శ్రీ

# త్రిపురా రహస్యము

## (జ్ఞానఖండము)



గ్రంథకర్త:

శిష్ట్లా వెంకటేశ్వర్లు

# విజ్ఞప్తి

'త్రిపురారహస్య' మను నీ ప్రాచీన మహోత్కృష్ట గ్రంథము, మాహాత్మ్యఖండము, ఉపాసనా ఖండము, జ్ఞాన ఖండమను త్రికాండయుతముగ గీర్వాణ భాషయందుండినటుల తెలియుచున్నది. అందు మొదటి రెండు ఖండములు, కాల క్రమమున లోపించి, యీ జ్ఞానఖండము మాత్రము మిగిలి యున్నది. దక్కిన దీఖండమగుటకు, జిజ్ఞాసువుల ద్వైత జ్ఞానామృతపాన మొనరించి, భవాబ్ధిసంతరింప శక్తులగుటకా పరాదేవి కృపావిశేషమె కాని వేరొండుగాదు. భారతావని యందుగల మహోన్నత ప్రాచీన వేదాంత గ్రంథములు, భాష్యాదుల గూడి యంతరించినను, ఈ గ్రంథ మొక్కటుం డిన, ఆధ్యాత్మిక తత్వానుభవ, తజ్జీవనములకు కొరత యుండ జాలదు.

అట్టి యీ గ్రంథము తొలుత స్వోప యోగార్థము పరమేశ్వరీ కరుణమె, యూతగాగొనుచు, తెనిగింప సాహ సించి, కృతకృత్యుడ నైతిని. ఆ వ్రాతప్రతి, నా శక్తి నెరింగి, మరియొక మరిణామమందజాలక, అటువలెనె యిరువది సంవత్స రములకు పై కాలమునుండి పడియుండెను. ఎచ్చటనో దక్షిణ దేశమున, తంజావూరు ప్రాంతమున నొక కుగ్రామమందు సాంప్రదాయక వైదుక కుటుంబమున జన్మించి, మావంశము

జొచ్చి, మాకు మాతృకల్పస్థాన మలంకరించి, మాగౌరవాభి మానముల జూరగొనుచు, భూదానాది సత్క్రియల జీవితము సార్థక మొనరించుకొనుచున్న, శిష్ట్లా రాజ్యలక్ష్మమ్మ గారు దీని నచ్చొత్తింప సమకట్టుటచే నిద్ది యీరూపు గాంచ నయ్యె. సాధు జనోపయోగముగ నిట్లొసరించుట కామె జీవితమాధ్యాత్మిక యోగ సంఘటితముగ సఫలమొనరింప నా పరమేశ్వరి యనుగ్రహించుగాత.

పొన్నూరునందలి యున్నతపాఠశాలయందుపాధ్యాయ పదవియందు బహుకాలముండి, విరమించి, యాగ్రామమందుండి యిందులకే యనువటుల ననుదినము ప్రూఫ్ దిద్దియిచ్చుచు, శ్రమజేసి, నిర్దుష్టముగ నీగ్రంథమిటుల బయల్వడుటకు ప్రధాన హేతుభూతుడగు నాసోదరుడు శిష్ట్లా వెంకట కృష్ణయ్యకు కృతజ్ఞతాపూర్వక ఆశీఃపరంపరలు.

మదభీష్టానుసారము శ్రద్ధగ నీ గ్రంథమిటులముద్రించి, యందజేసిన నాగార్జునప్రెస్ ముద్రణాధికారుల కెంతయు కృతజ్ఞుడను.

దక్షులగు వారలీ గ్రంథమును పఠించి, లోపములున్న మన్నింతురుగాత.

బుధజనవిధేయుడు
శిష్ట్లా వెంకటేశ్వర్లు.

శ్రీ శివాయ గురవేనమః

# సమర్పణ

శ్రీసాయుజ్య ఫలప్రశోభితమునై, చిత్స్ఫూర్తి సంఫుల్లతన్
గోసద్బ్రాహ్మణ సాధుకల్పతరువై, గుప్త ప్రసిద్ధంబునౌ
నే సర్వాగమ రూఢమూల, మట నేనిత్తున్ గదా బ్రహ్మవి
ద్యాసక్త్యైశ్వరి కీకృతిన్, నిజతురీయానందవాంఛారతిన్ –

శ్రీ

శివాయ గురవేనమః

తరియించెన్గద భార్గవుండు. మునుదత్తస్వామి బోధింపగా
పరమా నీదురహస్యమద్దిరయిటులన్, బ్రాచుర్యమున్ జేసి తీ
వరుదారన్ దలకొంటినంబ! యిపుడాయాపారముల్ నీదుమ్రో
ల రచింపన్ వినుపింప, నూకొనుటకున్ లక్షింపుమొక్కింత
యున్ -

జననీ! నీ పదపంకజాంతర సుధాసారానుసంధాన భా
గ్య నిధానంబగు భార్గవోపశమనాఖ్యానంబు నందెట్టులో
మనమున్ జేర్చితి, వద్ది నీయెదుటనంబా! పల్కెదన్, నిశ్చలో
న్మన దివ్యానుభవ ప్రసాదమొసఁగన్, మన్నించియాలింపుమీ

ఘోరతపఃప్రభావపరిఘూర్ణిత సంచిత కర్మసంచయో
దారుఁడు, తత్పరుండు, రహిదా గ్రహియించెనుభార్గవుండు, నీ
భారమెకాక నేబలుకఁ బాడియె నీదురహస్యమంబ! సం
సార విమూఢమానసులు, సారమెరుంగను నేత్తురేభువిన్ -

గురువై దత్తుఁడు బోధజేయ బరమాగుప్తార్థ సంవేదనా
తురుఁడై, భార్గవరాముఁడున్ వినఁగ, నేతుర్యంబు భాసించెనో
యెఱుఁగన్ జాలుదె తల్లి! నే బలుక నెంతేనిట్లు వాంఛింతు, నీ
కరుణాపాతమె యూఁతఁగా గొనుచు, సంకల్పార్థ సంసిద్ధికిన్ —

తొలుతన్ మాన్యుల శాంతచేతసుల, సంతుష్టాంతర స్వాంత ని
శ్చల గంభీర సమాధి సంశమిత విశ్వవ్యగ్ర విభ్రాంతులన్
కలనోద్వేగ వియుక్తమానసుల, నిష్కామప్రభాపూర్ణులన్
దలతున్, దేశిక పూజ్యపాదుల, నిదేత్వద్రూపులన్ ధీరులన్ —

శివమై, సుందరమై, పరోరజసమై శ్రేయఃపరంధామమై
యవితర్క్య ప్రతిభోన్మిష జ్జగదనంతాడంబరోద్భాసమై
సవికల్పాంకుర బీజమై, పరమునై, సాయుజ్యసంధానమై
భువిమూర్తంబగు, దేశికోత్తమ పదాంభోజాతమున్ గొల్చె
దన్

—

# త్రిపురా రహస్యము

## ( జ్ఞానఖండము )

### ప్రథమాధ్యాయము :-

కారణానందరూపిణీ! కరములొగ్గి
పరచిదేకమయీ! తనుభావమెడల
ఓంనమ యని నతులు నీకు నొనరజేతు
చైత్యచిత్ప్ర చిద్దర్పణా శాంతమూర్తి!

అంబా! పరతత్త్వ వేదనాతత్పరుండైన శ్రీపరశురాము నకు అవధూతేంద్రుడైన దత్తాత్రేయుండు చెప్పెనని నారద మహర్షికి హారితాయనుండు విదితంబొనరించిన త్రిపురారహస్య మందలి జ్ఞానఖండమును తెనుగున వినిపించెద నాకర్ణింపుము- హారితాయనుండిట్లనియె "నారద! సావధాన మనస్కుడవై పరసాధనమైన త్రిపురామహాత్మ్యమును వినియుంటివి కదా! ఇక దేనిని వినిన దిరిగి మనుష్యుడు శోకమునఁబొందఁడో మహా

ద్భుతమైన యట్టి జ్ఞానఖండమును వినిపింతును. పూర్వము దత్తాత్రేయులు ఉపనిషదర్థమును, వైష్ణవ, శైవ, శాక్త పాశుపత తంత్రసిద్ధాంతముల లెస్సగవిమర్శించి, మోక్షసాధనముగ నీజ్ఞానఖండమును నిశ్చయించెను. యుక్త్యనుభవములతో గూడుకొని, యుపాఖ్యానములతోడ బహుచిత్రమైన యీ విజ్ఞానమును పరశురామునకు బోధించెను. జ్ఞానోత్పాదనయం దిద్దానికి సదృశమైనది మరియొకటి లేదు. దీనిని విననప్పటికిని, యే విమూఢమానసునకు పరతత్త్వజ్ఞానముదయింపదో వాడు కేవలము దైవహతుడు, స్థాణువే యనుట నిస్సంశయము. అట్టివానికి సాక్షాత్ శంకరుడె బోధించినను జ్ఞానము గలుగ జాలదు. జ్ఞానఖండమను పేరున్న ఈ శాస్త్రము నీకు దెల్పెద వినుము. సర్వజ్ఞకల్పుడవగు దేవర్షివైయుండియు నావలన దీనినివిన కుతూహలబడుటాశ్చర్యము గదా! అహో! సత్పురుషవృత్తములు శ్రేష్ఠతమములై, యద్భుతమగుచుండును. ఘ్రాణేంద్రియాహ్లాదకత్వము కస్తూరికి వలె సత్పురుషులకీ యనుగ్రాహకత్వము సహజ సంభవమగుచుండును."

## భార్గవ చరితము

ఆవిధమున, శోభనమనస్కుడును సర్వజనాభిరాముడునగు జామదగ్న్యుండు దత్తాత్రేయుల వలన త్రిపురామాహాత్మ్య

నూను విని, భక్తిచే నపహృతమానసుడై కించిత్కాలము శరీరము విస్మరించి, తిరిగి బహిర్వృత్తి సమేతుడై యానందా శ్రువులు రాల, నంతరానందనిర్భరుడై, యానందములో నిము డక పైకి రోమకూపముల వెంట బొంగెనోయన, శరీరమం తయు బులకరింప, దత్తగురువునకు సాష్టాంగ దండప్రణామ మాచరించి, సంతోషాతిశయముచే గద్గదమైన సుస్వరముతో నిట్లనియె.

“స్వామీ! సాక్షాత్ శివస్వరూపులగు గురువులు సంతుష్టులగుచుండ నాబ్రహ్మపదముగూడ తృణప్రాయమగును. మృత్యువాత్మానందమగునని చెప్పుదురు. అట్టిచో, కరుణా సముద్రులును మహేశ్వరస్వరూపులునగు తమరీ కారణముగ నాయందు సంతుష్టులరగుటచే, తమప్రసాదమున ధన్యుడను. కృతకృత్యుడనునైతిని. తమకృపచే సర్వమునుబొందినవానిగ దలచుచున్నాను. తమ కటాక్షమున త్రిపురామాహాత్మ్యమం తయు వింటిని. ఇకనాత్రిపురాపరమేశ్వరి నుపాసింప నభిల షించుచున్నాను. సద్గురూ! సత్కృపనాకు తదుపాస్తిక్రమ మంతయు సెలవీయగోరెదను.

ఇట్లుప్రార్థింపబడి దత్తాత్రేయులు భార్గవునియందు త్రిపురోపాస్తికనువగు శ్రద్ధా భక్తియుతమగు యోగ్యతను లక్షించి, క్రమముగ తదుపాస్తికనువగు దీక్షనొసగిరి. పరశు

రాముడటుల, మంత్రయంత్ర భావనాక్రమసహితమును, పూర్ణ జ్ఞానప్రబోధకమునగుట, సర్వోత్తమమగు నా త్రిపురాదీక్షను గురుముఖాబ్జమునుండి, మకరందమును మధుకరమువలె గ్రహించి, తృప్తుడై గుర్వాజ్ఞానుసారముగ, త్రిపురా సాధనోద్యతుడై, మహేంద్రాద్రికిం జనియె. అచ్చట పర్ణశాల నిర్మించుకుని యందు పండ్రెండువత్సరములు, నిత్య నైమిత్తిక కర్మలజేయుచు, పూజా జపపరాయణుడును, నిరత శ్రీ దేవీ మూర్తి ధ్యానైకతత్పరుడున్నై యుండెను. ఇట్లుండు నాయనఘునకు ద్వాదశాబ్దములొక్క నిముసముగ గడచెను.

అంత నొక్కనాడు సుఖాసీనుడై యిట్లు చింతింపదొడగెను. పూర్వము నాచే ప్రార్థితుడై సంవర్తమహర్షి వచించిన దానియందణుమాత్రమైనను నామనస్సునకెక్కి యుండలేదు. దానినిగురించి గురువుగారి నడుగుటయు మరచితిని. త్రిపురాశక్తియొక్క మాహాత్మ్యము గురుముఖమున వినియుంటినే కాని, సంవర్తమహర్షి చెప్పినది తెలిసికొనజాలకుంటిని. గురువుగారిని సృష్టిప్రసంగమున నొక్కింత ప్రచ్ఛజేసితిని కాని, వారప్పుడు కటకృదాఖ్యానమునుజెప్పి, యిప్పటికయ్యదియు ప్రస్తుతమని యూరకుండిరి. ఈలోకముయొక్కగతి నాకేమియును దెలియకున్నది.

మహాత్తరమైన యీ జగదాడంబరమంతయు నెచ్చట నుండి పుట్టినది? ఎక్కడనున్నది? ఎక్కడకు బోవుచున్నది? సర్వమును విమర్శించిచూడ కేవలమస్థిరముగ గన్పించు చున్నది. అట్టిచో వ్యవహారము స్థిరప్రాయముగ నడచు చుండు టెట్టిది? అవిచారజన్యమైన యీజగత్తునందలి వ్యవహారము స్థిరముగ గన్పించుచున్నది. వ్యవహారము స్థిరప్రాయముగ నడచుచుండుటెట్టిది? అవిచారజన్యమైన యీ జగత్తునందలి వ్యవహారము చిత్రమైనదికదా? గ్రుడ్డివాని ననుసరించి గ్రుడ్డివాడునడచినట్లంధ పరంపరాన్యాయమున లోక వ్యవహారము నడచుచున్నది. స్వకీయాచరణమే దానికి నిదర్శనము. శైశవ మెట్లునడచినదియు నాకు దెలియదు. కౌమారదశ యందంతకంటె వేరైన వ్యాపారము గలిగియుంటిని. యౌవ్వన మందంతకంటె నితరమైనదియు, నిప్పుడు దానికి భిన్నమైన దియునగు వ్యాపారము గలిగియున్నాను.

ప్రతి మనుజునిచేతను జేయబడినప్పుడాయా కర్మ, ఫల ప్రాప్తి నిశ్చయపూర్వకముగ యుక్తమైనదనియే చేయబడు చున్నది. కాని, యాకర్మలవలన నేమి ఫలము పొందబడు చున్నది? ఏమి సుఖముకలుగుచున్నది? లోకమునందు అవిచారముచేత ఫలమువలె నగుపించి, పొందబడెడి ఫలము, ఫలము కాదని నామతము. కారణమేమన, ఫలముకోరిననరుడు వ్యవ

హరించి ఫలమును బొందినపుడు, తిరిగి వ్యవహరింప నవసర మేమియుండును? కాని సర్వజనులును, సర్వకాలమందును, ఫలేచ్ఛతోడ వ్యవహరించుచునె యుందురే!

దుఃఖాభావము లేక సుఖమనునదిగో ఫలమనబడును. కర్తవ్యము శేషించియుండుట దుఃఖాభావమగునా? సుఖ మగునా? కర్తవ్యతయె దుఃఖములలో నెల్ల పరమదుఃఖము. అట్టి కర్తవ్యత యుండి యుండ దుఃఖాభావముగాని, సుఖము గాని యెట్లుండనగును? కర్తవ్యశేషముగల మనుజునికి అనగా కోరికలవెంట బ్రవృత్తిగల మనుజునికి గలుగు సుఖలాభము, శరీరావయవములన్నియు దహింపబడుచుండ, పాదములకు మంచిగంధపుపూత వేయుటవలన గలుగు సుఖమువంటిదియే! హృదయము బాణముచే విదారింపబడియుండ, నప్సరోగణ పరిష్వంగముచే గలుగు సుఖమువంటిదియే! క్షయరోగ ముచే నాక్రమింపబడియుండ, సంగీత శ్రవణముచేగల్గు సుఖము వంటిదియే!

పూర్ణాశయులై, విషయముల వెంటనంటు మనోవేగ మను దావాగ్ని పూర్తిగ చల్లారుటచే, సర్వాంగసుశీతలులై కర్తవ్యతాగహితులై యుండిన మహాత్ములే, లోకములందు సుఖవంతులు. కర్తవ్యముశేషించి యుండిన నరునికి దేనిచే నైనను సుఖమున్నదనిన, శూలమునగ్రుచ్చి కొరతవేయబడిన

వానికి గూడ, గంధమాల్యాదులచే సుఖము గలుగునని చెప్పవలసియుండును. అట్టిచో నసంఖ్యాకములైన కర్తవ్యములచేత సంకులమైన ప్రయోజనమందు సుఖముకలదని, సర్వకాలమును మానవుడు వ్యవహరించుచుండుటకంటె మహాచ్చిత్రమేమికలదు? మానవులయందుగనుపించు నీ యవిచారమాహాత్మ్యమును గురించి యేమి చెప్పగలను! అనంతములైన కర్తవ్యములచే నాక్రమింపబడి సుఖమునుబొందగలరట!

సార్వభౌముడైనను సర్వదాసుఖముకొరకెటుల ప్రయత్నించునో, యటువలె భిక్షాటనారతుడైన భిక్షువు గూడ సుఖమునకై ప్రయత్నించును. ఉభయులును తమతమవాంఛాఫలములబొంది సుఖమును బొందితిమి, కృతకృత్యులమైతిమని తలంతురు గ్రుడ్డివాని ననుసరించి గ్రుడ్డివాడు నడచునటుల, ఫలము నాలోచింపక సర్వజనులు నడచిన చొప్పుననే నేనును నడచితిని. ఇకజాలు. ఇట్టి విచారప్రయుక్తమగుబుద్ధితో నా దయానిధినితిరిగి సమీపించి, విచారింపదగినదానిని విచారించినవాడనై సద్గురువాక్కులను నావనాశ్రయించి, యీ సందేహసముద్రమును దరింతుగాక.

అని నిశ్చయించి పరశురాముడు గురుదర్శనాకాంక్షుడై వెంటనే తానున్న పర్వతమునుండి వెడలి, గంధమాదనశైలేంద్రము గూర్చి వెడలెను. అందు పద్మాసనాసీనుడై, భూమి

నంతయు వెలిగించుచున్నటులున్న గురువుగారిని గాంచి, సాష్టాంగ దండప్రణామమాచరించి, కరముల వారి పాదపద్మ ముల గ్రహించి, శిరమునాపాదపద్మముల నుంచెను. అంత దత్తాత్రేయులు ప్రసన్నులై, భార్గవునాశీర్వదించి యాదరమున 'వత్స ! లెమ్ము, బహుకాలమునకు వచ్చితివి. నిరామయ మగు నీ స్థితిదెల్పు' మని క్షేమమడిగి యాసనమున గూర్చుండ నియమించెను.

అంతట భార్గవుడు బద్ధాంజలి పుటుడై, 'శ్రీగురునాథా! కరుణాసముద్రులైన తమ కృపామృత సుస్నాతుడనగు నన్ను విధిప్రేరితములగు ననామయము లేమిచేయగలవు! తమకృపా త్మయను చంద్రమండలాంతరస్థితుడనగు నన్ను, ఆధివ్యాధు లను గ్రీష్మాతపము లెట్లు బాధించును. బాహ్యాభ్యంతరముల నానందముతో నిండియున్ననాకు తమ చరణసేవా వియోగ మొక్కటియే కొరత. అట్టిదికూడ నిప్పుడు దీరుటచె సంపూ ర్ణత్వము గల్గి ధన్యుడనైతిని. కాని, చిరకాలము నుండియు నాహృదయమందు సంశయమొండు బాధించుచున్నది. అది తమరు తీర్పగలందులకు బ్రార్థించుచున్నాను. తమయాజ్ఞ యగునేని నా సంశయమును మనవిజేసికొందును' అని సవిన యముగ బల్కెను. అంత దయానిధియగు దత్తాత్రేయులు భార్గవుని భక్తికి సంతసించి ప్రసన్నులై, 'నీయభీష్టము నెరవే

ర్ఛేద. సంశయముదీర పృచ్ఛ జేయుమనిరి.

ఇది శ్రీత్రిపురారహస్య జ్ఞాన ఖండమునకు
తాత్పర్యార్థప్రకాశిక యను నాంధ్రీ
కరణంబున ప్రథమాధ్యాయము.

# ద్వితీయాధ్యాయము

తే॥ గీ॥ జామదగ్న్యుని సంశయసార మెరిగి
యదియె నీకృపాసంపాతమని విచార
శేముషీమహావిభవంబు జెప్పెనిందు
దత్తగురుదద్ది వినుమంబ! చిత్తములర-

దత్తాత్రేయులటు లనుగ్రహింప పరశురాముడు తన సంశయముల నిట్లు జెప్పదొడగెను. "శ్రీనాథా! కరుణానిధీ! పూర్వము నేనొకానొక కారణమున రాచకులముందు క్రోధము వహించి, క్షాత్రవంశము నిరువదియొక్కమారు దాక్షిణ్య రహితముగ వధించి, వారి రక్తతర్పణలచేత పితరుల సంతోష బెట్టితిని. అంతట పితురాజ్ఞ నా క్రోధ ముపశమింప జేసి కొంటిని. అక్కాలమున శ్రీహరియొక్క స్వీయావతారమగు శ్రీరామచంద్రు డయోధ్యయందుండెను. బలదర్పితుడనై క్రోధాంధత, నాయన నెదుర్కొని, పరాజితుడనై పరిభవింప బడితిని. అమ్మహాభాగుని దయ, నెట్లనో బ్రతికి మిక్కిలి దుఃఖితుడనై బహువిధముల బరితపించుచు మార్గమునంబడి వచ్చుచుండ, భస్మముచేత గప్పబడిన యగ్నివలె నిగూఢ తేజుండగు నవధూతేంద్రుడైన సంవర్తక మహర్షిని దైవవశ మున గలసికొంటిని. సర్వాంగశీతలుడగు నా మహాత్ముని

దర్శనమాత్రము ననె, మంచుగడ్డచేతవలె నా తాపములలయి జల్లారి మిక్కిలి శిశిరభావమును బొందినవాడనైతిని. అంతట స్వరూప స్థితినిగూర్చి నేనడుగ, సర్వతత్వసారమును సెలవిచ్చిరి కాని యదిగ్రహింపజాలక, దరిద్రుడు చక్రవర్తిని యడుగజాలనటుల ప్రశ్నింపజాలక, తిరిగి సెలవీయుడనిప్రార్థింప, తమ సన్నిధిని నిర్దేశించి మిన్నకుండిరి. అంత తమ పదాబ్జ సన్నిధి జేరితిని.

అంధుడు జనసమారోగమునువలె సంవర్తకముని వాక్రుచ్చినది నా కేమియు దెలియలేదు. తమసాన్నిధ్యమున త్రిపురాభక్తిజనకమైన మాహాత్మ్యమంతయు వింటిని. తమ స్వరూపిణియగు నా పరమేశ్వరి యెల్లప్పుడును నాచిత్తమందు సమాహితురాలై యున్నది. దేవతాకార చిత్తవృత్తి కల్గిన తదుపరి, తిరిగి ఉపాసన పిష్టపేషణ తుల్యముగదా! సంవర్తక మహర్షి పూర్వము దెల్పినది సెలవీయ వేడెదను. అది తెలియక నేమియొనరించినను, కృతకృత్యత లేదని తోచినది. అది తెలియజాలక, నాచే జేయబడిన కర్మయంతయు బాలక్రీడవలె నగుపించుచున్నది.

పూర్వము నే నసంఖ్యాకములైన క్రతువు లొనరించితిని. భూరి దక్షిణ లొసగితిని. ప్రభూతాన్న ప్రదానమున నింద్రాది దేవగణమునంతయు సంతుష్టి బరచితిని. సంవర్తక

మహర్షి వాక్యమున నాయీ కర్మఫల మతిస్వల్పమని వినియుం టిని. అట్టి యల్పఫలము దుఃఖమేయని యూహింతును. సుఖ రాహిత్యము దుఃఖము గాజాలదు. అల్పసుఖమే దుఃఖము. కారణమేమన సుఖానంతరము దుఃఖము ద్విగుణీకృతము కాగలదుగదా!

అట్టి కర్మపరంపరల నవిచ్ఛిన్నముగ జేసిన, నా యల్ప సుఖపరంపర కూడ నవిచ్ఛిన్నముగనే యుండును గదా యనిన, నన్నింటికంటె నధికమైన మృత్యుగ్రసనము కర్మలచే దుర్నివార్యమగుట, తద్భయములేనిస్థితి కర్మలచే నెట్లు సాధ్య మగును?

కర్మస్వరూప మట్టిదే యగుగాక, పరదేవతా సంబం ధానుబంధి యగుట నుపాసనయట్టిది కాదను శంకకు తావు లేదు. మానసవ్యాపారమే యగుట, త్రిపురావిధియందు నాచే జేయబడు ఉపాసన యైనను కర్మతుల్యమే యగుట, బాలక్రీడవలె నాకుదోచుచున్నది. శాస్త్ర భేదముచేతగాని, ఆచార్య మత భేదముచేత గాని, ఆలంబన భేదముచేత గాని, మీరుచెప్పిన యుపాసనా క్రమమిట్లుగాని, ప్రకారాంతరమున గాని, వివిధముగా జేయవచ్చును. ఇట్లనేకవిధముల ప్రతి పద్యమానమైన యీయుపాసన, అసత్యఫలముచే నొప్పుకర్మ సమముగాకుండు టెట్లు? మనోవ్యాపారమే యగుటచే, స్వరూ

పముచే నసత్యమగు నియ్యది సత్యఫలజనక మెట్లు కాగలదు? యావజ్జీవమట్టి యారాధనయే జరుపుచుండిన, పరశ్రేయః ప్రాప్తిగలుగుననిన, నేను ప్రత్యక్షముగ భగవత్సముడగు సంవర్తక మునీంద్రుని జూచియుంటినే! ఆమహామహుడు కర్తవ్యాంశమను ఘోర విషజ్వాలనుండి బయటబడి, సర్వా శీతలుడై యుండెనే! అరణ్యమంతయు దావాగ్నిచే జుట్టబడి దగ్ధమగుచుండ, చల్లనినీరుగల హ్రదమందు మునిగియున్న మత్తేభమువలె, భయరహితమగు మార్గమాశ్రయించి, లోకతంత్రమును పరిహసించుచున్నటులుండెనే! సర్వాకర్తవ్యమును అమృతము నాస్వాదించినటుల దిగద్రావి పరమానంద భరితుడైన యా మహర్షి యట్టిదశ నెట్లు బొందెనో, నాకు బూర్వమేమి సెలవిచ్చెనో, సర్వమును నాయందు గృపారసముంచి, హే! గురునాథా! తెలుపగోరెదను. కర్తవ్యామనుకృష్ణసర్పముచే మ్రింగబడిన నాకు విమోచన గలిగింతురుగాక! అని చరణములందు శీర్షముంచి, సాష్టాంగ నమస్కృతు లొనరించెను. ఆర్తుగును ముముక్షువునైన భార్గవునియందు మిక్కిలి దయమాన స్వభావులై, దత్తాత్రేయు లిట్లనిరి.

"వత్స! భార్గవ! ధన్యుడవైతివి. సముద్రమందు మునుగనున్నవానికి నౌకాప్రాప్తి గలిగినటుల, నీకిట్టి బుద్ధియుదయించినది. ఉపాసనాది క్రియలచే నందదగిన సుకృత్య

మిట్టి బుద్ధిప్రాప్తియే! ఇట్టిబుద్ధియే పరమపావనమైన మోక్ష సమారోహణకు సమర్థమైనది. ఆ త్రిపురాపరమేశ్వరి సర్వ బుద్ధి స్వరూపిణి. అనన్య శరణుడైన భక్తుని గూర్చి విమర్శాత్మక బుద్ధి రూపధారిణియై, తదంతఃకరణ యందస్నుగా పరిణమించి మృత్యువును దరింపజేయును.

ఎంతకాలమునరుడు కర్తవ్యమను పిశాచమును గూర్చి నిక్కముగ భయముగలవాడు గాడో, అంతకాలము పిశాచ గ్రస్తునివలె సుఖమును బొందజాలడు. కర్తవ్యమను కృష్ణ సర్పముచే సందష్టులగు నరులకు శుభోదయ మెట్లుగాగలదు? కర్తవ్యమను విషముయొక్క సంసర్గచేత గాఢ వ్యామోహమును జెందియున్న యీజగత్తును గనుము. గ్రుడ్డితనమును దాల్చి తనకు హితమగుక్రియను గుర్తింపజాలక వేరువిధముగ సంచరించుచు, తిరిగి తిరిగి మోహమును బొందుచున్నది. ఇట్లు కర్తవ్యవిషమూర్ఛితమై, యీ లోక మనాదినుండియు భయంకరమగు విషసముద్రమందు తపింపబడుచున్నది. ఇందులకు దృష్టాంతముగ నొకయాఖ్యాయికను దెల్పెదవినుము.

ఒకప్పుడొక కొందరు బాటసారులు నడచినడచి వింధ్య పర్వతము జేరి, యాకలిబాధచే మిక్కిలి పీడింపబడినవారగుచు, నచ్చటి యరణ్యమందు కొన్ని ఫలములగాంచి తిందుక ఫలములని భ్రాంతిపడి, విషముష్టిఫలముల సేవించిరి. అత్యంత

క్షుధచేత వారికాఫలముల తిక్తదనముగూడ జిహ్వాలకు తెలియదాయెను. అంత నా విషముష్టి ఫలములయొక్క విషముచే శరీరావయవములన్నియు దహింపబడ జొచ్చెను. ఆయుష్ణపశాంతికి మార్గము లారయుచు, తుట్టతుదకు జంబీరఫలములనెడి భ్రాంతితోడ దుత్తూర ఫలములను భక్షించిరి. వెంటనే యున్మత్తులైరి. మార్గముదప్పిరి. గోతులలోబడుచు లేచుచునుండిరి. ఆఘోరారణ్యమందు ముండ్లచే జీల్చబడిన శరీరావయవములు గలవారైరి. కొందరు కాలుసేతులు విరిగిన వారైరి శరీరములుదెలియక, నొకరినొక రధిక్షేపించుకొని పెద్దగ గలహింపజొచ్చిరి. శిలలచేతను, కాష్టముల చేతను నొకరినొకరు మోదుకొనిరి. ఇట్లు శరీరములన్నియు ఝర్ఝరితములుగాగ, నొకానొక పట్టణముజేరి, నిశీధివేళ నాపురద్వారము సమీపించి, యందుజొచ్చ యత్నించిరి. ద్వారపాలురడ్డగింప, దేశకాలాది జ్ఞానరహితులగుట వారిని మార్కొనిరి. వారిచే లెస్సగ గొట్టబడి, నిల్దిక్కులకు బర్వెత్తిరి. కొందరగడ్తయందుబడి మొసళ్ళచేత మ్రింగబడిరి. కొందరు నూతులలోబడి మరణించిరి. మరికొందరు పట్టుబడిరి. ఈ విధమున జనులు శబ్దవ్యామను విషముచే మూర్ఛితులై, గాఢవ్యామోహము చేత గ్రుడ్డివారగుచు, నహితములగు కోరికల చేత వినాశము జెందుచున్నారు. భార్గవ! నీవు ధన్యుడవు. శ్రేయమును బొందితివి. కారణమేమన, విచారమే సర్వము

నకును మూలము. మోక్ష సౌధప్రాప్తియందు విచారము ప్రథమసోపానముగా తెలియవలయు.

చక్కని విచారమునందరు, క్షేమమెవడెట్లు పొందగలడు? అవిచారపరత్వమే మృత్యువు. అవిచార పరునకు నాశముదప్పదు. విమర్శించి చేయువాడు తన యభీష్టమును బొందిసుఖించును. అవిచారపరులై దైత్యులు నాశము జెందిరి. విచారపరులై దేవతలు విష్ణువు నాశ్రయించి, శత్రువులనోడ్చి సుఖించిరి. సుఖమను వృక్షమునకు విచారము సఫలమగు బీజము. విచారముచేత పురుషుడు సర్వోత్కృష్టుడై ప్రకాశించును. విచారమువలన బ్రహ్మ యుత్కృష్టుడాయెను. హరి పూజింపబడుచుండెను శివుడు మహేశ్వరుడయ్యెను. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడగు రాముడ విచారమున మృగాసక్తుడై యాపదను బొందెను. అనంతరము విచారము బూని, సేవుతుగట్టి లంకాపట్టణ మాక్రమించెను. బ్రహ్మయు నవిచారమున నభిమానము వహించి మూఢుడై శిరచ్ఛేదము బొందెను. అవిచారితముగ శివుడు రాక్షసునకు వర మొసగి, తనవరముచేత తానె భస్మమగుదునని భయపడి పలాయన మొనరించెను. పూర్వమవిచారమున హరి భృగుపత్నిని జంపి, శపితుడై మహాదుఃఖమనుభవించెను. ఇటువలె ననేకులు దేవతలు, రాక్షసులు, మనుష్యులు, మృగములు

అవిచారవశమున నాపదలకు గురియైరి. ఎట్టి స్థితియందైన మహాభాగులను విచారము విడిచిపెట్టదో, యట్టిధీరులు సదా నమస్కారార్హులు. అవిచారముచేత కర్తవ్యమును బొంది మోహితులగుచున్నారు. విచారపరులగుచు కర్మజేసియు నపార సంకటములను దరించుచున్నారు. గ్రీష్మాతప సంతప్త మగు మరు భూమియందు చల్లని నీరుండనటుల, నవిచారమున్నంతవరకును విమర్శ యుదయింపదు.

ఈ విధమున చిరకాల మవిచారమను నగ్నిజ్వాలచే చుట్టబడియుండ, సాధనరహితమగుదు, విచార శీతల స్పర్శ మెట్లు గలుగగలదు? అందు సర్వోత్కృష్టమైన సాధన మొక్కటియే గలదు. అదియే సర్వ హృత్పద్మాసనాసీన యగు పరమేశ్వరియొక్క పరాకృప. అదిలేక యెవనికి శ్రేయఃప్రాప్తి సాధ్యము గాగలదు?

అవిచారముచే నంధుడగువాని చీకటిని పటాపంచలు చేయునది, విచారసూర్యుడు. అట్టి సూర్యుడుదయించుటకు మూలము, భక్తితోడ దేవతారాధనము. ఆరాధింపబడి యా పరమేశ్వరి మిక్కిలి సంతుష్టి జెందినపుడు, చిత్తాకాశ మందు సూర్యునివలె విచారరూపమును బొందును. కావున స్వాత్మస్వరూపిణియు, త్రిపురాధీశ్వరియు, సర్వాంతర్యామియు, మహేశియు, చిన్మయియునైన పరమేశ్వరిని గురూపదిష్టమార్గ

మునన్యగమముగ, నిష్కపటముగ, నారాధింపవలెను. అట్టి యారాధనకు మూలము నిర్మలమైన భక్తిశ్రద్ధలు. వానికి మూలము మాహాత్మ్య శ్రవణము. కనుక రామ! నీకు ప్రథమమున మాహాత్మ్యమును వినిపించితిని. అట్టి శ్రవణము చేత మంగళమును బొందిన వాడవైతివి.

విచారము శ్రేయస్సునకు మూలమగుట, నీకిక భయము లేదు. సన్నిపాత రోగగ్రస్తునకు, ఔషధ సేవచేత ధాతుశుద్ధిగలుగుపర్యంత మేటులనో యటువలె నవిచారదోషగ్రస్తునకు, విచారముదయించువరకు ననుక్షణము, మహత్తరమైన భయముగలదు. ఉత్కృష్టమైనవిచారము గలిగినపుడు, మానవుని జీవితము సఫలమగును. పరమార్థ విచారము గలుగునంతవరకు జన్మవృక్షములు గొడ్డుమోతులే యగును. విమర్శ గలిగినచో నా జన్మ వృక్షములే సఫలము లగును. కూపస్థ మండూకము, కూపమునందె పుట్టి మరియొక శుభాశుభ మేమియు నేరక, కూపమందె యెటులనశించునో యటువలె విమర్శారహితులైన నరులు బ్రహ్మాండమను కూపమున నిరర్థకముగబుట్టి, స్వాత్మలయొక్క శుభాశుభముల నొక్కింతయు నేరక, తనుహితమును గుర్తెరుగక, పుట్టి పుట్టి నశించుచుందురు.

అవిచార మాహాత్మ్యము వలన దుఃఖములందు సుఖబుద్ధియు, సుఖములందు దుఃఖ నిశ్చయమును గలిగి, సంసార

దావాగ్ని యందు తపించుచుందురు. ముఖముమీద, కాళ్ళ చేత ననేకతన్నులు తన్నబడుచుండియు, గొప్ప ఖరము నాడ గాడిదను వెంటనంటునటుల, దుఃఖముచేత మిక్కిలి బాధ పెట్టబడియు, జను డద్దానిని విడువలేక సంసారమునె యనుస రించును. రామ! నీవు విచారాత్ముడ వగుచు, దుఃఖము యొక్క పారమును బొందితివి.

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశిక యను నాంధ్రీకరణంబున విచార
మాహాత్మ్య మను ద్వితీయాధ్యాయము.



# తృతీయాధ్యాయము

తే॥ గీ॥ అట్టి సద్విచార శ్రేణి కాదియగుచు
బరగు సత్సంగ మాహాత్మ్య సరళిదెల్పు
దత్తమునిబోధ గల్గు నధ్యాయమిద్ది
వినుము బల్కెద నమ్మరో! విసువుగొనక -

దత్తాత్రేయు లట్లుబలికిన యా వాక్యములువిని మిక్కిలి కుతూహలుడగుచు పరశురాము డతివినయమున తిరిగి యిట్లు ప్రశ్నించెను. "గురునాధ! అవిచారము చేత సర్వనాశము గలుగుననియు విచారముచేత శ్రేయస్సు గలుగుననియు, అట్టి విచారమునకు మాహాత్మ్య శ్రవణము కారణమనియు, తమరు సెలవిచ్చియుండిరి. అందు నాకొక సందేహము గలదు. ఆ మాహాత్మ్య శ్రవణమైన నెట్లుగా లభించును? అందులకు సాధనమేమి కాగలదు? తనంత నె యయ్యది స్వాభావికముగ లభించునందురా, సర్వజనులును నట్టి శ్రవణ మందేల సంసక్తులు గారు? నావంటి శూరులకు మాత్రమె యయ్యది స్వాభావికముగ లభించునందురా, నేను శ్రీరామచంద్రునిచే పరాజితుడనై, దుఃఖితుడనగునంత దనుక, నట్టి ప్రవృత్తి నా

కేల గల్గియుండలేదు? దుఃఖము కారణమగునందురా, నా కంటె తీవ్రమగు దుఃఖపరంపరలు గలవారుకూడ నట్టి సాధనమును బొందకుండిరే! కావున నాకా విషయము దయతో సెలవీయుడు."

పరశురాముడారీతి బ్రార్థింప, దత్తమునీంద్రులా ప్రశ్నకు సంతసించి, యివ్విధమున సెలవిచ్చిరి. "రామ! శ్రేయస్సునకు ముఖ్యమైన కారణము జెప్పెద వినుము. సర్వదుఃఖముల నశింపజేయు సత్పురుష సాంగత్యమె, శ్రేయస్సున కాదికారణము. పరమార్థ ఫలప్రాప్తికి బీజము సత్సంగమని చెప్పుదురు. అందులకు నీవ నిదర్శనము. మహాత్ముడగు సంవర్తక మునీంద్రుని సాంగత్యమును బొందిన వాడవగుట, నిట్టి శ్రేయఃఫలముదయించు దశను బొందితివి. పరమ సుఖమునుపదేశింపగలవారలు సత్పురుషులుగాని, మరియొండు గాజాలరు. సత్సాంగత్యము లేక, యెవనిచే నెప్పుడు పరమార్థరూపమగు శ్రేయస్సు పొందబడినది? లోకమునందేయే మానవు డెట్టియెట్టి సాంగత్యము నందునో, ఆయామానవుడు తత్తదనుగుణ్యమగు ఫలము నే యందుననుటకు సందియము లేదు.

అందులకొక కథజెప్పెద వినుము. పూర్వము దశార్ణదేశము బాలించు ముక్తాచూడుడను రాజుండెను. అతనికి

హేమచూడ, మణిచూడులను పుత్రులుగలరు. వారు సౌంద ర్యవంతులు, గుణవంతులు, సర్వవిద్యా విశారదులునై యుండిరి. మహాబలులగు వారిరువురొకప్పుడు మహాసేనా పరివృతులై, ధనుర్బాణములుధరించి. మృగయార్థము సింహ వ్యాఘ్రాది దుష్టమృగయుతమగు భయంకరమైన సహ్యాచల పరిసరారణ్యము ప్రవేశించిరి. అచ్చట వారు ధనుర్ముక్త నిశిత బాణపరంపరల సింహ వరాహ మహిషాది వన్యమృగ ముల నసంఖ్యాకముగ బరిమార్చుచుండు నంతనొక ప్రచండ వాయువు శిలావర్ష సహితముగ నుద్భూతమయ్యెను. ఆ పర్వతమెల్ల గాఢాంధకారముచే నావృతమగుచు, మనిషినని కాని, చెట్టునికాని, గుట్టయనికాని గుర్తిడరాని విధమయ్యె. ఉపలవర్ష పీడితమై సైన్యమంతయు బలాయితమై చెట్టుపుట్టల నాశ్రయించెను. అశ్వారూఢులగుచు నారాజకుమారు లిరు వురును బహుదూరము పలాయన మొనరించిరి. అందు హేమచూడుడు పోయి పోయి, కదళీఖర్జూరాది వృక్ష మండ మండితమగు నొక చక్కని తాపసాశ్రమము ప్రవేశించెను. అందు పుటముబెట్టిన బంగారువంటి దేహచ్ఛాయచే గడుం గను ప్రకాశించుచు, నగ్నిశిఖవలె వెలుంగుచున్న నొక కన్యా లలామను గాంచెను.

లక్ష్మివలె శోభించు నా కన్యనుజూచి, రాజపుత్రు డాశ్చర్యమునంది "ఓ! పద్మాననా! నీవెవరు? భయమును గలి

గించు నీ నిర్జరారణ్యమున నిశ్చయముగ నేట్లుంటివి? ఎవ్వరి దానవు? ఒంటిగా నేట్లు నివసించుచుంటివి? ” అని ప్రశ్నించెను. అంత నాకన్య యాతనికి స్వాగతమొసగి, యాసన మునిచ్చి, “రాజపుత్ర! తాపసుల కతిథిపూజన మవశ్య ధర్మము. నీవు ప్రచండవాయువుచే బీడింపబడి మిక్కిలి యలసినట్లున్నది. అశ్వము నాఖర్జూర వృక్షమునకు గట్టి విశ్రమింపుము. తదుపరి నాయుదంత మాకర్ణింతువుగాక!” అని ఫలము లొసగి, మధురరసమును ద్రావనిచ్చి సేద దీర్చెను.

అంత శ్రమదీరిన రాజపుత్రుని జూచి అమృతమొలుకు పలుకుల “శివపదాశ్రయుడైన వ్యాఘ్రపాదుడను మునిగలడు. ఆయన తన తపో మహిమచే బ్రహ్మలోకములన్నియు జయించిన పరాక్రమజ్ఞుడు. మునిశ్రేష్ఠులచే బూజింపబడువాడు. నేనమ్మహానుభావుని ధర్మపుత్రిని. హేమలేఖయనబడుదానను. విద్యుత్ప్రభ యను సర్వాంగసుందరియగు నొక విద్యాధరస్త్రీ కలదు. ఆమె యొకప్పుడిచ్చటనున్న వేణానదియందు స్నానార్థము వచ్చియుండెను. ఆసమయమున సుషేణుడను వంగ దేశాధీశుడు గూడ నచ్చటికి వచ్చి, నదియందు స్నానమొనరించుటచే తడిసిన యుత్తరీయము శరీరమున కతుకుకొన, సువ్యక్తోత్తుంగ కుచద్వయ శోభితయగు నా లోకసుందరిని గాంచి మన్మథ వశంగతుడయ్యెను. ఆమెయు నా రాజు

సౌందర్యముచే మోహితురాలాయెను. అంతట నాయెతోడ సంగమించి యారాజు తననగరమున కేగెను. ఆవిద్యాధరి గర్భము ధరించి, యుపచార మొనరించుట, భర్తవలని భయమున, గర్భమచ్చటనే త్యజించి వెడలిపోయెను. ఆ రాజర్షి యొక్క అమోఘవీర్యమువలన జన్మించిన కన్యను నేను. అంతట సంధ్యోపాస్తినిమిత్త మచ్చటి కరుదెంచిన వ్యాఘ్రపాదుడు నన్నుజూచి జాలిగొని, యాశ్రమమునకు గొనిపోయి తల్లివలె బెంచి పెద్దజేసెను. ధర్మార్థ మిట్లుబెంచినవారు తండ్రులేయగుట, నేనా యనఘుని ధర్మపుత్రిని. ఆయన మాహాత్మ్యముచేత నిచ్చట నెట్టిభయమునకును తావులేదు. దుష్టబుద్ధిగలుగు సురాసురు లెవ్వరైన నిందుబ్రవేశింపజాలరు. ప్రవేశించిన నశింతురు. నా వృత్తాంతమంతయు జెప్పితిని. రాజపుత్ర! కొంచె మోపికవహింపుము. భగవత్స్వరూపుడైన నాతండ్రి యిప్పుడే రాగలడు. ఆయనను గాంచి నమస్కరించి యిష్టమును బొందినవాడవై, యుచితకాలమున బయనింతువు గాక" యని పలికెను.

ఆపలుకులాలించి రాజపుత్రుడామె సౌందర్యముచే మిక్కిలి మోహితుడై, కొంచెమైనను పలుకరింప భయపడి, విమనస్కుడై యుండ, కామవశంగతుడగుట, నా మహావిద్వాంసురాలుగ్రహించి, "రాజపుత్ర! ధైర్యమవలంబింపుము.

తండ్రిగారిప్పుడె రాగలరు. అనంతరము నీ యభిలషితమును బొందుదువు గాక' యని పలుకునంత, వనమునుండి పత్రపుష్పాదుల సేకరించుకొని, వ్యాఘ్రపాదమహాముని యరుదెంచెను. ఆయనను గాంచి, హేమచూడు డాసనమునుండి లేచి, నామ సంకీర్తనపూర్వకముగ నమస్కరించి, యాయనచే ననుజ్ఞాతుడై, యుపవిష్టుడయ్యెను. అంత కామముచే వికృతుడైన రాజపుత్రుని లక్షించి, యోగదృష్టిచే మునీంద్రుడు సర్వమెరింగి, యదియట్లగుట యుక్తమని భావించి, హేమలేఖ నాతనికి వివాహార్థ మిచ్చివైచెను.

హేమచూడు డత్యానందమున నాకన్యను దోడ్కొని, తన పురమున కేగ, నాతనితండ్రి ముక్తాచూడుడు కడుంగడు సంతసించి, మహావైభవమున వారిరువురకు విధిపూర్వకముగ వివాహమొనరించెను. అంతట రాజకుమారుడా హేమలేఖతోడ సౌధరాజములందును, ఉద్యానవాటికల యందును, నదీసైకతములందును, సదా క్రీడాపరుడై యుండెను. ఇట్లుండియు, హేమలేఖను భోగములందనాసక్తతచే నుదాసీనురాలుగనుండుట లక్షించి, యేకాంతమున నొక్కనాడు “ప్రియురాలా! నీయందత్యంతానురాగముగల నాయందు నీ కనురాగము లేదా యేమి? మరియెందులకు భోగములందాసక్తురాలవు గాకుంటివి? అత్యుత్తమ భోగములందు నయిత మనాస

క్తత గలిగియుండుటకు, నీమనస్సునకు రుచించెడి భోగము లెందు లేకుండెనా? నీవిట్టి నిరపేక్ష వహించియుండ నాకు సుఖ, మెట్లుండగలదు? నేను నీయందాసక్తుడనై యుండ, నీవన్యగత మనస్కవువలెనుండెదవు. నాచేబలుకరింపబడియు, నామాటలు వినకుండెదవు. నీకంఠసంలగ్నుడనైననన్ను, కొంతతడవుపరికింప కయే, 'నాథ! యెప్పుడువచ్చితి''రనిప్రశ్నింతువు. దుర్లభములై, యత్యంతమధురములైన భోగములందు నీ చిత్తమేల లగ్నము గాదు? నన్ను విడిచియుండినపుడెల్ల, నీవు నిమీలిత నేత్రముల గూర్చునియుందువు. నేను నిన్ను సమీపించినప్పుడెల్ల నీవట్లె యుండుట చూచుచున్నాను. విషయ భోగములందు నీవు విముఖురాలవై యుండ, నీతోడ సాంగత్యము నాకు కొయ్యబొమ్మతోడ సాంగత్యము వంటిదే గదా! వెన్నెలను కుముదము వలె సర్వదా నిన్ననుసరించి, నీయభిమతముకంటె భిన్నమైన కోరిక లేనివాడనుగ నుంటినే! నీ చిత్తమట్లుండుటకు కారణము దెల్పుము. నాప్రాణముల కంటెను నాకు బ్రియమైన దానవుగదా! నాయానగ, నా మనస్సునకున్న కళంకమిద్ది తీర్పు'' మని ప్రశ్నించెను.

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
పత్రికాశిక యను నాంధ్రీకరణంబున సత్సంగ
మాహాత్మ్య మను తృతీయాధ్యాయము.

# చతుర్థాధ్యాయము.

తే॥గీ॥ హేమలేఖా సమాగమమిట్లుగల్గి
పరమకైవల్యమందెను బౌరజనము
గూడ, సత్సంగఫలమట్లు గూర్చుననుచు
జెప్పెనిందు వినుముతల్లి! క్షేమగతిప -

కంఠలగ్నుడగుచు బ్రియుడట్లు పలుకగ, మందస్మిత వదనార విందయగుచు నా హేమలేఖ, జ్ఞానముబోధింప నిచ్ఛగలదై యిట్లు యుక్తిగా బదులు చెప్పెను. "రాజపుత్ర! నేను నీ యందు విరాగిణినై యిట్లుండలేదు. లోకమునందు ప్రియమ గున దెద్ది, యప్రియమగునదేది యనువిచారణయందు నిత్యము మునిగి యున్నాను. ఎంతకాలమునుండి విచారించుచున్నను, స్త్రీస్వభావమువలన నామనస్సు నిశ్చయమందకున్నది. అందలి యదార్థమెరుగజాలకున్న నాకు, దాని తత్వమెరిగిన మీరు చెప్పవలసినది."

ఇట్లడుగబడి, హేమచూడుడు నవ్వుచు "నిశ్చయముగ స్త్రీలు మూఢమనస్కులనుటకు సంశయము లేదు. లోకము

నందలి పశు పక్షి క్రిమికీటకాదులు సయితము ప్రియా ప్రియ ములగుర్తెరుగు చున్నవి. ప్రియమగు విషయముల బ్రవర్తిం, చుచుండుటయు, నప్రియముల బ్రవర్తింపకుండుటయు జూచు చుండ నింత విచారమేలకావలసివచ్చె? ఏదిసుఖదాయకమో యది ప్రియము. ఏది దుఃఖప్రదమో యది యప్రియము. దీనినిగూర్చి నీవు ముగ్ధవగుచు నింతచింతింపనేల?" అని మారు బల్కెను.

ప్రియుడిట్లు చెప్పిన హేమలేఖ తిరిగి యిట్లని యె. "నిశ్చయముగ స్త్రీలు మూఢమానసలు. వారలకు చక్కని విమర్శ యెట్లుండగలదు? మిక్కిలి విమర్శగలిగిన నీవు నాకు బోధింపవలసినది. నీచే బోధితురాలనై యీచింతను విడువ గలను. అనంతరము నీతోడ సమస్తభోగముల ననుభవింప గలను. ఓ! రాజా! సుఖము దేనివలన గలుగునో యది ప్రియ మనియు, దుఃఖము దేనివల గలుగునో యది యప్రియ మని యు, సూక్ష్మ విమర్శాత్మకముగ జెప్పియుంటివి. దేశకాలా కార భేదములచేత ప్రియాప్రియములు భేదించుచుండ నియత ముగ ప్రియము, అప్రియమని యెట్లు జెప్పనగును? అది యెట్టులన దృష్టాంతముగ నగ్నిని జూడుము. వహ్ని దేశకాల భేదము వలన, వేరువేరు ఫలముల నిచ్చుచున్నది. అటువలె నాకార విభేదము చేతను భేదఫలముల నిచ్చుచున్నది: "శీత

కాలమందు ప్రియమగుచు నుష్ణకాలమం దప్రియ మగును. శీతోష్ణ దేశభేదముచేత ప్రియా ప్రియమగుచున్నది. శీత ప్రకృతిగల జీవులకు ప్రియము. తదితరుల కప్రియమగుచున్నది. అటువలె నల్పానల్ప రూపాకార భేదముచేత భేదించుచున్నది. ఆవిధమున శీతము, ధనము, దారాపుత్ర రాజ్యాదులు, తదితరములున్ను, దేశకాలాకార భేదముచేత భేదఫలప్రదములగుచున్నవి. కాని నియత సుఖమాత్రసాధనము లెవ్వరికిని కాజాలవు. వియోగకాలమం దతి దుఃఖహేతువు లగునుగదా! కావున విషయములందు సుఖ సాధకత్వము లేదని తోచుచున్నది. అటుగాక నున్నదనిన, పుత్రదారధనాది సమృద్ధిచే పరివృతుడగు మీ తండ్రివంటి మహారాజనుదిన మేల జింతింపవలయు? అట్టి సుఖసాధన రహితులగు విరాగులైన మా తండ్రివంటి వారలేల దుఃఖమును బొందకున్నారలు?

సుఖసాధనము భోగమనుకొన్నను, అట్టి భోగమున కంతము లేదుకదా! సంపూర్ణ భోగముచే సంపూర్ణ సుఖ మెవనిచే బొందబడగలదు! అట్లయిన, నఖిలభోగ లాభప్రాప్తి కలుగకున్నను, ఎంతవరకా లాభము గల్గునో, యంతవరకైన తత్సుఖలాభప్రాప్తి గలుగుచుండును గదా యనిన నో నాథ! ఆ స్వల్ప సుఖము దుఃఖ విమిశ్రితముగాన సుఖము గాజాలదు.

దుఃఖము రెండువిధములు, బాహ్యమనియు, నాంతరమనియు. బాహ్యము ధాతుదోషాదులచే బుట్టిన శరీర సంబం

ధమైనది. ఆంతరము వాంఛవలన బుట్టిన మానసికమైనది. వాంఛయే దుఃఖమను వృక్షమునకు దృఢశక్తిగల బీజము. వాంఛ యంతటి శక్తిగలది కనుకనే అమృతాశనులగు నింద్రాది దేవతలు సయిత మహర్నిశము దానికి కింకరులై వ్యవహరించుచున్నారు. వాంఛమిగిలియుండ, సుఖప్రాప్తిగలుగు ననిన, అట్టి సుఖము దుఃఖమే యని గ్రహింపనగును. కారణమేమన, వాంఛ దుఃఖరూపమైయుండ, నద్దానితోగూడిన సుఖము దుఃఖమిశ్రితమె యగునుగదా! ఇట్టి సుఖాభాసము క్రిములకు గూడ గల్గును. ఒకవిధమున పశుపక్షి క్రిమికీటాదులకె యిట్టి సుఖ మెక్కుడుగా నుండునని చెప్పవచ్చును. ఎందువలనన, అయ్యవి స్వల్పవాంఛలతో గూడియుండునవి కాన. ఇక నసంఖ్యాక వాంఛలచే నాకులురైన మానవుల కేదో యొక కొంతవాంఛ ఫలించిన, నెట్టిసుఖము గలుగగలదో చెప్పుము. అట్టిదియే సుఖమగునెడల ప్రపంచమున సుఖవంతుడు గానివాడెవడు? శరీరమంతయు నగ్నిచే దహింపబడుచుండ, సూక్ష్మమైన మంచిగంధపు బిందువుచేత శీతలదేహుడయ్యెనేని. అనేక వాంఛాకులుడైయుండ స్వల్పవాంఛ ఫలించిన సుఖవంతుడు గాగలడు. ప్రియురాలియొక్క యాలింగనమున నరుడు సుఖమును బొందుచున్నాడు. ఆయాలింగనము నందె, పరస్పరాంగ సంశ్లేషరూపమైన బంధము పీడను గలిగించునదగుటచే, దుఃఖయుతమగుట నయ్యది కేవలసుఖమెట్లు

గును? రత్యావేశానంతరము, బరువును మోసిన పశువునకు వలె, నత్యంత పరిశ్రాంతి గలుగు టెల్లరకును విదితమే. పరిశ్రాంతి దుఃఖజనకమే కదా! కాన దుఃఖయుతమగుటచే నందు కేవల సౌఖ్యమెట్లున్నది? ఆనందేంద్రియ సంఘర్షవలన గలిగిన సుఖము, ప్రియాసంగమమందు నీకెంతగలదో ఆమాత్రము శునకాదులకుగూడ కలదుగదా! అయ్యది బుధజనులచే నెట్లభిలషణీయమగును? అంతకంటె సౌందర్య దర్శనమున బుట్టిన సుఖమెక్కుడు గలదని యందువా, అయ్యది స్వప్నమందలి స్త్రీసంగమమువలె కేవల మనఃకల్పితమె కాని వేరులేదు.

ఇందులకొక పూర్వగాథకలదు వినుము. పూర్వమందు మన్మథునికంటె సుందరుడగు నొక రాజపుత్రుడుండెను. అతనికి సర్వలోక సుందరియనదగు భార్యకలదు. ఆ కాంతయందతను మిక్కిలి అనురక్తుడై యుండెను. కాని యామె, యారాజపుత్రుని యందుగాక, నాతని భృత్యునియందాసక్తమానసురాలయ్యెను. ఆభృత్యుడు రాజపుత్రునొకయుక్తిచే వంచించెను. అతనికి నత్యధికముగ మదిరనొసగి, యొడలు తెలియని స్థితియందు, కురూపిణియగు నొక చేటి నతనివద్ద కంపి, సర్వలోకసుందరియగు నా రాణిని తాననుభవించుచుండెను. ఇట్లు బహుకాలము మదాంధుడగు నా రాజపుత్రు

డనుదినము దాసీసాంగత్యమును బొందుచు లోకసుందరియగు తనప్రియురాలిని బడయకుండినను, తనంత ధన్యుడింకొకడు లేడని యనుకొనుచుండెను. బహుకాల మిట్లుజరుగ, నొక నాడు దైవయోగమున భృత్యుడు మదిరనచ్చోనుంచి, కార్యాంతరమున వెడలియుండెను. రాజసుతుడా మదిరను స్వల్పముగ సేవించి, రత్యావేశిత చిత్తమున లోనికేగెను. నందనవనమందు దేవేంద్రునియొక్క శచీగృహంబువలె సర్వ భోగవస్తుజాల సమృద్ధమగు శయనాగారముజొచ్చి, యందలి హంసతూలికాతల్పస్థయగు చేటిని, కామవేగమున బొంది, రత్యంతమున వికారాకృతిగల చేటిగాఁగ్రహించెను.

అంతశంకించి, యాగ్రహించి, యిదియేమియనిచింతించి, తనప్రియురా లెందుబోయెనని యాచేటినడిగెను. మదరహితుడైన యాతని జూచి యాచేటి యత్యంత భయమున వణకుచు మాఱుబల్కకుండెను. రాజపుత్రుడు తాను వంచింపబడుటగ్రహించి, వామహస్తమున దానికొప్పుబట్టి, క్రోధమున గన్నులు నెత్తురుగ్రక్క, కృపాణమెత్తి, జరిగిన దంతయు నిజము జెప్పుమనియు, జెప్పకున్న తత్క్షణమ నరకివైతుననియు గర్జించి పలికెను. అంత ప్రాణభయమున నా చేటి, చిరకాలము నుండియు జరిగిన వృత్తాంతమంతయు జెప్పి, భృత్యుని గూడుకొని యున్న యాతని ప్రియురాలిని ప్రత్యక్షముగ జూపించెను.

నేలమీద నొకానొకచోట నల్లని శరీరముతో, పింగళ నేత్రములతో, క్రూరమును అసహ్యాకరమునగు వక్త్రముతో, ధూళి ధూసరిత సర్వాంగుడును, పరమహేయ స్వరూపుడు నగు భృత్యు నాలింగన మొనరించుకొని, రతిపరిశ్రాంతయై, తన మృదుబాహువులాతని కంఠమున బెనవైచి, తన ముఖ కమలమాతని ముఖమందిడి, యాతని హస్తములు తన స్తనముల సంసక్తములై యుండ, తనపాదములచే నాతని యూరు యుగ్మమును బెనచి, రావుతో గూడిన రోహిణివలెనున్న తన కాంతను జూచెను. నిద్రచే స్మృతి విహీనురాలై యట్లున్న యామెనుజూచి, నిశ్చాంతబడి, ధైర్యము దెచ్చుకొని రాజ పుత్రుడు తన్ను తానిట్లు నిందించుకొనెను.

"ఛీ! నేనెంత బుద్ధిహీనుడను, మదోన్మత్తుడను. స్త్రీల యందెక్కుడు ప్రేమవహించు పురుషాధము లెంతగ 'ఛీ' యన దగినవారు. గోరువంక పిట్ట లేయొక్క వృక్షమునకును సంబంధించి యుండనటుల, స్త్రీ లేయొక్కని వారును గాజాలరు. దున్నకుర్రవలె మూఢుడనైన నన్నుగూర్చి నేనేమని తలపో యుదును. నాభార్యను ప్రాణములకంటె నెక్కుడుగ చిర కాలమునుండి చూచుచుంటినే! విటునకు వేశ్యలువలె స్త్రీలే యొక్కనివారును గాజాలరు. స్త్రీలను విశ్వసించినవా డడవి గాడిదయేయగును. శరత్కాలమందలి మేఘముయొక్క

క్షణికమైన స్థితికంటె నత్యంత చంచలలైన స్త్రీలస్థితి మిక్కిలి పేలవము. నేటివరకు స్త్రీస్వభావమును గుర్తెరుగ నైతిని గదా! మనోవాక్కాయములస సంసక్తుడనగు నన్ను విడచి, యన్యాసక్తురాలగుచు భావము మరగుపరచి, లేని యనురాగము, భక్తియు విటసమూహమందు నటివలె, నాయందు బ్రదర్శించుచున్న దీనినింతదనుక, మదిరామత్త మానసుడనై గుర్తెరుంగనైతిని. నీడవలె నన్ననుసరించుచున్నదని మిక్కిలి విశ్వసించుచు వంచితుడనై, చూడ నసహ్యాకరమగు చేటి యొక్క సాంగత్యము చిరకాల మనుభవించితిని. నమ్మిక తోడ దీసిచేత నిట్లు వంచింపబడిన నాకంటె పరమమూఢుడీ లోకమున గలడా? ఈ భృత్యాహతకుడు పరమ వికారస్వరూపుడే! అందరచేతను గొనియాడబడెడి సౌందర్యము గలిగి, తన్ను ప్రేమించిన నన్ను విడచి, యాతనిపొందుబడయుట కందరి కంటె నెక్కుడు సౌందర్యము వీనియందు దీనికేమి యగుపడెను?" ఇట్లు కొంతదనుక విలపించి యారాజపుత్రుడు మిక్కిలి నిర్విణ్ణుడై, సర్వసంగ వర్జితుడగుచు వనమున కరిగెను.

కనుక రాజపుత్ర! సౌందర్యము మనఃపరికల్పితము. నా సౌందర్యాకృష్టుడవగుచు, నీవు నన్నెంతగ బ్రేమించుచుంటివో, యంతగగాని, యంతకంటె నెక్కుడుగగాని, కురూపిణులగు స్త్రీలను బ్రేమించి, వారలయందు రమించెడివారును

గలరు. సౌందర్యము మనఃకల్పితమేయని నిర్ధారితముగ నింకను నిరూపించెద, సావధానుడవై వినుము. తొలుత బాహ్యమందగుపడిన స్త్రీయొక్క ప్రతిబింబము మనస్సునాశ్రయించినదై, చూడబడుచున్నది. మనస్సునాశ్రయించినదగుటచే, నారూపము సంకల్పమాత్రమగుచున్నది. పిమ్మట నా సంకల్ప రూపముయొక్క సౌందర్యము, మనస్సుచే నుల్లేఖన చేయుచున్నాడు. అటుల తిరిగితిరిగి యుల్లేఖనచేయుటచేత దానియందు వాంఛగలవాడగును. అట్టివాంఛా ప్రాబల్యమున నింద్రియ క్షోభగలవాడై నరుడా స్త్రీయందు రతిని జెందుచున్నాడు. ఇంద్రియక్షోభము గలుగనివానికి సుందరమైన స్త్రీయందైనను రత్యావేశముగలుగదు. అట్టియింద్రియక్షోభకు మాటిమాటికిని సౌందర్యము నుల్లేఖనజేయుటయే కారణము. కనుకనే, యిట్టి యుల్లేఖనలేని బాలురయందును, యోగులయందును క్షోభ కానరాదు. కావున సౌందర్యోల్లేఖనమే క్షోభకుకారణముగాని సౌందర్యముగాదు.

మరియు సౌందర్యముండినను, నుండకుండినను, ఎచ్చెచ్చట సౌందర్యోల్లేఖనము మానవుడు చేయుచుండునో, యాయా స్త్రీయందు రతిని జెందుచున్నాడు. కావుననే లోకమునందు మిక్కిలి బీభత్సమైన యాకారాదులు గల్గిన స్త్రీలు సయితము యువకులచే ప్రేమింపబడి వారి పొందును

బడయుచున్నారు. అట్టి కుహూషికలు సంతానము గనుటయె యుందులకు దార్ష్టాణము. వైరూప్యము నుల్లేఖించినను, సౌందర్యము నుల్లేఖింపకున్నను. అట్టి కుహూషికలయందు నరులకు రతి సంభవించుటెట్టిది? అపానవాత పూషితమై, నికృష్టమగు యోన్యాద్యంగమందు, ముఖాదులకంటె నెక్కుడు సౌందర్యము భాసించు. విక్షిప్తమానసులైన కాముకులగు నరులను గూర్చి యేమి చెప్పనగును! మలమూత్రాదులచే పరిక్లిన్నమైన నీచాంగమందు సౌందర్యము జూడగల్గినచో, సౌందర్య మెచ్చటలేదో చెప్పుము. కనుక నో రాజపుత్ర! ఈ సౌందర్యము మనఃకల్పితమాత్రమె యగుట కొంచెమైనను సుఖహేతువు గాజాలదు.

అటుగాక తేనెయందు మాధుర్యమువలె దేహమందు సౌందర్యము సహజమగు నేడల, బాలురకును, కుమారులకును, నయ్యది యేల భాసింపదో చెప్పుము. అదికాక వివిధ దేశములందు నరులు వివిధాకృతులు గలిగియున్నారు. ఒక పాద మొకనేత్రము గలవారు, వ్రేలాడు చెవులు గలవారు, గుఱ్ఱమువంటి ముఖమువారు, నాసారహితులు, దీర్ఘమైన నాసికగలవారు, లోమములచే గప్పబడినవారు, లోమరహితులు, పచ్చని జుట్టువారు, తెల్లని జుట్టువారు, జుట్టు లేనివారు, స్థూలములైన వెంట్రుకలు గలవారు, చిత్రవర్ణులు,

కాకవర్ణులు, పింగళవర్ణులు, ఎఱ్ఱనివారు, ఇట్లు బహువిధము లైన మానవులాయా జాతి వనితలయందు నీవలె, రతిని గలిగి యుండుట జూడుము. కాన సౌందర్యము మనఃకల్పితముగాక యెచ్చటనున్నదో పరిశీలింపుము.

సుఖమునిచ్చు సాధనములలో ముఖ్యమైనదని సర్వ జనులచేతను ప్రేమింపబడుచున్నది స్త్రీశరీరము. సమస్త దేవతలును, పండితులునుగూడ నట్లే భ్రమపడుచున్నారు. అటులనే స్త్రీలకు పురుషశరీరము మిక్కిలి సుందరమును ప్రియమును నగుచున్నది. అట్టియెడ, రాజపుత్ర! శరీరము యొక్క యథాస్థితిని స్వబుద్ధిచేత విమర్శింపుము. మాంసము చే మెత్తబడినదియు, నెత్తురుచే తడిసినదియు, నాడులచే గట్టబడినదియు, చర్మముచే గప్పబడినదియు, ఎముకల గూడును, లోమావృతమును, వాతశ్లేష్మభూయిష్టమును, మలమూత్ర స్థానమును, శుక్ర శోణితములచే బుట్టినదియు, మూత్రద్వారమునుండి వెలువడినదియునగు నీ శరీరమునందా ప్రేమ! మహా భీభత్సమైన యిట్టి యీశరీరమందు రతి నొనరించు నరులకును, అమేధ్యమందలి పురుగులకును భేదమేమి కలదో చెప్పుము. రాజపుత్ర! నీకు మిక్కిలి ప్రియమైనది, యీ శరీరముగదా! ఇందలి మాంసాది ధాతువులయొక్క వేఱు వేరు స్థితిని వివేకముతోడ భావనజేయుము.

ఆదియునుగాక భోజ్యవిషయమున సర్వత్ర మిక్కిలి ప్రియములగు మధురాదిషడ్రసము లెట్లుపరిణామమును జెందునో ఆ స్వభావమును సూక్ష్మముగ నాలోచింపుము. భుజించి నది సర్వమును, నమేధ్యముగనే పరిణమించుననుటలో నెట్టి సందేహమును లేదుకదా! లోకస్థితి యిట్లుండ, ప్రియమెద్దియో, యప్రియమెద్దియో చెప్పుము.

ఇటుల జెప్పబడి హేమచూడుడు విషయములందలి రస హీనత గుర్తెరిగెను. వెనుకటి వాక్యజాలమునంతయు విని, యాశ్చర్యము గలవాడగుచు, విశేషముగ తత్సర్వమును విమ ర్శించి, భోగములందు నిర్వేదముగలిగి, యుత్కృష్టమైన వైరాగ్యమును బొందెను. అంతట క్రమముగ హేమలేఖను పృచ్ఛచేయుచు పరమార్థమును గుర్తెరింగినవాడాయెను. సర్వాంతర్యామియు, నేకమునైన త్రిపురా పరమేశ్వరిని ఆత్మ రూపిణినిగా తెలుసుకొని, సంసృతినుండి విముక్తుడై, సర్వము తానయగుచు, జీవన్ముక్తుడాయెను. అంత సతనితమ్ముడగు మణిచూడుడును, చంద్రియగు ముక్తాచూడుడును, తల్లియును, మంత్రులును, పౌరులును, తద్బోధను జెంది తత్వజ్ఞులైరి. ఆ పట్టణమందు వేత్త కానివాడుండకుండెను. ఆ విశాలనగర ముపశమించిన సంసృతివాసన గలదగుచు, బ్రహ్మపురతుల్య ముగ, సత్యోత్తమమై పృథ్వియందు ప్రకాశించుచుండెను.

ఆపట్టణమందు పంజరములనున్న కీర శారిక లిట్లుపల్కు-చుండెడివి "ఓ జనులారా! దుఃఖమూలమగు విషయాసక్తిని వదలి, దృశ్యవివర్జితమును, ప్రజ్ఞానఘనమును, స్వస్వరూపమునగు నాత్మయందు రతులుగండు. దర్పణమందు ప్రతిబింబమువలె, చితికంటె నన్యముగ చైత్యములేదు. చితియే చైత్యము. అహంశబ్దవాచ్యము చితియే. సర్వచరాచరము చితియే. కారణమేమన, చితి సర్వస్వాతంత్రము. స్వయంప్రకాశము. సర్వమును చితిననుసరించి ప్రకాశించుచున్నది. కావున సర్వాశ్రియమగుచు, స్వయంప్రకాశమగు చితిని, నేను, నాది, యను భ్రాంతిని విడచి, సర్వాత్మత్వ దృష్టితో భజింపుడు."

ఒకప్పుడు వామదేవాది బ్రహ్మర్షులు కీరములు బల్కు-నీ మహోత్కృష్టవాక్యములు విని, యాపట్టణమునకు విద్యానగరమని పేరిడిరి. అందలి పశుపక్ష్యాదులు సయితము బ్రహ్మవిద్యారతులగుటచే, నా పట్టణమున కా పేరొసగిరి. నేటివరకా పట్టణ మాపేరటనే ప్రసిద్ధిగాంచియున్నది. కనుక రామ! సర్వశుభములకును సత్సంగము మూలము. హేమలేఖాసాంగత్యమున నందలి సర్వజనులును బ్రహ్మవేత్తలైరి. కనుక సత్సాంగత్యము సర్వశ్రేయోనిదానము.

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
పరికాశిక యను నాంధ్రీకరణంబున సత్సంగ
ఫలమను చతుర్థాధ్యాయము.

# పంచమాధ్యాయము.

తే॥గీ॥ జీవకథనందు వ్యపదేశభావగతివి
బోధనొనరించె నాత్మవిభూతి మెరయ
బంధనాఖ్యానమను పేర; భవ్యగురుడు
దానివచియింతు, వినుమంబ! వినులార-

సత్సంగ మాహాత్మ్యమట్లు దత్తమునీంద్రుడు జెప్ప, పరశురాము డత్యంత మోదమంది తిరిగి యిట్లు ప్రశ్నించెను. “గురునాథా! సర్వశ్రేయోనిదానమై, సత్సంగరూపముతమరు సెలవిచ్చినయట్టిది. సంవర్తమునీంద్ర సంగము నాకనుభవ సిద్ధమేకద! ఎవడెట్టి సాంగత్యము నందునో వానికట్టి ఫలము గలుగక తప్పదు. స్త్రీయైనను హేమలేఖయొక్క సాంగత్యమున సద్రాజనమును మహాఫలము నందిరి. ఆ హేమచూడునకా మెచే నెటుల బోధితుండయ్యెనో ఆ క్రమము నంతయు నాకు విపులముగ దయాసముద్రులరగు తమరు సెలవీయ గోరెదను.

రాముడిటుల గోర దత్తాత్రేయులు పరమపావనమగు నాకథ సాకల్యముగ జెప్పెద నాకర్ణింపుమని యిటుల జెప్ప

దొడఁగెను. "అట్లాడిన ప్రియురాలిపలుకు లాలించి హేము చూడుడు, విషయములు రసహీనములనియు, పరిణామ దుఃఖ దాయకములనియు గ్రహించి, వానియందలి సక్తత వదలి ఖిన్నుఁడాయెను. చిరకాల పరిచయమున విషయ వాసనలకు వశంగతుఁడగుచు, వానినొక్కుమ్మడి త్యజించుటకు గాని, వెనుకటివలె భోగించుటకుగాని, శక్తుఁడు గాకుండెను. అతి లజ్జితుఁడగుచు, ప్రియురాలిని పలుకరింపక కొన్నిదినము లట్లు చింతాకులుఁడై గడపెను. విషయములు సన్ముఖమగు నప్పుడు, ప్రియురాలు చెప్పినదంతయు స్మృతికి దెచ్చుకొని, తన్నుదాను నిందించుకొనును నె, వాసనావశంగతుడగుచు నా విషయముల ననుభవించుచుండెను. వాసనావేగమున విషయముల ననుసరించును. అనుసరించుచు, నందలి దోషములను ప్రియురాలు బలికిన తెరంగున జింతించును. శోక విదీర్ణ మానసుఁడగుచు, మాటిమాటికి దుఃఖించును. ఇట్లాతని చిత్తము కదలెడి డోలికయందువలె నిటునటు నూగుచుండెను. భోజ్యములుగాని, వస్త్రభూషణాదులుగాని, వస్తువాహనములుగాని, కాంతగాని, మిత్రులుగాని, యాతనికి కొంచెమైనను సుఖహేతువులు గాజాలకుండెను. సమస్తైశ్వర్యమును గోల్పోయిన వానివలె నిరంతరము దుఃఖించుచుండెను. వాసనా వశంగతుడగుట, సర్వము నొక్కుమ్మడి పరిత్యజింప శక్తుఁడుగాకుండెను. విషయదోషదృష్టిగలిగి యుండుట, సర్వమునిశ్శంకముగ ననుభవించుటకును శక్తుఁడుగాకుండెను.

ఒకనాడేకాంతమున నిట్లు శోకముచే గృశించి, ముఖ కాంతి దొరగియున్న నాతనిజూచి హేమలేఖ యిట్లనియె,, "నాథ! వెనుకటివలె సంతోషయుతుడవుగనుంటకు మారుగ, దుఃఖించుచున్నవానివలె నగుపడుచున్నావు. ఇట్టి నీస్థితికి కారణమేమి? శరీరమే నేనని తాదాత్మ్యను బొందియున్న నాత్మకు, రోగబాధలేమైన కలిగెనా? రోగము లెప్పుడును భోగముల వెన్నుదన్నియుండునని పెద్దలు చెప్పుదురు. వాత పిత్తకఫములను దోషత్రయముచే గూడినది దేహము. ఈ త్రిదోషవైషమ్యములచే బుట్టినవగుచు, వ్యాధులు దేహాదుల నెల్ల వ్యాపించి సర్వదాయుండును. దోషములందట్టి వైష మ్యము జనింపకుండ జేయు ప్రతిక్రియ దుస్సాధ్యము. భుజిం చెడి యాహారమువలన, ధరించెడి వస్త్రమువలన, పలికెడి పలుకువలన, దర్శన స్పర్శనాదులవలన, దేశకాలముల వలన, చేయబడుకర్మ వలన, దోషములు వైషమ్యమును జెందును. కావున నట్టివైషమ్యమలక్షితముగ నుద్భవించును. కావుననె, యుద్భవించిన వైషమ్యమునకు చికిత్స చెప్పబడియున్నది. కాని వైషమ్యము పుట్టకుండుటకు చికిత్స యేర్పడి యుండలేదు. కనుక నో! ప్రియ! నీశోకకారణము జెప్పవలసినది."

అంత నారాజసుతుడిట్లు మారుబల్కెను. " నా శోక కారణము జెప్పెద వినుము. పూర్వము నాకేదియేది సుఖము

నిచ్చెడిదిగనుండెనో, యదియంతయు నీనుడులువిన్న తదుపరి నాశనము జేయబడినది. ప్రస్తుతమునాకు సుఖదాయకముగా గల్గునది యేదియు గానబడదు. ఉరికి నుత్తరువు చేయబడిన వానికి రాజుచే సత్కారముగ నీయబడిన స్రక్చందనాది విషయములెట్లు సుఖదాయకములు గాజాలవో, యటువలె నాకీ విషయములు కొంచెమైనను సుఖమును గల్పింప జాలకున్నవి. వేయేల! నాకు సుఖమే లేదు. రాజుగారియొక్క పనినిజేయుటకు బలాత్కారముగ, తద్భటులచే నిర్బంధింపబడిన వారద్దానిని జేయ నిరాకరించుటకెట్లు సమర్థులు గారో, యటువలె, వాసనలకు వశంగతుడనగుచు, విషయముల నిరసింపజాలక సేవించుచు, దుఃఖితుడనగుచున్నాను. కనుక ప్రియురాలా! నేనేమియొనరించిన సుఖమును బొందగలనో చెప్పుము" అని యడిగెను.

ఇట్లడుగబడి హేమలేఖ తనలో నానిట్లుచింతించెను. 'నావాక్యములువినుటచే నీతనికినిశ్చయముగ చక్కని విషయవైరస్యము గలిగినది. కైవల్యప్రాప్తిరూపమగు శ్రేయస్సునకు బీజమితనియందుగలదు. కనుక నే యిట్టి వైరాగ్యముదయించినది. ఎవరికట్టి శ్రేయ మసంభావ్యమో, యట్టివారలయందిట్టి వాక్యములెన్నివేలు చెప్పినను, కొంచెమైనను మార్పు రాజాలదు. విషయవైరస్యోదయమునకు కారణము బహు

కాల దేవతారాధనము. కాన నితనిచేబహుకాలము హృదం తర్వర్తియు, నాత్మదేవతయునగు త్రిపురాపరమేశ్వరి, లెస్సగ నారాధింపబడెను. అట్టివారలకు గాని యిట్టిస్థితి కలుగదు.' ఇటుల నాలోచించి, ఆమహావిద్వాంసుగాలు ప్రియునకు జ్ఞాన బోధజేయ నిచ్ఛగలదికాన, నాపాండిత్యము మెరుగుపరచి, యన్యవ్యపదేశాత్మకముగ నిట్లు వచించెను.

రాజకుమార! ఈ నా పూర్వవృత్తాంతము వినుము. తొలుత నాతల్లి నాకొక చెలికత్తెను క్రీడార్థమొసగెను. ఆమె స్వతస్సిద్ధముగ సాధ్వి. కాని యొకానొక కులటతోడ సాంగత్యము గలిగి యుండెను. ఆ కులట ఘటనాఘటన విచిత్రసృష్టి సామర్థ్యముగలిగి, నా తల్లి కెరుకలేని విధమున నాచెలికత్తెతోడ గలియుచుండెడిది. అవాస్తవిక చారిత్రి గల్గిన యాకులటతోడ సాంగత్యముగల్గిన దాసఖి, నాకు ప్రాణములకంటెను మిక్కిలి ప్రియమైనది. అందువలన నేనెల్లెడ, నామెవశమున వర్తించుదానను. ఆమెనువిడచి క్షణికమైన నెచ్చటనేని యుండుదానను గాను. ఆమె తన స్వచ్ఛస్వభావముచేత నన్ను వశమొనరించుకొని యుండెడిది. ఇట్లెల్లప్పుడును, నాస్వభావమె యామెగ బరిణమించెను. చిత్రస్వభావయగుచు దుష్టురాలైన యానటిచేత, నామె కామాది వృత్తులయందు ప్రేరేపింపబడెను. తుదకామాయలాడి తన

పుత్రునితో నాచెలినిగూర్చెను. మదిరచే ఘూర్ణితములైన నేత్రములు, నతిమూఢాత్ముడైన నామెపుత్రుడు నాసఖినాక్రమించి నాయెదుటనే, యెల్లప్పుడు ననుభవించుచుండెను. అతనిచేత సర్వాంగముల నాక్రమింపబడి, యనుక్షణ మనుభవింపబడు నాచెలి నన్నెప్పుడును విడువని కారణమున, నా సఖిప్రియునిచే స్పృశింపబడుచుంటిని.

తదుపరి యామూఢునకు సమానాకృతిగల పుత్రుడు బుట్టెను. అతను త్వరలో యౌవనముదాల్చెను. మిక్కిలి చంచలస్వభావుడయ్యెను. అతనికి తండ్రియొక్క మాధ్యము, నాయనమ్మయొక్క విచిత్రానేకసృష్టి నామధ్యముగూడ నబ్బియుండెను. అతనిపేరు అస్థిరుడు. స్వయముగనే బహు నేర్పరి. మూఢనామకుడగు తండ్రిచేతను, శూన్య నామముచే బ్రసిద్ధమైన మత్తవచేతను శిక్షితుడగుచు, నప్రతిహత శీఘ్రగమనము బొందెను. ఇట్లు జన్మతః సాధ్వియు, నిర్మల స్వభావము గలదియునైన నా సఖి, అ సతీ సాంగత్యమున మిక్కిలి మాలిన్యము బొందినదయ్యెను. ఆ కులటతోడను, ఆప్రియునితోడను, అసత్స్వభావుడగు నా పుత్రునితోడను, చిరసాంగత్యముగల్గి, వారలయందు తీవ్రానురాగము గలదగుచు నాయందలి ప్రేమ క్రమముగా వదలెను. నేను నా సరళస్వభావముచే నామె సాంగత్యము విడువలేక, తత్పరు

రాల్నై, సర్వదా యామెనె యనుసరించెడిదానను. అంత నామెప్రియుడైన మూఘుడామెను సర్వదా యనుభవించుచు, బలాత్కారముగ నన్నుగూడ నాక్రమింప దలపనుచుండెడి వాడు. వాస్తవమున మిక్కిలి పరిశుద్ధురాలనగు నేనాతని వశము గాకుంటిని. కాని లోకమునందు నేనుగూడ ననుభ వింపబడుచుంటినని గొప్ప యపవాదు కలదు. తన పుత్రు డైన యస్థిరుని నాయందుంచి, నాచెలి ప్రియునికౌగిట నెల్ల ప్పుడును తత్పరురాలై యుండెడిది. అస్థిరుడు నాచే లాలింప బడి పోషింపబడెను. అంతనాతడు పితామహి యంగీకార మున చపలయను స్త్రీని బొందెను.

ఆ చపల యనుక్షణము తనప్రియుని కభిమతములు, మనోహరములునగు వేరువేరు రూపముల ధరించెడిది. స్వ నైపుణ్యమున, మిక్కిలి సమర్థురాలగు నామె, ప్రియుని తనవశమొనర్చుకొనుచుండెడిది. అస్థిరుడైనను, క్షణకాల మున నసంఖ్యాక యోజనములు కొంచెమేనియు శ్రమనందక బోయిరాగలడు. అతనెప్పుడెప్పు డెచ్చటెచ్చటికి వెడల గోరుచుండెనో, యచ్చటచ్చట నతనికిష్టమగు రూపమును ధరించి, యాచపల భర్తను రమింపజేయుచుండెడిది. ఇట్లస్థి రునితో గూడి చపల, మాతా పితృ తత్పరులగు నైదుగురు కుమారులను గనెను. సమర్థులైన యాబిడ్డలు, నా చెలి కత్తియ చేత నాయందుంచబడిరి. నేను నాసఖియందలి ప్రేమ

చే, వారలను మిక్కిలి బలవంతులనుగా జేసితిని. అంత
నాయైదుగురును వేరువేరుగ నతి విశాలములును, నతిచిత్ర
ములునగు స్థానము లేర్పరచుకొనిరి. తల్లికి గారాబు బిడ్డ
లైవారు, తండ్రిని తమ వశమొనరించుకొనిరి. ఆ తండ్రిని
క్షణక్షణము వారివారి స్థానములకు గొంపోవుచుండిరి.

అస్థిరుడు జ్యేష్ఠపుత్రుని స్థానముజొచ్చి వివిధ శబ్దముల
నాకర్ణించు చుండెను. ఒకప్పుడు మధుర గానము,
నొకప్పుడు మంగళ వాద్యములు, త్రయీవేద మంత్ర
ములు, శాస్త్రాగమ పురాణములు, భూషణరవములు,
తుమ్మెదల ఝుంకారములు, కోకిల స్వరములు, మున్నగు
మనోహర శబ్దములు, పుత్రుడు నియమింపవిని సంతసించి,
తద్వశంగతుడగును. అంత నాపుత్రుడు మరియొకవిధమున
నియమింప, సింహగర్జనము, మేఘ నిర్ఘోషము మున్నగు
బ్రహ్మాండము బ్రద్దలొనరించు భైరవారావముల విని భీతి
నొందును. మరియు దుఃఖించుట, నాక్రోశించుట, విలపిం
చుట మున్నగు చిత్రధ్వనులుగూడ వినును.

రెండవకుమారుడు గొంపోవ నస్థిరుడాతని భవనమున
కేగును. అచట మృదు కర్కశ స్పర్శలుగల శయనాసనా
దులను, శీతోష్ణ స్పర్శలుగల వస్తువులను జూచుచు, హిత

మగువాని గాంచి సంతసించుచు, నహితములగాంచి దుఃఖించుచుండును. అంత మూఢనకుమారుని భవనము జొచ్చి యస్థిరుడు, రక్త శ్వేత నీల పీతహరితాది వివిధవర్ణములను, స్థూల కృశాకృతులను సుందర భీషణ బీభత్సాది రూపముల నాలోకించి, సుఖదైన్యముల నందుచుండును. అంత నాల్గవ తనయుడు విచిత్రమగు తన భవనమునకు గొంపోవ, నందు మధురామ్లకటు తిక్తాది భక్ష్యభోజ్యచోష్యలేహ్య పేయాదులనాస్వాదించును. అంత నైదవ కుమారుని స్థానమందు, వివిధ హితాహిత గంధముల నాఘ్రాణించును. ఇవ్విధి పుత్రుల భవనములందు రాకపోకలు గలిగి, హితముల నానందించుచు, నహితముల దుఃఖించుచు నా భవనములందె యుండును. ఆ పుత్రులు తండ్రియందలి ప్రేమాతిశయమున, నాతడు లేకుండ నేవిషయమును స్పృశింపరు.

అస్థిరుడిట్లు బహువిషయముల బుత్రుల గృహములందనుభవించుచు, కొన్ని విషయములు దొంగిలించి, గుప్తముగ తన స్థానమునకు గొంపోవును. అచ్చట పుత్రులెవ్వరు లేకుండ, చపలతోగూడి రహస్యముగ వాని ననుభవించుచుండును. చపలతోడబుట్టినది మహాశన యనునదికూడ నస్థిరునే పతిగ వరించెను. అస్థిరుడామెయందాసక్తుడగుచు, తత్ప్రీతి కొంకు సమస్త భోగాహరణ తత్పరుడగుచుండును.

అతను తెచ్చు సర్వము క్షణమాత్రమున భక్షించుచు, నా మహాశన పతిని తిరిగితిరిగి యాజ్ఞాపించు చుండును. అతడా భోగములను దెచ్చుటకు నిత్యమును యత్నించు చుండును. అయిదుగురు కుమారుల చేతను, భర్త చేతను, సంపాదిత మైన దానినంతయు క్షణమున హరించి, తిరిగి బుభుక్షాపీడితురా లగుచు, భోగాహరణమందు పుత్రులను, ప్రియుని తిరిగి యాజ్ఞాపించుచుండును. అంత స్వల్పకాలముననే, యామె యిరువురు కుమారుల గనెను. అందు జ్యేష్ఠుడు జ్వాలా ముఖుడు. రెండవవాడునింద్యవృత్తుడు వారిద్దరునుతల్లికిమిక్కిలి గారాబుబిడ్డలు. అస్థిరుడు మహాశనాసక్తుడై యున్నపుడు, జ్వాలాముఖుని జ్వాలలచే దేహమంతయు గప్పబడి పీడితు డగుచు గాఢ మూర్ఛనందును. మరియొకప్పుడు ప్రియపుత్రు డైన నింద్యవృత్తుని గూడి, లోకమంతటిచే నిందింపబడి జీవ చ్ఛవమగుచుండును. ఇట్లస్థిరుడు దుఃఖమునందించు భోగము లందు తత్పరుడగుచుండ, స్వభావశుద్ధయగు నాసఖి పుత్రవా త్సల్యమున దుఃఖముచేగ్రుంగుచు, నింద్యవృత్త జ్వాలాముఖు లను మనుమలచే నిందింపబడి, దహింపబడినదై, లోకమునందు మృతప్రాయురాలగును. ఆమెనెల్లప్పుడనుసరించు నేనును లేని దాననై యైతిని. ఇట్లుబహుకాలము సఖీదుఃఖముచే దుఃఖితు రాలనైతిని.

మహాశనను జేపట్టి యస్థిరుడస్వాతంత్రుడయ్యెను. ఆత డొకప్పుడేదో యొక కర్మచే దశద్వారయుతమగు పట్టణము బొందెను. ఆపట్టణమందు మహాశనతో గూడి, పెద్దదియగు తనతల్లిని కుమారులను బెట్టుకొని సుఖమును గోరుచు, నహో రాత్రములుదుఃఖమననుభవించుచు నివసించుచుండెను. పుత్రుల చేత శరీరము దహింపబడి యనుక్షణము నిందితుడగుచు, భార్యలచే నిటునటు లాగబడుచు, బుత్రికలయొక్క భవనము లైదును జొచ్చుచు వెడలుచు, మిక్కిలి శ్రమ నందుచుండెనే కాని, సుఖము కొంచెమైనను బొందకుండెను. పుత్రుడిట్లు దుఃఖింప నాసఖి యత్యంతదుఃఖితురాలగుచు, మూర్ఛితప్రాయ ముగ నాపట్టణమందె పడియుండెను. జ్వాలాముఖి నింద్యా వృత్తులతో గూడి యా మహాశన, మూఢుడైన శ్వశురుని చేతను, శూన్యయగు ముదుసలిచేతను, బోషింపబడుచు, సవతియగు చపలచే సమృద్ధిగనుచు, నస్థిరుని తనవశమందుంచు కొని, యాపట్టణ మధిష్ఠించెను. చెలికత్తెయందలి ప్రేమ చేత, తత్పరురాలనగుచు నేనుగూడ నందెయుంటిని. సఖీ దుఃఖముచేత మృతప్రాయురాలనయ్యు, వారినందర రక్షించు చుంటిని. నేనందు క్షణమాత్రము లేకున్న, నందుండెడివా రొక్కరును లేరు. నాచేతనే సర్వమును రక్షింపబడుచుం డును. శూన్యచేత శూన్యత్వమును, మూఢునిచే మూఢత్వ మును, నస్థిరునిచే నస్థిరత్వమును, జపలచే జాపల్యమును

జ్వాలాముఖునిచే బ్రజ్వలత్వమును, నిండ్యవృత్తునిచే తదాత్మత్వమును, నిట్లాయూయూకృతి సఖీసంయోగవశమున గల దాననగుచుంటిని. నా సఖిని నేనువిడచిన, క్షణ మాత్రమున నామె నాశమందును. వీరందరి సాంగత్యమున, నన్నుగూడ మూఢజనులు వ్యభిచారిణిగ జెప్పుచుందురు. కుశలురైన వారు నన్ను స్వచ్ఛమైనదానినిగ నెరుంగుదురు.

నాతల్లి మహాసతి. విశుద్ధురాలు. నిర్మలాకృతిగలది. ఆకాశముకంటె వ్యాప్తమైనది. పరమాణువుకంటె సూక్ష్మమైనది. సర్వజ్ఞురాలయ్యు, నేమియు నెరుగనిది. సర్వమునకు కర్త్రియయ్యు, గ్రియారహితమైనది. సర్వమున కాశ్రయమగుచు, తనకాధారములేనిది. సర్వమునకాధారమగుచు, తన కాశ్రయము లేనిది. సర్వరూపములు తానయగుచు, తనకు రూపములేనిది. సర్వము తనయందెయుండ, దేనితోడ గూడియుండనిది. సర్వత్ర ప్రకాశించునదయ్యు, నెవనిచేత గాని కొంచెమైనను తెలియబడనిది. మహానంద స్వరూపిణియయ్యు, నానందము లేనిది. తల్లిదండ్రులు లేనిది. ఆమెకు నావంటి కుమార్తెలు లెక్కలేనంతమంది కలరు. సముద్రమందు తరంగములవలె, నాసోదరీగణము లెక్కకందజాలదు. రాజపుత్ర! వారందరును నా శీలమువంటి శీలముగలవారు. నేను మహామంత్రవేత్తను. ఈ సమస్తసఖీజన పరివృతురా

లనై తత్పరురాలనై యుండినప్పటికిని, మా తల్లితో సమాన మైన స్వరూపము గలవాడను.

ఆపట్టణమందు పగటు మిక్కిలి శ్రాంతిజెందినపుడు, నా చెలికత్తెయగు తనతల్లియొడియందు శిరముంచి, గాఢముగ నిద్రించును. అతడట్లు నిద్రింప, నతని కుమారులు మొదలగు వారలెల్లరును గాఢనిద్రను జెందుదురు. అందు మేల్కొని యుండువా రొకరును లేరు. అప్పుడాపట్టణమును పూర్వ ద్వారయుగ్మమున పహరాయిచ్చుచు, ప్రచారుడను పేరుగల అస్థిరుని సఖుడు రక్షించుచుండును. అస్థిరునియొక్క తల్లి యగు నాచెలిగూడ కుమారుని వలె నిద్రింప, నా మెయిత్తయు కులటయునగు నా ముదుసలి కుమారునితో సహా వారలనందర నాచ్ఛాదించి రక్షించుచుండును. ఇట్లందరును గాఢ సుషుప్తిని జెందియుండ, నేను నాతల్లివద్దకేగి, యామె యాలింగనమున, చిరకాలమానంద మనుభవించుచుందును. తిరిగి వారు మేల్కాంచు నప్పటికి శీఘ్రముగ వారలననుసరించు చుందును.

అస్థిరుని చెలికాడగు నా ప్రచారుడు మహాబలుడు. అతను అస్థిరాదులనందర ననుక్షణము బోషించుచుండును. అతనొక్కడు అనేకవిధములగుచు, నీ పట్టణమును, తన్నివాసులను, వ్యాపించి యనుదినము రక్షించుచుండును. వీరల

నందర విడిపోని విధమున బట్టియుంచును. సూత్రము దెగిన, మాలయందు గూర్చబడిన మణులు వేరువేరగునటుల, నీతడు లేకున్న, వీరందరు నెవరికివారై, విడివడి నశింతురు. అతడె నన్నుగూడ కలుపుకొని వీరలనందర గూడగట్టును. నాచే మిక్కిలి పోషితుడగుచు, నాపట్టణమున, నాటకప్రవర్తకుడుగ నుండెను. ఆపట్టణము జీర్ణమైన, వారినందర శీఘ్రముగ మరియొక పట్టణము జేర్చును. ఇట్లస్థిరుడు ప్రచారునాశ్రయించి క్రమముగ, చిత్ర విచిత్రములగు పురముల కధిపతి యగుచుండును.

అస్థిరుడు భార్యాపుత్రులు గలవాడయ్యెను, మహాబలుని యాశ్రయించినవాడయ్యెను, నామన్ననను బడసినవాడయ్యెను, సర్వదా మిక్కిలి దుఃఖముననుభవించు వాడెయగుచుండును. భార్యలగు చపలా మహాశనలచేతను, పుత్రులగు జ్వాలాముఖ నింద్యవృత్తుల చేతను, మరి కుమారులైదుగురచేతను, నిటునటు నీడ్వబడి, సుఖలేశమైన లేక మహాకష్టముల నందుచుండును. ఒకప్పుడు చపలచే జలింపబడి మిక్కిలి దుఃఖితుడగును. ఒకప్పుడు మహాశనకుగాను భోజనార్థము, బరువులెత్తును. ఒకప్పుడు జ్వాలాముఖునిచే నాక్షిప్తుడగుచు నాపాదమస్తకము దహింపబడి మహామూర్ఛనుజెంది, తత్ప్రతిక్రియను గుర్తెరుంగ కుండును. ఒకప్పుడు నింద్య వృత్తుని

బొంది, శోకముచే గ్రసితుడై, జీవచ్ఛవమునై తినిగదాయని దుఃఖించును. దుష్కులమందుబుట్టి, దుష్టులైన పత్నీపుత్రులతోగూడి, మోహముచే వారలకు వశంగతుడగుచు సదా వారిచే నీడ్వబడుచు, వారితోసహా విచిత్రములగునుచ్చ నీచ పట్టణముల వసించుచుండును.

ఒకప్పుడు ఘోర కాంతారములందును, ఒకప్పుడు పిశితాశనాక్రాంత భూములందును, ఒకప్పు డత్యుష్ణప్రదేశములందును, ఒకప్పుడతి శీతలస్థలములందును, ఒకప్పుడు దుర్గంధ జలములందును, ఒకప్పుడు గాఢాంధకారములందును, వసించుచుండును. ఇట్లు దుఃఖాతిదుఃఖసంతప్తుడగు తనయుని జూచి నాచెలి, దుఃఖముచే మూఢురాలయ్యెను. స్వభావమున సతియయ్యు, నామె నిర్హేతుకముగ, దుస్సాంగత్యమున నిట్లనుభవించెను. ఆమెననుసరించి నేనును, తత్కుటుంబ పరాయణురాలనై, మూఢురాలివలె నైతిని. వేసవినూసర క్షేత్రమున కేగి, నరుడు దాహశాంతి నందజాలనటుల, దుస్సాంగత్యమున సౌఖ్యలేశమేని యెవ్వడును బొందజాలడు.

ఇట్లు బహుకాలము జరిగిన తదుపరి, నాసఖ మిక్కిలి దుఃఖముచే మోహితురాలగుచు, రహస్యముగ నన్నుగలసికొనెను. మదేక సంగమున, నుపాయము గ్రహించి సత్పతినిబొంది, తన తనయుని జయించి, యాతని పుత్రాదుల

కొందరబంధించి, మరికొందర జంపి, నన్నుగూడుకొని, నా తల్లి యొక్క పట్టణము శీఘ్రముగ జేరెను. నిష్కల్మషురాలగుచు నాతల్లిని మాటిమాటికిని కౌగలించుకొని, యానంద సముద్రమందు విలీనమైన స్వభావముగలదియయ్యెను.

కనకనాథ! నీవును సఖవలనగలిగినదుర్వృత్తమును నిగ్రహించి నీతల్లియందైక్యముజెంది, నిత్యసుఖమును బొందుము. ఈ సుఖాస్పదమగు నా స్వానుభవ వృత్తాంతమును నీకు జెప్పితిని.

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశిక యను నాంధ్రీకరణంబున బంధనా
ఖ్యానమను పంచమాధ్యాయము.

---

# షష్ఠాధ్యాయము.

తే॥గీ॥ జగములకు నెల్ల మూలము శ్రద్ధయగును
దానివిడచిలేదు ప్రవృత్తి తథ్యమనుచు
బల్కు దత్తావధూతేంద్ర ఫణితివినుము
నిజమునెరిగిన తల్లివి నీవు గాద!

ప్రియురాలట్లుబలుక విస్మితుడగుచు, మందహాస యుతుడై, విద్వాంసురాలగు నాకాంతతోడ నేమియు నేరక యిట్లు నుడివెను. "ప్రియురాలా! నీవు బలికినదంతయు, నాకాశచిత్రమువలె నున్నవి. నీవాక్కులాలంబన శూన్యము లని తోచుచున్నవి. నీవు నిజముగ కప్పురసకడుపున జన్మించి, యరణ్యమందు ఋషిచే పెంచబడితివి. ఇప్పటికిని పూర్తిగ యౌవనమైనను నీకువచ్చియుండ లేదు. అట్టిచో ననేకవేల సంవత్సరములు నీకుండినటుల జెప్పుచున్నావు. ఇయ్యవి దయ్యముపట్టినవాని పలుకుల విధమున నున్నవి. సందర్భ హితములగుట, నవి యథార్థములగునెట్లు? ఆ నీ సఖి యెచ్చటనున్నదో చెప్పుము. నీసఖిపుత్రుడెందు బద్ధుడయ్యెను? ఆపట్టణము లెందున్నవి? ఉండుగాక, వృత్తాంత మయ్యది

యటుంచుము. నాకు సఖియెవరో చెప్పుము. నాతల్లి నాకెట్టి సఖిని యిచ్చి యుండలేదు. నాతల్లి యంతఃపురమందున్నది. మాతండ్రికి మరియొక భార్యలేదు. ఆ నాసఖి గాని, తత్పు త్రికలుగాని యెందుండిరో చెప్పుము. నీపలుకులు వంధ్యా పుత్రునిగూర్చిన పలుకులవంటివని తలతును.

ఒకానొక విదూషకుడిట్లుపలికెనట. "గొడ్రాలి కొడు కొకడు, ప్రతిబింబమహారథమెక్కి, శుక్తియందారోపింప బడిన, రజతము వలననగు నగలచే భూషిత సర్వాంగుడై, మనుష్యుని కొమ్ముచే జేయబడిన యాయుధముల ధరించి, యాకాశమను అరణ్యమందు యుద్ధము జేసి, పుట్టనున్న రాజును సంహారించి, గంధర్వనగరమును జయించి, యెండమావుల లోని జలమందు, స్వాప్నిక కాంతలతోడ కేళిసలిపె"నని. నీపలుకులింత యసంగతములుగ నెయున్నవి.

అంతనా చతురురాలాతనితో తిరిగియిట్లనియె. "నాథ! నేపలికినది యర్థరహిత మెట్లుగాగలదు. మావంటివారల వచన మెప్పుడును, నాలంబన రహితము గాజాలదు. తపస్సు లను నాశమొనరించు ననృతము సత్యశీలురందెట్లుండును? బాల్లి వానియందు సౌందర్యమువలె, తపోధనులకులమం దనృత మెట్లుండును? జిజ్ఞాసువగు వానికెవడసత్యము, నపార్థము జెప్పునో, వాడిహపరదూరుడగును. రాజపుత్ర! నా పలుకు

లాలింపుము. లోకమున నేత్రరోగము గలవానికి కాటుకల పేర్లు విన్నంతమాత్రముననే, శీఘ్రముగ సమదృష్టిగలుగునా? మూఢమనస్కులు, హితవాక్కు నసత్యముగనే, భావింతురు. నీవు బియురాలవైన జిజ్ఞాసువగు నీవు నసత్యము జెప్పెదువా! లోకమందు నేర్పరియగుమనుజుడేదో యొక యంశమును పరిశీలించి, సమస్త వ్యవహారమందలి సత్యత్వమును గుర్తెరుగుచున్నాడు. కాననే జెప్పినదసత్యమగునేమో, సూక్ష్మబుద్ధిచే విమర్శింపుము. ఒకప్పుడు నీకభీష్టసాధనమగు విషయమంతయు, నానుడుల వలన నీకిప్పుడు సుఖసాధనము గాకుండుట, నీకనుభవసిద్ధమేకదా! అట్లు వెనుక జెప్పినది సత్యమగుట, నిప్పుడు జెప్పినది కూడ సత్యమనియె తెలిసికొనుము.

ఋజువగు నిర్మలబుద్ధితోడ బల్కుచుంటిని. నా పలుకుల వినుము. ఆప్తవాక్కులందు, విశ్వాస రాహిత్యము పెద్దశత్రువు. ఆర్తుడైన బిడ్డను, ప్రేమగల తల్లివలె, శ్రద్ధ మహాభయముల నుండి జిజ్ఞాసువులను రక్షించును. ఇందు సంశయము లేదు. ఆప్తవాక్కులం దశ్రద్ధవహించి మూఢుడైశ్వర్యమును, సుఖమును, కీర్తిని గోల్పోవును. శ్రద్ధారహితుడైనమనుజునకు సర్వమునశించును. శ్రద్ధ సకలజగత్తులకు దాదివంటిది. శ్రద్ధ సర్వమునకు జీవనాధారము. తల్లికశ్రద్ధయుండిన బాలుడెట్లు జీవించును? యువకునకు భార్యయం

దశ్రద్ధయుండిన సుఖమెట్లు గలుగును? సంతానమందు వయో వృద్ధులకశ్రద్ధయున్న, వారికి సుఖముగ కాలమెట్లు గడచును? శ్రద్ధా రహితుడగుచు వ్యవసాయకుడు భూమి నెందులకు దున్నును? త్యాగమందుగాని, సంగ్రహమందుగాని, శ్రద్ధ లేనిది ప్రవర్తకత్వమె యుండజాలదు.

శ్రద్ధాభావమున జగత్తునందలి సుఖాద్యనుభవ వ్యవహారమంతయు నశించును. లోకమునందలి వ్యవహార ప్రవర్తకత్వమంతయు, లాభాలాభ నిశ్చయపూర్వకముగ జరుగుచున్నది. కాని, శ్రద్ధవలన కాదందువేని వినుము. శ్రద్ధయనగ 'ఇది యిట్టిది' అను నిశ్చయమె రూపముగాగలది. అట్టి నిశ్చయము ననుసరించి ప్రవర్తించినను, శ్రద్ధ ననుసరించుటయె యగును. శ్రద్ధయె లేకున్న నుచ్ఛ్వాస నిశ్శ్వాసములకు సయితము నిరోధము గలిగి, సమస్తలోకము నశించును. కారణమేమన, శ్రద్ధలేనిది ప్రవృత్తి లేదు. ప్రవృత్తి లేనిది వ్యవహారముండదు. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు గూడ ప్రవృత్తిపూర్వక వ్యవహారమె కాన, శ్రద్ధలేకున్న తన్నిరోధము గల్గును. కనుక దృఢమగు శ్రద్ధనువహించి సౌఖ్యము జెందుము. నికృష్ట కార్యమందు శ్రద్ధకూడదు. కాన అందుశ్రద్ధామూలకత్వ మెట్లున్నదని యందువేని, అందు శ్రద్ధ కూడదను ప్రవృత్తియె శ్రద్ధారూపము. కాన, ఆ శ్రద్ధలేకుండుటకూడ

శ్రద్ధారూపమె యగుచు. అట్టిశ్రద్ధయే లేకున్న, 'నీచకార్యమందు ప్రవర్తింపకుండు'నను ప్రవృత్తి నిషేధాత్మక ప్రవృత్తి నీకెట్లు గలదు?"

ఈవాక్యములు విని హేమచూడుడు నేస్వరియగు తన భార్యతో నిట్లనియె. "ప్రియురాలా! మంచిచెడ్డల విచక్షణ లేక సర్వమునందును శ్రద్ధవహించుటయె కర్తవ్యమగునెడ, సద్విషయముల శ్రద్ధవహించిన శ్రేయమును బొందుదురు; అట్టి శ్రేయోభిలాషి, చెడ్డకార్యముల శ్రద్ధవహింపకూడదు. అట్లు చేయకున్న తీక్ష్ణమైన గాలమును మఱగు బరచుచుచు. గ్రుచ్చబడిన మాంసమునందు శ్రద్ధగలిగిన మీనములవలె నాశము జెందుదురను, మహాజనవాక్యమునకు వైయర్థ్యము తటస్థించును. కావున సద్విషయములందుశ్రద్ధ కర్తవ్యము. అసద్విషయముల గూడదు. అసద్విషయముల శ్రద్ధవహించిన నాశము గలుగును. సద్విషయముల వహించిన శ్రేయము గల్గును. ఇట్లు చెప్పబడు సత్పురుషవాక్యము ప్రమాణముగ బ్రవృత్తుడ నగుదును. కనుక సద్విషయమని గుర్తెరిగియె శ్రద్ధవహించుట యుక్తము. అసద్విషయమం దయుక్తము. అట్టిచో నీకు ప్రవృత్తి యెట్లుగల్గుననను ప్రశ్నకు దావెచ్చట?"

ఇట్లడుగబడి హేమలేఖ, యీక్రిందివిధమున బదులు చెప్పెను. "రాజకుమార! నేజెప్పబోవు వాక్యములువినుము.

'ప్రశ్నకు తావెచ్చట?' అని యడిగితివి కదా! వీడు మంచి వాడు, వీడు కాడను నిశ్చయమెట్లు గలుగగలదు? అన్య వాక్యలచే కలుగునందువా, అనవస్థా దోషము గల్గును. కనుక నట్టినిశ్చయమె కలుగదు. కలిగిన శ్రద్ధయెయగును. మంచిచెడ్డలు తెలియుటయె శ్రద్ధకు ప్రమాణమనిన, శ్రద్ధలేని వానికి ప్రమాణమేదియో చెప్పుము. కనుక సర్వపురుషార్థ సాధక ప్రవర్తకమగునది శాస్త్రముకంటె వేరొండులేదు. సదాగమముకంటె విరుద్ధ ధర్మములుగల యితర ప్రమాణములచే గలుగు ప్రవృత్తిఫలము నందజాలదు. సదాగమము నందలి శ్రద్ధ నాశ్రయించిన, ప్రవృత్తియొకప్పుడు ఫలము నందకున్నను, అది ప్రమాణదోషమున సంభవించినది కాజాలదు. సామాగ్రీలోపముచే నైనది. ఆలోపమును సవరింప ఫలము నందును. కనుక శ్రద్ధనాశ్రయించి, సమస్త లోకము ప్రవర్తించుచున్నది.

శ్రద్ధవలన శ్రేయఃప్రాప్తిగలుగు నుపాయము జెప్పెద. సావధానుడవై వినుము. శుష్కతార్కికుడు గాని, తర్కరహితుడగు మూఢుడుగాని, యిహపరములందు శ్రేయస్సును బొందజాలడు. వారిరువుర, తర్కరహితుడగు మూఢుడొకప్పుడు, గుడ్డివేటుగ ఫలమునందునేమొ కాని, శుష్కతార్కికు డెప్పుడును బొందజాలడు.

పూర్వము గోదావరీతీరమందలి సహ్యాచలమున కౌశికుడను బ్రాహ్మణుడు నివసించుచుండెను. అతడు పరమ శాంతుడు. పరావరజ్ఞుడు. ఆయనకనేకులు శిష్యులుగలరు. వారొకప్పుడు గురుపరోక్షమున జగద్రూపమును నిర్ణయించుచు, తమతమ బుద్ధ్యానుసారముగ, బరస్పరము సంభాషించుచుండిరి. అప్పుడచ్చటికి, శుష్కతర్క నిపుణుడగు శుంగుడను బ్రాహ్మణుడు వచ్చెను. అతడు తనబుద్ధి కౌశలమున, నా శిష్యులనువదించిన మతములన్నియు ఖండించెను. ఆశిష్యులు నిర్దుష్టమగు ప్రమాణముచేత, జ్ఞాతమగునది సత్యమని సిద్ధాంతీకరించునెడ, నశ్రద్ధచేత ప్రజ్ఞానాశమునందిన, వివాద నిపుణుడగు శుంగుడు శుష్కతర్కము నాశ్రయించి, వారిసిద్ధాంతమిట్లు ఖండించెను. 'ఓ బ్రాహ్మణులారా! నా వాక్యము వినుడు. సత్యమనునది యెచ్చటను లేదు. సత్ప్రమాణము చేత జ్ఞాతమైనది సత్యమని మీరంటిరి. అసత్యప్రమాణము చేత జ్ఞాతమైనది యసత్యమేకద! కనుక మున్ముందు ప్రమాణములయొక్క సత్యాసత్యములు నిర్ణయింపవలసియున్నది. ఆ నిర్ణయము మరియొక ప్రమాణముచే చేయబడుచుండిన, నద్దానికిని, ప్రమాణము నిర్ణయింపవలసియుండును. ఇట్లు ప్రమాణము, అనవస్థాదోషగ్రస్తమగుటచే జ్ఞాతమేయుండదు. కనుక ప్రమాణము, ప్రమిత, ప్రమాతయు లేనివేయగుచున్నవి. కాన నేను దీనిని కంటితో చూచుచున్నాననునట్టి వివిధ వికల్ప

మంతయు, శూన్యమె యాలంబముగా గలది యగుచున్నది. ఆశూన్య మెట్టి ప్రమాణముచేతను నిలువకుండుటచే శూన్యత్వమును జెందుచున్నది. కావున నంతయు శూన్యమె. ఏమియు లేదు. ఇది నిర్ణయము.' అను శుంగవచనములు విని వారిలో కొందరు ద్విజాధములు ఆవాదము నిశ్చయమని, శూన్యవాదులై నాశమందిరి. విచారపరులైన మరికొందరు శుంగవాదమును కౌశికునకు దెల్పి, యామహాత్మునిబోధచే సమాహిత మనస్కులైరి. ఇవ్విధమున శుష్కతర్క మన్ని విధముల విడనాడదగినది. సచ్ఛాస్త్రానుకూలమైన తర్కము శ్రేయోదాయకము."

మిక్కిలి ధీరురాలగు నాప్రియురాలిచే నిటులజెప్పబడి, హేమచూడుడత్యంత విస్మితుడగుచు నామెను తిరిగి యిటుల బ్రశ్నించెను. "ప్రియురాలా! అసదృశమగు నీ పాండిత్య మిట్టిదని యెరుంగకుంటిని. నీవు ధన్యురాలవు. నిన్నుబొంది నేనును ధన్యుడనైతిని. శ్రద్ధచే సర్వశ్రేయస్సిద్ధి గల్గునంటివి. అది యెట్లు? ఎందుశ్రద్ధవహింపవలె? ఎందుకూడదు? శాస్త్రము లనంతములు. అనేకార్థ ప్రతిపాదకములు. ఆచార్యమతములు వివిధములు. వ్యాఖ్యాతృమతము లంతకంటె భిన్నములు. స్వబుద్ధిచే విచారించి, గ్రహింతమనిన, నది స్థిరమైనది కాదు. ఏది గ్రహింపనగును? ఏది గ్రహింప

దగదు? ఏది యెనని కభిమతమో, యదియె సత్యమనియు, తదితరము హానిప్రదమనియు జెప్పచుందురు. అట్లగుట, నిశ్చయమేదియో, తెలియకున్నది. శూన్యవాది యగు శుంగునిచే తత్వము శూన్యమని చెప్పబడినది. ఆశూన్య తత్వవాదము దూషింపబడినది. ఆ శుంగునివాదము సయితము శాస్త్రసమ్మతమె కదా! దానినేలనమ్మరాదు? నీకు తెలియనిది లేదు. ఈసర్వమును నాకు జెప్పము."

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశిక యను నాంధ్రీకరణంబున శ్రద్ధా
ప్రశంసయను షష్ఠాధ్యాయము.

---

# సప్తమాధ్యాయము.

తే॥గీ॥ కలుగ సత్తర్కమున శ్రద్ధ, గలిగి పౌరు
షంబు ఘటియించి, యారాధనంబు సల్పు
పీశు, నిశ్శ్రేయస మొదవు నిక్కమనెడి
గోష్ఠి వినిపింతు వినుమంబ! గురునిదైన -

ప్రియుడగు భర్తచే నిట్లడుగబడి, విద్వాంసురాలును, జగత్స్వరూపమును లెస్సగా గుర్తెరిగినదియు నగు నా హేమలేఖ, యిట్లు జెప్పదొడంగెను. "నాథ! స్థిరచిత్తుడవగుచు నేజెప్పునది సావధానముగ వినుము. మనస్సు మర్కట ప్రాయము. అందువలననె మానవుడు మహానర్థమును బొందుచున్నాడు. చంచలాత్మకమగు నీమనస్సు సర్వ దుఃఖములకు గారణమగుట స్పష్టము. ఎట్టులన చలనరహితమైన సుషుప్తి యందు మానవుడు సుఖము ననుభవించుచున్నాడు. కావున స్థిరీకృత చిత్తుడవగుచు నేజెప్పునది వినుము. అనాదరమున వినినది వినినదియె. అట్లువినినదానికి, చిత్తరువునందు వ్రాయబడిన వృక్షమునకువలె ఫలమేమియు నుండదు.

నాశనహేతువగు శుష్కతర్కమును విడచి, సత్తర్కమునాశ్రయించి, నరుడు చక్కని ఫలము శీఘ్రమున బొందును. సత్తర్కము నాశ్రయించుటచేత, తజ్జనిత శ్రద్ధను బొంది, సాధన తత్పరుడగుచు, ఫలము నందగలడు. శుష్కతర్కమును వదలి, శ్రద్ధను వహించుటవలన, ఫలశోభితమగుచున్న జగత్ప్రవృత్తిని గాంచుము. సత్తర్కముచే దగిన కాలమని, నిర్ణయించి, కర్షకుడు భూమినిదున్నుచున్నాడు. అటువలె కుతర్కమును వదలి, సదాగమ సత్తర్క సహితమగు శ్రద్ధచే, స్వర్ణరత్నౌషధి పరీక్షకులు నిశ్చయమంద కృషిని సల్పుచుందురు. కనుక శ్రద్ధా సుతర్కములగూడి, యాత్మశ్రేయస్సును నిశ్చయించి, తత్సాధనముకొరకు ప్రయత్నించవలయునుగాని, శుష్కతర్కజనితమగు నశ్రిద్ధవలన, శుంగానుచగులవలె, పురుషకారమును విడువరాదు. శ్రద్ధ వహించి, పురుషప్రయత్నమొనరించువాడెందును జెడడు. దృఢమగు పౌరుషము నాశ్రయించినవాడు ఫలము నందకుండు టెట్లు! పురుషప్రయత్నమున కర్షకుడు ధాన్యమును, వర్తకుడు ధనమును, రాజులు రాజ్యలక్ష్మిని, విప్రులు సర్వసుఖాశ్రయమగు విద్యను, శూద్రులు జీవనమును దేవతలమృతమును, తాపసులుత్తమ లోకములను, మరియితరులు తమతమ యభీష్టములను బొందుచున్నారు. కుతర్కజనితమగు నశ్రద్ధవలన పురుషుడు కొంచెమేని ఫలమెప్పుడెటుల బొందెనో విమర్శించి

చెప్పఁము. ఒకానొకప్పుడు, ఫలప్రాప్తి గలుగనంతమాత్రమున శ్రద్ధనుడిగి, పురుషకారము సడలినవాఁడు, దైవహతుఁడనియు, దనకుఁ తానె శత్రువనియు నెరుఁగుము.

పురుషకారము నాశ్రయించి, సత్తర్క పోషితమగు శ్రద్ధగలిగి శ్రేయస్సునకుముఖ్యతమమగుసాధన మేదియో, దాని నాశ్రయింపుము. శ్రేయస్సాధనము శాస్త్రములందు, కర్మయోగాది బహువిధముల బ్రసిద్ధమగుచుండ, నందు దేనినాశ్రయింపవలయునన్న, ఫలప్రాప్తియందు విచిత్రములును, నానావిధములునగు సాధనముల నెయ్యది సర్వవిధముల ఫలమును సాధించునో, యదియముఖ్యతమముగాన, దాని నాశ్రయింపవలయును. ఆసాధనము సత్తర్కానుభవములచే నిశ్చయించి, యనుష్ఠింపవలయును. తద్విధమంతయు దెల్పెద సావధానుఁడవగుచు వినుము.

ఏవిధమమున శ్రేయమన నెద్దియో వినుము. దేనిని బొందిన శిరికి దుఃఖమనునది యుండదో, యదియ శ్రేయస్సు. సూక్ష్మముగ విచారించిన సర్వము దుఃఖమయముగనె కన్పించును. దుఃఖమిశ్రితమైనదెప్పుడును శ్రేయముగాదు కదా? ఇకనిట్టి శ్రేయమునకు సాధనమేదియగునో విచారింతము. ధనము, సంతానము, భార్య, రాజ్యము, కోశము, బలము,

కీర్తి, విద్యాబుద్ధులు, దేహము, సౌందర్యాదికము, మున్నగు నవి యెల్ల నస్థిరము లగుటచే, కాలసర్పముఖ స్థితము లై యున్నవి. ఈ సంపదయంతయు దుఃఖాంకురోత్పాదన యందు మహాశక్తిగల బీజమువంటిది. అనగ, వియోగకాల మందుగలుగు మహాదుఃఖమును, తమయం దిముడ్చుకొని, తాత్కాలికముగ సుఖరూపమును వహించియున్నవి. కావున నిందేదియు శ్రేయమునకు ముఖ్యసాధన కాజాలదు.

దేవతారాధనమె ముఖ్యమును, పరమునునగు శ్రేయస్సాధనము. అదియెట్లగునదియు, నిరూపించెద వినుము. ధనాదులను సుఖసాధనములుగ నంగీకరించుట కేవలము భ్రాంతిమాత్రము. ఆభ్రాంతి మోహసముద్భూతము. ఆ మోహము గలిగించువాడు మహేశ్వరుడు. అతడు సర్వ జగత్కర్త గనుక, సర్వజనులను మోహమందింప గలుగుచు న్నాడు. అట్టి సామర్థ్యమును నీవు శంకించిన వినుము. స్వల్పోపాధి పరిచ్ఛిన్నుడగు నింద్రజాలికుడు, తనకున్న స్వల్ప విద్య నాశ్రయించి, కొందరనె భ్రాంతి నందింపగలుగు చున్నాడు. కారణ మాతని విద్య, మితమైనది కనుక. ఇట్టి స్వల్పవిద్యగల నింద్రజాలకుని మాయనే దాటజాలనపుడు, మహామాయ తనయధీనమందుగల మహాదేవుని నతిక్రమింప నేరికి శక్తిగలదు? ఇంద్రజాలకుని స్వల్పమాయ, నెవడు

తత్ప్రతిరోధియగు విద్యచే తెలిసికొనుచుండెనో. వాడు తద్భ్రాంతికి లోనుగాక, స్వస్థుడై యానందించుచున్నాడు. అట్టి విద్య, నామాయకుని నాశ్రయింపకుండినను, ధన దాన సేవనాదులనాతని ప్రసాదముబడయకుండినను, లభ్యము గాజాలదు. అట్టిచో, మహామాయకుడగు నా మహేశ్వరుని ప్రసాదము బడయక, మహామోహము దరింప నెట్లగును? కావున సర్వవిధముల నా మహేశ్వరుని నాశ్రయింపవలయు. నిష్కపటముగ నా మహామహుని బ్రసన్నునిగ జేసికొని, తత్ప్రసాదమున, మహావిద్యను గ్రహించువాడు, తన్మహామాయను శీఘ్రముగ దాటగలడు. ఇతరయోగము లనేకములు శ్రేయస్సాధనములుగ జెప్పబడెను గాని, మహేశ్వర ప్రసాదము లేనిచో, నయ్యవి ఫలప్రాప్తి నందింపజాలవు కనుక దొలుత విశ్వకారణుడగు నా మహేశుని భక్తిచే నారాధింపుము. అట్టి యారాధనచే, మోహనాశకములగు సమస్తయోగములు ఫలించును.

మహేశ్వరుడు సర్వజగత్కర్తయని చెప్పియుంటినిగద! అది యెట్లగునో వినుము. ఈ జగత్తు కార్యభూతముగ మనకు ప్రత్యక్షగోచరమగుచున్నది. సావయవత్వము కార్యలక్షణము. సావయవమగునది ఉత్పత్తిపూర్వకమగునదికాన, ఉత్పత్తిమత్త్వముగూడ కార్యలక్షణమె. అట్టిచో, పధ్రి

వ్యాదులకు కార్యలక్షణమెట్లు పట్టుననిన, అయ్యవి యంశా సహితము లగుటచే సావయవములు. అదృష్టోత్పత్తియుగలవి. కావున జగత్తు కార్యభూతము. పరమాణువు, ఆకాశము మున్నగునవి అవయవరహితములగుట, కార్యము గాజాలవు కాన తన్మూలమగు జగత్తు కార్యముగాజాలదని పూర్వపక్ష మొనరించిన వినుము. అట్లుకాదు. వేద్యమగునది కూడ కార్యమే యగును. ఈ యనుమాన ప్రమాణము 'ఆత్మన ఆకాశస్సంభూతః' ఇత్యాద్యనేక శాస్త్రవచనములచే, దృఢప రుపబడి, జగత్తునకు కార్యత్వము సిద్ధింపజేయుచున్నది. ఇట్లు జగత్తునకు కార్యత్వము సిద్ధింప, కర్తృపూర్వకత్వము గూడ సిద్ధింపబడినదియె యగుచున్నది. ఆకర్త సర్వకర్తృ విలక్షణుడు అనగ, సృష్టికి పూర్వమును నైన నుండదను శాస్త్రప్రమాణమున, సృష్టికి పూర్వము పాదానాదులు లేనం దున, తదపేక్షారహితముగ సర్వమును సృష్టించుటచే సర్వ కర్తృవిలక్షణత్వ మా జగత్కర్తకు సిద్ధించినది.

లోకమకర్తృకమనియు, స్వభావైక సమాశ్రయ మనియు చార్వాకమతము పృధివ్యాపస్తేజోవాయు చతు ష్టయాత్మకము లోకము. ప్రత్యక్షమే ప్రమాణము. కనుక పంచమభూతమగు నాకాశము లేదు. తత్త్వచతుష్టయము యొక్క కలియకవలన ప్రతిక్షణము భేదించును. ఉత్తరో

త్తరము పూర్వాపూర్వము ననుసరించియుండుట సృష్టి స్వభావము. గుడోదకమందు మదశక్తి యుద్భవించునటుల, శుక్ల శోణిత బుద్బుదమందు చైతన్యముద్భవించును. మదశక్తితో గూడిన యుదకము మద్యమనబడునటుల, చైతన్యముతో గూడిన దేహము పురుషుడనబడును. సుఖమె స్వర్గము. దుఃఖమె నరకము. ఇయ్యవి స్వభావముననె ప్రవర్తించును. స్వభావముగ మదిరయందలి మదశక్తి నాశమందునటుల, చైతన్యము దేహాదులందునాశముగాంచును. అదియమరణము. అట్టిమరణమె మోక్షము. ఈమతము తర్కయుతములగు ననేకశాస్త్రములచే గొట్టివేయబడుచున్నది. ఒక్క ప్రత్యక్ష ప్రమాణమునె, యాశ్రయించుటవలన నాత్మనాశమె పరమ పురుషార్థమని చెప్పు శాస్త్రమాభాసమాత్రము. అది వివేకజ్ఞులంగీకరింపరు ఆత్మనాశము మోక్షమనియు, సర్వము క్షణికమనియు నను. నీరెండు చార్వాక సిద్ధాంతములు, తర్కముచే లెస్సగ బాధితములగును. ప్రతిక్షణము నాత్మ నశించుచుండుటచే, ప్రతిక్షణము మోక్షరూపమగు పురుషార్థము కలుగవలసియేయుండును. ఆత్మనాశమందిన క్షణమందు ఆక్షణమునందె పుట్టిన యీపురుషార్థమును బొందువారెవరు? పొందక పోయినను, అది పురుషార్థమెట్లైన, నితరుని యాత్మ నశించునపుడు తానాపురుషార్థమును బొందవలసియుండును. అదియునుగాక స్వాత్మనాశము ప్రమాణసిద్ధమా!

కాదా! ప్రమాణసిద్ధమనిన నరశృంగముగూడ ప్రమాణ సిద్ధము గావలసి యుండును. ప్రమాణసిద్ధమగునందము. ఆప్రమాణ మెయ్యది? ప్రత్యక్షప్రమాణము వర్తమాన కాలమునందె వర్తించును గాన, ఆగతానాగతములందలి ఆత్మ నాశము తత్ప్రమాణసిద్ధము గాజాలదు ప్రత్యక్షముకంటె వేరొక ప్రమాణము ఈ మతమందు లేదు. తత్వ చతుష్టయ సమ్మేళనమున చైతన్యము బుట్టునను నీ మతసిద్ధాంత మనుమాన ప్రమాణసాధ్యముగాని ప్రత్యక్ష ప్రమాణ సాధ్యముగాదు. ఇట్లు ఉపపత్తి రహిత తర్కము మూలముగా గలదియగుట నీమతమత్యంత నిరసనీయము.

మరియు జగత్తునకు వేరొక కర్త లేడని అనీశ్వర సాఖ్యమతము చెప్పుచున్నది. గుణసామ్యావస్థాత్మకమైన ప్రకృతితత్వము జగత్తునకు మూలకారణము. అది చిత్క్రియారహితము జడము. మృత్పిండము ఘటముగా మారుటకు కులాలుడను కర్త నపేక్షించునటుల, నీప్రకృతి తత్వము జగద్రూపమున పరిణమించుటకు, తనకంటె నతిరిక్తమగు వేరొక కర్త నపేక్షింపక జగత్క్రియయందు స్వాతంత్రత గలిగి యుండి, తత్కర్త తానె యగుచున్నది. ఇట్లీమతమున జగత్తునకు అబుద్ధిమత్ప్రకృతికర్తృత్వము ప్రతిపాదింపబడినది. ఇది అసమంజసము. క్రియకు బుద్ధిపూర్వకత్వము సిద్ధము.

ఘటాద్యుత్పత్తిక్రియకు కులాలాది బుద్ధిపూర్వకత్వము ప్రసిద్ధము. ఈవిధముగు ఘటము నిట్లు చేయుమనను బుద్ధిమత్పూర్వకత్వము గల్గిన ఘటాద్యుపపత్తి ననుసరించి, ఆబుద్ధి మత్ప్రి కృతి కర్తృత్వము జగత్తునకు సిద్ధింపదు. అటువలె, బుద్ధ్యభావపూర్వకముగ క్రియ కానరాదు. చిత్తరువులందు లిఖింపబడిన కులాలాదులందు ఘటాదిక్రియలు గాననగునా? మరియు ననేక శాస్త్రవచనముల ననుసరించి, ఘటాదులవలె కార్యభూతమగు జగత్తునకు, బుద్ధిమత్కర్తృకత్వముసిద్ధమగుచున్నది.

ఈవిధమున సచ్ఛాస్త్రసత్తర్కముల, నీజగత్తున కర్తృకమనియు, నాకర్త, లౌకిక కర్తలకంటె విలక్షణుడనియు తెలుచున్నది. విలక్షణత్వమునకు కారణమేమన, కార్యరూపమగు జగత్తు అచింత్యరూపము గలదియును, అపరిచ్ఛిన్నమును అగుటచే, తదనుగుణముగ, తత్కర్త అచింత్యానంత శక్తియుతుడును, అపరిచ్ఛిన్న సామర్థ్య యుతుడునై, యుండియుండవలయునని సిద్ధాంతీకరింపబడినది.

కనుక ప్రపన్నుల నుద్ధరించుట కన్నివిధముల ఆయనయె సమర్థుడు. ఆజగత్కర్తను నిష్కామముగ సర్వదా శరణు జొచ్చుము. ఇటుల సర్వభావమున శరణుజొచ్చుటవలన, ఫలప్రాప్తి గలుగుననుటయందు, నీకు విశ్వాసము గలుగ గలం

ములకు దృష్టాంతము జెప్పెదవినుము. లోకమునందు స్వల్ప ప్రభువు సయితము నిష్కపటములగు మనోవాక్కాయ కర్మల ప్రసాదితుడగుచు, నాశ్రయించిన పురుషునకు నభీష్టార్థ సర్వ స్వము, ననుగ్రహించును. అట్టిచో, సర్వలోకేశ్వరుడు, భక్తలోకైక వత్సలుడునగు భగవంతుడు, తద్విధమున మనో వాక్కాయకర్మల, బ్రసాదితుడగుచు, నుపాసకున కెద్దియొ సంగకుండును! మితేశ్వరులు, దయారహితులు, కృతఘ్నులు, చంచలమనస్కులు గాన వారొసగెడి ఫలమస్థిరము. పరమే శ్వరుడు దయా సముద్రుడు, కృతజ్ఞుడు, సుస్థిరుడు. అట్టి యనంతకళ్యాణ గుణవిశిష్టుడు గాకున్న, నా పరమేశ్వరు డనాది సంసారగుణములచే స్పృశింపబడకుండు టెట్లు! తద్రచి తమైన లోకయాత్ర సుస్థిరమైన దెట్లుగాగలదు! చపలులైన ప్రాకృతుల రాజ్యములు నష్టమగుట చూచుచుండలేదా! కావున నా దయాసముద్రుడు సుస్థిరుడని కీర్తింపబడుచున్నాడు. అట్టి పరమేశ్వరుని, నిష్కామభక్తితోడ, శరణుజొచ్చుము ఆమహామహుడు నీకు శ్రేయమునొడగూర్చును. నీవు మాత్రమే శ్రేయఃపరత్వమును గోరకుము. నీకర్తవ్యమారాధిం చుటయె. అట్టి యారాధనవలన ప్రసన్నుడగుచు నీశ్వరుడేది శ్రేయమో, దాని నొడగూర్చునని తాత్పర్యము.

ఉపాసన వివిధమైనది. రోగాదులవలన నార్తిచేగాని, ధనాది లిప్సచేగాని, యుపాసన జేయుట ప్రసిద్ధము. నిర్హేతుక

మనగా, నిష్కామమగు, నుపాసన నెక్కడనోగాని చూడము అనియు, సత్యమగు నుపాసన. ఒకడార్తుడగుచు నొకానొక ప్రభువును సేవించుచుండె ననుకొనుము. ఒకప్పటికి దయగలిగి, ఆ ప్రభువాతని బాధను తొలగింప వచ్చును, లేకున్న, నాసేవ సుందలి తారతమ్యము ననుసరించి, యొకప్పు డుపేక్షింపవచ్చును. అటులనె, ధనార్థియై సేవించువానికి, కొంచెముగనో, గొప్పగనో యీయవచ్చును. ఈయక పోవచ్చును. నిర్హేతుకత్వము బహుకాలమునకు గుర్తించి 'యీతని సేవకు మనమేమియు నీయజాలకుంటిమే' యని, తద ధీను డగును. ఆప్రభువు అజ్ఞుడుగా నభృత్యుని నిష్కామ త్వము గుర్తింప బహుకాలము బట్టును. సకల హృదంతర్వ ర్తియగు నా సర్వేశ్వరు డుపాసనారంభకాలమందె, తద్విష యమును గుర్తెరింగి, సత్వరముగ ఫలమును బ్రసాదించును. ఆర్తునకును, అర్థార్థికిని, తత్తత్కామితార్థముల నా పరమే శ్వరు డొసగజాలడు. 'ఇది యిట్లుగానగుగాక' అను తన, సంకల్ప రూపశక్తిచేత, కాలవిశేష సహకార కృతకర్మలచే. ఫలప్రదాన సామర్థ్యము తత్తదా చరితకర్మకెంతకలదో, ప్రతీ క్షించి ఫలమొసగును. కర్మపరిపాకము ననుసరించి, స్వని యతిశక్తిచే ఫలమొసగునని తాత్పర్యము. అనన్య శరణు డగు, నిర్హేతుకోపాసకుని నిష్కామత్వము గ్రహించి, యెట్టి ప్రతీక్షయు లేక, నతని యోగక్షేమములెల్ల వహించును.

కర్మవిపాకమును బ్రతీక్షింపక, నియతినుల్లంఘించి, ప్రారబ్ధము ద్రోసిపుచ్చి, తత్సాధన నిర్విఘ్నమొనరించి, శీఘ్రముగ ఫలము జేకూర్చును. ఇట్లు నియతిప్రారబ్ధముల నుల్లంఘించి, ప్రసాదించుటయె, భగవంతుని యందలి మహేశత్వము, మహోత్కృష్ట స్వాతంత్ర్యము.

మరి, నియతిప్రారబ్ధములు అనుల్లంఘనీయములు గదా యన, మహేశవిముఖునియందె వానిమహాత్మ్యము ఈశ్వర తత్పరుడగు మృకండు తనయునియందవి యెట్లుల్లంఘింపబడెనో, యెల్లరకు విదితమెగదా! అనుల్లంఘనీయములగు ప్రారబ్ధ నియతుల, యుల్లంఘనమందు నీకొక యుక్తి జెప్పెదవినుము. పురుషకారరహితులగు వారలయందు ప్రారబ్ధముతప్పక అనుభవనీయమగుచున్నది. ప్రాణాయామపరులగు యోగులచే ప్రారబ్ధము జయింపబడుచున్నది ప్రారబ్ధ మట్టి యోగిని, రోగాది ప్రత్యక్షదుఃఖముల నందింపజాలకుండుట జూచుచున్నాము. కావున పురుషకార పరాఙ్ముఖులె ప్రారబ్ధమను సర్పముచే కబళింపబడెడివారు. పౌరుషమున, ప్రారబ్ధము పరిభవింపబడుచెట్లనిన, అది నియతిస్వభావము. నియతిస్వభావమట్టిదనుటకు అనుభవమె ప్రమాణము. సంకల్పమె ముఖ్యస్వరూపముగగల ఈశ్వరుని శక్తియె నియతి. ఈశ్వరుడు సత్యసంకల్పుడుగాన, ఆనియతి యనుల్లంఘనీయమగుచున్నది.

అట్టి యకుంఠితమగు నా నియతి, పరమేశపరాయణునియందు కుంఠితమగుచున్నది. సర్వత్ర అకుంఠితమగునది యిట్లు భక్తుని యెడమాత్రము కుంఠితమగుటకూడ ఆ నియతి స్వభావమెయని తాత్పర్యము.

పర్యవసానమేమన, ఫలోన్ముఖమైనకర్మ ప్రారబ్ధమనబడును. అది యోగిచేత జయింపబడునని నియతియొక్క ఆదేశము. నిష్కామోపాసకుడు యోగికాన, అతనిచే ప్రారబ్ధముల్లంఘనీయము. భగవత్సంకల్పరూపమైన నియతి సర్వథా అనుల్లంఘనీయ స్వభావముగలదియె యైనను, భగవత్పరాయణుని యందు కుంఠితమగుట తన్నియతి స్వభావమె యగుచున్నది. కావున, కుతర్కమువదలి, మహేశ్వరుని శరణుజొచ్చుము. నిష్కాముడవగు నీకా మహామహుడు శ్రేయమొసగగలడు. ఇంతదనుక మోక్షమనెడి క్షేమసాధమందలి ప్రథమసోపానము. దీనినివిడచిన, మరియొక సాధనమందు ఫలప్రాప్తి కొంచెమైనను గలుగదు."

ఇటుల బలుకు ప్రియురాలి వచనములు విని హేమచూడుడు, సంతోషాక్రాంతచిత్తుడగుచు నామెను తిరిగి యిటుల బ్రశ్నించెను. 'ప్రియురాలా! సర్వకర్తయు, సర్వస్వాతంత్రుడును, సర్వ జగన్నియంతయు, సర్వశరణ్యుడునునగు నా పర

మేశ్వరునిగురించి నాకు జెప్పుము. జగత్కారణరూపమును, విష్ణువనియు, శివుడనియు, గణేశ్వరుడనియు సూర్య నృసింహాదులనియు బుద్ధుడనియు, సుగతుడనియు, అర్హంతయనియు, వాసుదేవుడనియు, పాణిసోమపావకులనియు, కర్మయనియు, ప్రధానమనియు. అణువనియు, నిట్లు బహువిధములగు మతభేదముల విచిత్రముగ జెప్పెదురు అందెచ్చట ఈశ్వరబుద్ధి కర్తవ్యమో చెప్పవలసినది. నీకు తెలియని యంశము లేదనుట నిశ్చయము. ఆ వ్యాఘ్రపాద మహర్షి పరావరజ్ఞుడు. అట్టివానిబిడ్డవగు నీయందు గూడ, నట్టిజ్ఞానమె ప్రకాశించుచున్నది. శ్రద్ధగలిగియుంటిని. నాకు సర్వమును దెల్పుము”

హేమలేఖ యీవిధమున నడుగబడి, సంతసించి యిటుల బదులుచెప్పెను. “నాథ! యీశ్వరునిగూర్చిన నిర్ణయము వినుము. జగజ్జాలముల సృష్టిస్థితి లయములకు కర్తయగువాడీశ్వరుడు. ఆ యీశ్వరుడు విష్ణువు, శివుడు, బ్రహ్మ. సూర్యుడు, సోముడు, మున్నగు నన్నిమతములచేతను నిరూపింపబడిన, అన్ని నామధేయములును గలవాడగును. కలవాడును గాడు. ఇందలి రహస్యమును దెల్పెద. సమాహితచిత్తుడవగుచు వినుము. శైవులు పంచవక్త్రుడును, త్రిలోచనుడును నగు శివుని జగత్కర్తగ జెప్పుచున్నారు. ఆ కర్త

ఘటకర్తవలె చేతనుడును, శరీరముగలవాడును. లోకమం దెవ్వాని కర్తయైనను చేతనుడును, సశరీరుడుగను జూడబడు చున్నాడు. శరీరరహితమగు చేతనుడు కర్తగ నెందును గానము. శరీర చేతనములందు కర్తృత్వము ముఖ్యముగ, చేతనసంబంధమె యగుచున్నది. కారణమేమన, స్వప్నమం దీజీవుడు స్థూల శరీరము వదలి, చైతన్యమయ దేహముచేత సకలాభిమతములను సృష్టించుచున్నాడు. కనుక చిదాత్మ యగు కర్తకు, సృష్టిరూపకార్యమందు శరీరము కరణము గాదు. జీవులకు పూర్ణస్వాతంత్ర్యము లేదుగాన, కరణా పేక్ష కలదు. జగత్కర్తయగు భగవంతుడు పరిపూర్ణ స్వతంత్రుడగుట, కరణాపేక్ష లేకయే, సకలజగత్తును సృష్టిం చును. భగవంతున కిటుల శరీరములేదు. ఇది ముఖ్య నిర్ణయము.

అట్లుగాక ఈశ్వరునకు సృష్టియందు శరీరాపేక్షయుండె నేని, యుపాదాన కారణముల గూడ నాశ్రయింపవలసిన వాడ గును. అట్లు దేశకాలదికారణ సామాగ్రితో జగత్తును సృజించిన మహేశ్వరుడు, పూర్ణైశ్వర్యములేని జీవుడె కాగ లడు. ఉపాదానాది కారణాపేక్షయుండిన, సృష్టికి పూర్వ మందె, అవి యుండియుండవలయునుగదా! వానిని స్వీకరించి సృష్టియొనరించిన భగవంతుడు, వానికి కర్త గా జాలడు.

ఇటుల సర్వకర్తృత్వమునకు హాని నిస్సంశయముగ గల్గును. కనుక దృశ్యములగు దేహాదుల నపేక్షింపకయె, జగత్తును సృష్టించును. ఆకారణమున, నా స్తవమునస్థాల దేహ,మా భగవంతునకు లేదు. దేహములేని భగవంతునికి, విష్ణ్వాది దేహమెట్లు వచ్చెననిన, దేహరహితుడగు నా భగవంతుని యందు మందబుద్ధులటుల మోహమును జెందుచున్నారు. వారెచ్చటెచ్చట ఏయే విధముగ భక్తిగలిగి ధ్యానించు చున్నారో, అచ్చటచ్చట నాయారూపముల నాభక్త చింతా మణి స్వయముగా దాల్చుచున్నాడు.

కనుక చేతనమె ఈశుడు తద్దేహము పరాచితి. ఆ చితి యపరిచ్ఛిన్న సద్రూపిణియు, సర్వస్వతంత్రియు పరమే శ్వరియునగు త్రిపుర. ఆమెయె సర్వత్ర నిర్విశేషముగ సర్వదా భాసించుచుండును సర్వత్రిజగము భాసించుచుండ, నా చితి భాసించుటెట్టిదన. అద్దముకంటె వేరుగాని ప్రతిబింబ నగరము, అందువేరుగ భాసించునటువలె, నా చితియందు చరాచరాత్మకమగు జగమభిన్నమైనను, భిన్నముగ భాసించు చున్నది. బాలురు ప్రతిబింబమును జూచుచు, దర్పణమును గుర్తెరుగ నటుల, మూఢులు జగత్తును జూచుచు, నా చితిని గుర్తెరుగ జాలరు. విష్ణుశివాదులయందున్న దీపరమేశ్వరియె. కావున నాయా రూపములందు ఉత్తమాధమ భావములు,

కర్తవ్యము గాదు. శాస్త్రమందు ఉత్తమత్వాది లక్షణము లెట్లు జెప్పబడినవన, నయ్యవి యవాస్తవమగు స్థూలశరీరము నుంచె లక్షితములు గాన, కల్పనాప్రాయములు. కావున ప్రాజ్ఞుడు ఉపాధిరహితమును, పరమునునగు రూపము నుపాసింపవలయును. అసమర్థుడే రూపమందు తనబుద్ధి దృఢానురాగము గలదియగునో, ఆమూర్తి నుపాసింప వలయును, ఇట్లుపాసించిన, నుత్తమమగు శ్రేయమునుబొందగలడు. ఈ విధమున నీశ్వరు నారాధింపక, కోటిజన్మలకైనను పరశ్శ్రేయస్సాధన ప్రాప్తి గలుగజాలదు".

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ ప్రకాశిక యను నాంధ్రీకరణమున ఈశ్వరస్వరూప నిరూపణమను సప్తమాధ్యాయము.

---

# అష్టమాధ్యాయము.

తే॥గీ॥ తొలుత వ్యపదేశవిధమంది పలికినట్టి
ఖంథకాఖ్యాయికాగత భావమెల్ల
పొందుగాఁ బల్కె నింథా తపోధనుండు
వినుము తల్లిరో! వీనుల విందుగాఁగ -

ఈరీతిబల్కు ప్రియురాలి వాక్యములు విని, ఈశ్వర తత్వము చిన్మయమగు తుర్యారూపముగ గ్రహించి స్వస్థచిత్తుఁడగుచు, సగుణమూర్తియగు త్రిపురా పరమేశ్వరిని గూర్చి గురువులవలన తన్మంత్రాదికము సర్వమును, గ్రహించి, పరమేశ్వరానుగ్రహ శక్తిసహితుఁడై, యా త్రిపురాపరమేశ్వరిని దృఢభక్తియుతముగ నుపాసించుచు కొన్నిమాసములు గడపెను. అంత నాపరమేశ్వరి ప్రసాదింప, నాతని చిత్తము విషయ విముఖమై, స్వరూప విచారతత్పరత వహించెను. అట్టి విచారపరమగు చిత్తము పరమేశ్వరీ యనుగ్రహమున గాక, వేరొండువిధమున దుర్లభము విచారపరమగు చిత్తమె, మోక్షమునకు ముఖ్యకారణము. రామ! ఎంత కాలమట్టి స్వరూపవిచారణ, మనమునను దయింపదో, అంత

కాలముపాయ శతముల చేతనైనను శ్రేయఃప్రాప్తి గలుగ జాలదు

తదనంతర మొకనాడు విచారప్రవణచిత్తుడగుచు, తన గృహమున కేతెంచు నాతని హేమలేఖ దూరముననె చూచెను. అంత లేచి, తోడ్కొనివచ్చి, యాసనమిచ్చి, పాదప్రక్షాళనాదు లొనరించి, యథావిధిపూజించి, యమృత మొలుకునటుల సుందరమగు వాక్యముల నిట్లు వచించెను. "బహుకాలమున కగుపడితిరి. దేహమున కనామయ మొకద? ఇంతదనుక మీచే నెట్లువిస్మరింపబడకుంటినో చెప్పుడు. నన్ను గాంచక, నాతో భాషింపక, దినభాగమైనను గడపని మీ రిట్లుండు టెట్టిది? స్వప్నమందైనను, మీ కభిమతముగాని మార్గ మనుసరింపకుందును. పూర్వము నన్ను విడచిన క్షణ, మొక యుగముగ దుర్భరమయ్యెడి మీ కిప్పుడు, రాత్రులెల్ల గడుప నెట్లయ్యె!" అని భర్తను కౌగలించుకొని క్షణమాత్రము ఖిన్నురాలువలె నుండెను. హేమచూడుడు ప్రియురాలిచే నిట్లాలింగితుడగుచు, కొంచమేని విక్రృతి నందక, 'ప్రియా! నన్నీరీతి మోహపెట్టకుము నిన్ను లెస్సగ తెలిసికొంటిని. నీకు శోకకారణము లేదు. పరావరజ్ఞురాలవు. ధీరవగు నిన్ను మోహమెట్లు స్పృశింపగలదు. పూర్వము నీస్వవృత్తాంతమని నాకొకటి చెప్పియుంటివి. అది స్పష్టార్థముగ

నాకు నిర్వచింపుమని యడుగుటకిప్పుడు వచ్చియుంటిని. నీచే చేర్కొనబడిన, నీతల్లియెవరు? ఆ చెలికత్తెయు నామె భర్తయు నెవరు? తత్పుత్రాదు లెట్టివారలు? నాకును వారు గలరంటివి. వారెచటనున్నారు? నాకది తెలియకపోయినను, నవి యెల్ల నసత్యముగాదని తెలిసికొంటిని. నీచే వ్యపదేశపూర్వకముగ జెప్పబడియుండెను. దానిని వివేచించి, నాకు స్పష్టముగ దెలియునటుల జెప్పి, నాహృద్గత సంశయమును ఛేదింపుము” అని యడిగెను.

ఇట్లుబలుక, హేమలేఖ ప్రసన్నురాలగుచు నాతనిని దివ్యానుగ్రహ యుతుడగుట, సునిర్మలాంతఃకరణను బొందిన వానినిగ గ్రహించి, “ఇతడు నిశ్చయముగ విచారదూరుడును, విషయపరాఙ్ముఖుడు నాయెను. పరమేశ్వరీ శక్తిపాతము నందినాడు. ఈతని పుణ్యరాశి ఫలించినది. తత్త్వబోధకియ్యది యనువగు కాలము. కాన నీతనికి జ్ఞానముపదేశింతు గాక” యని తలచి, ‘నాథ! పరమేశ్వరీ కృపావశమున మహాభాగ్యము నందితివి. అట్లుగాక, ఇట్టి విషయవైరస్య మంచజాలవు. ఈశ్వరానుగ్రహము గలుగ తొలుదొల్త నీలక్షణమె యుదయించును. అది యెట్టిదన, భోగవైరస్యము, రెండవది విచారప్రవణమగు చిత్తము.

నే జెప్పిన ఆత్మవృత్తాంతము వివరించెదవినుము పరాచితి నా జనని బుద్ధి నాసఖి. బుద్ధి సాంగత్యమందిన యా కులట అవిద్య. రజ్జువునందు సర్పము నాభాసింపజేసి, మహాభీతిని గలిగించునట్టి యవిద్యయొక్క విచిత్రసామర్థ్యము లోకప్రసిద్ధమే కదా! అవిద్యాపుత్రుడు మహామోహుడు. అతని సుతుడు మనస్సు. ఆమనస్సుయొక్క పత్ని కల్పన వారి యైదుగురు పుత్రులె పంచ జ్ఞానేంద్రియములు. వారి స్థానములు గోళకములు. విషయముల తస్కరణమె, మనస్సంస్కారము. తద్విషయభోగము స్వప్నానుభవము. కల్పనయొక్క తోడబుట్టినదగు మహాశన ఆశ ఆ మహాశన కుమారులిరువురును క్రోధ లోభములు. ఆపురము శరీరము. నాయొక్క మహామంత్రిము, స్వరూపస్ఫురణ. మనస్సునకు ప్రియసఖుడైన ప్రచారుడు, ప్రాణము. కాంతారాదులు నరకములు. బుద్ధికి నాతోటి సంగమము. సమాధి. నాతల్లి యొక్క లోకసంప్రాప్తియె మోక్షము. ఇవ్విధమున జీవ వృత్తాంతము ను జెప్పితిని. నీవిధముగూడ నిట్టిదియె. దీని యందు నీ స్వ వృత్తాంతము గ్రహించి పరశ్రేయము నందుము'' అని చెప్పెను

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశిక యను నాంధ్రీకరణంబున, సంసారా
ఖ్యాయికా వివరణమను అష్టమాధ్యాయము.

# నవమాధ్యాయము

తే॥గీ॥ ఆత్మరూపంబు నెరుకజేయ మమతార్థ
సకలవర్ణన పరిశిష్టసారమనుచు
గురుడు దెల్పిన యుపలబ్ధి గుహ్యపదము
లిందు వినుమంబ! వినుపింతు నించుకంత -

ప్రియురాలట్లు జెప్ప విని హేమచూడు డత్యాశ్చర్యము నంది, సంతోషాతిశయమున గద్గద స్వరయుతుడగుచు నిట్లు బలుక నుపక్రమించెను. "ప్రియురాలా! నీవు ధన్యురాలవు. నీ జ్ఞానవైభవమేమని వర్ణింతును. క్రోధలోభాదులచే దుఃఖానుభవ రూపమైన స్వవృత్తమింతదనుక నెరుగనైతిని. నీ కథనమున నిప్పుడంతయు గరతలామలకమయ్యె. లోకవ్యవహారము మహాద్భుతము గదా! తల్లియగు నాపరచితి యెవరు? ఆమెవలన మన ప్రాదుర్భావమెట్టిది? దేహము పురమంటివి ప్రాణాదులు పరిచారకులంటివి. ఇక మనమెవరము? మన స్వరూపమెట్టిది? నాకు దెల్పుము."

అనిపలుక హేమలేఖ యిట్లు బదులు జెప్పెను. "నాథ! చెప్పుటకశక్యమగు నీవిషయమెటులనో చెప్పెదను వినుము.

అత్యంత విశుద్ధమైన బుద్ధిచే నాత్మస్వరూపము విః

అనగ; అంతఃకరణమునకు ఇంద్రియముల వెంట బహిర్ముఖత్వము, అశుద్ధి. దానిని విడచుటచేనైన అంతర్ముఖత్వము, శుద్ధి కనుక బాహ్యములగు దేహాదులయందు అనాత్మత్వము నిశ్చయించి, బుద్ధి కంతర్ముఖత్వసంపాదనచే, నాత్మస్వరూపము స్వయముగనె తెలిసికొనుటకు శక్యమని తాత్పర్యము. ఆత్మస్వరూపము, కంటికగుపడునదికాదు. వాక్కులకందునది కాదు. దానినేనెటుల జెప్పగలను! ఆత్మస్వరూపము గుర్తెరిగినయనంతరము, తల్లియగు నావరాచితిని తెలిసికొన గలవు. అదృశ్యము, నవాచ్యమునగు, నాత్మ స్వరూపము సాక్షాదుపదేశార్హముగాదు. అద్దాని కుపదేష్టమృగ్యము. ఇక నది తెలియబడుటెట్లనిన, వినుము. విషయాకారరహితమగు బుద్ధియందు తెలియదగిన నీ స్వరూపమును నీవె చూడుము. అదృశ్యమగుదానిని జూచుటెట్లందువేని, బ్రహ్మాది స్తంభపర్యంతము, నాత్మరూపమున భాసించునదియు, పరిచ్ఛిన్న దృశ్యాకారజ్ఞానములచే భాసింపనిదియునగును. అనగ, దృశ్యాకారములచే నాచ్ఛాదితమగుట, నంతఃకరణయందు మిక్కిలిగ భాసింపక, కుంభగత సూర్యునివలె భాసించును. విషయవాసనా రహితమగు శుద్ధబుద్ధియందు, మేఘావరణ లేని యాకసమందు సూర్యునివలె, మిక్కిలి భాసించునని తాత్పర్యము. బుద్ధియందెభాసించిన పరిచ్ఛేదము ప్రాప్తిం

చును గదాయనిన, నట్లుగాక సర్వత్రసర్వదా భాసించును. సూర్యకాంతి సర్వత్ర భాసించుచున్నను, స్వచ్ఛమగు భిత్తి యందు సువ్యక్తముగ భాసించునటుల, విషయాకార రహిత మగు బుద్ధియందు, మిక్కిలి యభివ్యక్తమగునని యభిప్రాయము. అదియుగాక, విషయములచే నాత్మప్రకాశమునకు భంగము గలుగజాలదు. మేఘావరణచే సూర్యుని ప్రకాశ మునకు లోపము లేనియటుల, నాత్మస్ఫూర్తి కెన్నడును పరి చ్ఛిన్నత్వము గలుగజాలదు. సర్వత్ర, సర్వదా భాసించు చుండునని తాత్పర్యము.

ఆత్మ, ప్రమాణాపేక్ష లేకయే భాసించును. ఆత్మ ప్రమాణమున కవిషయమగుటవలన 'ఇచ్చట, ఇప్పుడు, ఇట్టిది' అనినిరూపింప శక్యముగాదు. ఆత్మను నిరూపింపుమనుట, తన నేత్రమును తనకగుపరుపమని యడుగుటవంటిది. స్వనేత్ర దర్శనమందువలె, నాత్మదర్శనమందు సాక్షాద్గురూపదేశ ముండజాలదు. ఆచార్యుడెట్టి నిపుణుడైనను, నేత్రమునెట్లు గా జూపగల్గును. అట్టిచో గురువువలని ప్రయోజనమేమి యనియనవలదు. బహిర్ముఖత్వమున నాత్మకు దూరమగు చుండ, నంతర్దృష్టియను నుపాయము నొడగూర్చి, యాత్మ సామీప్యమునందించుటచే, గురువు తద్దర్శనమం దుపాయ మగుచున్నాడు. కనుక నీకుపాయముజెప్పెద వినుము.

'నాది' యనుకొనుటచే సమన్వితములగు నెల్ల వస్తువు లును గాక, వానికి భిన్నమై, 'నాది' యని యేది స్ఫురింపదో యదియు, నిజమగు నాత్మరూపము ఏకాంతస్థలమున కేగి నేనీ చెప్పినదానిని లెస్సగ విమర్శింపుము. 'నాది' 'నావి' యను నవన్నియు, ననాత్మయనినిశ్చయించి, పరిత్యజింపుము. అనం తరము, మమత్వముచే ననాక్రాంతముగ నేదికలదో, అనగ, 'నాది' యని యేది స్ఫురింపదో, యదియాత్మయని నమ్ముము. ఇందుల దృష్టాంతము వినుము. నేను నీకు నీ దా స ను గ భాసించుచున్నాను. సంబంధమాత్రమున, నీదాసనె కాని, నీస్వరూపాంతర్భూతురాలను గాజాలను. అటువలె, నాది యనుటచే సమన్వితమగునదెల్ల, స్వస్వరూపస్థితిని బొందజా లదు కనుక మమార్థమంతయుద్యజింపుము. దేనిని త్యజింప శక్యముగాదో, యది యాత్మయని నిశ్చయించి శ్రేయమును బొందుము."

హేమచూడుడు, ప్రియురాలిటులబలుక వెంటనే లేచి, యశ్వారూఢుడై, నగరమునకు వెలుపలనున్న నందనవనతుల్య మగు తన యుద్యానవనమున కేగెను. అందలి మహోన్నత మగు స్ఫటిక సౌధమును బ్రవేశించి, అందలిసేవకులనెల్ల విస ర్జించి, లో నెవరునుబ్రవేశింపకుండ ద్వారపాలురనియమించెను. తాను తిరిగి యాజ్ఞనిచ్చుదనుక, రాజునకుకూడ ప్ర వే శ మీయ జనదని, వారలశాసించి, యాసౌధమునందలి తొమ్మి

దవయంతస్థు నధిరోహించెను. అందుండి దిగువలోకము నెల్ల పరికింపనగునొక వాతాయనమందు, మెత్తని యాసనమున సుఖాసీనుడగుచు, నేకాంతమున మనస్సును స్థిరమొనరించి విమర్శింప దొడగెను.

ఈసకలజనులిట్టిటుల మోహముచే గ్రసియింపబడిరి. ఇందొక్కడైనను తనయాత్మస్వరూపము లేశమైన నెరుంగడు గదా! సర్వజనులును ఆత్మసుఖముకొరకు వివిధ క్రియాసక్తు లగుచున్నారు. కొందరు శాస్త్రముల పఠించుచున్నారు. కొందరు వేద వేదాంగాధ్యయన తత్పరు లగు చు న్నా రు. కొందరు ధనార్జనపరులగుచున్నారు. కొందరు భూ మి ని శాసించుచున్నారు. మరికొందరు శత్రువులనోడించుచున్నారు. ఇంకను కొందరు భోగాసక్తులగుచున్నారు. అందరును తమ తమ స్వార్థమునకిటుల జేయువారలెకాని, యింవరిలో నొక్కడేని స్వాత్మయెట్టిదియో, యెరిగినవాడు లేడు. ఇట్టిభ్రమకు కారణమేమి? ఆత్మ నెరుంగక, యజ్ఞానముచే జేయబడినదంతయు, స్వప్నమందలి కృత్యమువలె, వ్యర్థమెయగును. కావున, నాత్మస్వరూపము విమర్శించెదగాక!

దారాపుత్రి ధనధాన్య రాజ్యగృహపశ్వాదిక మంతయు నాస్వరూపము గాజాలదు. అదియంతయు నాదియగునెకాని,

యది నేనుగాను. కనుక నాస్వరూపముగాదు. నేను అను దానికి విషయభూతమగుట, నీదేహము నేనుగావచ్చును. నిశ్చయముగ నేనుక్షత్రియుడను. పచ్చనిఛాయగలవాడను. ఈ జనులందరకుగూడ ఆత్మ దేహమెయగుచున్నదని నిశ్చయించి, యీ రాజకుమారుడు దేహ మాత్మరూపమున చింతించెను. అట్టి ధ్యానానంతరమున దేహస్వభావము లక్షించి, యది యాత్మకాజాలదని విమర్శింపదొడగెను. అహో! యీదేహము నారూపమెట్లగును? ఇది యస్థిమాంసాదుల పోగువు, ప్రతిక్షణమును వికారమును జెందుచున్నది. ఈదేహము 'నాది' అని నేననుచున్నాను. ఇందలి యే యంగమైనను ఛేదింపబడిన, నాతుండెము, కాష్ఠలోష్ఠ సమముగ నుండును గాని, నారూపమని యనుకొందునా? స్వప్నాదులందు, దీని స్మారకములేక నేనుండియుంటినికదా! కావున నీదేహము నేనుగాదు. దీనికన్యుడను. ప్రాణముగూడ నిట్టిదెయగును. నాబుద్ధి, నామనస్సు, అనియనుటచే, మనోబుద్ధులు గూడ నేనుగాను. కావున దేహముమొదలు బుద్ధ్యంతము, మమత్వాశ్రమైనదగుట నేనుగాదు. వీనియన్నిటికంటె నేను భిన్నుడను. సందియము లేదు,

నేనెప్పుడును భాసించుచునే యుంటిని. భాసింపని దెన్నడును లేదు జాగ్రితయందు దృశ్యమంతయు బతికించు

చుంటిని. స్వప్నమందుగూడ, తద్విధమున ద్రష్టగనుండియె యుంటిని. సుషుప్తియందుగూడ నటువలెనెయుంటిని. అట్లు గానిచో, సుషుప్త్యనంతరము, నేనేమియు నెరుగను, సుఖముగ నుంటినను జ్ఞప్తి యెట్లుండగలదు. కాన సర్వదా, ఏకరూపమున భాసించుచునేయున్నాను. కాని మేఘమచ్ఛాదగిలిన సూర్యునివలె, సామాన్యముగ భాసించుచుంటిని. నాస్వరూపమిద్ది యను విజ్ఞానము దేనిచే, స్ఫుటముగ గల్గునో, యయ్యది తెలియజాలకున్నాను ఏ కారణమున నాకది *తెలియకున్నది? ఘటాదులు నేత్రాదులచే గ్రహింప బడుచున్నవి. ఘ్రాణము, త్వగింద్రియమున గ్రహింపబడుచున్నది. మనస్సు జ్ఞానాత్మక కార్యముచే ననుమితమగుచున్నది, బుద్ధికూడ నటువలె ననుమితమగుచున్నది. స్వరూపజ్ఞానము దేనిచేగల్గునో, యదిమాత్రము తెలియకున్నది. ప్రతిబింబములు భాసించుకాలమందు, శుద్ధ దర్పణము భాసింపదు. తద్విధమున, ననాత్మభూతములగు దేహేంద్రియ బుద్ధ్యాదులన్నియు భాసించుటచే, నాత్మ భాసించుటలేదేమో! అట్లయిన, ననాత్మభావములను విమర్శించి చూచెద. అవి స్వయముగ భాసించుటలేదు పరికింపబడియె, భాసించుచున్నవి. పరికింపబడక భాసింపవు ఘటమును బరికించు కాలమున తదితరము భాసించుచున్నదా? ఆ విధమున, ననాత్మభూతములగు దేహేంద్రియాదుల పరా

మర్శ కారణమున, నాత్మభాసించుటలేదు. అన్య పరామర్శా భావమున, నాత్మ భాసింపగలదు.

ఇటులసూక్ష్మబుద్ధిచే విమర్శించి, హేమచూడుడనాత్మ భూత దేహేంద్రియబుద్ధ్యాది విమర్శ పూర్ణముగ త్యజించెను. వెనువెంటనె గాఢమగు నంధకారమును జూచెను. ఇదియ నాయాత్మస్వరూపమని నిశ్చితమనస్కుడగుచు సాటిలేని సంతోషమును బొందెను. తిరిగిచూతునుగాక యని చింతించి, చంచలమగు చిత్తమును, 'కొంచెమేని సంకల్పింప'నను దృఢ సంకల్పాభి నివేశముతోడ, హఠప్రాయముగ నిరోధించెను. వెనువెంటనే, యత్యంత భాస్వరమగు తేజః పుంజమును జూచెను. అంత మనోనిరోధము సడల, నాశ్చర్య చకితుడగుచు 'ఇదియేమి? ఆత్మను వివిధముగ జూచుటెట్టిది? తిరిగి చూతునుగాక' అనిచింతించి మనస్సును తిరిగి పూర్వము వలె నిరోధించెను. అప్పుడు నిద్రయందు చిత్తము చిరకాలము గాఢముగ లీనమయ్యెను. ఆ నిద్రయందనేక విచిత్ర దర్శనములుగల స్వప్నముల గాంచెను. అంత ప్రబుద్ధుడగుచు మహత్తరమగు చింతనందెను 'ఇదియేమి! నిద్రచే నావరింపబడితిని. కలలుగంటిని. చూడబడిన తమస్తేజములు గూడ స్వప్నాత్మకములై కావచ్చును. స్వప్నము మనస్సుచే నుల్లంసింపబడిన దేకద! తదుల్లాసము నెటుల వర్జింపగలను. తిరిగి

నిగ్రహించి చూతునుగాక. అని దృఢముగ చిత్తమును తిరిగి నిరోధించెను. అప్పుడు చిత్త మీషత్కాలము సుస్థిర మగుటంత, సతతడానంద సముద్రమునందు మునిగినవానివలె నుండెను. తిరిగి చిత్తము చంచలింప, శీఘ్రముగ ప్రబుద్ధుడగుచు 'ఇదేయేమి! స్వప్నమా? లేక చిత్తవిభ్రమమా? లేక సత్యమెయగునా? నాకేమియు దోచుటలేదు. విషయానుభవమున గదా సుఖముగల్గుట. అట్టిదేమియు ననుభవింపని నిరోధకాలమందు నేను సుఖమెట్లు బొందగల్గితిని. ఈ సుఖముయొక్క లేశమునకేని, యెట్టిదియు సరికాదు. సుషుప్తి యందువలె, బాహ్యాంతరముల నెరుగక మోహగ్రస్తుడనై యుంటిని. అట్టిచో నాకు సుఖానుభవ మెట్టిది? కారణము లేని సుఖము నెట్లుబొందియుంటిని? ఆత్మస్వరూపము నెరుగదలచి, ప్రవృత్తుడనై, యాత్మ నెరుగక, తదన్యమ్ము లగు నేవియో చూచుచుంటిని. ఇదియేమిచిత్రము! ఆత్మప్రకాశమో, అంధకారమో, సుఖమో లేక తత్సంఘాత్మకమో, లేక మరియొకటియో, నిశ్చయమందజాలకున్నాను. తిరిగి విదుషీమణియగు నా ప్రియురాలినడిగెదగాక!' అని తన సన్నిధికి హేమలేఖను దోడ్కొనిరావలయు నని ద్వారపాలకు నాజ్ఞాపించెను.

మహారాజాజ్ఞమాత్రమున హేమలేఖ యచ్చటికరుదెంచి' యా మహా సౌధాగ్రమున, శాంతమానసుడును, నిశ్చలుడును,

నిర్వికారుడను సంహృతేంద్రియుడునునగు ప్రియునిగాంచెను. అంత సమీపించి, తదాసనాసీనయయ్యెను. నిమిషార్థమాటుల నేకాసనోపవిష్టయైయుండ, రాజపుత్రుడు కండ్లుదెరచి, పార్శ్వమందున్న సతినిగాంచెను. వెంటనే యామె ప్రేమపూర్వకముగ ప్రియుని కౌగలించుకొని, అమృతము చిలుకునటుల, సుందరముగ "నాథ! మీకారోగ్యమెకద! మీచే బిలువనంపబడిన కారణమేమి" అనియడిగెను. అంత నా రాజపుత్రుడు "ప్రియురాలా! నీచేశాసితుడనై, వివిక్తస్థలము నాశ్రయించి, యాత్మస్వరూప విజ్ఞాన హేతుకమగు మోక్షము కొరకు విచారపరిణుడనై తిని. తత్పరుడనైనను, నాచేనది యనేక విధములుగను, అత్యంత భిన్నముగను, గాంచబడినది ఆత్మ సర్వదాలభ్యముచు, భాసించునదియైనను, లెస్సగ భాసింపకుండుటకు, తదితరములగు ననాత్మవిషయములు భాసించుట కారణమని తలచి, యన్యమును భాసింపజేయు నింద్రియాదుల నెల్ల నిరోధించి సమాహితుడనై తిని. అంత, నంధకారమును, ప్రకాశమును జూచితిని. మహత్సుఖమును కొంచెముగ పొందితిని. అదియేమో చెప్పుము. ఆత్మరూప మిదియె యగునా? లేక వేరుగనుండునా? లెస్సగవివరించి, నేనద్దాని నెరుంగునటుల చెప్పు"మని యడిగెను

పరావరజ్ఞురాలగు నా హేమలేఖ "సర్వమును దెలిపెద, సమాహితుడవై వినుము. బాహ్యము నెల్ల నిరోధించుట

యందు నీచే నొనరింపబడిన మహత్తరమగు కృషి, శుభమును ముఖ్యమునని, యాత్మవేత్తలచే నామోదింపబడినది. అట్టి చిత్తనిరోధ మొనరింపక, యెవరిచేగాని. యద్వయాత్మ విజ్ఞానమందబడి యుండ లేదు. కాని, యానిరోధ మాత్మ ప్రాప్తికి కారణము గాజాలదు. ఆత్మ నిత్యప్రాప్తమైనది కాన, నద్దానికి ప్రాప్తత్వ ధర్మములేదు. ఆత్మజ్ఞానమొక సాధనముచే సాధ్యమగుననిన, ఘటాదిజ్ఞానమువలెనే యగును. అప్పుడు ఘటమునకు వలె, నాత్మకుగూడ జడత్వము, అనాత్మత్వము బ్రాప్తించును. ఆత్మ నిత్యప్రాప్తము. ఆత్మయందు ప్రాప్తత్వధర్మమేయుండదు. ఒకప్పుడుండక, మరియొకప్పుడు పొందబడునది అప్రాప్యము, ప్రాప్యము, నగును. అనగ, నట్టివస్తువునందు ప్రాప్తతాప్రాప్తతా ధర్మములు వర్తించును. సర్వదా సిద్ధమగు నాత్మయందు ప్రాప్తత్వ ధర్మము జెప్పుట సమంజసముగాన, నాత్మ యప్రాప్యమనబడుచున్నది కాన నీచిత్తనిరోధ మాత్మయొక్క ప్రాప్తికొరకు గాజాలదు. ఇయ్యది నిదర్శనపూర్వకముగ చెప్పెద వినుము. ఘటము అంధకారసమావృతమై యున్నదనుకొనుము. దీపాదులచే నంధకారమును నిరోధించిన, అనగ పరిహరించిన, ఘటము ప్రాప్తమైనదానివలె పొందబడుచున్నది. అంతకు పూర్వమె, యచట యుండియున్నప్పటికిని, ఘటము తమోనిరోధమున ప్రాప్తమైనదిగ నెట్లగుచున్నదో, యటువలె

స్వప్రకాశ చిదేకతత్త్వమగు నాత్మతత్త్వము వికల్పములచే గప్పబడినటులుండి, వికల్పనిరోధమున ప్రాప్తమైనదానివలె నగుచున్నది. కావున నిరోధమునకు స్వరూప ప్రాపకత్వము లేదు.

మరియొక నిదర్శనము చెప్పెదవినుము. ఒకానొక భ్రాంత చిత్తుడు, తన స్వర్ణాభరణము నెచ్చటనో యుంచి మరపు జెందెను. ఎందు వెదకినను కానరాక, పోయినదనుకొనెను. కాని కొంచెము స్వస్థుడగుచు, నన్యాలోచనల నిరోధించుటచే జ్ఞప్తికిరాగ, నాకంఠాభరణమును నష్టమైనది ప్రాప్తమైనటుల బొందియుండెను. అంతకుపూర్వమా నిష్కము నష్టమైయుండెనా! లేదు. నష్టముగాని నిష్కము, నష్టమైనది. ప్రాప్తమైనటుల జెప్పబడుచున్నది. అటువలె, నప్రాప్తమగు నాత్మ ప్రాప్తమగుచున్నది. అచట నన్యచింతానిరోధకము, నిష్కప్రాప్తి కెంతటి హేతుత్వము వహించెనో, చిత్తనిరోధ మాత్మప్రాప్తికి తావన్మాత్ర హేతుత్వమునె వహించుచున్నది. కావున బాహ్యవస్తునిరోధ మాత్మలాభమునకు హేతువుగాదు. నిరోధమాత్మప్రాప్తికి హేతువుగాకపోయినను. ఆత్మను లక్షించుటకు హేతువగునుగద! నాచే నట్లెందుకు లక్షింపబడలేదని యందువేని, చెప్పెదవినుము. వస్తుపరిచయాభావముచేత నీవాత్మను లక్షింపజాలకుంటివి. కనబడు

చుండిన వస్తువయ్యును, తత్పరిచయములేనిదది లక్షింపబడ కుండుటకు దృష్టాంతము గనుము. ప్రకాశ పరిచయము లేని వాడొకడు, రాత్రియందు రాజసభకు వెడలెననుకొనుము. వాడచ్చటనున్న సభ్యులను దీపములను జూచునుగాని, తద్దీప జన్య ప్రకాశమును గుర్తింపజాలడు. అటువలె నీవును ఆత్మను లక్షింపకుంటివి.

ఆత్మనుపలక్షింపకుండుటకు, తద్వస్తు పరిచయాభావమె కారణము ఆపరిచయము నీకు గలిగించెద. నీవు చిత్తము నిరోధించితివి. అదియ వికల్పదశ. అంధకారమును జూచుటనునది వికల్పము. కనుక నీవు నిరోధాంతమునందు అంధకారమును జూచియుంటివి. అట్టి యంధకారమును జూచుటకు బూర్వదశయగు నిర్వికల్పదశయందు పరిశిష్టమగు నీరూపము గలదు. అనగ దేహాది వ్యతిరిక్తమగు జ్ఞానమె, ఆత్మయొక్క రూపము. అదివికల్పదశయందు దృశ్యముతోడ మిళితమగుచు బ్రకాశించును. నిరోధసమయమున దృశ్యము భ్రంశమగును. జ్ఞానము మాత్రమె యుండును. ఆ పరిశిష్ట మగు రూపమె, శేషభావమని యనబడుచున్నది. అది స్వ ప్రకాశమునసె, ప్రకాశించుచుండును. సుషుప్తినుండి లేచి 'ఇంతవరకు నాకేమియు దెలియకుంటి' ననునది యట్టి శేషభావ స్థితిమె. ఆ శేషభావము దృశ్యరహితమగు దృఙ్మాత్రి

రూపము. దుఃఖమూలమగు ద్వైతాభాస లేకపోవుట, బరమానంద దాయకము. అదియ నేనని భావింపుము. బహిర్ముఖాంతఃకరణులైన సర్వశాస్త్రజ్ఞులును. మోహగ్రస్తులగుచు, తద్భావమును బొందజాలక, శాంతులగుచున్నారు. ఆ శేషభావము ననుసంధింపజాలకున్నారు. లోకమునందు శాస్త్రవేత్తలు, నిపుణులును నగు తార్కికులుగలరు వారలీభావము నెరుగజాలక అహర్నిశము దుఃఖించుచున్నారు. శబ్దార్థమనన మాత్రమున నాతురీయ పదము పొందబడదు. శ్రవణాది రూపమగు నన్వేషణముగాని. మననరూపమగు విచారముగాని, యెంతపర్యంతము పండితునిచే జేయ బడుచుండునో, అంతపర్యంత మాత్మ పదము పొందబడదు. కారణమేమన, నది యలౌకిక మగుటచే నగ్రాహ్యము. ఇంద్రియప్రసారమున నెంతదూరముబోయినను, నది పొందబడదు. తదప్రసారముచే సర్వదా ప్రాప్తమె యగును. మనశ్చింతన రూపమగు విచారముచే నది గ్రహింపబడదు. మనః ప్రసాదరూపమగు, నవిచారముచే వదిభాసించును. వ్యాపారముచే నది, యప్రాప్తమనుటకు దృష్టాంతము వినుము. తన నీడను తను దాటవలయునని, పరుగిడువాడెన్నడును దాటజాలడు గదా! అటువలె నెట్టి క్రియచేతను, అది ప్రాప్యము గాజాలదు. నిర్మలమగు నాదర్శమున, ననంఖ్యాకములగు బ్రతిబింబములను బొలుదు జూచుచు, నాదర్శమును జూడ

జాలడు. అటువలె పామరులు స్వాత్మరూప మహాదర్శమున జగత్ప్రతిబింబమును జూచుచు. స్వాత్మను గుర్తిడ జాలరు. దీనికి కారణ మాత్మవస్తుపరిచయాభావమె ఆకాశతత్వ పరిచయశూన్యు, లాకాశము నాశ్రయించియున్న జగత్తును జూచుచు, నాకాశమును జూడజాలరు అటువలె నాత్మ పరిచయ శూన్యులు తమయాత్మయందు ప్రతిబింబితమగు జగత్తును జూచుచును, తమయాత్మను జూడజాలరు.

నాథ! సూక్ష్మబుద్ధిచే గనుము. జగత్తు జ్ఞానము జ్ఞేయమను రెండురూపములు గలది. అందుజ్ఞేయము, ప్రత్యక్షాది ప్రమాణములచే సిద్ధమగు, ననాత్మస్వరూపము. అది విదితమెకాన, నిరూపణావశ్యకత లేదు. జ్ఞాన స్వరూపము నిరూపించెద వినుము. జ్ఞానము ప్రమాణాపేక్ష లేకయే సిద్ధము. ప్రతిబింబములకు దర్పణమువలె, జ్ఞేయ స్వరూపమగు జగత్తునకు, సర్వాధిష్ఠానమగుటచే, నధిష్ఠానమగు దర్పణము లేనిది, ప్రతిబింబము లేమియు నుండజాలనటుల, నా జ్ఞానము లేనిది జ్ఞేయముండజాలదు. జ్ఞానమునకు హాని యెప్పుడును లేదు. ప్రతిబింబజ్ఞానమును, తదభావజ్ఞానమును దర్పణాధీన మగునటుల, జ్ఞేయరూపమగు జగద్భానము, తదభావభావముగూడ జ్ఞానాధీనమగుచున్నది. జ్ఞానము ప్రమాణములకెల్ల ప్రమాణము. తనకు ప్రమాణాపేక్షలేనిది.

అనగ, ప్రత్యక్షాది ప్రమాణములనుసిద్ధింపజేయునది, చిద్రూప మగు జ్ఞానము. ఇతర ప్రమాణముల నపేక్షింపక, స్వతః ప్రమాణమే యగును.

ప్రత్యక్షాది ప్రమాణములవలె మనోబుద్ధ్యాదులు జడములు. సాధనభూతములగు కుఠారము జడమగుట, నన్యకర్తృసహాయ మపేక్షించునటుల, మనస్సు మొదలగునవి, జ్ఞాన ప్రేరితములగుచునె. తత్తద్వ్యాపారముల నడుప సమర్థములగుచున్నవి. కనుక ప్రమాణముల నన్నింటిని గల్పించెడి జ్ఞానమును తెలిసికొనుట, కే ప్రమాణమును లేదు. ఇతర ప్రమాణాపేక్ష లేనిదియు, ననాదిసిద్ధమునగు జ్ఞానాత్మకు ఉత్పత్త్యాదులు గాని, మరి యేసాధనాపేక్షయుగాని లేవు ఆత్మలేదను నాస్తికులతో ప్రశ్నోత్తరముల కవకాశమె లేదు. జ్ఞానస్వరూప సారాంశమును వినుము. జ్ఞాన జ్ఞేయముల, జ్ఞేయమునకు జ్ఞాన మధిష్ఠానమనియు, జ్ఞానము స్వతస్సిద్ధమనియు, నదిలేని దెద్దియు లేదని చెప్పియుంటిని. జ్ఞేయము జ్ఞానమునకు భిన్నముగాదని యిప్పుడు చెప్పుచున్నాను వినుము. జ్ఞానమను మహాదర్శమునకు, హాని యెన్నడును లేదు. దర్పణము లేక ప్రతిబింబము లేనటుల, జ్ఞానాదర్శము లేక, జ్ఞేయ ప్రతిబింబముండదు. దర్పణమందు ప్రతిబింబమువలె, జ్ఞానాత్మయందు జ్ఞేయరూపమగు ప్రపంచమున్నది. దర్పణ[illegible]

మగు ప్రతిబింబమునకు తద్భిన్నత్వము లేనటుల, జ్ఞేయమునకు జ్ఞానాత్మకంటె పృథక్త్వము జెప్పుటకు వీలులేదు. దేశకాలాదులచే, జ్ఞానమునకు పరిచ్ఛిన్నత్వము గలుగజాలదు. దేశకాలాదులు జానముచే ప్రకాశింపబడిన జ్ఞేయమగు జగత్తునందలి భావములు, తదంతర్భాసమానములగు దేశకాలాదులచే, జ్ఞానమునకు పరిచ్ఛేదమెట్లు గలుగును. ఆకాశాంతర్గతములగు ఘటాది వస్తువులచే నాకాశమునకు పరిచ్ఛేదము గల్గునా?

రాజపుత్రి! యీ విధముగ నఖండముగను, నపరిచ్ఛిన్నముగను, స్వయంప్రకాశమగు జ్ఞానము నీరూపము. దానిని, అంతర్ముఖమున విషయాకారరహితమగు సమాధియందు లక్షింపుము ఆస్వరూపము నింకను విమర్శించి, చెప్పెద వినుము. ఘటాదులందు, తత్తదాకారాదులు విశేషములు. సర్వానుస్యూతమగు మృత్తు సామాన్యము. అటువలె. తత్తదాకారాఖిల దృశ్యులయందను స్యూతమగునది సామాన్య చైతన్యము. కేవల నిర్వికల్పదశయందీ సామాన్యచిద్రూపము. శుద్ధ దర్పణమువలె బ్రకాశించును వికల్పదశయందు, ప్రతిబింబములను ధరించిన దర్పణమువలె, నాసామాన్య చైతన్యమె, జగదాశ్రయముగ బ్రకాశించును. ఆ సామాన్య చైతన్యమె నీ స్వరూపము. 'ఆ జగద్భానాధి

స్థాన సామాన్యచైతన్యమె నేను,' అను అవిచ్ఛిన్నానుసంధాన ముచే నీకు తత్సిద్ధికలిగి సర్వ కర్తృత్వమును బొందగలవు. ఆ సామాన్య చైతన్యము యొక్క ఉపలబ్ధి స్థానములదెల్పెద

నిద్రాజాగ్రన్మధ్య భాగ మొకస్థానము. జాగ్రత్స్వప్నావస్థలు రెండును సవికల్పములు. సుషుప్తి నిర్వికల్పము. ఈ సవికల్ప నిర్వికల్పములమధ్య, ననగ జాగ్రత్స్వప్నములకును సుషుప్తికిని మధ్యానుభాసించు చైతన్యము స్వస్వరూపమని తెలియుము. జాగ్రదావస్థ వికల్ప జ్ఞాన పరంపరతో గూడినది. ఇందు మనస్సుకంటె, భిన్నములైన స్థూలేంద్రియములచే విషయ గ్రహణకలదు మనస్సునందు ప్రవిష్టములగుచు, తదైక్యరూపమును జెందిన, ఇంద్రియములచే మానసవిషయగ్రహణముగలది స్వప్నావస్థ. సుషుప్త్యవస్థయం దింద్రియ విశిష్టమగు మనస్సు స్వకారణమగు ప్రకృతియందు విలీనమగుచుండును. అప్పుడు ప్రకృతి, తన తమోంశమున సత్వ రజోగుణముల నాక్రమించి యుండును అప్పుడు మేఘావృతమగుసూర్యునివలె, తమోవృతమగుచు నాత్మ మందముగ బ్రకాశించును. ఇదియ వస్థాత్రయవిధానము. జాగ్రత్సుషుప్తులమధ్య, మనస్సు విలయాభిముఖమగుట, పూర్వ విషయగ్రహణ విడచియుండి, రానున్న సుషుప్తి యందలి తమోంశము విజృంభింప కుండుటచే, స్వరూప మాచ్ఛాదన

జెందకయుండును ఆక్షణమందు ప్రకాశమగునది సామాన్య చైతన్యము

రెండవ యుపలబ్ధిస్థానము, సంవిద్భేదాంతర మందు గలదు. సంవిత్తు జ్ఞాన లక్షణము. ఘటాకార జ్ఞానము పటాకార జ్ఞానము మున్నగు జ్ఞానలక్షణము గలది. సంవిద్భేదాంతరమన, ఘటాకారజ్ఞాన పటాకారజ్ఞానముల మధ్య ననియర్థము. మనస్సు, ఇంద్రియముద్వారా విషయమందు బ్రవేశించి, తదాకారమును బొందును. అప్పుడు తదాకార జ్ఞానము గలుగుచున్నది. ఇట్లు మనస్సనుక్షణ మొకదానిని విడచి, మరియొకదానిని బొందుచుండును. ఘటమునుజూచి, ఘటాకారమును బొంది, తత్ జ్ఞానరూపము దాల్చినదనుకొందము. వెనువెంటనె, పటాకారము పొందనున్నపుడు ఘటాకారజ్ఞానరూపమును వదలి, పటాకారజ్ఞానరూపమునుదాల్చునంతలో, మధ్య నంతరాళమున, ఘట పటాకారములు రెండును లేక సామాన్య చైతన్యరూపమున ప్రకాశించును. అది కనుము.

ఇక మూడవ యుపలబ్ధిస్థానము చెప్పెదవినుము. సంవిద్వేద్యములమధ్య నట్టిస్థానము గలదు. సంవిత్ అనగ ద్రష్ట. వేద్యమనగ దృశ్యము. ద్రష్టయింద్రియములవెంట దృశ్య

జ్ఞానముతోడ నేకీభవించి, యనేక విధములగుచుండును. దృష్టదృశ్యముల మధ్యగల దర్శనరూపమగు చైతన్య మా రెంటికిని విలక్షణమగు శుద్ధసామాన్య చైతన్యము. దానిని లక్షింపుము. ఆపదము, దృశ్యాకార వర్జితమగు శుద్ధచైతన్యమును, ద్రష్టయొక్క వాస్తవరూపమునై యున్నది. దానిని పొందినవాడు దుఃఖమునందడు. అట్టి శుద్ధ చైతన్యమందు దర్పణమందువలె జగత్తు ప్రతిబింబమాత్రమె యని, నిశ్చయము గలవానికి, చిత్తరువునందలి వ్యాఘ్రాదుల వలె, దృశ్యము దుఃఖదాయకము గాజాలదు. ఈ విజ్ఞానములేక సంసారము ప్రవృత్తమగుచున్నది.

ప్రతిబింబముల కధిష్ఠానము దర్పణము. దర్పణ జ్ఞానము గలుగుచుండ, ప్రతిబింబాదులు, తదతిరిక్తములు గాక, వాని యందలి యాభాస వాస్తవిక జ్ఞానము నశింప, యాభాసమాత్రములె యగును. అటువలె, పూర్వోక్త దశలందుపలభ్యమైన, ఆత్మయొక్క వాస్తవరూపమగు శుద్ధ చైతన్యమందు, గంధరసరూపస్పర్శ శబ్దరూపములు గాని, సుఖ దుఃఖములుగాని, గ్రాహ్యములగు విషయాదులు గాని, గ్రాహకములగు నింద్రియాదులు గాని, తదతిరిక్తముగ నేమియు లేవు. ప్రతిబింబమునకు దర్పణమువలె, నా శుద్ధచైతన్యము

సర్వదృశ్యమునకు నాశ్రయమును, సర్వరూపము నగుచున్నది. దర్పణము సర్వ ప్రతిబింబములకు నాశ్రయమైనను, వస్తుతః సర్వవివర్జిత మగునటుల, నాశుద్ధచైతన్యము సర్వదృశ్య వివర్జితము. అదియ సర్వేశ్వరి. బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ సదాశివులా సామాన్య చైతన్యమగు నాత్మయె. ఈ విధముగ నాత్మతత్వము, నాచే నుపదేశమందిన నీకు దుర్లక్ష్యము గాజాలదు. క్షణకాలము దృశ్యాభిముఖ్యతను వదలి, యంతః ప్రసరణమందు ఉద్యుక్తుడవగుచు, దృశ్యాకారము నుల్లేఖింపక, మనస్సును సంరోధించి, నిరోధమున కవధిభూత మగుచు, స్వాత్మకంటె నభిన్నమగు సామాన్య చైతన్యముగ నాత్మను జూడుము. మరియు నేను నన్ను జూచుచున్నాను, అను అభినివేశము గల్గునంతవరకు స్వరూపము దుర్లక్ష్యము. కనుక 'నేను చూచుచున్నా'నను అభిమానము వదలి, గ్రుడ్డివానివలె నూరక జూడకుండుము. జాగ్రత్స్వప్నరూపమగు వికల్పజ్ఞానమును, సుషుప్తిరూపమగు మూఢ నిర్వికల్ప జ్ఞానమును, రెండునుగూడ వికారరూపములని విడచి, యా రెండును నేనుగానని దృఢముగ నిశ్చయింప, తత్సంధియందలి పరిశిష్ట సామాన్య చైతన్యరూపుడవు నీవగుదువు. ఆ రూపమునె, ఆత్మత్వేన భజింపు"మని చెప్పెను. అంత హేమచూ

డుడా పదమునులక్షించి, చిరవిశ్రాంతినిబొంది, బాహ్యమును విస్మరించెను.

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశిక యను నాంధ్రీకరణమున, హేమచూడ
విశ్రాంతియను నవమాధ్యాయము.

—

# దశమాధ్యాయము

తే॥గీ॥ ఇంద్రియోపరతిని గాంచ నెద్ది కలుగు
నదియ కాదు బాహ్యసమాధి నందవలయు
పూర్ణవిజ్ఞాన పరిపూర్ణ బోధకనుచు
గురుడు దెల్పె వినుము తల్లి! వరమపదము-

ప్రియుడట్టుల సామాన్యచిదూప్రప స్థితి నంది యుండుట గాంచి హేమలేఖ యతనికి భంగముగలిగింపక నూరకుండెను. అతడు ముహూర్తకాల మట్లుండి, ప్రబుద్ధుడగుచు నేత్రములు దెరచి, యెదుటనున్న ప్రియురాలిని దొలుతగాంచి, దృశ్యమునంతయు వెను వెంటగాంచెను. కాని యతివేగముగ బూర్వస్థితి నందగోరుచు నేత్రములు ముకుళించునంత, నామె యాతని తన హస్తస్పర్శమున నివారించి, యమృతము లొలుకు పలుకుల "నాథ! నీ యభిప్రాయ మేమి? నేత్రనిమీలనోన్మీలనలచే, నట్టిలాభాలాభముల నందుచుంటివి? నేత్రముల దెరచుటవలన బొందబడనిదేది? మూయుటచే నేమి పొందబడుచున్నది? నీస్థితిని వినగోరుచున్నాను. చెప్పు" మని యడిగెను.

మదోన్మత్తుడగు వానివలె నలసుడగుచు, మారుబల్కుట కిచ్చగింపకుండియు నాతఁడు, "ప్రియురాలా! బహుకాలమున కత్యంత విశ్రాంతి నందితివి. దుఃఖభూయిష్ఠమగు బాహ్యమునందు నాకు కొంచెమేనియు విశ్రాంతిలేదు. సారరహితమగు పిప్పియొక్క చర్విత చర్వణ ప్రాయమగు. జగద్వ్యవహారమిక జాలును. దౌర్భాగ్యమున, గుడ్డివాడనై, యాత్మసుఖము నిప్పటివరకును దెలియకుంటిని. తనకుండిన నిధి నెరుగక, భిక్షాటన మొనరించువానివలె నుంటిని. స్వకీయమగు నానందసముద్రము గుర్తెరుగక, దుఃఖ శతసంకులము. మెరుపువలె క్షణికమ్మునైన, విషయసుఖమె శ్రేష్ఠము, స్థిరము, ననితలచి, తత్పరవశుడనగుచు, మాటిమాటికి దుఃఖములచే గొట్టబడుచు, విశ్రాంతిని బొందకుంటిని. అహో! సుఖదుఃఖ వివేక జ్ఞానరహితులగు నీ జనులగూర్చి నేమిచెప్పవలె! సుఖము నర్థించుచు, నెల్లప్పుడును, దుఃఖసమూహమును బ్రోవుజేసికొనుచున్నారలు. స్వప్రయత్న సంపాదిత దుఃఖభోగమిక జాలును. నాయందు దయయుంచుము. అంజలిఘటించి ప్రార్థించుచున్నాను. సుఖాత్మకమగు స్వస్వరూపావస్థానాత్మక సమాధియందు, చిరవిశ్రాంతిని గోరుచున్నాను. నీ దురదృష్ట మేమనవలయును. అట్టి యాత్మపదమును గుర్తిడియు, నా విశ్రాంతిని విడచి, దుఃఖాత్మకమగు వ్యవహారమునందుంటివి." అనియె నను.

అంతటనామె, మందహాసమొనరించి, "నాథ! పరమ పావనమగు నాతురీయపదము, నీచే దెలియబడలేదు. ఏపదమందు 'అహామస్మి' యను దృఢాభినివేశమును జెంది, పండితులు మోహమునందకున్నారలో, యాపదము నీకు భూమిమీదనున్నవాని కాకస మెంతదూరమో, అంతదూరమైననున్నది. నీచే దెలియబడిన కొంచెమేది కలదో, యది తెలియబడనిదానితోడ సమమె యగును. నేత్రముల యొక్క నిమీలనోన్మీలనలచే, నా పదము దెలియబడదు. ఒకపని చేయుట, చేయకుండుటలచే, నదిలభ్యము గాజాలదు. రాకపోకలచే, నది చెందబడదు. నిమీలన, కరణ, గమనాదులచే బొందబడునది పూర్ణమెట్లు గాగలదు! యవాష్టక పరిమితములైన, నీ కనురెప్పల నున్మీలనము నదిరోహితమైన, యాపదము పూర్ణమెట్లు గాగలదు! నీ మాహాత్మ్యమెంత యాశ్చర్యకరముగనున్నది! కోటానకోటిబ్రహ్మాండము లేపదముయొక్క అంచుననుండునో, యది యంగుళిమాత్రి ప్రమాణముగల నీకనురెప్పల యున్మీలనమందు, తిరోహితమగునా! రాజపుత్రి! ఆ తత్వసారము జెప్పెదవినుము. గ్రంధి విచ్ఛేదము గానంత వరకు, సుఖానుభవముండజాలదు. త్రాడును మెలికవైచి, వేనుటచేబడ్డ ముడికి గ్రింధియను పేరు. మోహరజ్జువిటుల వేనబడియుండుటచే నందు కోట్లకొలది గ్రంధులు గలవు. స్వరూపాజ్ఞానమె, మోహరజ్జువు. అందు విపరీతముగ పైన

వేయబడి యేర్పడిన గ్రింధులు కొన్నికలవు. అందు మొద టిది, దేహేంద్రియాదులం దాత్మత్వ నిశ్చయము. ఇది స్వరూపాజ్ఞానమూలకము. కనుక నీగ్రింధి, స్వరూపా జ్ఞాన మాశ్రియముగా గలది. గట్టిగ వేయడినముడి, తదాబశ్ర, యమగు త్రాటిని త్రెంచిననె కాని విడనటుల, స్వరూపాజ్ఞాన రజ్జువును ద్రెంపక, దేహాదులందాత్మత్వరూప గ్రంధి విడదు. ప్రతిక్రియారహితము, సుఖదుఃఖానుభవ ప్రవాహ రూపము నగు సంసార మీగ్రింధి వలననె వ్యాప్తిజెందినది. భాస రూపమగు నాత్మస్వరూపమె, యధిష్ఠానముగా గలజగత్తునం, దనాత్మత్వబుద్ధి రెండవగ్రింధి. దర్పణమె యాశ్రయముగా గల ప్రతిబింబము దర్పణాతిరిక్త మెట్లుగాగలదు? జీవ పరస్పర విభేదనిశ్చయము, జీవేశాది విభేద నిశ్చయము మున్నగునవి, తదితర గ్రంధులు. ఈ స్వరూపాజ్ఞాన మనాదికాలమునబుట్టి, మిక్కిలి పెనవేయబడి, గ్రింధిరూపమును బొందినది. ఇట్టి రజ్జువుచే పురుషుడు కట్టబడినాడు. ఆ గ్రింధి విడినంతనె, బంధమునుండి ముక్తుడు గాగలడు. నీవు నేత్రములు మొగిడ్చి, యెట్టి స్వీయపదమును బొందితివో, అది పూర్ణ మును, సర్వనిషేధావధిభూతమును నగు, నీ స్వస్వరూపము. అదియు, సర్వసంసారమను ప్రతిబింబమునకు మహాద్దర్పణము. అది యెక్కడెప్పుడే రూపమున లేదోనిరూపింపుము. సామాన్య చైతన్య మెక్క డేకాలమున లేదని చెప్పెదవో,

ఆ దేశకాలములకు వంధ్యాపుత్రత్వ ధర్మము పట్టును. అది యెట్లన, నాదర్శములేని ప్రతిబింబము వంధ్యాపుత్రునివిధమె కద! కావున నపరిచ్ఛిన్నమగు సంవిదాత్మాతిరిక్తముగ, నేమియులేదు. ఆత్మయటుల పరిపూర్ణమగుచుండ, నీ నేత్రోన్మీలనముచే నంతర్హితమగునదెద్ది! ఇట్టి క్రియచే నాత్మను దెలిసికొంటిననునట్టి యభిమాన రూపమగు గ్రంథి, దృఢము గనున్నంత వరకు, నావరమపదము బొందబడదు. అంత దనుక పొందబడినది, యాపదము గాజాలదు. నేత్రములు దెరచి పొందితిననికాని, నేత్రములు ముకుళించి, పొందితి ననికాని, యెట్టిపదమును గుర్తింతువో, అది పరమపదము గాజాలదు. ఉన్మీలననిమీలనాది క్రియలచే దానికి పరిచ్ఛిన్నత్వము వాటిల్లినదగును.

నాథ! తనయందుబడిన సర్వమును గ్రసించునట్టి కాలానల ప్రభవలె, భాసమానానంత జగత్కల్పనను, తనయందిమిడ్చుకొను మహాసంవిదాత్మ యుండనిచోటెద్ది? పరమపదమును గుర్తెరిగిన, నీకు కర్తవ్యశేషము లేదు. సర్వమును నిరోధించి, స్వస్వరూపమును చూచుచున్నానను భ్రమరూపమగు గ్రంధినివిడచిపెట్టుము. భాసించుదృశ్యము నేనుకాదను, పూర్వగ్రంథిమూలభూతమగు నీ గ్రంథినిగూడ త్యజింపుము. అనిరోధకాలమందు భాసమానమగు విషయ

సంభిన్న రూపముగూడ శుద్ధమగు స్వాత్మరూపమె. కారణ మేమనన, దృశ్యము ప్రతిబింబతుల్యము. ప్రతిబింబము దర్ప ణాతిరిక్తము గాదు. ఇట్లీ గ్రంథుల నిర్మూలన మొనరించి, యపరిచ్ఛిన్నానంద భరితమగునాత్మను సర్వత్రగనుము. ఆత్మ యందఖిల జగత్తును దర్పణమందు ప్రతిబింబమును వలె జూడుము. ప్రతిబింబములుగా జూడబడు వస్తువులందు, కామాదివాసన లుదయింపవు. అటువలె, సకల దృశ్యమం దును, స్వాత్మాదర్శమంతలి ప్రతిబింబత్వ నిశ్చయముగలుగ, కామ వాసనగాని, దుఃఖముగాని యుండజాలదు. చిత్త నిరోధ కాలమునందు దృశ్యరూపద్వైతము భాసింపదు గాన, కామాదివాసన లుదయింపక, పరమ సుఖావాప్తి గలుగు చున్నది. దర్పణస్థిత ప్రతిబింబమువలె, నాత్మయందు జగ త్తును జూచునెడ, చిత్తనిరోధము లేకున్నను, ద్వైతాభా సము ఆత్మాతిరిక్తముగాదు గనుక, సట్టిసుఖమే కలుగును. సర్వము నాత్మయందు ప్రతిబింబాత్మకముగ నున్నది. కనుక సర్వత్ర, యఖిలము, నాత్మగనె చూడవలయునుగదా యనిన, సర్వత్ర భాసమానమగు సకలము నాత్మగ జూచు చున్నానని తొలుత నిశ్చయించి తిరిగి సర్వత్ర యఖిలము నాత్మయేయను అంశమును బాటింపక, పరిశిష్టమగు రూప మును బొందుము. అనగ భావింపబడు నంశమును విడచిన, భావకరూపమగు సామాన్యచైతన్యము 'అహమస్మి' యని తట

స్థుడవుగమ్ము అనగ 'చైత్యవర్జిత చితిమాత్రి రూపోహ మస్మి' యని" సంస్కారశేషుడవగు"మని యనెను.

ఇట్లు ప్రియురాలు చెప్పినది విని హేమచూడుడు నిర్బోధము నందె శుద్ధాత్మ భాసించుననెడి భావము విడచి పూర్ణమగు నాత్మస్వరూపము ను గుర్తించెను. క్రమముగ నట్టి పూర్ణరూపమునందు దృఢాభినివేశమునంది, స్థిర భావనుడగుచు హేమలేఖాది స్త్రీజనముల గూడి విహరించుచు, సమృద్ధమగు రాజ్యమును శాసించి, యుద్ధమున శత్రువులనోడ్చి, శాస్త్రాది శ్రవణ మొనరించుచు, ధనముల నార్జించుచు, నశ్వమేధ రాజసూయాది మహాక్రతువుల నొనరించుచు, నిరువదివేల సంవత్సరములు భూమియందు జీవన్ముక్తుడై యుండెను. జీవన్ముక్తదశయందున్న తనయుని జూచి, రాజగు ముక్తాచూడుడును, తమ్ముడగు మణిచూడుడును, ఇతడు పూర్వమందు వలె గన్పడుచుండుట లేదు. సుఖమందు సంతోషముగాని, దుఃఖమందు నిరుత్సాహముగాని చెందుటలేదు. లాభాలాభ, శత్రుమిత్రులయెడ సమత్వబుద్ధిగలిగియున్నాడు. నటరంగమందు నటునివలె రాచకార్యములు నిర్వర్తించుచున్నాడు. మద్యపానమత్తునివలె గన్పించుచున్నాడు. వ్యవహారము సక్రమముగ నిర్వర్తించుచున్నను, మనస్సు, అన్యత్రి యున్నటుల గన్పించును. ఇతనెట్టికారణమున నిట్లుండె'

నని చింతించి, హేమచూడుని తనస్థితికి కారణమడిగిరి. అతను తన వృత్తాంతమంతయు జెప్పెను. అంత వారిరువురు, నతనిచే బోధితులగుచు, బరతత్త్వమును గ్రహించి జీవన్ముక్తులైరి. రాజువలన, నమాత్యగణమంతయు జగద్గతిని గ్రహించి జ్ఞాతజ్ఞేయమయ్యె. ఇట్లు విశాల నగరమందెల్లరును, పరస్పరము బోధితులగుచు, దేహాత్మభావన విడచి జ్ఞాతజ్ఞేయులైరి. ప్రాయముగ, కామక్రోధాదులకు లోనగు, బాలస్థవిరులు గూడ, త్యక్తదేహాహంభావనచే, వానికి లోనుగాక కేవల వ్యవహారార్థము వానినవలంబించు చుండిరి.

పరతత్త్వ సంకీర్తన మొనరించుచు, తల్లులు పిలలను జోలబాడుచు నిద్రబుచ్చుదురు. అన్యోన్యము, పరతత్త్వపరమగు సల్లాపము లొనరించుచు, దాసదాసీ జనములు, తమపనులను నిర్వర్తించుచుందురు నటకులు, గాయకులు, విదూషకులుగూడ తమతమ కళలను, పరతత్త్వపరముగ బాటించుచుందురు. పరతత్త్వ విచారార్హములగు నుదాహరణలిచ్చుచు శాస్త్రజ్ఞులు, శిష్యులకు పాఠములు జెప్పుచుందురు. విశాల నగరమందలి దాసదాసీజనములు, నటవిట గాయకులు, భృత్యులు, భటులు, మంత్రులు, శిష్యులు, వారవనితలు, తదితరులందరును, బూర్వ సంస్కారములచే వ్యవహార పరాయణులెకాని, అందరును తత్త్వవేత్తలైరి.

అందలి జనులు, పూర్వమును స్మరింపక, భవిష్యత్తు ననుసంధింపక, వర్తమానమునె యనుసరించుచు, వ్యవహరించుచుండిరి. తన్నగరమందలి పంజరస్థములగు కీరములు సయితమిట్లు బలుకు చుండెడివి.

"ఓ! జనులారా! దుఃఖమూలమగు విషయాసక్తిని వదలి, దృశ్యవర్జితమును, ప్రజ్ఞానఘనమును, స్వస్వరూపమునగు నాత్మయందు రతులు గండు. దర్పణమందు ప్రతిబింబము వలె, చితికంటె నన్యముగ చైత్యము లేదు. చితియే చైత్యము. అహంశబ్దవాచ్యము చితియే. సర్వచరాచరము చితియే కారణమేమన, చితి సర్వస్వతంత్రము, స్వయంప్రకాశము, సర్వము చితిననుసరించి ప్రకాశించుచున్నది. కావున సర్వాశ్రయమగుచు, స్వయంప్రకాశమగు చితిని, 'నేను' 'నాది' యను భ్రాంతిని వదలి, సర్వాత్మత్వ దృష్టిగలిగి భజింపుడు."

ఇట్టి యీ నగరమును సనకాది మహర్షులొకప్పుడు చూచి, విద్యానగరమని పేరిడిరి. అప్పటినుండియు ప్రసిద్ధ విద్యానగరమను పేర నయ్యది జరగుచుండెను. ఇట్లు పూర్వము హేమలేఖచే బోధింపబడి హేమచూడుడు బ్రహ్మవిద్యాప్రాప్తిని గాంచి జీవన్ముక్తుడయ్యెను. అటులనె నా

పట్టణమందలి స్త్రీ, బాల, ప్రముఖులందరును జ్ఞాతపరావరు లైరి. కావున శ్రేయమునకు సత్సంగము ప్రథమనిధానము. శ్రేయము వాంఛించు నరుడు సత్సంశ్రయపరుడు గావలయును.

ఇది శ్రీత్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశికయను నాంధ్రీకరణంబున, హేమచూడ
విశ్రాంతియను దశమాధ్యాయము.

# ఏకాదశాధ్యాయము.

తే॥గీ॥ ఖమత సిద్ధాంత ఖండన కోటియందు
దర్పణ ప్రతిబింబ విధాన, నగును
చితియె చైత్యంబు; కాదొండు, సిద్ధమనెడి
గురుని వినుమంబ! యొక్కింత కరుణతోడ!

హేమచూడుని యత్యద్భుతమగు కధనువిని భార్గవుడు సంశయమనస్కుడగుచు నిట్లడిగెను. "గురునాధ! మీచే జెప్పబడిన యద్వయాత్మకమగు జ్ఞానము, సర్వానుభవ విరుద్ధమనియు, నసాధ్యమనియు నాకు దోచుచున్నది. దృగ్దృశ్యములు వేరుగ గన్పించుచుండ, దృశ్యమంతయు చితి మాత్ర స్వరూపముగ నెట్లు జెప్పనగును. అది ప్రత్యక్ష విరుద్ధము, కేవల శ్రద్ధామాత్రోపజీవ్యము. చైత్యరహిత మగు చితి, యనుభవ విషయమైనదికాదు. కాన చిద్రూప మట్టిదని చెప్పుట యుక్తియుక్తము గాదు. అది యట్టిదియే యని, యెటుల నిశ్చయింపనగును. దయగలిగి, నాకా విషయమంతయు బోధజేయుము." దత్తగురువంత భార్గవుని జూచి "రామ! దృశ్యతత్వమంతయు, నున్నది యున్నటుల

జెప్పెద వినుము. దృశ్యము నిర్విశేషముగ చిన్మాత్రమె కాని మరియొకటి కాదు. అందు యుక్తిని జెప్పెద సావధానుడవగుము.

ఉత్పత్తిగలిగియుండుట కార్య లక్షణము. జగత్తు ఉత్పత్తి గలిగిన దగుట, నది కార్యభూతము. ఉత్పత్తి యనగ, నూతనముగ భాసించుట నూతనముగ భాసించునది, యుత్పన్నమైనదని చెప్పబడును. ఈ జగత్తు ప్రతిక్షణము నూతనముగ భాసించుచున్నది. అందువలన క్షణోత్పత్తిగలది కాన, కార్యభూతమైనదగును. విజ్ఞానవాదులు జగత్తు అఖండైకక్షణోద్భవమని చెప్పుచున్నారు. వారి మత మీవిధము. బాహ్యవస్తువులు లేవు. ఘటాకార జ్ఞాన, పటాకార జ్ఞానాది వివిధాకార భేదముగల విజ్ఞానముచే, వ్యవహార కల్పన జరుగుచున్నది. విజ్ఞానము ప్రతిక్షణోద్భవము. ఏక్షణమందలి జ్ఞానమందు, దేశకాల వస్త్వాకార మెంతగ భాసించునో, అంత నది యఖండైక రసము. ఒక కుండ యందు బదరీఫలములున్న వనియెడి జ్ఞానము గలుగ వలయు ననిన, మొదలు కుండక్షణము, తదుపరి బదరీఫలక్షణము, తదుపరి కుండబదరీఫలక్షణము గలుగును. ఇట్లు జగత్తు క్షణికము. తత్తత్కాల దేశాకారాత్మకము. అఖండైకరసము నగు విజ్ఞానమమాత్రమె.

తార్కికులు పదార్థ సంఘాతమె జగత్తని చెప్పెదరు. ఆకాశాది స్థిరపదార్థములు నిత్యమనియు. ఘటాదులు చరమనియు, స్థిరచరాత్మక పదార్థ సంఘాతమె, జగత్తనియు వీరి మతము ఎవరెటుల తమయిచ్చవచ్చిన రీతి చెప్పినను, జగత్తు దృశ్యమగుట, నుత్పత్తి గలదనుట నిర్వివాదాంశము. కనుక కార్యభూతమగుచున్నది.

కారణమునకు, కార్యాపేక్ష లేనటుల, కార్యమునకు గూడ కారణాపేక్ష లేదు. కార్యాపేక్ష లేకుండుట కారణమున కెటుల స్వభావమో, యటువలె కారణాపేక్ష కార్యమునకు లేకుండుట స్వభావము. కాన జగత్కార్యమునకు కారణాపేక్ష లేదని చార్వాక స్వభావ వాదము. ఈ వాదమతి పరిసంగమని త్రోసివేయబడుచున్నది. కారణమగు మృత్తు నపేక్షింపకయె పుట్టినఘటము, పటము గూడ గావచ్చును. ఘటకారణము మృత్తు, పటకారణము ప్రత్తి యను కారణ వైచిత్ర్యముండుటచే, ఘటము పటము గాకున్నది. ఘట కారణమె, పటకారణము గాగూడదా యనిన, రెంటికారణము లందును భేదముండుట, నటుల జెప్ప వలనుపడదు. కాన, నామతము శాస్త్రసమ్మతముగాదు.

అదియునుగాక, కార్యకారణ నిశ్చయమన్వయ వ్యతిరేకములచే గలుగుచున్నది. అన్వయమనగ, కార్యమందు

సమగ్రమగు కారణవ్యాప్తి. వ్యతిరేకమనగ, కారణాభావమందు. కార్యాభావవ్యాప్తి. కార్యమగు ఘటమందు సమగ్రముగ కారణముగ మృత్తుయుండును. పటమందు ప్రత్తియుండును. ఇది అన్వయ వ్యాప్తి. మృత్తులేనిది ఘటము లేదు, ప్రత్తిలేనిది పటము లేదు. ఇది వ్యతిరేక వ్యాప్తి. కావున ఘటకారణము మృత్తు, పటకారణము ప్రత్తి యని అన్వయ వ్యతిరేకముచేనగు కార్యకారణ నిశ్చయము. మృత్తు కారణమనియు, ఘటము కార్యమనియు నేల జెప్పవలయును? ఘటము కారణము, కపాలములు కార్యములని యేల జెప్ప గూడదనిన, నందు నన్వయ వ్యతిరేకములు కుదరజాలవు. కాన తన్మతమంగీకార్యము గాదు. అన్వయ వ్యతిరేకముల జ్ఞానము, భ్రమ జనితము గాని, ప్రమాణము గాజాలదనిన, నట్టి భ్రమకు కారణము జెప్పవలసియుండును. అట్లు జెప్పుటకు మొదలిడిన దానికంతముండదు. కాన నాత్రోవ పనికి రానిది. ఈ హేతువుల ననుసరించి, కారణ రహితముగ కార్యము బుట్టదని తేలుచున్నది.

ఒకప్పుడు కారణము దృష్టము గాకపోయినను, కారణము లేని కార్యముండజాలదను నియమమున, నదృష్టకారణ ముండవలయునని, యూహింప దగును. అట్లూహించు శ్రమకు లోనుగాక, నదియ కారణకమని యేల ననరాదనిన,

శాస్త్రములను, బహుజనమనుసరించిన మార్గములను, అను సరించి యోచించుట న్యాయముగాని, కుతర్కమార్గమున జన, శ్రేయముగాదు. లోకమునందు సర్వమును, ప్రాయముగ కారణజన్యముగ స్పష్టముగ గన్పడు చుండుట, నొకానొకచో గారణ మగుపడకుండినను, నదృష్ట కారణ ముండుననియె, తలచవలయును. అట్లుగానిచో, లోక ప్రవృత్తికి భంగము గలుగగలదు. కావున సర్వమును సకారణమె కాని మరియొండుగాదు. కావున, నేదేని కార్యమొనరింప దలచువాడు, తదుపాదానాది కారణమును తొలుత గ్రహించుట సామాన్యముగ లోకము నందు జరుగుచున్నది. కాన చార్వాక స్వభావవాదము శాస్త్రదూష్యము. ఆచారవిరోధము గాన నిరసనీయము.

కాణాదు లింకొకరీతి జెప్పుచున్నారు. అదృష్టములగు నణువులచే. జగత్కార్యము ఘటింపబడుచున్నదని వీరి మతము. దీనికారంభవాదమని పేరు. ఆమత సిద్ధాంతము దెట్లనిన వినుము పరిపక్వ ప్రాణ్యదృష్ట సహకృత మగు ఈశ్వరేచ్ఛవలన, స్థిరములగు పరమాణువులందు చలన క్రియ గలుగును. అంత రెండు పరమాణువులు గలసి ద్వ్యణుక మగును. తిరిగి, యీశ్వరేచ్ఛవలన నీ జనితములందు చలనము గల్గును. అట్టి ద్వ్యణుకములు మూడు గలసి త్రిస

రేణువగును. ఇటుల ఘటాద్యంత కార్యోత్పత్తి జరుగును. ద్వ్యణుకాదికార్యము, పరమాణ్వాది కారణము కంటె నత్యంత భిన్నము. వస్తువు, నాశానంతర మత్యంత, మసత్ప్రియము. ఈమతము సమంజసముగాదు. ఒకవస్తువు పుట్టకపూర్వము లేనిది, పుట్టిన తరువాత నున్నది, నాశానంతరము లేనిదని చెప్పుట అసమంజసము. సదసత్తుల నైక్యము విరుద్ధము గదా! పీతాపీతములు, ప్రకాశాప్రకాశములు విరుద్ధధర్మములగుట, నొకచో నెట్లుండగలవు? ఒక వస్తువునందె, యిట్టి విరుద్ధ ధర్మములుండుట అసంభవము. ఈశ్వరుడైనను, నట్టి వాని యిచ్ఛచేత పరమాణువులం దెట్లు క్రియ యుద్భవించును. ప్రభువాజ్ఞచే నచేతనములందు క్రియోద్భవమగునెడ, భటాదులు లేకయె, శస్త్రములు యుద్ధము జేయనగును. కనుక, పరమాణువుల వలన జగత్తు పుట్టునెడి. యీ వాదమయుక్తము.

సాంఖ్యులు నిరీశ్వర వాదము నిట్లు జెప్పుచున్నారు. స్వతస్సిద్ధముగ, గుణత్రయ సామ్యావస్థ గలది ప్రకృతి. తానె, గుణవైషమ్యము నంది జగద్రూపమున బరిణమించును. ఇందీశ్వర సహాయాపేక్ష యేమియు లేదు. ఇట్లు సంభవము గాజాలదు. ప్రళయమందు గుణ సామ్యరూపమగు ప్రకృతి, ప్రళయాంతమున గుణవైషమ్యమును, నిర్హే

తుకముగ జెందుననుట యుక్తము ఎటులనో వైషమ్యము నందిన ప్రకృతి తిరిగి ప్రళయః మిత్త సామ్యావస్థను జెందుట కెట్టి హేతువును జెప్పగలము? కర్మ, యట్టి గుణ వైషమ్యాదులకు కారణమనిన, నది యసమంజసము. చేతనాధిష్ఠితముగాని ప్రకృతి, స్వయముగగాని, కర్మలచేగాని, పరిణామము నందజాలదు. చేతన వ్యాపారము లేక, జడములందు క్రియోద్భవము లోకమున గానుపించదు. చేతనము లేక జడమునందు ప్రవృత్తి నివృత్తులు గానరావు. కాన చేతన రహితమగు ప్రకృతి, జగద్రూపమున పరిణమింప జాలదు. జగత్తునకు కారణము లేదనిన, పై జెప్పిన అన్యమతముల స్వీకరింపవలసి వచ్చును. జగత్తు కార్యమనుట, ప్రమాణ సిద్ధము. కార్యముగాన కారణముండియుండవలయును. అట్టి కారణము పరోక్షమగు నెడల శ్రుతియె, ప్రమాణము. ఇంద్రియ గోచరముగు విషయములందు, ప్రత్యక్ష ప్రమాణము వర్తించును. ప్రమాతలు పరిమితులగుట, పరిపూర్ణత్వము సిద్ధింపక, స్వర్గ ఇంద్రాదులు వారికగోచరములగుట, ప్రత్యక్ష ప్రమాణము సిద్ధింపదు. ప్రత్యక్షమె, మూలముగా గలదగుట, ననుమాన ప్రమాణముగూడ పంకింపదు. నిత్యాపరోక్షమందీ రెండు ప్రమాణములును వర్తింపవు. కాన శ్రుతియె, ప్రమాణము గాగలదు. శ్రుతి శబ్దరూపము. శబ్దము, పరిచ్ఛిన్న ప్రమాత ప్రయుక్తముగదా! శ్రుతి

ప్రమాణమెట్లగుననిన, శ్రుతి, యీశ్వర ప్రేరితము గాన, నుత్తమ ప్రమాణత్వము గాంచినది.

పైన జెప్పబడిన విధము ననుసరించి, జగత్తు సకర్తృక మని తేలుచున్నది. ఆజగత్కర్త చేతనుడు. కార్యభూత మగు జగ, మచింత్యరూపమగుట, తత్కర్త సాధారణు డెట్లగును? కావున నాకర్త, యచింత్య శక్తియుతుడు. అట్టి యచింత్య శక్తిగల జగత్కర్తయొక్క తత్త్వావబోధక శబ్ద వ్యాపార, మాగమము. అట్టి పరిపూర్ణునిదగు శ్రుతి, సర్వాధిక ప్రమాణమగుట నిస్సంశయము. చైత్యము చితి మాత్రమె యగుటయం దుపపత్తిని చెప్పదలచి, పూర్వోక్త గ్రంథవిస్తారమున శ్రుతికి ప్రమాణమూర్ధన్యత సాధించి, ప్రధాన విషయము నీక్రిందివిధమున దత్తావధూత బోధింప దొడగను.

"శ్రుతి యిట్లుల జెప్పుచున్నది. సృష్టికి పూర్వమందు, పరమేశ్వరుడొక్కడె, కలడు. ఆయన సర్వ స్వతంత్రుడు. ఆయన, యుపాదానాద్యపేక్ష లేకయె, తన మహోత్కట స్వాతంత్ర్య మహాత్మ్యమున, దాననెడి గోడయందు జగత్త నెడి చిత్రమును, విలాసార్థము భాసింపజేసెను. స్వప్నమందు గాని, మనోరాజ్యమందుగాని, నీవు కేవలము నీచే గల్పింప

బడిన దేహమును నీవుగనె గ్రహించుచున్నావు. అటువలెనె, యీశ్వరుడు తనచే కేవలము కల్పితమగు జగత్తును తానుగ, గ్రహించుచున్నాడు. ఆ స్వప్నకల్పిత దేహము, స్వప్నము నశించ నీరూపమగుటలేదు. అటువలె ప్రళయమందు. పరమేశ్వరునకు కల్పితజగద్దేహము రూపము గాకుండును. నీవు జాగ్రిదాద్యవస్థలయందనువృత్తుడవగుచూ, తత్తదవస్థానువృత్త దేహాది వ్యతిరిక్తుడవైన చిన్మయుడవు. అటువలె, పరమేశ్వరుడు ప్రళయానువృత్త జగద్వ్యతిరిక్త శుద్ధ చిన్మయుడు. అట్టి చిదేక శరీరుడగు పరమేశ్వరునిచే, తనయందె, జగద్విచిత్రము భాసింపజేయబడుచున్నది.

ఏకము, పరిపూర్ణమునగు తనకంటె, మరియొక వస్తువు, తన కన్యత్రయుండుట సంభవింపదు గాన. నా పరమేశ్వరుడు జగచ్చిత్రమును, తనయందుగాక నెచ్చటభాసింప జేయగలడు? చితివినా, యెక్కడనేది యెప్పుడుండ గలదు? ప్రకాశింపబడక, నేయొక్కటియు నుండజాలదు. చితి సర్వమును బ్రకాశింపజేయునది. కాన చిదభావమగు దేశము సిద్ధింపజాలదు. సర్వప్రకాశమగు చిత్తునకభావ మెట్లు సిద్ధించును? చిత్తునక భావమనునది లేదుకాన, నది సర్వనిషేధావధిభూతము. కాన, నపరిచ్ఛిన్న సత్తాకము. కాన, సర్వజగద్వ్యాపకము. కాన, పరిపూర్ణము. కావున జగత్తు

చిత్తునకు వినా భూతముగ నున్నది. సముద్రము లేకుండ తరంగములును, సూర్యుడు లేని కాంతియు నుండనటుల, సవిదూపము వినా జగత్తు లేదు. కావున సృష్టికి పూర్వము శుద్ధచైతన్య విగ్రహుండగు నా మహాదేవుడుండెను. చరాచరాత్మక దృశ్యమంతయు, నాయననుండియె యుత్పన్నమైనది. ప్రళయమందాయనయందె లీనమగుచున్నది. సముద్రములనుండి బుట్టిన తరంగాదులకు, సముద్రాద్యాత్మత్వమువలె, చిత్తునుండిబుట్టిన జగత్తునకు, చిన్మాత్రాత్మత్వమని భావము.

ఈ తీరున జెప్పబడిన శ్రుత్యర్థమును సంశయింప, పనిలేదు. అప్రత్యక్షార్థములందు వేదము నిర్ణీతప్రమాణము. ఆ వేద, మీశ్వర ప్రోక్తమగు టెట్లనిన, నాగమోక్తములగు మణిమంత్రౌషధుల వలన సిద్ధులు గలుగుట సర్వప్రసిద్ధము. అట్టి మణిమంత్ర మహాఫలముల, నల్పప్రజ్ఞు డెరుగజాలడు. కానదృష్టాదృష్ట విషయిక ప్రమాణమగు వేదము, సర్వజ్ఞప్రోక్తమనుట నిస్సంశయము.

ఆ వేదమిట్లుజెప్పినది. జగత్సృష్టి కాదియందా పరమేశ్వరుడొక్కడె యుండి ఈ యఖిల జగమును సృష్టించెను. కాని, కర్తయగుకుమ్మరి ఘటాదికార్యమందు, మృదాద్యుపా

దాన కారణ మాశ్రయించుట ప్రసిద్ధము. సృష్టికి పూర్వ మొక్కఁడె, పరమేశ్వరు డుండుట, ఆయన కుపాదానము లెట్టివి కలవవిన, నుపాదానాపేక్షలేక యె, ఆయన జగత్తును సృష్టించెను. అట్లు నిరుపాదానముగ భాసింపజేయు టెట్లనిన, నీశ్వరుడపరిచ్ఛిన్న సహజస్వాతంత్ర్య యుతుడు గాన, తన చిదాత్మరూప భిత్తియందు, జగచ్చిత్ర మఖిలమును భాసింపజేసెను. అట్టి జగత్తాపరమేశ్వరుని వెలుపల నెచ్చటనో యుండుట, సంభవింపదు కారణమేమన, ఈశ్వరుడు పరిపూర్ణుడు. ధాన్యముచే బరిపూర్ణమగు ఘటమునం దితర ములకు స్థానముండనటుల, దిగంతముల నిండి పూర్ణమగు నీశ్వరు నతిక్రమించి మరియొక స్థాన ముండజాలదు. కాన ఈశ్వరునికంటె నన్యమగు స్థానమందు జగత్తుండు టెట్లును సిద్ధింపజాలదు.

అన్యస్వరూపాంతరమందు అన్యావభాసయె, సహజముగ గలుగుచుండ, చిదాత్మస్వరూపమందు జగదావభాస గలుగు చున్నదనుట సమంజసమనిన, వినుము. దర్పణ స్వరూప మందు భాసించు ప్రతిబింబమువలె, పరమేశ్వరునిచే, చిదాత్మస్వరూపమందు జగత్తు భాసింపబడుచున్నదనిన, సర్వము సమంజసమే యగును. నిరుపాదానముగ నేకర్తయు లోక మున నెట్టిక్రియను జేయజాలకుండుట జూచుచున్నాము.

ఈశ్వరుడెటుల జగత్కార్యము, నుపాదానాపేక్ష లేక జేయ గలుగుననిన, యోగబలముచే, యోగి సృష్టినొనరించు విధ మునవె యని చెప్పుచున్నాము. కాని, యోగిచే నిర్మిత సృష్టి, యోగికంటె భిన్నముగ నున్నదికదా, చిదతిరిక్తముగ జగత్తు లేదను టెట్టిదనిన, సంకల్ప నగరమువలె, జగత్తు తత్కర్తకంటె నతిరిక్తము గాదు. సంకల్ప నగరమైనను తత్కర్తకంటె భిన్నమనియెదవేమొ, రామ! అట్లుగాజాలదు. నీమనస్సుచే స్వప్నాదులందు జేయబడిన సృష్టి, యనేక కర్త క్రియలచే బ్రచురముగ భాసించుచున్నను, కేవలము నీ మనోమయమె కదా! ఆ సృష్టి యనేక భేదముల భిన్నభిన్న ముగ నున్నను, అందు మనస్సున కన్యమగున దెద్దియును లేదుకదా! ఆసృష్టి మనస్సునందె యుత్పన్నమై, యందె యుండి, యామనస్సునందె లీనమగుచున్నది. కేవలము మనోరూపమె యగుచున్నది. అటువలె, నీజగత్తు, యీశ్వ రునుంచి, యుత్పన్నమైనది. మానససృష్టి మనోమయమగు నటుల, చిదాత్మయగు నీశ్వరువలన, నుత్పత్తిగాంచినజగత్తు చిన్మయమగుచున్నది. ఈశ్వరునివలన నుత్పన్నమైన జగత్తు, ఈశ్వరమయము గావలయును గాని, చిన్మయమగుటెట్లనిన, ఈశ్వరుడు చితికంటె వేరుకాదు. చితిమాత్రైక రూపుడు.

ఆ చితియన నెట్టిదో తెల్పెద వినుము. చిదతిరిక్త

మగు దేహ మాచితికి లేదు. ఆ చితియె, త్రిపురాపరమే శ్వరి. దర్పణమందు భాసించు ప్రతిబింబములయొక్క సంఘ ట్టమయమగు రూపము దర్పణమె యగునటుల, జగత్తునందలి ఘటాద్యాభాసరూపములగు ననంత శక్తులయొక్క సంఘట్ట రూపిణి, యాచితియగు పరమేశ్వరి. కాని, దర్పణమువలె జడముగాక సర్వసాక్షిణి. ఆ చితి సర్వత్ర పరిపూర్ణమైనది. లోకమునందు పరిచ్ఛేదము దేశకాలముల బ్రాప్తించుచున్నది. 'ఇక్కడ,' 'ఇప్పుడు,' 'ఘటమున్నది,' యనునపుడు 'ఇక్కడ' యనునది గృహాది రూపమగు దేశము. 'ఇప్పుడు' అన ఉద యాది రూపమగు కాలము, దేశము గృహాది రూపము; ఆకారమయము. కాలము సూర్యాది చలనాత్మకము; క్రియా మయము. ఈ యాకారక్రియలు రెండును, చితియొక్క ఏక దేశాశ్రయమున నగుచున్నవి. అట్టిచో నట్టి యాకార క్రియల వలన, తదిష్ఠానమగు చితికి పరిచ్ఛేదమెట్లు గాగలదు? చితిలేని దేశకాలము లెందున్నవో చెప్పుము. మృత్తున కవినాభూతములు, తదాశ్రయములునగు, ఘటశరావాదులు మృత్తు వినాగా యుండునా? దర్పణమున కవినాభూతములు, తదాశ్రయములునగు ప్రతిబింబములు, దర్పణము వినాగా యుండునా? అటువలె చిదవినా భూతములు, తదాశ్రయ ములు నగు దేశకాలాదులు, చిద్వినాగాయుండవని తాత్ప ర్యము. అధిష్ఠానమగు చితిలేనిచోట, తదాశ్రయములగు

దేశకాలములెట్లుండ గలవు?

సూర్యకాంతివలె చిత్తు వస్తుప్రకాశక యగునపుడు, సూర్యకాంతిరహితముగ ఘటాదులు అంధకారమున నుండుట లేదా। అటువలె చిత్తు లేకుండియు, దేశకాలాది భావము లుండవచ్చుననిన, వినుము. ప్రకాశమున వస్తువుల అస్తిత్వము, లేక సత్వము, లేక ఉనికియె కాని మరియొకటి కాదు. అట్టి అస్తిత్వాత్మక లేక సత్వాత్మక ప్రకాశమెచితి చితి కానిదానికి ప్రకాశత లేదు. కాన చితియె ప్రకాశము. సూర్యకాంతి రహితముగ, ఘటాదులు అంధకారమున భాసించుటచే, నా కాంతికంటె నన్యమగు నస్తిత్వము ఘటాదులకు గలదు. ఆ యస్తిత్వము లేనిది, ఘటాదులనెడి వ్యవహారమె యుండదు. అస్తిత్వమె, ప్రకాశము. కావున చిత్ప్రకాశమె, యస్తిత్వమని భావము. ఏది యన్యాపేక్ష లేక స్వతంత్రముగ ప్రకాశించుచున్నదో, అద్దాని ప్రకాశమె ముఖ్యము. చిత్తుకంటె భిన్నములగు జడములు స్వప్రకాశములు గాజాలవు. అయ్యవి చిత్తుయొక్క తాదాత్మ్యమును జెందక ప్రకాశింపజాలవు. అనగ చితినాశ్రయింపక జడములు ప్రకాశింపజాలవు. చితిమాత్ర మన్యానపేక్షముగ, అన్య తాదాత్మ్యమును జెందని, స్వస్వరూపమందు బ్రకాశించును. సమాధ్యాది దశలందిటుల ప్రకాశించుట, విదితము.

సర్వవస్తువులును, ఆకాశము నాశ్రయించి యుండు నటుల, చిత్తునాశ్రయించియుండవచ్చును. అయినను 'అస్తి', 'ప్రకాశతే', యనెడి వ్యవహారము ననుసరించి, యస్తిత్వము ప్రకాశముకంటె భిన్నమైనదికదాయనియునదగదు. ప్రకాశము లేకయే, ఘటాదుల కస్తిత్వమున్నదనిన, అప్రకాశ మాన మగుటచే నియ్యది లేదనిచెప్ప వలనుబడదు. అప్పుడు లోక మున 'అస్తి, నాస్తి' యను భేద వ్యవహారమె, యుండక పోవలయును. అట్లైన, ప్రకాశించుచున్నది కనుక నున్నది, అను వ్యవహారముండు టెట్టిదనిన, వినుము. ఈ వస్తువు దృశ్యముగనుక ప్రత్యక్షమని లోకమున వ్యవహరింపబడు చున్నది. దృశ్యప్రత్యక్షములకు భేదమేమికలదు. అటువలె, అస్తిత్వ ప్రకాశములకు భేదము లేదు. కనుక చిత్ప్రకాశ మన, వస్తువుల యస్తిత్వమె యని తేలినది.

అందుల దృష్టాంతము దెల్పెద వినుము. ప్రతి బింబ ముల యొక్క సత్వము (అస్తిత్వము) దర్పణమె యగునటుల, జగత్సత్తా చితియెయగును. కావున సర్వజగత్తు చితియె యగు చున్నది. సర్వము చితియె యైన, చితిగ భాసింపవలయును గదా! ఘటము పటమను విశేష రూపమున భాసించుటెట్లు? చితియొక్క నైర్మల్య మహాత్మ్యముచే, నటుల విశేషాంశము భాసించునని సమాధానము. ఇందునుగూడ ప్రతి బింబమె,

యనుసరింపబడినది. కారిన్య నిర్మలత్వములచే ప్రతిబింబము భాసించుచున్నది. వాని న్యూనాధిక భావము ననుసరించి, ప్రతిబింబము స్ఫుటాస్ఫుటముగ భాసించును. దర్పణమం దయ్యవి, యధికముగనుండుట, ప్రతిబింబము స్ఫుటముగను, జలమునందయ్యవి న్యూనతగలిగి యుండుట, నస్ఫుటముగను, భాసించుచున్నవి. భిత్తియందు నిర్మలత్వమభావమగుటను, ఆకాశమునందు కారిన్యమభావమగుటను, వానియందు ప్రతిబింబావభాసము లేకపోవుచున్నది. జలదర్పణాదులు జడములు, స్వాతంత్ర్య రహితములు. అనగ స్వప్రకాశములు గాక, లోకమునందలి తదితరములవలె చిత్ప్రకాశితములు. కనుక నయ్యవి చిదూపమునందు ప్రతిబింబింపవలయును. కనుక చిత్ప్రకాశితమగు బింబముండినగాని, జల దర్పణాదులందు ప్రతిబింబము భాసింపదు. చితి, యపరిచ్ఛిన్న సార్వత్రిక స్వాతంత్ర్యము గలది కాన, బింబాపేక్ష లేదు.

చిత్తునందు జగత్ప్రతిబింబావభాసన కనువగు మహోత్కృష్ట నిర్మలత్వ కఠినత్వ లక్షణములెట్లు సిద్ధించెనో వినుము. అసంగలక్షణముగ నాకాశమునకు మాలిన్య మెట్లుండగలదు? అటువలె నసంగత్వమున మాలిన్యము అంటకుండుట, నిర్మలత్వము చిత్తునకు స్వతస్సిద్ధము. అదియునుగాక, అవయవ

ములు గలవస్తువునకు, తమ యవయవముల యంతరాళమం దన్యవస్తుసమ్మేళనము గలుగుటకవకాశముండి, మాలిన్య మేర్పడుచుండును. అట్టి వస్త్వంతర సమ్మిళితత్వమున, దర్పణజలాదులకు మాలిన్యము గలుగుచున్నది. జలము నందు పార్థివ రజస్సమ్మిళితత్వము, దర్పణమందు కాఠిన్యాంశ సమ్మిళితత్వము విదితముగదా! చిత్తునకుండిన, ఏకాత్మ రూప మున, మాలిన్యరహితమగుచున్నది. చిత్తునందుగల కాఠిన్య మెట్టిదో, పరిశీలింతము లోకమునందు వస్తువుల, యవయవ సంశ్లేష తారతమ్యతవలన, కాఠిన్య తారతమ్యము దృష్టమగు చున్నది. అవయవముల సంశ్లేష యధికముగ నున్న, కాఠి న్యాధిక్యత, సంశ్లేష న్యూనముగనున్న కాఠిన్యన్యూనత్వము, పాషాణజలములందు దృష్టమగుచున్నది. అవయవ సంశ్లేష యధికముగనున్న, తన్మధ్యావకాశమరిక్తమగుట, కాఠిన్యాధి క్యత. అవయవ సంశ్లేష తరచుగ నుండిన, తన్మధ్యావ కాశము రిక్తమగుట, కాఠిన్యతా న్యూనత్వము గల్గుచుండును. చితి యఖండమగుటచే నిరవయవి. కనుక నరిక్తాత్మ భావము గలది. కావున దర్పణాదులకంటె నిర్మలత్వ కాఠి న్యములు సర్వతోధికముగ చితియందు గలవు. కాన జగ త్ప్రతిబింబరూప విశేషాంశమును తనయందు భాసింపజేయ సమర్థమగుచున్నది.

జగత్తు ప్రతిబింబముగను, చిత్తు దర్పణముగను జెప్ప టకు ప్రమాణమేమి కలదన, ప్రతిబింబ లక్షణయోగమున జగత్తునకు ప్రతిబింబత్వమును, ప్రతిబింబ గ్రహణలక్షణయోగ మున, చిత్తునకు దర్పణత్వమును చెప్పబడినది. స్వతస్సిద్ధ ముగ భాసింపక, అన్యసంబంధమున్నపుడే భాసించుట ప్రతి బింబ లక్షణము. ప్రతిబింబ ఘటము, దర్పణములేక భాసిం పక, దర్పణ సంబంధముననె, భాసించుచున్నది. అటువలె జగత్తు చితిలేక భాసింపక, చిత్సంబంధముననె, భాసించు చున్నది. కాన, నది ప్రతిబింబాత్మకమె యగును. జగత్తు స్వభావమున భాసింపకుంకుటయు, చిదాశ్రయముననె, భాసిం చుటయు నింతకుపూర్వము నిర్ధారితమైనది కాన, నద్దాని కాదర్శ ప్రతిబింబత్వ లక్షణ మొప్పుచున్నది. విచిత్రాన్య స్వరూపముల వ్యాప్తమై, భాసించుచున్నను స్వస్వరూప మును లేశమైనను విడువకుండుట ప్రతిబింబ గ్రాహిత్వలక్ష ణము. విచిత్రవర్ణములు గల నానావిధ పదార్థముల తన యందు భాసింపజేయుచు, దర్పణము తన సహజ స్వచ్ఛత్వ మును విడువదు గదా! అటువలె జగద్భావము, లసంఖ్యాక ములుగ, విచిత్రానేక విధముల తనయందు స్ఫురించుచు న్నను, సర్వసాక్షియగు తనస్వరూపమున కేమాత్రమును చ్యుతియుండదు గాన చితియందు దర్పణ లక్షణ మొప్పు చున్నది. దర్పణము నందలి ప్రతిబింబములు, దర్పణము

కంటె వేరుకానియటుల, చిదాత్మ ప్రతిబింబమగు జగత్తు చిదాత్మకంటె వేరుకాజాలదు.

దర్పణమందలి ప్రతిబింబమునకు బింబాపేక్ష కలదు. స్వాతంత్ర్య మహాత్మ్య కారణమున, తనయందు జగత్ప్రతిబింబమును భాసింపజేయు చితి కట్టి బింబాపేక్ష యుండదని పూర్వము చెప్పియుంటిని. బింబము లేని ప్రతిబింబమెట్లు సంభవమగునని పరిచ్ఛిన్నదృష్టిగలవానికి దోచును. రామ! అందుల దృష్టాంతము దెల్పెద వినుము. నీ సంకల్పముచే, నీ యంతఃకరణ యందు ప్రతిబింబితములగు భావములను గాంచుము. అవి బింబముండిననె, భాసించునా? నిర్నిమిత్తముగ, బింబరహితముగ భాసించుటలేదా? ప్రతి బింబలక్షణ యోగ్యములగుటచే, ప్రతిబింబ భూతములగు వివిధ భావములు, నీ సంకల్పవశమున, నీ మనోరాజ్యమందు భాసించుచున్నవి. అయ్యవి బింబాపేక్ష లేకయే, భాసించుట సుప్రసిద్ధమగును. అటువలె, పరాచితియందు జగత్ప్రతిబింబనమని యెరుంగునది.

ఇకనా పరాచితియొక్క సంకల్పమన నెట్టిదియో, వివరించెద వినుము. చిదాత్మకు స్వాతంత్ర్యమను శక్తిగలదని చెప్పియుంటిని. ఆ శక్తివలన చిదాత్మ, స్వానతిరిక్తత్వ

సూక్ష్మరూపత్వములు గలది యగుచున్నది. ఆ శక్తియె, పుష్ట యగుచు, దృశ్యాకారరూపమున స్థూలత్వమును బొందినపుడు సంకల్పమని చెప్పబడుచున్నది. నీ స్వాతంత్ర్యము సంకల్ప రూపము. అది యనేక భావములను, ప్రతిబింబ విధమున భాసింపజేయుట లేదా! అటువలె నీశ్వరునియొక్క స్వాతంత్ర్యము జగత్తును భాసింపజేయుచున్నది. సంకల్ప రహిత దశయందా పరాచితి, ప్రతిబింబ వర్జితమగుట, స్వచ్ఛైక చిన్మాత్రరూపిణిగ నుండును. సృష్టికి పూర్వము విశుద్ధైక రూపిణి యగు, నా చితికే యపరిచ్ఛిన్న స్వాతంత్ర్య ముండెనో, యయ్యదియె సృష్టికాలమున సంకల్పాత్మకమగుచు జగద్రూపమున భాసించును. శుద్ధచిద్దశయందు చిదేక రూపమున నున్న, ఈ స్వాతంత్ర్యము, సృష్ట్యాదియందు జగద్రూపము నందుండుటయె, సంకల్పత్వమని తాత్పర్యము. అట్టి సంకల్పమున ప్రతిబింబాత్మకమగు జగత్తు భాసింపబడుచున్నది. ఈశ్వరుని, యీ సంకల్పము బృహత్సంకల్పమగుట, సద్దాని స్థిరత్వమున జగత్తు చిరకాలము భాసించుచున్నది. అటుగాక, నస్థిరమగు మానవుని సంకల్పముచే, భాసించు భావములు అస్థిరములగుచున్నవి. ఈశ్వరుడు పూర్ణస్వాతంత్రుడు. కాన, తత్సంకల్పమున భాసించు జగత్తెల్లరకును భాసించుచున్నది. అస్వతంత్రులు, అపూర్ణులునగు జీవుల సంకల్ప జనిత భావములు, ఇతరానుభవార్హములు గాకపోవుచున్నవి.

జీవులకు స్వాతంత్ర్య మపూర్ణము గాన, తత్సంకల్పిత సృష్టి యసాధారణమని చెప్పితిమి. ఉపాయాదులచే, సంకోచ మెంతగ విడచునో, స్వాతంత్ర్య మంతగ పూర్ణత్వమును గాంచుచుండును. అట్టియుపాయముల, 'సోహం' మను శుద్ధ చిదాత్మతత్వముయొక్క నిరంతరానుసంధాన రూపాభ్యాసము మొదటిది. మరియు మణిమంత్రాదులచే గూడ తత్స్వాతంత్ర్యమునకు, తావన్మాత్ర పూర్ణత్వము, ఘటింప బడుచున్నది. రామ! అందులకు దృష్టాంతము దెల్పెద వినుము. ఇంద్రజాలికుడు ఉపాదానాద్యపేక్ష లేకయే, తన సంకల్ప మాత్రమున, జగచ్చిత్రమును భాసింపజేయు చున్నాడు. అనగ, మణిమంత్రాదుల, స్వాతంత్ర్యము నెక్కుడుగ సంపాదించి గజ తురగాది సృష్టిని, సంకల్ప మాత్రమున భాసింప జేయుచున్నాడు. ఆసృష్టి జీవసృష్టివలెగాక, సాధారణము, స్థిరము, స్వార్థక్రియార్హమునై భాసించుచున్నది ఆ సృష్టి నంతయు తిరిగి తనయందే యుపసంహరించు చున్నాడు. అయ్యదియు స్వల్పకాలమె యుండునది గాన మరియొక దృష్టాంతము గనుము. విశ్వామిత్రాది యోగులు, తమ యోగమహిమచే, నా ప్రళయస్థాయిత్వ రూప పూర్ణ స్థైర్య సమన్వితమగు సృష్టిని భాసింపజేయుచున్నారు. ఆ యోగులైనను పరిచ్ఛిన్నులగుట, పరిమిత శక్తిగలవారలు. కాన బాహ్యమునసె సృష్టిని భాసింప జేయ గలుగుచున్నారు.

పూర్ణయోగులగు శ్రీకృష్ణాదులు, సర్వజగద్వైచిత్ర్యమును. తమయందె భాసింపజేయ సమర్థులగు చున్నారు. అంత సృష్టియె, పూర్ణ స్వాతంత్ర్య లక్షణమగుట, చిదాత్మ వ్యతిరేకమగునది, యసత్యమగును. ప్రతిబింబమునకు దర్పణాత్మత్వము గాక, సత్యత్వము వేరుండజాలదు కదా! అటువలె జగత్తునకు చిదాత్మత్వముగాక సత్యత్వము వేరొండుండజాలదు. అనగ చిదాత్మ వ్యతిరేకముగ, జగత్తునకు అసత్యత్వమె ప్రాటిల్లును కావున జగత్తు ప్రతిబింబాత్మక మని విమర్శించిన, నందలి యసత్యత్వము రూఢియగును.

భార్గవ! స్వభావమును విడువనిది, అనగ, అవ్యభిచరిత స్వభావము గలది సత్యము. తదితర మసత్యము. ఈ జగత్తు ప్రత్యక్షముగ నతిచంచలము. ఇందలిసత్య మెంతదనుక; అసత్య మెంతదనుక; నని సత్యాసత్య విభాగముచే, నీ యఖిల జగత్తును విమర్శించిన, నీకు నిశ్చయము తెలియగలదు. అది యెట్లులనిన, ప్రతిబింబాదర్శముల యొక్క, అనియతనియత రూపభావము వలె, జగచ్చిదాత్మల భాసము గూడనని విమర్శింపుము. ఆదర్శ మచలము, ప్రతిబింబము చలము గదా! అటువలె జగత్తు చలము, సంవిదచలము. ఇట్లందరిచేతను దెలియబడు చున్నది. తాత్పర్యమేమన; ప్రతిబింబము లుండియున్నను, ఆదర్శము వికారియు, నపరి

త్యక్త స్వభావము గలదియు నగుటచే సత్యము. ఘటాది ప్రతిబింబము, పటాది ప్రతిబింబ కాలమునందు వికారమును జెంది, పరిత్యక్తస్వభావముగలదగుటచే నసత్యము. అటువలె ఘటాదిరూప జగత్తు పరస్పర వ్యావృత్తి గలదియు, సంవిత్సర్వత్రయు వికారియగుట; జగదసత్యము సంవిత్సత్యమని తెలియబడుచున్నది.

అసత్యములగు మరుమరీచికాదులు విచారసహములు గా జాలవు. జగదసత్యముగాన, నటువలె, నందలి భావములు విచారాసహములు అనగ, విమర్శింప నిలువ జాలవు. సూర్యకాంతి సర్వ వస్తుప్రకాశిక మగును గదా! ఉలూకాది దివాంధములకు విపరీతాంధకార మగుచున్నది. సూర్యకాంతి, మానవులకు సర్వవస్తువులను ప్రకాశింప జేయుచు. గ్రుడ్లగూబలకు ప్రకాశింపజేయుట లేదు. తమస్సు ఉలూకములకు సర్వవస్తువులను ప్రకాశింప జేయుచు, మానవులకు జేయుటలేదు. అట్టిచో, సూర్యకాంతి తమస్సులలో ప్రకాశత్వాంధకారత్వ ధర్మముల నెద్ది దేని కన్వయించునో, తెలియబడకున్నది. అటువలె వత్సనాభి మొదలగు విషజాతులు, మానవులకు మారణ హేతువు లగుచున్నవి తజ్జనిత క్రిములకు జీవనభూతములగుచున్నవి. మనుష్యాదులకు, గమన ప్రతిబంధరూప భయమును గలిగించు

నవి, యోగులకును దేవతలకును, అట్లగుటలేదు. మానవులకు కడుదీర్ఘములగు దేశకాలాదులు, యోగులకును, దేవతలకును తద్విపరీతముగ దోచుచున్నవి. ఒక దేశముననే, దూరాదూరత్వ లక్షణ మెటుల సంభవించుననిన, దృష్టాంత ముఖమున దెల్పెద వినుము. దీర్ఘమగు దేశము దర్పణమందు చూడబడు చున్నది. అప్పుడది దర్పణాతిరిక్తముగ నుండదుగదా! దీర్ఘత్వమేమైనది? అటులనె, చితియందు భాసించు లోకాదుల ప్రకాశత్వాదికము విమర్శింప స్థిరము గాకపోవుచున్నది. కావున జగత్తు ప్రతిబింబాత్మక మగుట, నాశ్రియరూపమగు చిదాత్మ వినాగాలేదని భావము. దర్పణమందిది యున్నదని చెప్పబడి భాసించు ప్రతిబింబమునకు, దర్పణమె స్వరూపమగు నటుల, చిదాత్మయందిది, యున్నదని చెప్పబడి భాసించునది యంతయు చితియె తనయందు ప్రతిబింబాత్మకముగ జగము భాసించుటకు, తనయైశ్వర్యమె. నిమిత్తముగా గలది కాన, ఆ చితియె మహేశ్వరి కావున చైత్యము చిదేకాత్మరూపమెకాని వేరొండు గాదు.

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశికయను నాంధ్రీకరణంబున, జగత్తత్వ
నిరూపణంబను ఏకాదశాధ్యాయము.

# ద్వాదశాధ్యాయము.

తే॥ గీ॥ భావనామాత్ర మీజగద్భ్రాంతియగుట
శిలను లోకంబు గల్పించి చిత్ర మొదవ
మునిసుతుండే లెనను గాథ వినుముతల్లి!
అత్రిసుతుఁడు బల్కె సరణి, నాదరించి॥

దత్తావధూతేంద్రుఁ డటుల జగత్తత్త్వమును వివరించి తెల్పిన, భార్గవుఁడు విని సందేహాకులుఁడగుచు తిరిగి యిటుల ప్రశ్నించెను "గురునాథ! భగవత్స్వరూపులరగు తమచే నుడువబడిన జగత్తత్త్వమంతయు వింటిని. తమరు చెప్పిన విధము యథార్థముగాక నొండెద్ది కాఁగలదు. కాని, యీ జగత్తు సదా సత్యముగా భాసించుచుండుటకు హేతువేమి? బుద్ధిశాలురగు ద్వైతవాదులు మున్నగువారలచే నిది సత్యముగ నెట్లునిశ్చయింపబడినది? తమరింత చెప్పినను, తిరిగి నాకు సత్యముగ నియ్యది భాసించుటకు కారణ మేమి? నాయందు దయయుంచి జగత్తునందలి, యీ సత్యత్వభ్రమ నశించునటుల జెప్పఁగోరెదను."

అంతట, దత్తాత్రేయులు జగత్సత్యత్వ భ్రాంతిమూలమును విశేషించి తెలుపుటకిట్లుపక్రమించెను. రామా! వినుము. జగత్సత్యత్వభ్రాంతికి మూలమనాది సిద్ధమైనది. వస్తువుయొక్క యథార్థజ్ఞానము లేక, అన్యరూపమున దానిని దృఢభావన జేయుటయె, యా భ్రాంతికి మూలము. అందుల కుదాహరణము వినుము. రక్తమాంసాస్థిపంజరమగు శరీరమెక్కడ? అతి నిర్మలమగు చిదాత్మ యేడ? అట్టియాత్మను దెలిసికొనక, శరీరమందలి నీకుగల ఆత్మబుద్ధిని పరికింపుము. కేవలభావనాదార్ఢ్యముచేత చిదాత్మ దేహ మగుచున్నది. అట్టి భావనాదార్ఢ్యముననె, యుపపత్తుల దేహ మాత్మ కాదని తెలిసికొనినను, తిరిగి తిరిగి భ్రాంతి గలుగుచున్నది. ఇవ్విధముగ భావనచే జగత్తు సత్యముగ భాసించుచున్నది. తద్విపరీతమగు దృఢభావనచే, నా భ్రాంతి తొలగగలదు. ఎవడెటుల భావనజేయునో, వానికటులనె జగము భాసించును ధ్యాన ధారణలచే భావనాపరిపాకముగల్గిన యోగులకు, తద్భావనామయరూపముగ జగము భాసించుచుండును. అందులకు మహాద్భుతమగు పూర్వగాథ నొండు దెల్పెద వినుము.

వంగదేశమున, పరమపావనమగు సుందరపురమను పట్టణ ముండెను. అందు పరమ ధార్మికుడును, విఖ్యాత

చారిత్రుడనగు సుషేణుడను రాజు, సర్వ సమ్మతముగ రాజ్యము బాలించుచుండెను. అతనికి సర్వవిధముల శిష్టుడగు మహాసేనుడను సోదరుడు గలడు. ఆరాజొకప్పుడశ్వమేధయాగ మొనరింప సమకట్టి, యజ్ఞాశ్వము వెంట, మహాబల పరాక్రమములుగల తనకుమారుల ససైన్యముగనంపెను. ఆరాజకుమారు, లడ్డగించినవారలనెల్ల జయించుచు నాయశ్వము వెంట నైరావతీ తీరము జేరిరి. అచ్చట తపోనిధియగు గణమహర్షిని గాంచిరి. బలదర్పితులగు నా రాజసుతులామహామహుని యెడన నాదరమున, తత్సమీపము జేరి, నమస్కరింపక నరుగుచుండిరి. అదికాంచి, యా మహర్షిపుత్రుడు కోపించి, వారల నదలించి, యజ్ఞీయాశ్వమును బట్టుకొనెను. అంత నా రాజపుత్రులు తన్ను ముట్టడించునంతలో, నాఋషిపుత్రు డెదుటనున్న గొప్ప శిలయందు, వారందరు జూచుచుండ, నశ్వముతోడ నంతర్ధానమయ్యెను. రాజపుత్రులంత కోపోద్దీపితులగుచు శస్త్రాస్త్రముల నాగండశైలమును జూర్ణ మొనరింప జొచ్చిరి. అంతలో, ఋషిపుత్రుడు, మహత్తరమగు సైన్యమున, నాగండశిల వెలువడి, యుద్ధమొనరించి, వారి సైన్యముల నెల్ల దునిమి, యా రాజపుత్రులను బందితుల జేసి, తిరిగి యా గండశిలయందు బ్రవేశించెను. యుద్ధమునందుని హతులుగాక, శేషించిన భటులు పురమున కేగి, రాజునకీవార్త నంతయు జెప్పిరి.

సుషేణుఁడతివిస్మితుఁడగుచు, సోదరునిబిలచి, 'నాయనా! ఆ గణమహర్షి యున్న స్థలమునకరుగుము. తపోధను, లచింత్య వీర్యులు. దేవతలకేని, యజేయులు. ఆ మహామహులని యనుగ్రహమును బడసి, యశ్వముతోసహా కుమారులను సత్వరముగ దోడ్కొనిరమ్ము. యజ్ఞ సమ్మతమగు వసంత కాల మరుదెంచినదె. అదియతిక్రమింప జనదు. తపోధనుల యెడ, నహంభావము వహించుటెన్నడును జనదు. వార లాగ్రహించిన, క్షణమున లోకముల భస్మమొనరింతురు. కాన, నామహర్షి ప్రసాదము బడసి కార్యము సాధింపు"మని యాదేశించెను.

మహాసేనుడంత శీఘ్రముగ నచ్చటికేగి, సమాధి నిష్ఠుడగు నా గణమహర్షిని గాంచెను. మనో బుద్ధీంద్రియము, లుపరతిజెంద, గాఢకుడ్యాకృతి నిశ్చలుడగుచు, నామహర్షి నిర్వికల్పసుధాంభోనిధి యందు విలీనుడై యుండెను. మహాసేనుడంత సాష్టాంగదండ ప్రణామము లాచరించి బద్ధాంజలుడగుచు, నామునీశ్వరుని వివిధ స్తోత్రముల నుతింపుచుండ, మూడుదినము లరిగెను. తండ్రినటుల స్తుతింప సంతసించి, యాఋషిపుత్రుడందరుదెంచి, మహాసేనుని జూచి 'రాజ! "నీ స్తుతికి సంతసింతిని, నీకోరిక దెల్పుము. శీఘ్రముగ దాని నొనరించెద. నేనీ ఋషిపుంగవుని పుత్రుడను. మాతండ్రిగా

రిపుడు, పలుకజాలరు. పండ్రెండు వత్సరములకొక్క పర్యాయము సమాధి జాలింతురు. ఇప్పటికైదు వత్సరములు మాత్రము గడచినవి. ఇక నేడేండ్లకుగాని, కనులుదెరువరు. పురాతనముగనిదియ వారిపద్ధతి కాన నీయభీష్టముదెల్పుము. నే నద్దాని నొసంగెద. నన్ను పనికిమాలినవానిగ దలచవద్దు. తపోరాశియగు నాతండ్రితో సమానమైనవానిగ నెరుగుము. యోగులకును, తపోధనులకును లోకమున నసాధ్యమెద్దియును లేదని'' చెప్పెను.

మహాసేనుడా మునికుమారుని పలుకులాలించి, నమస్కరించి, యంజలి ఘటించి, "మునిపుత్ర! నా యభీష్టమును నీవు సత్యముగ నెరవేర్చునెడల, నీతండ్రిగారి నిప్పుడు సమాధినుండి ప్రబోధింపుము వారితోడ భాషించుటయే, నేనత్యంత మభిలషించునది. నాయం దనుగ్రహ ముండిన, శీఘ్రముగ నాకార్యము నెరవేర్పు''మని యడిగెను. మునికుమారుడంత 'రాజా! నీకోరిక మిక్కిలి యసాధ్యమైనది. అయినను చేయుదునని చేయకుండు టెటుల. ముహూర్త కాలము వేచియుండుము. యోగసముద్భవమగు నా సామర్థ్యము జూడగలవు. నాతండ్రి పరమపావనమగు ప్రశాంత పదమున సమాహితుడై, యున్నవాడు. ఎట్టి బాహ్యాయత్నములను, వారికి ప్రబోధ గలుగజాలదు. సూక్ష్మమగు

యోగమార్గమున వారికి ప్రబోధగలిగించెద, చూడు"మని యుపదిష్టుడగుచు, నింద్రియమండలమెల్ల నాహరించి, ప్రాణ మందపానమును జేర్చి, ముఖ్యప్రాణయుతముగ దేహము నుండి వెలువడి, తండ్రి దేహముజొచ్చి, ప్రలీనమగు నాతని మనస్సును గదల్చి, సత్వరముగ వెల్వడి. తన దేహము జొచ్చెను. అంతనె, యా మునీశ్వరుడు, సమాధినుండి లేచి, యెదుట నంజలిఘటించి స్తుతించు మహాసేనునిగాంచి, 'ఇదియేమి,' యని, కొంచె మాలోచించి, యోగ దృష్టిచే, సర్వమెరింగి ప్రసన్నచిత్తుడగుచు, కుమారునిబిలచి యిట్లుల నియె. "వత్స! యిక నెన్నడిటుల జేయకుము. క్రోధము సర్వతప మును హరించును, లోకమున రాజరక్ష గలిగినగాని, తప ములు నిర్విఘ్నముగ వృద్ధినందజాలవు. యజ్ఞమునకు విఘ్న కర్తలు రాక్షసులు గాని, తాపసులుగారు. శీఘ్రముగ రాజపుత్రుల నశ్వముతోడ, నీతని వశమొనరింపుము. సత్వ రముగ నీతనినంపకుండిన, యజ్ఞమునకు ముఖ్య కాలాతిక్రమణ జరుగగలదు."

ఇట్లాదేశింపబడి, యాఋషిపుత్రుడు వెనువెంట, గండ శైలము బ్రవేశించి, క్షణకాలమున రాజకుమారుల నశ్వము తోడదెచ్చి మహాసేనున కప్పగించెను. అంత మహాసేనుడు వారల నగరమునకంపి, యంజలిఘటించి, యా మునిపుంగ

వుని జూచి "మహాత్మా! నాసోదరపుత్రి లక్ష్మీసహితముగ నీ గండశైల గర్భము నందెట్లుండిగో, తెలుపు"మని ప్రార్థించెను. అంత నామునిపుంగవు డాతనియం దనుగ్రహము గలిగి యిటుల జెప్పదొడగెను. "రాజ! పూర్వము నేనొక రాజుగనుండి, సముద్రముద్రిత భూవలయమెల్ల చిరకాలము పరిపాలించితిని. అంత మహాదేవప్రసాదమున, సర్వాధిష్ఠిత మగు చిదాత్మ నెరింగి. దృశ్యమంతయు నీరసమని, లోక యాత్ర ముగింపనెంచి, రాజ్యభారమెల్ల సుతులయందిడి, పరమ పతివ్రతయగు భార్య వెంటరా, నరణ్యమున కేగితిని. నేటి కర్బుద సంవత్సరములుగ. నిందు తప మొనరించు చున్నాను. నా సేనవలన. నా భార్యయు మోక్షసిద్ధి బడసెను

అంత నొకనాడు, విధిప్రేరితముగ నామె, సమాధి యందె కామార్త మానసురాలయ్యెను. రతి నభిలషించి నన్నుగాంచ నేను సమాహితుడనై, సమాధియందుంటిని. కాలవేగమును సహింపజాలకామె, మద్రతిని భావనజేసి, మత్సంభోగమును గాఢమైన భావనచే బొంది, గర్భమును ధరించి, యీపుత్రుని గాంచెను. ఇతనిని నా యొడియందిడి, నన్ను సమాధినుండి మేల్కొలిపి, తన దేహమును పంచభూత ములందు లయమొనరించి. తాను బహిర్భూతురాలయ్యెను.

పత్ని పరమపదమందుట గ్రహించి, యొడియందున్న పసి వానినిగాంచి దయాక్రాంత చిత్తుడవగుచు బెంచియుంటిని, ఇతడే, యా పసిబిడ్డడు. ఈతడొకప్పుడు, నేను భూమిని పాలించియుంటినని చెప్పవిని, రాజ్యశాసనకాముడై, నన్ను బ్రార్థించెను. అంత నాయుపదేశమున, నుత్తమ మగు యోగైశ్వర్యమును బొంది, తన్మహిమచే, నీమహాశిలయందు లోకమును భావనాయోగమున నిర్మించి, సముద్రముద్రిత భూవలయమెల్ల, నీత డనుదినము శాసించుచుండును. ఆ లోకమున రాజపుత్రులు, సాశ్వముగ నుంపబడి, యందుండి యిప్పుడు విడిచిపెట్టబడిరి.'' మునీశ్వరుని యా వాక్యములాలించి, మహాసేనుడు, ''మహాత్మా! అత్యాశ్చర్యకరమగు నీవృత్తాంతమెల్ల వింటిని. గండశైలమందలి లోకమును జూడ మిక్కిలి కుతూహలుడ నగుచున్నాను. కృపయుంచి చూపు''డని ప్రార్థించెను. అంత మహర్షియటుల నా లోకమంతయు జూపింపుమని, కుమారుని యాదేశించి, తిరిగి తాను సమాధి నిష్ఠుడయ్యెను.

ఋషిపుత్రుడంత మహాసేనుని దోడ్కొని, గండశైలము దరకేగి, తానందు ప్రవేశించి, యాతని గమ్మని పిలచెను. అతడు రాకుండుట చూచి, తిరిగి వెలుపలికివచ్చి, 'ఈలోకము, యోగముచేగాని, వేరువిధమున బ్రవేశింప

నసాధ్యమనియు, కావున స్థూల శరీరమచ్చటి తృణావృత మగు కోటరమందుంచి, మనోమాత్ర శరీరమున, తనను గూడి శైలము బ్రవేశింపు''మనియు నాతనికి జెప్పెను. మహాసేనుడు దేహమును విడువ నశక్తుడగుచు, శరీరమును వదలు టెట్టిది? బలాత్కారముగ విడచిన మరణింతునుగదా! యని మునిసుతునితో నన, నతడు నవ్వి, యోగ మెరుగనివాడు గాన, నట్లనుచున్నాడని తెలిసికొని కన్నులు మూయమని, యాతడట్లొనరింప, యోగసామర్థ్యమున, నిమిషమాత్రమున నాతని శరీరమందు జొచ్చి, తల్లింగశరీరము నాకర్షించి, స్థూలము నొకకోటరమందుంచి, శైలమును బ్రవేశించెను. మహాసేనుడు దేహవైకల్యమున, సుషుప్తి వహించియుండ. స్వసంకల్పననొక దేహము నిర్మించి, యద్దానితో, నాలింగ శరీరమును ఋషిపుత్రుడు జేర్ప, నాతడు తెలివినంది, ముని పుత్రుడు తననుబట్టుకొని మహాగగనమందు రయమునబోవుట గమనించెను. పైనను, ప్రక్కలను, క్రిందనుగూడ భయంకరమగు ననంతాకాశములేక వేరొండు లేకుండుట జూచి, భయమంది 'మునిపుత్ర! నన్ను కొంచెమైనను విడువజనదు. పట్టువిడచిన, నెక్కడబడి నాశమందుదునో, తెలియరాకున్న''దన, ముని సుతుడు నవ్వుచు, రాజా! భయపడ వలదు. నిన్ను విడువను. శైలాంతర్గతమగు నీ లోకమంతయు ధైర్యమున తిలకింపు''మని బదులుజెప్పెను. అప్పుడు

రాజు ధైర్యముబూని చూడనారంభించెను. దిగువ భాగమున, దూరముగ నంధతమోవృతమై, నక్షత్రముల గూడియున్న నభోమండలము గాంచెను. అందు బ్రవేశించి, దాని కడుగు భాగమున, చంద్రమండలము గాంచెను. అందు బ్రవేశింప, తన్మాండలమందలి శీతమున జడీకృతుడు గాకుండునటుల మునిపుత్రునిచే రక్షింపబడెను. అంత సూర్యలోకము జొచ్చి, యందలికిరణముల, సంతప్తుడయ్యెను. మునిపుత్రుడు తన యోగబలమున రక్షింప చల్లని దేహముగలవాడయ్యెను. స్వర్లోకమునకు ప్రతిబింబమువలెనున్న లోకమంతయు గాంచెను.

అనంతరము మేరునగర శిఖరమందు, మునిపుత్రునిగూడి, సంస్థితుడయ్యెను. అటనుండి సర్వ దేశమును జూచెను. దేశాంతరముల నాలోకింప, నా మునిసుతుని యనుగ్రహమున దివ్యదృష్టినిబొంది, లోకాలోక పర్వతమును, దానికవ్వల తమస్సందోహమును, తన్మధ్య సువర్ణభూమిని, సముద్రములను, నదులచే, పర్వతములచే నిండియున్న సప్తద్వీపములను, సమస్త భువనములను, నింద్రాది దేవతలను, దైత్యులను, మనుష్యులను. యక్ష కింపురుషాదులను గాంచెను. అంత సత్యలోకమును, వైకుంఠమును, కైలాస పర్వతమును గాంచెను. అందా మునిసుతుడె, బ్రహ్మ విష్ణు

శివాత్మకముగ నుండి, యీసర్వలోక సృష్టిస్థితి లయముల నిర్వర్తింపుచు, భూమిభాగమునందు సార్వభౌముడై, ప్రజానీకము తానె యనుశాసించుచు, నన్నిచోట్ల నన్నిరూపముల నాతడొక్కడె యుండుటగాంచి, యీమునికుమారుని యోగసామర్థ్యమున కచ్చెరువందుచుండెను. అంతలో, నా మునిసుతుడు, రాజా! యీ లోకజాలమంతయు బరికించుచున్న మనకిందు దినమాత్రము గడచినట్లున్నది. కాని ద్వాదశాబ్దుబ్ధ సంవత్సరము లతిక్రమించినవి. మా తండ్రిగారుండిన బాహ్యలోకమునకిక నరుగుదమని, మహాసేనుని దోడ్కొని గండశైలమునుండి వెల్వడి బాహ్యలోకమున కరుదెంచెను.

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశికయను నాంధ్రీకరణంబున, శైలోపాఖ్యాన
మను ద్వాదశాధ్యాయము.

---

# త్రయోదశాధ్యాయము.

తే॥ గీ॥ స్వప్నజాగర సామ్యంబుచక్క దెలిపి
మిథ్యయనుదాన శోకింప మేరలేదు
మౌఢ్యమున కంచు, నవధూత మహితగతిని
బల్కు సరణి నాలింపుమంబ! చెవియొగ్గి-

గండశైలము నుండి నిర్గమించుతరిని, మునిసుతు డమ్మహాసేనుని లింగదేహమును సుషుప్తినందించి, యట్లు మూర్ఛావస్థయందున్న దానిని, పూర్వము కోటరమందుంచిన యాతని జీర్ణభూతమగు స్థూల శరీరమందు బ్రవేశపెట్టి, ప్రబోధ కలిగించెను. మహాసేనుడంత లేచి, బాహ్యలోకమును వీక్షించి, యచ్చట నదులు, హ్రదములు, వృక్షములు, జనములు, సమస్త భూమియు, నూతనముగనుండుట కచ్చెరువునంది, మునిసుతుని జూచి, "మహాభాగ! ప్రస్తుతము నాకు ప్రదర్శింపబడుచున్న లోకమెయ్యది? పూర్వము జూచి నదిగ గన్పించుటలేదు. అపూర్వముగనున్న నిది యెట్టిదియో, చెప్పు"మనియెను. మునిసుతుడిటుల బదులు జెప్పెను. "రాజ! మనము పూర్వము సేవించిన లోకమె, యియ్యది. బహుకాలమగుట, నిటుల బరిణామమును గాంచి

నది, శైలలోకావలోకన తత్పరులమగు మనకు అచ్చట గడచిన యొక్కదినమున కీలోకమునందు, ద్వాదశార్బుద వత్సరములు గడచియుండెను. ఆకారణమున నిది రూపాంతరము జెందియున్నది. కాలము ననుసరించి, జనుల స్థితి యంతయు మార్పుజెందినది. భాషా వ్యవహారాదు లన్నియు మార్పు గాంచినవి. ఇట్లు జగత్తుయొక్క స్థితి భేదించు చుండుట, నేననేక పర్యాయములు చూచితిని. అదుగో! సమాధియందున్న నా తండ్రిగారుచుము. ఆ మహానుభావుని పూర్వము నీవుస్తుతించిన ప్రదేశమిద్యాదియె అది యె, మనము లోకాంతరముల గాంచిన గండశైలము. నీ యన్న గారి వంశమునం దనేకవేల తరములు గడచి పోయినవి. పూర్వము సుందరపురముండిన వంగదేశము, నేడు క్రూర మృగానేక సంకులమగు ఘోరారణ్యముగనున్నది. నీయన్న గారి వంశీయుడొకడు, వీరబాహుడనువాడు, నేడు క్షిప్రా నదీ తీరమున, మాళవదేశము నేలుచు విశాలనగరమందున్నాడు. మరియొకడు సుశర్మ యనువాడు, తామ్రపర్ణీ తీరమున, ద్రవిడదేశమును బాలించుచు వర్ధనా పురమున నుండియున్నాడు. ఈలోకస్థితి యిటుల, సర్వకాలమును మారుచుండును. స్వల్పకాలముననె, యీజగము నూతన స్థితిని బొందుచుండును. బహుకాల మతిక్రమించిన, నదనదీ పర్వతములన్నియు, కేవలము మరియొక రూపము ధరించు

చు డును జగద్గతి, యిట్టిది పర్వతములు పల్లము లగును. పల్లములు పర్వతము లగును. మరుభూములు, బహుళోదక భూయిష్ఠములగును. మిక్కిలి కఠినమగు రాతి ప్రదేశ మత్యంత కోమల ప్రాయమగును. కోమలభూములు, పాషాణసదృశములగును. ఊషరక్షేత్రములు, సస్య సమృద్ధి గాంచును. సుక్షేత్రము లూషరములగును రత్నములు, గండ్రయిసుక లగును గండ్రయిసుక రత్న రూపముల దాల్చును క్షారజలము మధురముగ మారును. మధుర జలము క్షారత వహించును. ఒక దేశ మొకప్పుడు బహుజన సంకులమగును మరియొకప్పు డరణ్యాదియై, బహుమృగాకీర్ణ మగును. మరియు నింకొకప్పుడు సరీసృపాది కీటక పరివృత ముగ, మారు చుండును. కాలభేదమున జగము, వివిధ పరి ణామముల గాంచుచుండును. కావున పూర్వ మట్లుండిన యీలోక, మీవిధమైనది.''

మునిసుతుని యీ వాక్యము లాలించి, మహాసేను డత్యంత శోకావిష్టుడగుచు, మూర్ఛను జెందెను. ముని పుత్రుడు చేపదీర్ప నెటులనో, తెలివిగాంచి, తన దారా పుత్ర బంధుసంతతుల దలచి బహుదీనముగ విలపింప దొడ గెను. ఇటుల భ్రాత్రాదులయెడ, మోహితుడగుచు శోకించునతనికి, బోధనొనరించు తలపున, మునిపుత్రు డిట్ల

డిగెను. "రాజ! నీవు బుద్ధిశాలివగుట నిశ్చయము. ఎందు లకు దుఃఖించుచుంటివి? ఫలరహితమగు కర్మ నొకప్పుడేని, జేయుకుండుట బుద్ధిశాలుర లక్షణము. ఫలము సు విసర్జింపక కర్మనొనరించువాడు బాలిశుడు. ఎవరినిగూర్చి దుఃఖించు చుంటివో, యెందులకుదుఃఖించుచుంటివో, నిజము జెప్పుము." ఇట్లడుగ మహాసేను డతిదుఃఖమున, "మునిపుత్ర! నా దుఃఖ మునకు కారణమె, నీకగుపడకుండెనా! సర్వస్వము నాశన మైన తరి, కారణమేదియని చెప్పెదును. లోకమునందా ప్తు డొక్కడు మృతిజెందినను, దుఃఖము సహజమగుచుండ, సర్వ నాశమునందిన నన్ను ప్రశ్నించుచుంటి"వని మారుబల్కెను.

మునిపుత్రుడంత మందహాసమొనరించుచు నిట్లనియెను. "రాజ! స్వజనము నశింప, దుఃఖింపవలసియుండుట, సనాతన మగు మీ కులధర్మమా, యేమి? అటుల దుఃఖింపకున్న, మహత్తరమగు ప్రత్యవాయము సంభవించు గాబోలు! లేక, శోకముచే, నష్టమైనది తిరిగి ప్రాప్తమగుచుండునా? శోక ముచే, నేమి ఫలము గలుగగలదో, ధైర్యమున విమర్శిం పుము. శోకించినవార, లేమి ఫలమునుగాంచిరో విమర్శింపుము. ఫలము లేకున్నను, బంధు మరణమున శోకింపవలయునని యుందువేని, పితామహ, ప్రపితామహాదు లెందరో బంధు వులు పూర్వము మరణించి యుండిరికదా! వారిని గూర్చి,

సర్వదా శోకింపవలసియే యుండునే! అటుల శోకింపకుండు టకు కారణమేమి? భ్రాత్రాదు లెవరికి బంధువులు? నీకు వారి బంధుత్వమెట్టిది? ఏకగర్భసాహసులచే, నాకు భ్రాత్రా ది బంధుత్వము గలదని, యందువేని వినుము. మాతా పిత్రాదులయొక్కగాని, స్వకీయముగ గాని. స్వదేహ సము ద్భవములు గాని, దేహసంబంధము గలవిగాని, యసంఖ్యాక ములైన పురీషకృమ్యాదులు గలవు. ఇవి యున్నియు బంధువు లేల గాకున్నవి? వాటినిగూర్చి శోకింపకుండు టెట్టిది? రాజ! నీ వెవరవో, యెవరినిగూర్చి దుఃఖించు చుంటివో విమర్శిం పుము. నీవు దేహమా? లేక తద్భిన్నుడ వగుదువా? దేహము సంఘాతరూపము. సంఘాతరూప దేహమగు నేను, నష్ట మైన దేహాత్మ ఘాతుల గు బంధువులగూర్చి దుఃఖించు చుంటి నందువేని, బంధువులయొక్క సంఘాత సమగ్రినాశమా, లేక సంఘాతైక దేహనాశమా, నీ దుఃఖకారణ మని యడుగ వలసి యుండును. సంఘాతైక దేశనాశమె, దుఃఖకారణమైన, మూత్ర పురీష, శ్లేష్మ, నఖకేశాది రూపమున నట్టినాశమను క్షణము జరుగుచున్నదైనను పాటింపబడుట లేదే! సంఘాత సమగ్రినాశమె, నాశమగునెడల, నీ భ్రాత్రాదుల దేహాదు లందలి, పృథివ్యాదంశలు పృథివ్యాదులయందుండియే యున్నవి. వాటికి నాశమెచ్చటిది! దేహసంబంధమగు పృథివ్యాద్యంశము నాశమయ్యెను గదా, యన, పృథివ్యాదంశముల నాశమంగీ

కరించినను, తత్పర్యవసానమగు శుద్ధమగు నాకాశమునకు నాశము లేదుగాన, నది యుండియెయున్నది. కాన సంఘాత సమగ్రినాశము లేకుండుటచే, శోకకారణము లేదు.

దేహము నీవుకాదు. నావస్త్రమని నీవు చెప్పునపుడు, వస్త్రము నీవగుదువా? నా దేహమని నీవు చెప్పుచుందువే! ఆ దేహము నీ వెట్లగుదువు? నీవు దేహివి. దేహము కంటె నీవు భిన్నుడవగుచుండ, నితర దేహములతోడ నీకు సంబంధ మేమి? నీ భార్యాత్రాదుల వస్త్రములతోడ నీకు సంబంధ లేశ మైనను గలదా? ఆ వస్త్రాదులు నాశమైన నీవు శోకింతువా? తత్తుల్యములగు వారి దేహములు నశింప నీకు శోకకారణ మేమి? 'నాశరీరము', 'నాప్రాణము', 'నామనస్స'ని, యను చుందువు గదా! నీ స్వరూపమెట్టిదో, నే నడుగుచుంటిని చెప్పుము."

మహాసేను డిట్లడుగబడి, ముహూర్తము విచారించి, మునిసుతుని ప్రశ్నకు సమాధానమీయ నశక్తుడగుచు, మిక్కిలి దీనముగ, 'మహాత్మా! నాస్వరూప మెద్దియో, యెంతవిచారించినను, దెలియజాల కున్నాను. స్వాభావిక ముగ, దుఃఖించుచుంటినె కాని, యందలి కారణమెరుంగను. ప్రపన్నుడను. దీనుడను. నాకది యెట్టిదియో, తెల్పుము.

ఎవరో యొక బంధువు మరణించిన, నందరును దుఃఖించు చున్నారు. అన్యుడనైన దుఃఖింపరు. తమ స్వరూపమును గుర్తెరుగరు. శిష్యుడనైన, నాకీ నిమిత్తమంతయు దెలుప వేడెద''నని ప్రార్థించెను.

మునిసుతుడంత బ్రిసన్నుడగుచు, ''రాజ! వినుము. మాయామహాదేవిచేత సర్వజనులును మోహితులగుచు, స్వస్వరూపముల నెరుంగక, వ్యర్థముగ నెల్లప్పుడు దుఃఖించు చుందురు. ఆత్మతత్వము నెరుగనంతదనుక, నిటుల దుఃఖించుచునె యుందురు. ఎరిగిన, శోకమెన్నటికిని బొందజాలరు. నిద్రామోహితుడగుచు, స్వప్నమందు నరుడు తనను మరచి దుఃఖించుచున్నాడు. ఇంద్రజాలికుడు, మంత్రములచే మాయనుగ్రమ్మ, మానవుడు మోహితుడగుచు, తత్కల్పిత సర్పాదులవలన భయభ్రాంతులను జెందుచున్నాడు. అటువలె మానవులు మహామాయా విమోహితులై, తమ స్వస్వరూపముల నెరుగజాలక శోకవశంగతు లగుచున్నారు. స్వప్నము నుండి లేచినవాడు, ఐంద్రజాలికాగమము నెరింగిన వాడును, తత్తద్దుఃఖాదుల నందుటలేదు. తద్వశంగతులగువారల జూచి నవ్వుచుండును. అటువలె మాయను తరించిన ఆత్మవిదు, లెందును శోకమునందక, మాయావిమూఢులగుచు శోకించు నీవంటివారలగాంచి, నవ్వుచుందురు. ఆత్మ

తత్వమును, యథార్థముగ గుర్తెరిగి, దుర్గమమగు మాయను తరించి, సద్వివమ్నచే, మోహజనితమగు నీశోకము విడుము'' అని నుడివెను.

మహాసేనుడు తిరిగి "మహాత్మా! మీరు చెప్పిన దృష్టాంతము, వైషమ్యమును పపాదించుచున్నది. స్వప్నము గాని, ఇంద్రజాలమని మాయకాని, యటుల భాసింప జేయునవి, యసద్రూపములు. ఈ జాగ్రత్ప్రపంచము సర్వార్థ సాధకముగను, అబాధితముగను, స్థిరముగను, సర్వానుభవ సిద్ధముగుటచే, సత్యమగుచుండ, స్వప్నసమ మెట్లు గాగలదు'' అనియడిగెను.

అంత మహాబుద్ధిశాలి యగు నా ఋషిపుత్రు డిటుల, బదులుజెప్పెను. "రాజ! నేజెప్పిన స్వప్నదృష్టాంతము విషమమైనదనుట రెండవభ్రమ. దృశ్యము ద్రష్టకంటెభిన్నము, సత్యము ననునది సర్వసాధారణమగు మొదటిభ్రమ. దృశ్యమందు స్వప్నాదుల సత్యమనునది రెండవభ్రమ. ఇది, స్వప్నావస్థయందు స్వప్నపురుషుడు రజ్జువునందు సర్పభ్రమ జెందుట వంటిది. స్వప్నమందలి వృక్షములు, తత్కాలమునందు హితమును సాధించుటలేదా? నీడనొసగి, పాంథులకు తాపమును హరించుటలేదా? ఫలాదులచే, స్వప్న పురుషులను

సంతోష పెట్టుటలేదా! జాగ్రద్వృక్షము, జాగ్రతయం
దెటుల, నర్థసాధకము, నబాధితము, స్థిరము నగుచున్నదో,
యటువలె స్వాప్న వృక్షము స్వప్నమందు, అర్థకారి, యబా
ధితము, స్థిరము నగుచున్నది. స్వాప్న వృక్షాదిక మంతయు
జాగ్రద్దశయందు భాసింపకుండుటచే, బాధితముగుటలేదా,
యన జాగ్రత్ప్రపంచమంతయు సుషుప్తియందు భాసింపక,
బాధితమగుచుండెనుగదా! సుషుప్తియందు భాసింపకున్నను,
పరదినమందు, ఆ జాగ్రత్ప్రపంచముయొక్క అనువృత్తి
యుండుటచే, బాధితముగాదనిన వినుము. స్వాప్నానువృత్తి
కూడ పరదినమందుండియే యున్నది కాన, నయ్యదియు బాధి
తము గావలెను. స్వప్నమునందట్టి యనువృత్తి, యనుభ
వింపబడుట లేదనిన, జాగ్రతయందుగూడ ననుభవింపబడుట
లేదనియె, చెప్పవలసివచ్చును. జాగ్రతయందు ప్రతిక్షణము
వస్తువు నూతనత్వముజెంది భాసించుచుండుట, ననువృత్తి
యెటుల సంభవించును? జాగ్రతయందు ప్రతిక్షణము
నూతనభావముగాంచు క్రియాది క్షణికభావములకు ననువృత్తి
లేకుండినను, తదితరములగు పృథ్వీగిరి సముద్రాదుల యను
వృత్తి నిశ్చయమె కదా! అనిన, దీర్ఘస్వప్నమందు పుత్ర
కళత్రాదుల యనువృత్తి యనుభవసిద్ధమే, కనుక జాగ్రత్తుల్య
మేయగుచున్నది. స్వప్నమందలి భార్యాపుత్రాదు లసత్యము
గనుక తదనువృత్తి భాసనము భ్రమరూపమనిన, జాగ్రద్భా

నములు గూడ మృషాత్మకములై కాన నందలి యనువృత్తి భాసనముగూడ భ్రిమరూపమె, యగును. జాగ్రితయందలి, దేహవృక్ష నదీద్వీపాది సర్వవస్తువులును క్షణవిభేదితములు. వాటియనువృత్తి స్థిరమగున దెట్లుగాగలదు? అనారతము నిర్ఘరాదులచే, భేదింపబడు చుండు పర్వతాదులకు సయితము పూర్వక్షణము నందలి రూప ముత్తర క్షణముందుండదు. క్రిమి, మూషక, సూకర, నిర్ఘరాదులచే పర్వతములు సర్వకాలమును భేదింపబడుచుండును. పర్వతములు, సముద్రిములు, భూభాగము లన్నియు, ననుక్షణ విభేదితములు. కాన వాటి యనువృత్తిగూడ భ్రిమరూపమె యగును.

నీకింకను దెల్పెద. ఈ విషయము సూక్ష్మముగ నాలోచింపుము. పైన జెప్పబడిన విధమున, పరిచ్ఛిన్నానువృత్తి స్వప్నజాగరములందు సమముగనె. కలదు కార్యరూపములు, వస్తుతః కాలపరిచ్ఛిన్నములగుట, నందపరిచ్ఛిన్నాను వృత్తి యసంభవము. జాగ్రిద్భానమెల్ల కార్యరూపముగాన, నందపరిచ్ఛిన్నానువృత్తి యసంభవము. కార్యము, కారణ వ్యావృత్తి రూపమెకాన, కారణ రూపమున, ననువృత్తి యుండవచ్చును. కావున జాగ్రిద్భాన కార్యమునకు కారణము పృథివ్యాదికమగుట, వాటి యనువృత్తి యుండుననిన, స్వప్నమందు గూడ పృథివ్యాదులు

భాసించుట, నచ్చుటగూడ తదనువృత్తి యుండియే యున్న దని, చెప్పవలసివచ్చును.

స్వప్నము, జాగ్రితయందు బాధితమగుట అనుభవ సిద్ధము. జాగరము బాధింపబడుట మనమెందును జూడ మనిన వినుము. బాధితమగుటన భాసింపకుండుటని యర్థము. సుషుప్తియందు సర్వజగము భాసింపకుండుట సర్వానుభవమె కదా! బాధయనగ ప్రిమాణబుద్ధిలేకుండుట. అనగ, ప్రబుద్ధుడైన వానికి, స్వప్నమునం, దిది ప్రిమాణము కాద'నెడి జ్ఞానమె, దానికి బాధయని యర్థము. జాగ్రితయం దట్టి యప్రిమాణత్వబుద్ధి, నీవంటి భాింతుల కుండదు గాని, యాత్మవిదులకు జాగ్రితయందప్రిమాణత్వ బుద్ధి ప్రిస్ఫుటము. కావున, నీ దృశ్యజాలమంతయు. స్వాప్న దృశ్యజాలతుల్యమె కాని, వేరుకాదు. జాగ్రిత దీర్ఘకాలము భాసించును, స్వప్నమటులగాదనిన, జాగ్రితయందువలె స్వప్నకార్యము నిర్విశేషముగ ముగియునంతదనుక, తత్కాలము భాసించుటచే, స్వప్నమునకు దగిన దీర్ఘకాల, మందుగూడ భాసించును. కావున, నబాధితమును, నర్థక్రియాకారియును, స్థిరమునునగు స్వప్నభావ మన్నివిధముల జాగ్రిద్భావతుల్యమె. యగును, జాగ్రితయందు స్వప్నానుసంధానము గలదు. స్వప్నమందు, స్వప్నలక్షణగ్రిహణమె కాని, జాగరానుసం

భావము లేదనిన, నట్లుగాదు. స్వప్నమందు నిఖిల జాగ్రదనుసంధానము లేదనిన, జాగ్రితయందును, నఖిల స్వప్నానుసంధానము లేదనవలయును. అనుసంధానమున స్మృతి. జాగ్రితయందు స్వప్నానుసంధానము వలె, స్వప్నమందు జాగరానుసంధానముండియే యున్నది.

ఇట్లుండ రాజ! స్వప్న జాగ్రితలయందు తారతమ్యమేమికలదు. తారతమ్యము లేనపుడు, స్వప్నమందలి బంధువుల గూర్చి యేలశోకింపవు. స్వప్నజాగ్రితల కిటుల సామ్యము ఘటించుచుండ, నెల్లగకును జగము సత్యముగ భాసించుటకు కారణమేమియన వినుము. జగము సత్యమని, తద్విపరీత భావనా రహితముగ, ననుసంధించుటయె, జగత్సత్యత్వమునకు నిమిత్తము. అటుగాక జగము శూన్యమని భావించిన, సత్యముగ భాసించు నీజగత్తు శూన్య భావమునుజెంది, యాకాశమునవలె నప్రతిరోధము గాగలదు. శూన్యముగా భావించినంత మాత్రమున, నటుల శూన్యమగుట లేదన, నది సిద్ధభావన గాకపోవుటచే, నటుల భాసించుట లేదు.

భావనాసిద్ధి యెట్టిదో తెల్పెదవినుము. 'ఇది, యిట్టిది అను ప్రత్యయ ప్రవాహము భావన. దాని స్థిరత్వమె సిద్ధి.

'ఇది యిట్టిది కాద'ను నపరిమాణత్వ బుద్ధిచే నంతరితమగుచు భావన స్థిరత్వము గాంచకుండును. అట్టి యపరిమాణత్వమున నస్పష్టపరుపబడక, నవిచ్ఛిన్నమై 'ఇది యిట్టిది' అనుభావన స్థిరత్వమును గాంచును. అటుల స్థిరత్వము గాంచిన భావనయే, సిద్ధభావన యనబడును. తద్విధమగు, తదాత్మ రూపభావనచేత, నాభావనయె, భావిత వస్తురూపము దాల్చును. నీచే గండశిలయందు జూడబడిన జగమిందు లకు నిదర్శనము. "ఈశైలముచుట్టు తిరిగి చూతము రమ్ము" అని మహాసేనుని చేయిబట్టుకొని గండశైల మాతనిగూడి చుట్టుదిరిగి, స్వస్థానమున కేతెంచి, మేధావియగు నా ముని సుతుడు తిరిగి యిట్లనియెను

"రాజ! యీ శైలము పాదగవ్యూతిమాత్రి మగుట జూచితివిగదా! దీని గర్భమందట్టి విస్తృతమగు లోకమును గాంచియుంటివి. ఈశైలమందట్టి జగత్తు భాసించుట. జాగ్ర తయో, స్వప్నమో, సత్యమో మిథ్యయో, వివేచింపుము. అటువలె శైలలోకమందలి, యొక్కదినమిచ్చట, ద్వాదశా ర్బుద వత్సరములు. బాహ్యమున పాదగవ్యూతి మాత్రి దేశము, ద్వాదశార్బుద వత్సరప్రాయమగు కాలము. అంత రమున ననంత దేశము, ఏకదివసమాత్రి కాలము. ఇటుల పరస్పర విరుద్ధ స్వరూపములమధ్య సత్యాసత్యముల వివేచిం

పుము. రెండు స్వప్నములలో నేది సత్య, మేది యసత్య మని వివేచించు టెట్టిదియో, యీ వివేచనగూడ నట్టిదియ కాగలదు. కావున నీజగము భావనయె సారముగ, గలదిగ నెరుంగుము. నాచే భావింపబడక యీ శైల జగత్తు క్షణ కాలమున లయమునందును కాన జగత్తును స్వప్న సమముగ నెరిగి, శోకమునుబరిత్యజింపుము. శోకమును విడుచు టెట్టిదనిన వినుము. స్వాప్న భావములు చిత్రి సదృశములు. భాసమానమగు చిత్రాదిక మసత్యమె యనుట నిర్వివాదము. అట్టి స్వాప్నచిత్రములకు భిత్తిభూతమగు సంవిదాత్మయగు స్వాత్మరూపమును, దర్పణతుల్యముగ నూహించి, స్వప్న మందలి బంధునాశ రాజ్యలాభములందు, శోకసంతోషములు జెందకుండునటుల, స్వప్నజాగరముల కత్యంత సామ్యముం డుట, జాగ్రిద్భావములు గూడ, స్వప్నభావముల వలె, చిదాత్మ దర్పణ ప్రతిబింబరూపములని, నిశ్చయించి, స్వాప్న శోకాదులచే స్పృశింపబడనటుల, జాగ్రిత్శోకాదులచేగూడ స్పృశింపబడకుండుము. అటుల శోకాది సమస్త వాసనలు వెడలనడువ, లోనున్న నుదకమంతయు నొలికిపోవ, ఘటమం దాకాశము సువ్యక్తమగునటుల, స్వాంతమునం దభివ్యక్త మగు నాత్మానందము గలవాడవగుము.

ఇది త్రిపురారహస్య జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశిక యను నాంధ్రీకరణమున, శైలలోక
దర్శనంబను త్రయోదశాధ్యాయము.

—

# చతుర్దశాధ్యాయము.

తే॥ గీ॥ జగము సద్భావనామాత్ర సారమనుచు
తత్వసంచయాంచిత సముద్భవవిధంబు
నెరుక, దత్తావధూతేంద్రుడిందుజేసె
దాని వినిపింతు, వినుమంబ! దయజెలంగి-

జగత్తు భావనా మాత్రమె యని సోపపత్తికముగ బల్కు మునిసుతుని వాక్యము లాలించి, మహాసేనుడు స్వబుద్ధిచే విచారించి, జగత్స్థితిని స్వప్నసమముగ గ్రహించి, శోకమును త్యజించి, ధైర్యమవలంబించి, తిరిగి యిట్లు ప్రశ్నించెను. 'మునిపుత్ర! నీవు మహాబుద్ధిశాలివి. పరావరజ్ఞుడవు. నీకు విదితముగానిది లేశమైనను లేదు. నాయందు దయగల్గి, నా సందేహములనెల్ల దీర్పుము. ఈ సర్వజగము భావనామాత్రప్రభవమని చెప్పుచుంటివి. ఇది నేనెంతగ భావించినను, అటుల బాహ్యమున నగుటలేదు. అందులకు కారణమేమి? భావనాసిద్ధివలన నీచే, శైలమున లోకము గల్పింపబడినది. మరియు నొకేకాలమందు దేశకాలములు ద్వివిధముగ నెట్లుండును? అందు నెయ్యదిసత్యము? ఏదియసత్యము? ఇదియంతయు నాకు జెప్ప వేడెదను."

ఇటులనఁగ. మునిసుతుఁడిట్లు సమాధానము జెప్పుట కుపక్రమించెను. "భావన యనఁగ సంకల్పమె. 'ఇది యిట్టి' దను మానసోల్లేఖనమె సంకల్పము. సిద్ధభావన, అసిద్ధభావన యని భావన రెండువిధములు. వికల్పముచే నసంభేదమగు సంకల్పము సిద్ధభావనయగును. 'ఇది యిట్టి' దను సంకల్ప ధారామధ్యయందు, 'ఇది యిట్టిదికా' దను, విరుద్ధ కల్పన, నితరాం లేకుండుటయె. భావనకు సిద్ధియగును. సంకల్ప విషయమాత్రమునందె మనస్సుండిన, తద్విషయము నుండి, చలనరహితమగుటచే, సంకల్పము వికల్పరహితముగ నుండి పోవును. బాహ్యసృష్టి సత్యమని గ్రహించి, స్వమానస సృష్టి యసత్యమని వికల్పముండువరకును, భావనాసిద్ధి కలుగ జాలదు. చతుర్ముఖుని యొక్క భావనచే, నీజగత్తంతయు బుట్టినది అది యందరిచేతను అనేక జన్మాభ్యాస దార్ఢ్య రూపమున సత్యముగ భావింపబడుటచే, సర్వసాధారణముగ సత్యముగ భాసించుచున్నది బ్రహ్మసృష్టియందువలె, నీ సంకల్పజన్యమగు దానియందెవరికిని సత్యత్వభావన యుండ జాలదు, కారణమేమన; ఇది సత్యమగునా! కాదని నీ సంకల్పమునందు, నీకే వికల్పోదయ మగుచుండుటచే, నీ భావన యసిద్ధమైనది.

లోకమునందు భావనాసిద్ధి, బహువిధముల గలుగు

చున్నది. బ్రహ్మకు జన్మవలనను, యక్షరాక్షసులకు మణి వలనను, దేవతల కమృతముచేతను, యోగులకు యోగము వలనను, తాపసులకు తపస్సువలనను, మాంత్రికులకు మంత్రము వలనను, విశ్వకర్మ ప్రభృతులకు వరము చేతను, భావనాసిద్ధి కలుగుచున్నది. 'నాచే నిటుల సంకల్పింప బడు చున్నది,' అని సంకల్పారంభమున దోచును. ఇది సంకల్ప మునకు బూర్వావస్థ. దీనిని విస్మరించిన, సంకల్పము స్థిర ముగా గలదు. ఇటుల పూర్వమును విస్మరింప సంకల్ప మెటుల స్థిరముగా గలదో, యటుల సంకల్పించుట కర్త వ్యము. ఎంతగ పూర్వము విస్మరింపబడునో, యంతగ సంక ల్పము స్థిరము గాగలదు. పూర్వమును స్మరింపక సంకల్ప మునే, యనువర్తింపవలెను. చిరకాలమిట్టి యభ్యాసమున, భావన స్థిరముగా గలదు. అటువలె, విరుద్ధ వికల్పములచే ననుంభిన్నమైనయెడల, భావన సుస్థిరము గాగలదు. అప్పుడు మానవుడు మహాఫలమును సాధింపగలడు. భావనాసిద్ధికి బ్రయత్నించు వాడెవడును, విరుద్ధవికల్పములను కోరి తెచ్చు కొనడు. కాని యవి, యనిచ్ఛయా వచ్చుచుండును. అని చ్ఛయా వికల్ప సంభేద మెప్పుడుండదో, అప్పుడు భావనాసిద్ధి కలుగును అట్టి సిద్ధభావన బ్రహ్మాండాది మహాఫలమును సాధించును. వికల్పసంభేదముగల్గి యుండుటచే, నీ భావన సిద్ధభావన కాదు. కాన, నీకు సృష్టినొనరింప నిచ్ఛగలదేని,

శీఘ్రముగ భావనా సిద్ధిని సాధింపుము.

లోకముయొక్క వ్యవహారమందు, నీకు పరిజ్ఞానము లేకుంకుట, దేశకాల ద్వైవిధ్యము చిత్రముగ భాసించు చున్నది. అట్లు వివిధముగ భాసించుట, జగద్భావము యొక్కస్వభావము. ఒక్కటియేయగు సూర్యప్రకాశము ద్వివిధముగ నున్నది దివాంధములగు నులూకాదుల కంధ కారముగను, తదితరములకు ప్రకాశముగను భాసించు చున్నది మనుష్యులకును, పశువులకును, జలము శ్వాస నిరోధము గలిగించుచున్నది. మత్స్యాదులకు జలముచేత బహిశ్శ్వాస ప్రతిరోధము లేదు. అగ్ని, మర్త్యాదులను దహిం చుచున్నది దానిని తిత్తిరిపక్షి భక్షించుచున్నది. జలమున, నగ్ని చల్లారుచున్నది. సముద్ర మధ్యమున, బడబానల రూపమున జ్వలించుచున్నది. ఇట్లు జాగ్రద్భావములన్నియు ద్వైరూప్యము నందియున్నవి. భూమ్యాదులు మనుష్యాదు లకు ప్రతిరోధకములు. ఇంద్రియరహితములగు, పిశాచాదుల కప్రతిరోధకములు. ఇట్లు సేంద్రియ నిరింద్రియ భావములు, విరుద్ధ ద్విస్వభావములు గలవి, యసంఖ్యాకములుగ నున్నవి. ఏకవస్తువున కిటుల విరుద్ధోభయ రూపకత్వ మెట్లు గలుగు ననిన, సోపపత్తికముగ దెల్పెద వినుము.

ఈభావములన్నియు చాక్షుసములు. చక్షురింద్రియ వికారమాత్రములు. చక్షురింద్రియాంశముకంటె బాహ్యముగ దృశ్యమెద్దియు లేదు. పిత్తదోషము వ్యాపించిన నేత్రములు గలవానికి, బాహ్యము పచ్చగ గన్పించును తైమిరిక జాడ్యముగల నేత్రములకు నొకవస్తువు రెండుగ గాన్పించును అటువలె దృష్టిదోష వైచిత్ర్యమున, జగము వివిధముగ గాన్పించును. పూర్వసముద్ర మధ్యమున కారండక ద్వీపము గలదు. అచ్చటి జనుల, కెల్లవస్తువులు నెర్రగ గాన్పించును. రమణక ద్వీపమందుజనులు, సర్వభావముల వ్యత్యస్తముగ, తలక్రిందుగ జూతురు. ఇతరద్వీపములందిటులనే, వివిధముగ భావగ్రహణ చేయుచుందురు. నేత్రస్వభావముననె, సర్వదా చూచుచుందురు. అది నేత్రదోషము గాదు. నేత్రస్వరూపమె యగును. ఆయాద్వీపములందాయాజనులు, తత్తద్విధముగ నెర్రగను, వ్యత్యస్తముగను జూడకుండిన నేత్రములకు దోషమాపాదించినదని, పూర్వమువలె నెర్రగను వ్యత్యస్తముగను జూచునంతదనుక, నౌషధ సేవజేయుదురు. పిత్తప్రదుష్టనేత్రములచే జూడబడు పీతవర్ణము, తన్నేత్రాంశమగునటుల పురుషునియొక్క చక్షురింద్రియముచే, జూడబడినదంతయు, చాక్షుషాంశమె యగును. అటువలె ఘ్రాణేంద్రియాదులచే గ్రహింపబడు గంధాదులన్నియు, తత్తదింద్రియాంశములె యగును. అటు

వలె మనస్సుచే గ్రహింపబడునది, మనోంశమె. అనగ మానసమె యగుచున్నది. పూర్వపశ్చిమాది వ్యవస్థాత్మక దేశక్రమము, క్రియలయొక్క పూర్వాపరవ్యవస్థాత్మక ఘటికాది కాలక్రమము, నేత్రస్వభావజన్యముగాని, తద్భిన్నమగు బహిఃపదార్థమేమియు లేదు. ఏయేకాలమందు, దేశముగాని, కాలముగాని, గొప్పగగాని, స్వల్పముగగాని, యెట్లెట్లు భాసించుచున్నదో, యదియంతయు, తత్తత్కాల విభిన్నమగు చాక్షుషాంశమె కాని, వేరుగాదు. కావుననొకే దేశమునకుగాని, కాలమునకుగాని, విరుద్ధోభయరూప దోషములేదని తెలియుము.

వినుము చిత్తరువునకు భిత్తివలె, లోకమున బహిఃపదార్థమని చెప్పబడునది, జగచ్చిత్రమున కాశ్రయమును, కారణము నగుట, సర్వజగదాది యగుచున్నది. బాహ్యమనునపుడు, దేనికంటె బాహ్యమను ప్రశ్నరాగలదు. కాన బహిఃపదార్థముయొక్క అపాదానమును (దేనికంటె బాహ్యమని) నిర్ణయింపవలసియుండును. ఘటాదులకు బాహ్యమనునపుడు, తద్బాహ్యమునకు ఘటాదిశరీరమపాదానము గావలసియుండును. కాని యట్టి శరీరమె బాహ్యముగ భాసించునపుడు దానికపాదానత్వమెట్లు సిద్ధింపగలదు? పర్వతముకంటె బాహ్యమని చెప్పునపుడు, బాహ్యము పర్వతము

గాజాలదుకదా! ఘటము భాసించునట్లు, తద్విధముగ ఘట శరీరము బాహ్యముగ భాసించుచున్నది. కావున శరీరము బాహ్యామె యగుచున్నది. ఈ బాహ్యమునకు శరీరాంతర్భూత భాసకరూపమగు ఆత్మ అపాదానమని యోచించిన, నది పొసగదు. భాసకవస్తువు అపాదానమగునెడ, సూర్య కాంతికి బహిర్గతములై, యంధకారమందున్న వస్తువులు, భాసింపకుంకుట, భాసక బహిర్గతములైన వస్తువులకు భాసనమే లేకుండును. ఆకారణమున, భాస్యము భాసకాంతర్భూతము గావలసి యుండును. కావున బాహ్యములగు భాస్యములకు భాసకమగు నాత్మ అపాదానము గాజాలదు ఏతావతా, బహిఃపదార్థముయొక్క అపాదాన నిర్ణయము గాకపోవుచున్నది. సర్వత్రివ్యాపృతమగు, నాకాశము నందువలె, బహిఃపదార్థావభాసమంతయు, భాసకాంతర్భూతమె, యని సిద్ధమగుచున్నది. ఆకారణమున స్వాంతర్భూతమగు భాస్యమున కపాదానము గాజాలని, భాసక స్వరూపమును విచారింతము.

దేహాదులు, పర్వతాదులవలె భాస్యములగుట, భాసకము గాజాలవు. భాసకము భాస్యమేల కాకూడదు? అనగ, నొకేవస్తువునకు భాస్యభాసకధర్మము లుండగూడదా యనిన, కూడదు. ఒకేవస్తువునకు వేద్యవేదక రూపములగు కర్తృ

కర్మత్వ ధర్మములుండవు. అదియుగాక, భాసకమైన కన వస్థా దోషముగల్గును. కావున భాసకము శుద్ధము. అనగ భ్యాసము గానిదియు, భాసకమె యగునదియు నగు 'భా' రూపము. అనగ. లోకమునందు కర్తృక్రియలకు భేదము గలదు. ఇచ్చట నట్టిభేదములేక, క్రియాత్మకమె యగు కర్తయని యర్థము. కావున పూర్ణము, వస్త్వంతరాభిన్న స్వరూపము గలది. ఇది సర్వత్ర భాసించుట, దేశకాలములను గూడ వ్యాపించునది. అనగ దేశకాలములను గూడ. భాసింపజేయునది. కావునె, యపరిచ్ఛిన్నమగుచు పూర్ణమైనది.

ఇచ్చట భాస్య భాసక స్వరూపమొక్కింత విచారింతము. అది ఘటపటములయొక్క భాసనమువలె లౌకికమైనది కాక, దర్పణప్రతిబింబన్యాయమున, నలౌకికమైనది. అది యెట్లనిన, భారూపతాదాత్మ్యమును బొందక ప్రకాశింపక పోవుటచే, భాస్యమునకు, భారూపభాసకానన్యత్వము జెప్పవలసియున్నది. కనుక భాస్యము, భారూపైకరసమె యగును. బాహ్యాంతరము లెల్ల నిటుల, భారూపోదరమునందె యుండుట, నా భారూపము, పర్వతము శృంగమునకపాదానము గానటుల, నపాదానము గాజాలదు. ఆ భారూపము సర్వత్ర, సర్వదా, యనన్యాపేక్షముగ, తనయందె

ప్రకాశించుచుండును ఈ భారూపమె పరాచితి. త్రిపురాపర మేశ్వరి. వేదవిదులు బ్రహ్మయనియు, వైష్ణవులు విష్ణువనియు, శైవులు శివుడనియు, శక్తిపరాయణులు శక్తియనియు, నా భారూపమునె చెప్పుచున్నారు. అట్టిదగు నా పరాచితి కన్యముగ నేదిచెప్పినను, నది పరిచ్ఛిన్నమెయగును. దర్పణము ప్రతిబింబమునువలె, నా పరాచితి సర్వదృశ్యమును వ్యాపించియున్నది. ఆపరాచితికి భాసకత్వధర్మము భాస్యము ననుసరించి చెప్పబడినదియె కాని, యయ్యది గుణాతీతముగాన సహజ ధర్మముగాదు. ఆదర్శమందు నగరాదులవలె, సర్వభాస్యమును, భాననిర్మగ్నమెయగుచున్నది. దర్పణమందు భాసించు నగరాదులకు, దర్పణముకంటె నన్యత్వము లేనటుల, చితియందు భాసమానమగుజగత్తునకు చిద్వ్యతిరిక్తత్వము లేదు.

దర్పణమందు ప్రతిబింబమువలె, చితియందె జగము భాసించుచున్నదని యేలచెప్పవలయును? ఆకాశము నందు భాసించుచున్నదని యేలచెప్పగూడదు? అనిన వినుము. దర్పణమందు ప్రతిబింబము భాసించుటకు కొన్ని లక్షణము లుండియున్నవి. దర్పణము ఛిద్ర రహితముగను ( అనగ సంపూర్ణముగను ) అశిథిలావయవముగను (అనగ నిబిడముగను, ) అత్యంతరములచే, నసంభిన్నముగను (అనగ నేకరూప

ముగను) ఉండి యుండవలయును. ఛిద్రముండిన, వెనుక నున్న వస్తువు భాసించును. శిథిలావయవిమైన, నవయవ సంధులందున్న వస్త్వంతరము భాసించును. వస్త్వంతరము లున్న, విచిత్రముగ భాసించును. ఇట్టి లక్షణ ములు గల్గిన దర్పణమున నేకాని, తద్భిన్నమగు దానియందు, ప్రతిబింబము భాసింపదు. అటువలె, సంపూర్ణము, నిబిడము నేకరూపము నగుట, చితియందీ జగత్ప్రతిబింబము భాసించు చున్నది.

ఈ యుపపత్తి సరియగునదికాదు. ఆకాశమవకాశా త్మకమును, శూన్యరూపమునగుట, నందు ద్వైతరూపమగు జగత్తును సహింపగలదు. అశూన్యాత్మరూపిణియు, నిబిడ స్వరూపిణియునగు చితియందు, వేరొకవస్తువు లేశమైననుండుట సంభవింపదు. కాన, నాకాశమునందుగాక, చితియందు జగత్తు, దర్పణ ప్రతిబింబవిధమున నున్నదనుట సమంజసము గాదు. అనిన, నటులగాదు. దర్పణమువంటి పరాచితి, నిజముగ ద్వైతవస్తువునుసహింపలేదు. కావున స్వాతంత్ర్యో త్కృష్ట మాహాత్మ్యమున, సంవిద ద్వితీయమగు తనయందు, నిమిత్తోపాన హీనమును, నతిచిత్రమును, ద్వితీయమగు సర్వ చరాచరమును బింబాపేక్షలేకయె, దర్పణమందువలె, ప్రకా శింపజేయును.

ప్రతిబింబము లనేకము లనేకవిధముల భాసించు చున్నను, ఏకమగు దర్పణ స్వరూప మబాధితమగునటుల, జగము చిత్రవిచిత్రముగ స్వప్నాదుల భాసించుచున్నను, ఆ స్వప్నాదుల ననుభవించిననేన, యీ జాగ్రాదులననుభవించు చున్నానను, మున్నగు ననుసంధానశతముల, నా సంవిత్, ఏకమును, నబాధితమునగు స్వరూపముగలదని తేలుచున్నది. కావున జగము చిదాత్మైకరూపము. రాజేంద్ర! యింకను వినుము. నీ మనోరాజ్యస్థితిని పరికింపుము. మనోరాజ్య మనగ సంకల్పము సంకల్ప కాలమున, నఖిలము నీలో భాసించు చున్నది. దానికి ప్రతిబింబ సాదృశ్యము చెప్ప వచ్చును. అచ్చట బింబాపేక్షయున్నదా! అదియంతయు నీ మనోరూపమె కదా! అటువలె చిదాత్మయందు, బింబా పేక్ష లేకయె, ప్రతిబింబించు విధమున భాసించుజగము, చిదాత్మరూపముకంటె నన్యము గాజాలదు. ప్రతిబింబ ముండియున్నస్థితియందును, లేనిస్థితియందునుగూడ, దర్పణము నకు దర్పణమాత్రాత్మత్వము వలె, ప్రపంచము భాసిం చెడి సృష్టికాలమందుగాని, భాసింపని ప్రళయ కాలమందు గాని, ఆపరాచితి, నిర్వికల్ప చితిమాత్రరూపిణియె.

బాహ్యసృష్టి మనోరాజ్యతుల్యమగుట, కల్పనామాత్ర సారమైనదనియు, చితి నిర్వికల్ప రూపమైనదనియు, నీ పై

జెప్పినదానినిబట్టి తెలినది. నిర్వికల్ప రూపమగు చితినుండి, వికల్పమయమగు సృష్టి, యెటుల పరివృత్తి గాంచినదియు నిరూపించెద వినుము. చితి, నిర్వికల్ప చిదేక రసరూపిణి యైనను, ఆదర్శమం దాకాశము భాసించునటుల, తనయందె యున్న (స్వాంతర్భూతమగు) బాహ్యమనుపదమున కర్థభూత మగుదానిని భాసింపజేయును. దర్పణమందు గగనావ భాసకు, బింబభూత బాహ్యగగనాపేక్ష గలదు. చితి సర్వ స్వాతంత్ర్య యుతముగాన, నట్టి పారతంత్ర్య రూపమగు బింబాపేక్ష లేదు. ఈ బాహ్యార్థావభాసన రూపమగునదియె ప్రథమసృష్టి. ఈ బాహ్యావభాసనమె, యవిద్యయనియు, తమస్సనియు జెప్పబడుచున్నది. పూర్ణమగు చిదాత్మకు, బాహ్యావభాసన మెట్టిదనిన, వస్తుతః అంశము లేనిదైనను, నేకాంశము చేతవలె భాసించుటేది కలదో, దానికి బాహ్యా వభాసనమని పేరు. నిర్వికల్ప చిదేకరూపమగు చిదాత్మ, సర్వ స్వాతంత్ర్యము గలదని చెప్పియుంటిని. ఆ స్వాతంత్ర్యము నకె, శక్తియనియు, క్రియ యనియు, విమర్శ యనియు, నామము లాగములందు జెప్పబడియున్నవి. చితి, యాస్వాతం త్ర్యమున, సృష్టికాలమం దు జగమును భాసంపజేయును. ప్రళయకాలమందు సంహరించి స్వరూపస్ఫూర్తి గలిగియుం డును ప్రళయాంతమందు, ఆస్వాత త్ర్యమె, పరిపక్వ ప్రాణ్య దృష్ట సహకృతమగు సదంశచేతవలె, స్వరూపమును భాసింప

శేయును. అనగ, పరిచ్ఛిన్నముగ భాసించును. అదియు, బాహ్యావభాసనము. బాహ్యాస్వరూప వివేచన మంతయు వినుము. పూర్ణాహంభావము, స్వదేహమును వ్యాపించి యుండును. భిన్నమగు హస్తమున నవహంభావరూపముగ నుండును. అనగ. పరిచ్ఛిన్నమగు నితరాంశమునం దనహం భావ రూపమున నుండును. ఆత్మయందిట్టిభాసనమె, బాహ్యా భాసనము. ఈరూపమె, యవ్యక్తమనియు, జడ రూప మనియు, చెప్పబడుచున్నది. ఇట్లు పూర్ణమగు చిదాత్మ యొక్క స్వాతంత్ర్య శక్తి చేతనగు, తనయొక్క పరిచ్ఛేదావ భాసనమున, కవిద్యయని పేరుగలదు. అదియు, బాహ్యావ భాసనరూపమగు మొదటిసృష్టి. ఈ బాహ్యావభాసనమె, యుపనిషత్తులందు మూలావిద్యయని చెప్పబడుచున్నది. భగ వంతుని యొక్క సర్వస్వాతంత్ర్యమునకు చిచ్ఛక్తియని పేరు. ఈ చిచ్ఛక్తియం దవస్థాత్రియము గలదు ప్రళయాది నిర్వి కల్పదశయందు చిచ్ఛక్తిరూపమును; నిర్వికల్ప దశాంతమున, వికల్పము ప్రాధాన్యముగాని దశయందు మాయాశక్తి రూప మును, వికల్పదశయం దవిద్యాత్మక జడశక్తి రూపము ను నగుచున్నది.

తత్త్వజాలము త్రివిధము. శుద్ధము, మిశ్రమము, అశు ద్ధము. శుద్ధతత్త్వజాలము చిచ్ఛక్త్యధిష్ఠితము. శివాది శుద్ధ

విద్యాంత పంచతత్వయుతము ఇందు బీజ మంకురాత్మక భేదముయొక్క పరిగూఢిని జెందియున్నటుల, భేదశక్తి (అనగ జడశక్తి) స్వ ప్రాధాన్య కార్యరూపభేద పరిగూఢిని జెందక చిదాత్మ భిన్నమగు చుండుట, చిత్ప్రాధానత్వము గలదు. కావున నియ్యది శుద్ధము, చిచ్ఛక్త్యధిష్ఠితమునై యున్నది.

మిశ్రితత్వము మాయా శక్త్యధిష్ఠితము మాయాది పురుషాంత సప్తతత్వ సంయుతము. ఇందు బీజ మంకురము వలె, జడశక్తి సూక్ష్మకార్య రూపభేద పరిగూఢినిగాంచుట, చిదచిదుభయ ప్రాధాన్యత గలుగుట వలన మిశ్రమము, మాయాశక్త్యధిష్ఠితమునై యున్నది.

అశుద్ధతత్వము, జడశక్త్యధిష్ఠితము. ప్రకృత్యాది పృధివ్యంత చతుర్వింశతి తత్వయుతము. ఇందు బీజము వృక్షమువలె, స్థూలకార్య రూపభేద పరిగూఢిని గాంచుట, నచిత్ప్రాధాన్యత గలుగుట వలన, నశుద్ధత్వము, జడశక్త్యధి ష్ఠితము నగుచున్నది.

ఇక, నీ షట్త్రింశత్తత్వోత్పత్తి క్రమలక్షణము జెప్పెదవినుము. పూర్వము పూర్ణ. చిదాత్మయొక్క పరిచ్ఛే

దావభాసనాత్మకమగు బాహ్యావభాసన, అవిద్య యనబడు ప్రథమసృష్టియని చెప్పియుంటిమి. పూర్ణ పరాచిదాత్మ, యెల్లప్పుడును, పూర్ణాంశముగనె, భాసించుచుండును. అది, యేకాంశముచే భాసించుట వాస్తవికము. కాని, యటుల భాసించుచున్నటు లుండుటయె, యవిద్య. అటనుండియె, తత్వజాల పరిణామము, నిస్తరంగైక రూప మహాంబుధి యందు, నాకస్మికముగ పరస్పర సంఘట్టనగల, తరంగోత్పత్తివలె, జెప్పబడుచున్నది. పరచిదాత్మయొక్క, అనంత పరిచ్ఛిన్న స్వాంశల యుదయము తత్వజాలమని తేలుచున్నది.

పై జెప్పబడిన, యనంత పరిచ్ఛిన్నాంశల యందలి, నిర్వికల్ప చితి సామాన్యము శివతత్వ మనబడును. ఆ పరిచ్ఛిన్న నిర్వికల్ప చితియొక్క 'అహం' యనెడి భాసన మేది కలదో, ఆభాసన సామాన్యము రెండవదియగు శక్తితత్వము. చితి పూర్ణాహంతాస్వరూపమగుట, శివశక్తి తత్వములకు భేదములేకున్నను, నిర్వికల్ప చిత్తత్వము శివతత్వ లక్షణము. అహంభాసనా లక్షణము శక్తితత్వమని, నిరూపింపబడినది

చిదాత్మ యొక్క పరిచ్ఛిన్నావ భాసనాత్మక బహిః పదార్థ రూపమగు నవిద్య, జగచ్చిత్రాశయ మగుచున్నది.

ఇట్లు మహాకాశతుల్యమగుట, మహాశూన్యమును, స్వాత్మ యొక్క పరిచ్ఛేద భాసనమాత్రోల్లసితమగుట, కల్పితమును నగుచున్నది. ఇట్టి బహిఃపదార్థమును 'అహమేవేద' మని, యహంభావముచే నాచ్ఛాదమొనరించినపుడు మూడవదియగు సదాశివతత్త్వ మనబడుచున్నది. 'అహమిద' మని చిదాత్మక మగు 'అహ'మంశచేత, బహీరూపమగు 'ఇద' మంశ నిషేధించుటచే, చిత్ప్రధానాభాసన రూపమగు సదాశివతత్త్వమై నది. 'ఇదమహ'మని, జడాత్మకమగు 'ఇద' మంశచేత, చిద్రూపమగు 'అహమంశ'యొక్క నిషేధము వలన, జాడ్య ప్రధానాభాసన రూపమగు ఈశ్వర తత్త్వమయినది ఇది నాల్గవ తత్త్వము. 'అహమిదం', 'ఇదమహ' మని, సదాశివే శ్వరుల భేదాభేద విమర్శన రూపమగు నాభాసము, అయిద వది యగు శుద్ధ విద్యాతత్త్వమయినది ఇంతదనుక శుద్ధతత్త్వ పంచకమని పేరు.

పైఁ జెప్పిన శుద్ధతత్త్వము లందు చిదంశ ధర్మిగను, జడాంశతన్నిర్మగ్నమగుచు, తదభిన్నమగు ధర్మముగనున్నది. ప్రకృతమందా ధర్మి ధర్మభావములు వ్యత్యాసమును జెంది, జడశక్తి ధర్మియగుచున్నది. ధర్మిత్వము జెందిన జడశక్తికి మాయాతత్త్వమని పేరు. విభేదబుద్ధి సామాన్యరూపమునకు, మాయాతత్త్వమని పేరు. భేద ప్రాచుర్యమున, చితివ్యాప్తి

మైనదగుచు, సంకుచితత్వమును గాంచి, చెప్పనున్న పంచ కంచుక వ్యాప్తమై, పురుషత్వమును బొందుచున్నది. అనగ, పంచకంచుకములచే, సంకుచితమగు చితి సామాన్యమునకు, పురుతత్వమని పేరు.

పంచకంచుకముల లక్షణము దెల్పెదవినుము. కించిత్కర్తృత్వ రూపమగు కళాతత్వము మొదటి కంచుకము. కించిజ్ఞత్వరూపమగు విద్యాతత్వము రెండవ కంచుకము 'ఇది నాకుండుగాక', యను విషయసామాన్య రూపమగు రాగతత్వము మూడవ కంచుకము. శతవర్షాది రూపమగు నాయుష్యముచేత పరిచ్ఛేదముగల్గిన కాలతత్వము నాల్గవ కంచుకము. కొలదిపనికైనను, సాధనాపేక్షరూప పారతంత్ర్యాత్మక మగు నియతి తత్వము అయిదవ కంచుకము. పంచకంచుకములచే, వేష్టితుడగుచు పురుషుడు పరిచ్ఛిన్నత నందెను. పరమశివుని సర్వకర్తృత్వ, సర్వజ్ఞత్వ, నిత్యతృప్తత్వ, నిత్యత్వ సర్వస్వాతంత్ర్యాది పంచశక్తులు సంకుచితములగుచు, పురుషునియొక్క పంచకంచుకము లయ్యెనని తెలిసికొనదగును. ఇంతవరకు మిశ్రతత్వపంచకము.

చిదాత్మయొక్క జ్ఞానశక్తిరూప ప్రకాశాంశమునకు, చితిశక్తియనిపేరు. దాని నాశ్రయించియుండిన జీవసంబంధి

ప్రాకృత కర్మసంస్కార పిండమునకు ప్రకృతియని పేరు. కర్మల యొక్క ఫలము, సుఖదుఃఖ మోహరూపమున త్రివిధమగుట, తత్ఫలజనక కర్మ వాసనాపిండరూపమగు ప్రకృతికూడ సత్వ రజస్తమోమయముగ మూడు రూపములు గల్గియుండును. సుషుప్తికాలమందీ వాసనాపిండము ప్రకృతి యనబడుచున్నది. తదంతమున జాగ్రత్స్వప్నములయొక్క ఆదియందా వాసనా పిండమే చిత్తమగుచున్నది. అనగ, సుషుప్తియం దేవాస నాపిండమగు చితిశక్తి ప్రకృతి యనబడుచున్నదో, యదియ, కాలాంతరమున చిత్తమని చెప్పబడుచున్నది. వాసనా పిండస్వరూపమే, రూపముగా గల్గిన ప్రకృతి చిత్తములకు భేదము లేదని తాత్పర్యము. ఇక చిత్త ప్రకృతులకు గల భేదము దెల్పెదవినుము. పురుషభేదమున చిత్తము భిన్న మగుచు బహువిధములుగ నున్నది. జీవుడు పరిచ్ఛిన్న చిదూపుడు. పరిచ్ఛేదము దేహాదులచే గల్గినది. జాగ్ర త్స్వప్నము లందు, దేహాదులు వివిధములగుటచే, జీవులందు భేదము యుక్తము. సుషుప్తియందు దేహాదులు భాసింప కుండుట, తత్పరిచ్ఛేదాభాసనముగూడ, నాత్మయందు లేదు గాన, నిస్తరంగ సముద్రమందు తరంగములయొక్క భేద రాహిత్యమువలె, జీవులకభేదము ప్రసిద్ధమగుచున్నది ఇట్టి జీవాభేదమున, తద్గత కర్మవాసనలకు గూడ, నేకరాశిత్వ మొప్పుచున్నది. ఆ యేకరాశియే, ప్రకృతి. సుషుప్తియం

దలి, యీప్రకృతియె, విషయసంయోజన కాలమందు చిత్తమని చెప్పబడుచున్నది. ఈ చిత్తమె, చిత్ప్రాధాన్య వివక్షయందు పురుషుడని చెప్పబడుచున్నది. ప్రకృతి ప్రాధాన్య వివక్షయందు చిత్తమనబడుచున్నది. కావున చిత్తము పురుషుని యందుగాని, ప్రకృతియందుగాని, యంత ర్భూతమగునుగాని తత్వాంతరము గాజాలదు. ప్రకృతి తత్వము త్రిగుణాత్మకము దీని కంతఃకరణమని పేరు అభి మాన నిశ్చయ సంకల్పాత్మక త్రివిధ క్రియాభేదమున, నీ యంతఃకరణ అహంకార, బుద్ధి, మనోరూపమున త్రివిధమై నది. అహంకారముయొక్క సత్వరజస్తమోంశల, శ్రోత్ర, త్వక్చ, క్షు, జిహ్వా. ఘ్రాణాది, జ్ఞానేంద్రియ పంచకము, వాక్పాణి పాదపాయూప స్థాది కర్మేంద్రియ పంచకము, శబ్ద స్పర్శరూప రసగంధాది సూక్ష్మభూత పంచకము, క్రమముగ నేర్పడినవి. సూక్ష్మభూతముల నుండి ఆకాశవాయురగ్ని సలిలపృధివ్యాది స్థూలభూతము లేర్పడినవి. ఇట్లు షట్త్రింశ తత్వాత్మకముగ బ్రసిద్ధమును, ననవచ్ఛిన్నమ నగు సంవిత్ బాహ్యావభాస పూర్వకముగ, జగత్క్రీడను, సర్వసాక్షి యగుచు జరుపుచుండును.

లోకము భావనామాత్ర సారమని చెప్పి యుంటిని. తొలుత, సర్వకారణభూతురాలగు త్రిపురా పరమేశ్వరిచేత,

సృష్ట్యర్థము, హిరణ్యగర్భుడను పేరుగల బ్రహ్మ, భావనా యోగమున భావింపబడెను. తిరిగి, ఆబ్రహ్మయొక్క భావ నచే, నీ జగదుద్భవము గల్గినది. బ్రహ్మ భావనచే గల్గిన లోకమందు, సర్వకర్తృత్వమా త్రిపురాపరమేశ్వరిది. ఎట్లని న, బ్రహ్మచేగాని నాచేగాని, మరియొకరిచేగాని భావింప బడిన నేలోకమందైనను, 'నీవు' 'నేను,' అనువిధమున భాసించు పరిచ్ఛిన్న సంవిదంతయు, నా త్రిపురా పరమేశ్వ రియె. అందెట్టి భేదమునులేదు. భేదమౌపాధికము. ఉపాధి బ్రహ్మచే భావింపబడెను. ఆ భావన నుపసంహరింప, ననగ, నుపాధిలయమున, తత్పరిచ్ఛిన్న సంవిత్తులకు, ఘటాది నాశ మందు పరిచ్ఛిన్నాకాశములకు వలె, భేద ముండజాలదు. చిదాత్మకు భావనా స్వాతంత్ర్యము సహజమగునే, నాకట్టి భావన, యేల లేదను వేని, నీభావనాశక్తి, మాయచే సమా వృతమైనది. నీ చిచ్ఛక్తి నాశ్రయించిన. యా మాయా వరణ తొలగ, నీకు సిద్ధికల్గును. దేశకాలాదు లన్నియు, నెవనిచే నెట్లుగ భావింపబడుచుండునో, దీర్ఘసూక్ష్మ భేద మున, నవి యట్లుగ భాసించును నాచే భావింపబడిన, యీయొక్కదినము, బ్రహ్మచే ననంతటి కాలమున నె, ద్వాద శార్బుద వత్సరకాలముగ భావింపబడినది. బ్రహ్మచే నిర్మిత పాదగవ్యాతి మాత్రశైలమున, నాచే ననంత దేశము భావింప బడినది. ఇట్లు రెండును సత్యములు, నసత్యములును

గాగలవు. నీవునుగూడ క్రోశమాత్రదేశమును, కలాత్మక మగు కాలమును, అనంతయోజన ప్రదేశముగను, అనంత కాలముగను భావింపుము అదియటుల భాసింపగలదు. నీవు భావన నుపసంహరింప, సర్వసాధారణముగ భాసించును. కావున భావనా రూపమాత్రమగు నీ జగత్తు, బాహ్యమున, నవ్యక్తమగు చిదాత్మ రూపమందు భాసించు చున్నదని తెలియుము.

భావనామాత్ర రూపము గలదగుట, జగత్తసత్యము. భిత్తియందు చిత్రింపబడిన చిత్రము, భిత్తికంటె నన్యము గాదు. అటువలె నవ్యక్త భిత్తియందు చిత్రసదృశమైనది జగత్తు. కావున, నాయవ్యక్తభిత్తి కన్యము గాజాలదు. ఆ యవ్యక్తము జడశక్తి. తిరిగి, యాజడశక్తి చిదాత్మ భిత్తియ దు చిత్రకల్పముగాన, చిదాత్మ కన్యమైనది కాదు. జడశక్తి చిదాత్మకంటె నన్యముగానపుడు, తదనన్యమగు జగత్తు, చిదాత్మకంటె వేరెట్లు గాగలదు. చిదాత్మ వ్యతిరేకముగ, జగదసత్యము గనుక. దూర దేశమైనను యోగులు క్షణముననేగి, కరామలకమువలె, ధృవముగ జూచుచున్నారు. అనగ, దూరాదులు అసత్యమగుట, దూరసమీపాదులు భావనామాత్ర సారములని నిశ్చయించి, యటుల జూడగల్గుచున్నారు.

జగము చిదాత్మ దర్పణమందు, ప్రతిబింబము వలె నుండిన దనియు, తద్వ్యతిరేకముగ నసత్యమనియు నిశ్చయించి, దేహాతిరిక్త శుద్ధ చిదాత్మయొక్క 'యోహామస్మి' యను భావన, దీర్ఘకాల నిరంతరానువృత్తి రూపక్రమమున నభ్యసించి, జగత్సత్యత్వ భ్రాంతిని త్యజింపుము. అనంతరము నావలె సర్వస్వతంత్రుడవు గాగలవు."

మునిసుతుని యా వాక్యములు విని, నృపసత్తముండు, జగత్సత్యత్వ, దేహాత్మత్వాది భ్రాంతుల నెల్ల విడచి, జగత్ప్రతిబింబ దర్పణాత్మక మగు నాత్మ తత్వమెరింగి, కామ క్రోధాది రహితుడగుచు, సమాధ్యభ్యాస యోగమున భావనాసిద్ధిని సాధించి, సృష్ట్యాదులందు స్వాతంత్ర్యమును బొంది. చిరకాలము విహరించి, దేహముత్యజించి, నిర్వికల్ప సంవిన్మాత్రరూపుడగుచు విదేహముక్తిని బొందెను. భార్గవ! ఇట్లు జగము సత్యమని భావించు భావనామాత్ర కారణమున, సత్యాత్మరూపమున భాసించుచున్నది. దీనిని లెస్సగ విమర్శింపుము. విచారణచేత నీచిత్తము నాశయించిన భ్రాంతి శమింపగలదు.

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ ప్రకాశిక యను నాంధ్రీకరణమున, శైలలోకాఖ్యానంబను చతుర్దశాధ్యాయము.

# పంచదశాధ్యాయము.

తే॥గీ॥ ఆత్మయగు నవేద్యంబు, వేద్యమునుగూడ
నను చు బరమగుప్రార్థ విన్యాసమొనర
జేసె సంక్షేపగతినిందు చిత్రమొదవ
నత్రిసుతుదద్ది పినుమంబ! యాదరించి-

అత్యద్భుతమగు నా శైలలోకాఖ్యానమునువిని, పరశురాము డతివిస్మితుడగుచు, గురువుగారిచే నుడువ బడిన దంతయు పరిశుద్ధ బుద్ధిచే విమర్శించి, తిరిగి వారి సన్నిధికి జని, నమస్కరించి సవినయముగ నిట్లుప్రశ్నించెను. "గురునాథ! వివిధాఖ్యాన పూర్వముగ మీచే జెప్పబడినదంతయు లెస్సగ విమర్శించితిని. అట్టి విమర్శచే, మీనుడుల సారమిద్దిగ గ్రహించితిని. సంవేదన మద్వితీయము. సత్యము ఆదర్శ నగరతుల్యముగ నందు సంవేద్యముకల్పితము అనగ, నసత్యమగునది, యున్నటుల భావింపబడినది. చితి స్వపర ప్రకాశమయము అపరిచ్ఛిన్న శక్త్యాత్మకము. సంవిద్రూపము బ్రహ్మాదులకైన నియంత్రి. ఆచితి, తన సర్వ స్వాతంత్ర్యకారణమున, నుపాదానాది కారణ రహితముగ,

బహిఃపదార్థాది విభేదమున జగచ్చిత్రమును, తానసుభిత్తి యందు భాసింపజేయుచున్నది. సూక్ష్మబుద్ధిచే విచారింప, నాకింతవరకు జ్ఞాతమైనది. కాని, నిరూపింపబడిన ఆ శుద్ధ నిర్వికల్పరూపమగు నా చితి, పొందబడజాలనిది. కారణ మేమన సంవేద్య మెప్పుడును నుండియుండ, వేద్యరహిత మగు సంవిత్తును బొందు టెట్లగును? దానిని బొందనిది, పురు షార్థరూపమగు మోక్షము లేదుకదా! ఆ మోక్షమన నెట్టిది? విజ్ఞానము గల్గిన మోక్షప్రాప్తియగునందము. ముక్తావస్థ యందు వ్యవహార మెట్లుండును? లోకమునందు జ్ఞానులయ్యు, వ్యవహార పరాయణులుగ నున్నారు. వారలకు నిర్వికల్ప సంవేదన స్థితి, యెట్లు గాకుండును? శుద్ధ నిర్వికల్పమందుండి యున్న, వ్యవహార మెట్లు సంభవించును? విజ్ఞాన మొక్క రూపమైయగుట, తత్ఫలమగు మోక్షముగూడ నేకరూపము ననే, యుండవలయును. లోకమునందు జ్ఞానులస్థితి భేదముగ గాన్పించుటకు కారణమేమి? కొందరు శాస్త్రచోదితములగు కర్మల, నిర్ణీత కాలములందు జేయుచున్నారు. కొందరనేక మారముల నాత్మదేవత నారాధించుచున్నారు. కొందరిం ద్రియ సమూహము నాహరించి, సమాధినిరతులగుచున్నారు. కొందరు దేహేంద్రియ శోషణరూపమగు తపమునం దాసక్తు లగుచున్నారు. కొందరుపదేశ వాక్యముల శిష్యులకు బోధ లొనరించుచున్నారు. కొందరు దండనీతి మార్గాను సార

ముగ, రాజ్యమును శాసించుచున్నారు. కొందరు సభలందు ప్రతివాదుల నెదుర్కొని వాదించుచున్నారు. కొందరు వేదశాస్త్రముల నెల్లపుడు పఠించుచున్నారు. మరికొందరు మౌనవ్రతము నవలంబించుచున్నారు. కొందరు నిత్యమును, లోకవిగర్హితమగు వృత్తిని స్వీకరించుచున్నారు. వీరంద రనుజ్ఞానులుగ లోకము గణించుచున్నది సాధన ఫలము లందు భేదము లేకున్నను, వీరందరియ దున్న స్థితి భేదము నకు కారణమేమి? విజ్ఞానసములగు వీరియందలి, యిట్టి తారతమ్యమునకు కారణమేమి? అనన్యశరణ్యుడను, శిష్యుడను నగు నాకు మీ నైసర్గిక కారుణ్యమున సర్వమును దెలుప వేడెదను.''

అంత దత్తాత్రేయులు, భార్గవునెడ ప్రసన్నులగుచు, నడుగబడిన ప్రశ్నజాలమంతయు, యుక్తమని తలచి, చెప్పాట కిటుల నుపక్రమించెను. ''రామ! నీవు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవు. ఆ పరమపదము జాడను గంటివి. సద్విమ ర్శనపరుడవగుటచే, నద్దానిని తెలిసికొనసమర్థుడవగుచున్నావు. సద్విమర్శనగలుగుటయె, యీశ్వరశక్తిపాత లక్షణము. ఈశ్వరానుగ్రహ రూప శక్తిపాతము లేక నెవడు శ్రేయ మును బొందగలడు? లెస్సగ నారాధింపబడిన, యాత్మదేవత ప్రసన్నురాలగుచు, సద్విమర్శగలిగించి, నిత్యమును దానిని

దెలియుటచేత నిశ్చలామృత సంస్థితి పొందబడుచున్నది. ఆద ర్శము విదితమగుచుండ, సర్వ సందేహావృత్తి యెటుల నశిం చునో, యనంత ప్రతిబింబము లందు, దెలియ బడనిది యుండదో, ప్రతిబింబము లేయని తెలియుటచే, కోరదగిన దెద్దియు నుండదో; యటువలె నా పరమపదము విదితమగు చుండ, తెలియబడనిదియు, కోరదగినదియు లేదని యన్వ యము. తదన్యమిల్ల జడమగుట, నది జడమగు నన్యమున, దెలియబడజాలదు. కావనది యవేద్యము ఇది శాస్త్ర జ్ఞాన విభావితమగు నాత్మతత్వము."

అష్టావక్రుడిట్లుబలుక, నామె తిరిగి యిట్లు బలికెను. "మునిపుత్ర! చెప్పినంతవరకు సర్వాసమ్మతముగ జెప్పితివి. వేదకాభావమున, నది యవేద్యమపియు, దానిని తెలిసికొనిన నవ్యయామృతపదము బొందబడుననియు నీవు చెప్పియుంటివి. అందు పూర్వోత్తర వచనములు సంగతములుగ నుండెనా? పరస్పర విరుద్ధములుగ లేవా? అవేద్యమగునెడల నేనెరుగనని కాని, లేదనికాని, లేనిదనికాని, నిరూపింపుము అదియుండి నీవెరిగిన యెడల, నది యవేద్యమని యనకుము. ఆ పర మాత్మ తత్వము శాస్త్రవాక్య జ్ఞానమున. నీచే నిశ్చితమైనది కాని, యది నీవు స్వయముగ నెరుగవు. కాన నీకది ప్రత్యక్ష విషయముగాదు. ప్రత్యక్షముగ, సర్వ ప్రతిబింబములను

యథాస్థితముగ జూచుచు, నాదర్శమును బ్రత్యక్షముగ దెలిసికొనకుండు టెట్టిది? సభా మధ్యమందు, అందును జన కుని ముందిటులఁ స్వవచన వ్యాఘాతముగ బల్కుచు, బరి భూతుడనై తినని యేల దలపకుంటివి?"

ఇట్లామె పలుక, మారు బలుకజాలక, లజ్జితుడును విమనస్కుడు నగుచు, నవనత శిరస్కుడై, యెంతవిచారిం చియు నామెప్రశ్నల కుత్తరము గానక, అష్టావక్రు డిట్లని యెను. "తాపసీ! నీ ప్రశ్నల కుత్తరము లీయ జాలను. శిష్యుడను. అవేద్యమగు నాత్మ తత్వమెరిగిన, నమృతత్వ ప్రాప్తి గలుగుననెడి శాస్త్రనిరూపణ మెటుల సంగతమ గునో, నాకు దెలుపుము. తెలియని దానిని, తెలియున నెడి తపస్సును హరించు నన్నృతము నాడజాలను." అతడట్లు సత్యమును బలుక తాపసి ప్రసన్నురాలగుచు. సభాసదు లందరు వినుచుండ, నాతనిని జూచి యిట్లనియెను.

"వత్స! ఆసమాధాన మెరుంగక, ననేకమంది మోహా మును జెందుచున్నారు. అది మిక్కిలి గోప్యము. శుష్క తర్కములచే దెలియబడదు. ఇంతటి సభయందు దాని నెరి గిన వారొక్కరును లేరు. ఈ రాజెరుంగును. నేనెరుంగు దును. మరియెవరు నెరుంగరు. ఎట్టి వివాదములందైనను,

తర్కమాత్రిము నాశ్రియించిన విద్వాంసులీ ప్రశ్నల కుత్త రము లెరుగజాలరు. సద్గురు సేవయు, దేవతానుగ్రహ మును లేక, సూక్ష్మబుద్ధిచే నైనను, తర్కమాత్ర సమాశ్ర యమున, నది తెలియబడజాలదు.

మునిపుత్రా! ఆత్మతత్వమును గూర్చి యెంత వినినను, ఎంతటి సూక్ష్మబుద్ధిచేతగాని, దానియందు సమాహితము గాకుండ, బహిర్ముఖముగ నుండి నంతవరకును, అది తెలియ బడదు. ఆత్మ సూర్యునివలె స్వప్రకాశమగునను గురు వాక్య ములు విని, నేనట్టి విధమగుదునా, కానా, యని, నిశ్చయము కొరకు సమాహితాంతఃకరణుడై, స్వరూపాభి ముఖుడు గానంతవరకును, గురువుచే జెప్పబడినది కాని, తాను వినినది కాని, నిరర్థకము. ఒకడు తన కంఠమునం దుంచుకొనిన ముక్తాహారమును, బ్రమాదవశమున మరచి, చోరులచే నప హరింపబడెనని తలచెననుకొనుము. ఒకానొకనిచే, నీకంఠ మునందె, యది యున్నదని చెప్పబడినప్పటికిని, తత్తదిం ద్రియ వ్యాపారముచే, కంఠమునందు జూడనంతదనుక, నెంత సూక్ష్మముగ విమర్శించినను, కంఠస్థహారమును, బొందజాల నటుల, నెంత నిపుణుడైనను సమాహిత చిత్తమున, నంత ర్ముఖుడగుచు, స్వాత్మ యిట్టివిధమగునా, కాదా, యని, యాత్మరూపమును నిశ్చయించుటకభిముఖుడు గానంత వర

ఘను, ఆత్మరూపము దెలియబడదు. బహిర్ముఖమున నెచ్చట నది యెట్లుగ దెలియబడగలదు? కావున సమాహితుడగు నంత ర్ముఖునకే, యాత్మప్రాప్తి రూపఫలము గలుగగలదు.

అవేద్యమగు నాత్మయొక్క వేదనప్రకారము దృష్టాంత ముఖమున వినుము. దీపము సర్వత్రవిషయములను బ్రకా శింపజేయును. స్వప్రకాశమున కన్యదీపము నపేక్షింపదు. అనగ, మరియొక ప్రకాశము నపేక్షింపక, స్వయముగ బ్రకాశించును. అటువలె సూర్యాదులు స్వయంప్రకాశము లుగ నున్నారు. సూర్యుడు, దీపము మున్నగునవియన్నియు నప్రకాశ్యములగుటచే, లేవనిగాని, ప్రకాశించుటలేదని కాని పలుకుట యుక్తమగునా? దీప సూర్యాదులకు ప్రకాశక మగుచు, స్వయముగ నత్యంతాప్రకాశ్యమగు చిదాత్మ, యసంవేద్యమును, స్వప్రకాశము నగుననిన, నీకెట్టి సందియ ముండదగును? కావున నప్రకాశ్యమగు చిదాత్మకు ప్రకా శనము స్వతస్సిద్ధముగ నున్నది, లేనిది, యంతర్ముఖ దృష్టిచే లెస్సగ విచారింపుము.

సర్వ సంశ్రయము గాన, సర్వమును తనయందభాసింప జేయు, చిచ్ఛక్తి, యెచట, యేరూపమున, నెపుడు ప్రకా శించుటలేదు? ఆచితి ప్రకాశింపనపుడు ప్రకాశించున దేది

వృద్ధినందించునని యర్థము. నీచే గ్రహింపబడిన తత్త్వార్థ మట్టిదియు. మరియొక విధముగాదు. కాని, నీచే నుడువ బడిన పర్వచిదాత్మరూపము, 'అదియిట్టిది' అనినీకు సువిదిత ముగా, లేదు. కాన నటుల జెప్పియుంటివి. పరోక్షముగ దెలియునది, తెలియునిదియె, యగును. పర చిద్రూపము లెస్సగ తెలియబడిన, అనగ, అపరోక్షజ్ఞానము గల్గిన పరోక్షజ్ఞాన, ముపశమించును. అపరోక్షమగు వస్తువుయొక్క పరోక్షజ్ఞానము భ్రమరూపము గాన, పరోక్ష జ్ఞానము స్వప్నమువంటిది. స్వప్ననిధిప్రాప్తి పురుషునకు నిరర్థకమగు నటుల. పరోక్షజ్ఞానము నిత్యఫలమిచ్చునదికాదు, అందులకు పూర్వగాథనొండు దెలిపెద వినుము.

పూర్వమందు మిక్కిలిధార్మికుడును, జ్ఞాతపరావరుడు నగు జనకుడను రాజు విదేహరాజ్యమును బాలించుచుండెను. ఒకప్పుడాయన, యాత్మదేవతను, ఉత్తమక్రతువుల నారా ధింప సమకట్టెను. అచ్చటికి విద్యావంతులును, తపస్సంపన్ను లును, నిగమవేత్తలును, శ్రౌత పరాయణులును, బహు పురాణవేత్తలునగు బ్రాహ్మణోత్తము లరుదెంచియుండిరి. ఆకాలమునందె, వరుణుడు యజ్ఞమొనరింప నారంభించెను. ఆయనచే నాహ్వానింపబడియు, విప్రులచ్చటికరుగక, జన కుని యందలి ప్రేమచే, నచ్చటికె యరిగిరి. అంత తర్క

కుశలుడగు వరుణపుత్రుడు, విప్రవేషము ధరించి, కపటమార్గమున బ్రాహ్మణుల, తమస్థానమునకుఁ గొంపోవ నరుదెంచెను. అతడు యజ్ఞశాలఁజొచ్చి, జనకునాశీర్వదించి, సభ్యులందరు వినుచుండ నిట్లాక్షేపించెను. "రాజ! కాకగృధ్ర సమూహముచే వీఁగియున్న కమలాకరమువలె, నీయజ్ఞశాల యేమియు శోభించుట లేదు. విద్వత్సమూహముగల్గిన సభ, శరత్కాలమందు పద్మములతోఁగూడిన సరస్సు హంస సంఘములచే వలె, మిక్కిలి ప్రకాశించును. నీ సభయందు విద్యావిశదుఁ డొక్కఁడేనియు నాకగుపడుట లేదు. నీకు స్వస్తియగుఁగాక. వెళ్ళఁగలను. ఇచ్చట నాకుండ జనదు మూర్ఖ బాహుళ్యము గల యిట్టి సభయందు నేనుండుటెట్లగును.?"

ఈవాక్కులకు సభ్యులందరును మిక్కిలి కోపించి, "ద్విజాధమ! నీవందర నాక్షేపించుచుంటివి. మమ్ములనందర జయింపగల నీ విద్య యేపాటిది? వృథా వదరుచుంటివి. మమ్ముల జయించికాని నీవు వెళ్ళ వలనుపడదు. ఇచ్చటికి రమారమి, భూలోకమందలి విద్వాంసులెల్లరు వచ్చియుండిరి. దుర్మతి! భూలోకము నంతయు జయింప నిశ్చయించితివిగా! ఏవిద్యచే మమ్ముల జయింప జూతువో, దానిని జెప్పుము," అనియడుగ వారుణి యిట్లు మారుబల్కెను. "నేనోడిన, మీరు నన్ను సముద్రమందు ముంచుదురుగాక. లేక నాచే

యోడినవారిని. యోడినట్లు సముద్రమందు ముంచగలను ఇట్టి సమయమున కంగీకరించిన, మిమ్ములనందర క్షణమాత్రమున గెల్వగలను. వాదమునకు రండు."

ఇట్లన, సభ్యులందరు వల్లెయని, యాతనితోడ వాదమునకు గడంగిరి. వరుణపుత్రుడు విప్రులనందరను, వితండ జల్ప వాదమున జయించి, వారలనందర సముద్రమునందు ముంచుచుండెను. వరుణదూతలు, ముంచినవారిని, ముంచినట్లుగ, వరుణుని యజ్ఞశాలకు గొంపోయిరి. అచ్చట వరుణునిచే బూజితులగుచు సంతసమున నుండిరి. అష్టావక్రుడు తన తండ్రియగు కహోలుడు, సముద్రమందు ముంచబడుట విని, యచ్చటికేగెను అతను వితండజల్పవాదమున గడు సమర్థుడు. ఆవాదమున వారుణిని జయించి, యాతనిని సముద్రమందు ముంచుట కాజ్ఞాపించెను. అంత వారుణి విప్రవేషమును విడచి, ద్విజులనందర తనలోకమునుండి తీసుకు వచ్చెను. అటుల తనమూలమున విమోచితులైన విప్రులను, దర్పమున నష్టావక్రుడు హేళన మొనరించెను. అతనిచే నట్లవమానితులగుచు, వారందరు ఖేదమునంది, యొకానొక తాపసి శరణు జొచ్చిరి. నిత్య యౌవ్వనురాలును, మనోహరోజ్వల శరీరధారిణియు, జటాధారిణియు, కాషాయాంబర వాసినియు నగు నా తాపసి బ్రాహ్మణుల నెల్ల

నోదార్చి, వారలదోడ్కొని రాజసభకరుదెంచెను. అచ్చట జనకునిచే లెస్సగం బూజింపబడి, యామె యిట్లు బలికెను. "వత్స! అష్టావక్ర! నీవు మిక్కిలి బుద్ధిమంతుడవు వాదమున వారుణిని జయించి విప్రుల నెల్ల విడిపించితివి. నేను నిన్నిప్పు డొకటి ప్రశ్నించుచున్నాను. వితండ కపటమార్గము వదలి చెప్పుము.

ఏపద, మపరిచ్ఛిన్నామృతత్వ ప్రతిపాదకమో, యే పదము దెలియబడిన, సర్వసందేహములు విలయముజెందునో; తెలియదగినదికాని, కోరదగినదికాని యే కొంచెమేని యుండదో; యేది యవేద్యమో, యాపదము నీకు విదిత మగునెడ, మత్సమీపమున సత్వరముగ జెప్పుము." అంత కహోళతనయుడిట్లు బదులుజెప్పెను. "తాపసీ! లోకము నందు నాకు విదితముగాని దెద్దియు లేదు. నీవడిగిన దెంత మాత్రము! నాచే సర్వశాస్త్రము లనేక పర్యాయములు, సంలోడితము లైనవి. నీ ప్రశ్నకు సరియగు సమాధానము జెప్పెద వినుము. ఆపదము నాకు విదితము. అది సర్వజగ మునకు హేతువు ఆదిమధ్యాంతరహితము. దేశకాలము లచే ననవచ్ఛిన్నము, శుద్ధము అఖండము. చిదాత్మ కము. దేనినాశ్రయించి, యీసర్వజగ మాదర్శనగర ప్రఖ్య ముగ భాసించుచున్నదో, యదియ, యాపరమపదము. దానిని

కలదు? సుషుప్తి ప్రళయాదులం దేమియు ప్రకాశించుట లేదు గాన, చిత్ప్రకాశము కాల పరిచ్ఛిన్నమగు ననిన యెడల, నట్లుగాదు. ఏమియు ప్రకాశించుట లేదను రూప మున చితియె, ప్రకాశించుచున్నది. అట్లు చితి ప్రకాశింప కున్న, నేమియు ప్రకాశించుట లేదనునదియైన, నెట్లు సిద్ధ మగును. సుషుప్తియందు ప్రకాశాభావము కేవలము భాసించుచున్నది కాని, చితి భాసించుట లేదనిన, వినుము. అప్రకాశమనునది స్వయముగ ప్రకాశింపజాలదు. అప్ర కాశ స్వప్రకాశములు స్వయంవిరోధములు గాన, చితియె యా యప్రకాశమును బ్రకాశింపజేయునది. అటుల నప్ర కాశ ప్రకాశక యగు చితి ప్రకాశింపకుండు టెట్టిది? ఈ విధ మున చితి భాసింపకున్న నప్రకాశముగూడ భాసింపదు గాన, చితి సర్వదా ప్రకాశించుననియె, చెప్పదగినది. ఇట్లు సర్వదా భాసించు చితి స్వతః భాసించునా? లేక యెటుల భాసించు? నని సూక్ష్మబుద్ధిచే, నీవ విమర్శింపుము. అట్టి శుద్ధ చిద్రూప మును నిపుణులగు పండితులు గూడ కానకున్నారు. వార నంత దృష్టులు గలవారగుట, మోహితులై సంసరించు చున్నారు.

దృష్టి ప్రవృత్తిని పరిత్యజించి – దృష్టియన మనస్సు, ప్రవృత్తియన సంకల్పము– జాగ్రద్దశయం దుండనంతవరకును,

అంతర్దృష్టి కలుగజాలదు. సంకల్ప నాశమున గలుగు నంత ర్దృష్టి లేనంతదనుక, శుద్ధ చిద్రూపమును గాంచ శక్యము గాదు. మనస్సుయొక్క నిస్సంకల్పత్వ లక్షణమున కంతర్దృష్టి యనిపేరు. సంకల్ప లక్షణము గలిగిన మనస్సున కంతర్దృష్టి గలుగదు. ఆ సంకల్పమును నిశ్శేషముగ బరిహరించి, స్వభావము నాశ్రయింపుము. మనస్సు శుద్ధ చిద్రూపమున, నాకాశముచే పూర్ణమగు ఘటము వలె, స్వభావముగనే. పూర్ణమగును. ధాన్యాదులచే, ఘటము పూరింపబడినటుల, సంకల్పములచేత మనస్సు నిండింపబడుచున్నది. ధాన్యమును తొలగించి నంతమాత్రమున, తిరిగి ఘటమాకాశ పూర్ణమగు నటుల, సంకల్పములను నిరసించినంత మాత్రమున, మనస్సు తిరిగి, యాత్మచే పూర్ణమగును. అట్టిస్థితియె స్వభావము. క్షణకాలము నాస్వభావము నాశ్రయించి విమర్శా రహితు డవై యుండుము. పిమ్మట తత్స్వభావ సంశ్రయ దశను సంస్మరించి, యా శుద్ధ చిద్రూపము, సంకల్పాభావ దశ యందు స్వయముగ భాసించుచున్నదా? మరియొకదానిచే భాసింపబడుచున్నదా? అనునది విమర్శింపుము. అట్టి విమర్శ చేత, నా శుద్ధ చిత్తత్వ సర్వస్వముచు దెలిసికొనగలవు. కావున తత్వమసంవేద్యము, సంవేద్యమునవికూడ చెప్పబడి నది. అవేద్యమగు దానినెరిగిన, నమృతత్వసిద్ధి పొందబడును.

మునిపుత్రి! నీకు సర్వమును జెప్పితిని. నమస్కారము. వెళ్ళగలను. సంక్షేపముగ నిటుల వినినంతమాత్రమున, నది తెలియబడ నేరదు. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడగు నీ రాజు నీకు బోధనొనరింపగలడు. నీ సంశయములను తిరిగి యడుగుము. అవియెల్ల నాయన ఛేదింపగలడు. అని చెప్పి రాజుచే పూజింపబడి, సభాసదులచే నమస్కరింపబడి, యామె గాలిచే మటుమాయమగు మేఘరేఖవలె, తత్క్షణమే యంతర్ధానమయ్యెను. రామా! శుద్ధ చిదాత్మనందుట కశక్య మని తొలుత నంటివి కదా! ఆ యాత్మయొక్క వేదన ప్రకారము దెలిపితిని.

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశిక యను నాంధ్రీకరణమున, అష్టావక్రీయ
మను పంచదశాధ్యాయము.

---

# షోడశాధ్యాయము.

తే॥గీ॥ సులభ వేద్యంబులో జాడ్య చొరవగలుగ
మరి యవేద్యంబు వెలిదృష్టి మరగసనుచు
నాత్మ వేదనాప్రక్రియ నతిశయుతుడు
విమలగతి బల్కె నీపట్టు వినుముతల్లి! -

పరశురాము డష్టావక్రుని కథను విని, యాశ్చర్యసమన్వితుడగుచు, నింకను వినగోరి. దత్తావధూతేంద్రుని తోడ "గురునాధ! మీరు చెప్పిన వృత్తాంతమత్యద్భుతము ఇట్టి కథ నేనెన్నడును వినియుండలేదు. అష్టావక్రుడు జనకు నేమి యడిగెనో, యాయనకు డేమి బదులుజెప్పెనో, యావిజ్ఞానమంతయు నాకు సవిస్తరముగ సెలవిందు," అని యడిగెను. పరమపావనమగు నా కథ దత్తాత్రేయ మునీంద్రు డిటుల జెప్పదొడగెను

'భార్గవ! మహాత్ముడగు జనకుడు జెప్పిన దంతయు వినుము. తాపసి వెడలిన తదుపరి, యష్టావక్రుడు విప్రబృంద పరివృతుడగుచు, జనకుని దరిజేరి, తాపసిచే క్లుప్త

ముగ జెప్పఁబడిన మహార్థమును గూర్చి యెటుల ప్రశ్నించెనో, యదియంతయు దెల్పెద. సమాహితుడవై వినుము. అష్టావక్రుడు జనకుని గూర్చి యిటుల ప్రశ్నించెను. "విదేహాధీశ్వర! సంక్షేపముగ జెప్పుటచే, తాపసినుడుల లెస్సగ గ్రహింప జాలకుంటిని. అవేద్యమగు చిత్తత్వము నెటుల తెలిసికొనగలనో తద్విధమెల్ల సెలవిండు," అన జనకుడు సంతసించి యిటుల చెప్పదొడగెను

ఆశుద్ధ చిదాత్మతత్వము సర్వథా అవేద్యమునుగాదు, సర్వథా వేద్యమునుగాదు. సర్వథా అవేద్యమె యగునెడల, గురువు చెప్పగలదెద్ది? గురువు తత్వము నెరుకజేయగలడు గాన, తొలుత గురువు నాశ్రయింపవలయును. శుద్ధ చిదాత్మ జ్ఞానమత్యంత సులభమము, అత్యంతదుర్లభమము గూడ నగును. పరావృత్తదృష్టి గలవాని కత్యంత సులభము. పరాగ్దృష్టి, యనగ, బహిర్దృష్టిగలవాని కత్యంత దుర్లభము. ఆత్మతత్వము కేవలము, సర్వథా యవేద్యమును, అనిరూప్యము నగు నప్పటికిని, యన్యవస్తు నిషేధరూపమున, నిరూప్యము గూడ నగును. అనగ 'ఇదికాదు, యిదికాదు,' అని నిషేధింప, పరిశిష్ట జ్ఞానరూపమె, యాత్మతత్వమని నిరూపింపదగును. దృశ్యరూపమునసె, యది వేద్యమగుచున్నది. అది యెట్లులనిన, ఘటాది దృశ్యజాలమును జూచుచున్నాము.

దేనిచే నిది ఘటము, ఇది పటమని తెలియబడుచున్నదో, ఘటపటాద్యాకార రహితముగ పరిశిష్టమగు నదియె జ్ఞానము. దృశ్యజ్ఞానము గలుగునపుడు, తత్తదుపాధి పరిచ్ఛిన్నమగు, ననంత జ్ఞానానుస్యూతజ్ఞాన సామాన్య మాత్రమె నిజనుగు రూపము. కావున నది దేశకాలాకారములచే, నపరిచ్ఛిన్న మైనది. అటుల నది వేద్యమే యగుచున్నది.

అట్టి యపరిచ్ఛిన్నాత్మ జ్ఞానతత్వము నెట్లుగ తెలిసికొనగు ననిన వినుము నీకొక్క యేకాలది జ్ఞానముచ, ఘటాద్యాకారము భాసించున్నదో, దానిని విశదమగుబుద్ధిచే విచారింపుము. నీకు కలుగు ఘటజ్ఞానమందు, ఘటమనియు జ్ఞానమనియు రెండంశలుగలవు. అందు ఘటముప్రకాశ్యము. జ్ఞానము ప్రకాశకము. ఆ ప్రకాశమాత్రమగు జ్ఞానమునకు భానశక్తి యని పేరు ఘటమునకు నీలరూపమువలె, నీ భానశక్తికిభాస్యము స్వరూపాంతర్గతము. కావున, నీభానశక్తి భాస్యహీనమైనది. విషయభేదముచే గాని, పురుషభేదమున గాని, యీ భానశక్తులు భిన్నముగ భాసించుచున్నవి. కాని వీనియన్నిటి యందును. సర్వానుస్యూతమగుట, నన్నిటికి నాశ్రయమగు ప్రకాశసామాన్యము సర్వభాన సమాశ్రయ మగుచున్నది. ఆభానశక్తియె, శుద్ధ చిదాత్మ తత్వము,

ఉపాధి పరిచ్ఛిన్నమగు నఖిల జ్ఞానానుస్యూతభాన శక్తి రూపమె, యాత్మతత్త్వమని చెప్పియుంటిని. జ్ఞానమందు భాసమానమగు భేదము, జ్ఞానస్వాభావికమైనది కాదు. ఔపాధికమైనది. అది యెట్టులనిన వినుము. ఘటాది జ్ఞానమందు భాసమానమగు ఘటాది రూపము వేద్యాంశము. అది జ్ఞానాత్మక మగు విత్తిగాజాలదు. వేద్యభూతములగు ఘటాదులు, జ్ఞానాంశస్వరూపము గాజాలవు. కారణ మేమన, వేద్యము స్వయముగ బ్రకాశింపజాలదు. అనగ, నస్వప్రకాశమానమగుట, వేద్యము విత్తిరూపము గాజాలదని భావము. ఏ విత్తిచే, వేద్యము ప్రకాశింపబడు చున్నదో, యా విత్తి వేద్యముకంటె నన్యమైనది. అటులనె, వేద్యము విత్తిచే తెలియబడుట వేద్యము విత్తికంటె భిన్నమైనది. కావున, వేద్యరూప విభేదమున, విత్తియందు భేదము గలుగజాలదు. ప్రతీయమానమగు భేదము, శుక్లనీలవర్ణులాద్యాకార గతము అది వేద్యమునందె భాసించుచున్నది. కాన భేదము వేద్యధర్మమనియె, చెప్పవలయును. నిరాకారమగు విత్తిని భేదము స్పృశింపజాలదు. ఇది పరోక్షవాదము గాదు. ప్రత్యక్షముగ గనుము.

సంకల్పరహితమగు బుద్ధిచేత, విత్తినుండి వేద్యమును వేరుజేసి, యాకార వివర్జితమగు విత్తిని గనుము. ఇందుల

దృష్టాంతమును వినుము ఆదర్శ మేకరూపమైనను, విభిన్న ములగు బింబముల యాకృతిని గాంచుచున్నది. అటువలె, చిదాత్మకూడ దృశ్యములగు ఘటాదులయొక్క నీలవర్ణత్వా ద్యాకారముల ధరించి. నానారూపత్వమును గాంచుచున్నది. కాని స్వతః అటులగాదు. ఈ విత్తి వేద్యాంశముల నిది కాదిదికాదని, నిషేధించుటచే, పరిశిష్టరూపమున తెలియబడు చున్నది (వేద్యమగుచున్నది). అంతియకాని, విశ్వమున కాశ్రియ భూతమగుట. నపరిచ్ఛిన్న మగునది స్వభావతః వేద్యము గాజాలదు శుద్ధ విత్తి వేదితృ స్వరూపమెయగుట, తెలియబడనేరదు. కాని యాత్మరూపమున భాసించు, వేద్య ములగు దేహాదులయొక్క ప్రతిషేధమున – ఇది యాత్మకా దిది యాత్మకాదని – స్వాత్మరూపము ప్రతిషేధింప నశక్యము గాన, సర్వ ప్రతిషేధానంతరము, ప్రతిషేధావధిభూత మగు నది స్వతః ప్రకాశమాన మగుచుండును. సమాధి విరమించి తద్దశను విమర్శించుట చేత. నది వేద్యమైనదిగ నగును. అవేద్యమగు శుద్ధ చిదాత్మ యిటుల వేద్యము గాగలదు.

అష్టావక్ర! ఇట్టి నీ నిజరూపమును స్ఫుటముగ విమ ర్శింపుము. అస్థికత్వమె, యేకస్వభావముగాగల శరీరమనః ప్రాణములు నీవుగాదు. బాల్యాద్యవస్థానుగత 'అహం' ప్రత్యయానుసంధాన రూపముననూ, జాగ్రదాద్యవస్థాను గత

'అహం' ప్రత్యయానుసంధానరూపమునను, నిత్యుడవుగ ధృవపడు నీవు, ధాతుసమూహ మాత్రమగు శరీర మెట్లగుదువు? శరీరమే నీ వగునెడల, నెల్లపుడును, తత్స్మరణ యుండ వలయునుగదా! అన్యవిషయము భాసించునపుడు, నీ దేహమూనందుగల 'అహం' బుద్ధి స్ఫురించుటలేదే! అటులనె, ప్రాణమనోబుద్ధులు గూడ నహంబుద్ధిచే నతిక్రమింప బడుట వలన, నవియునహంపద లక్ష్యములు గాజాలవు. అహంబుద్ధి రూపమున నాపరాచితి యుండియున్నది. కావున, యథార్థముగ సర్వవేత్రియగు నాపరాచితియె, నీవు.

అంతర్ముఖీకృత చక్షువు గలవాడవగుచు, స్వాత్మరూపమును గాంచుము. పరిపక్వాంతఃకరణు లుపదేశకాలమందె. స్వస్వరూప జ్ఞానము గలవారగుచున్నారు. చక్షువన బహిర్వ్యాతమగు గోళకము గాదు. మనస్సనెడి చక్షువని నా యభిప్రాయము. అనగ, జాగ్రతయందు నేత్రవ్యాపారము మానసాధీనమగుటచేతను, స్వప్నమందుమనస్సె, చక్షురూపము దాల్చుటచేతను, మనస్సె ముఖ్యమగు చక్షువని నా యభిప్రాయము. అట్టి మనస్సునకు ప్రత్యావృత్తి, యనగ, నంతర్ముఖత్వము లేక, ఆత్మ సాక్షాత్కార మసంభవమని భావము. ప్రత్యావృత్తియన నెట్టిదో వినుము. ఏదియేని యొక వస్తువును కంటితో చూడదలచినవా డితర వస్తువుల

నుండి దృష్టిని ప్రత్యావృత్తి మొనరించి, యా వస్తువునందె నిగిడ్చి నపుడుగాని, యయ్యది స్పష్టముగ భాసింపదు. అట్లు గాని యెడల, నెదుటనున్న వస్తువుకూడ స్పష్టముగ భాసింప కుండుటయు, సుతరాం భాసింపకుండుటయు గూడ కలుగు చుండును. అటువలె, శ్రోత్రత్వగాది స్థితియు గూడనని యెరుంగుము. మనస్సునందు సుఖదుఃఖములు గూడ భాసిం చు, టటువలెనని యెరుంగుము అన్యవ్యాపృతము గాక. తదేకపరమగు నపుడె, మనస్సునకు బూర్ణమగు సుఖదుఃఖా ద్యనుభవము గలుగ గలదని తాత్పర్యము. కావున విషయ గ్రహణకు దృష్టియొక్క పరావృత్తి, తదేక పరత్వము, నను రెండు లక్షణములును గావలయును.

నిజరూపమును భాసింపజేయు శుద్ధమగు మనస్సొక పత్యావృత్తిలక్షణము గలదియె. కావలసియుండును. తదేకపర త్వము నపేక్షింపదు. ఆ విషయము స్పష్టముగ దెల్పెద నాలకింపుము చిదాత్మ మనస్సునకగోచరము, గోచరము గూడ నగును. అందు శ్రుత్యాగమ నిపుణు లనేకులు భ్రమ జెందుచున్నారు. బాహ్యమున, మనోగోచరత్వము. రెండు విధములనున్నది మొదటివిధ మితరములనుండి పరావృ త్తియు, రెండవది తత్పరత్వమును నగుచున్నది. మనస్సున కన్యపరావృత్తి గలిగి నంతమాత్రమున, నుదాసీన దశలం

దేవస్తువుగూడ కొంచెమేని భాసించుటలేదు. కావున మనస్సునకు తత్పరత్వ రూపమగు రెండవవ్యాపారము గూడ నవసరము. ఇట్లు పరిచ్ఛిన్న అనాత్మవస్తువులు, మానసవ్యాపారద్వయమున భాసించుచున్నవి. చితి యపరిచ్ఛిన్నము, వికారరహితము. కావున దద్భాసనము, పైజెప్పిన వ్యాపారద్వయ మపేక్షింపదు.

ఇతర వస్తువుల నుండి పరావృత్తిమాత్రము చేతనే, చిదాత్మ భాసించును. ఇందుల దృష్టాంతముగనుము. ఎదుటనున్న దర్పణమందు, ప్రతిబింబమును జూడదలచినవాడితర విషయములనుండి, పరావృత్తియు, తదాభిముఖ్యతయు, అనగ, తత్పరత్వమును గలవాడు గావలసి యుండును. దర్పణమందాకాశమును జూడదలచువాని కన్యపరావృత్తి మాత్రము ననే, కృతార్థత గల్గుచున్నది. సర్వత్రవ్యాపించి, యాకాశము దర్పణమందు, సర్వదా యుండియె యున్నది. కాని, యన్యవస్తువులచే నాచ్ఛాదిత మగుచు, భాసింపనపుడు, తదన్యవస్తువులను దొలగించు నంతమాత్రముననె భాసించును. అనగ, నన్యపరావృత్తి మాత్రముననె భాసించును. అటువలె, చితియు సర్వ వ్యాపకమును, సర్వాశ్రయమునగుచు, సర్వకాలమందును, దర్పణమందు గగనము వలె మనస్సునందు పూర్ణముగ నిండి యున్నది. కావున చితి భాసింప

వలెననిన, మనస్సున కన్యపరావృత్తి మాత్రమె, కావలసి యున్నది. విప్ర! చితి యెప్పు డేచ్చట భాసింపకున్నది? చిదాత్మ భాసించుటయందు, మనస్సున కన్య పరావృత్తి మాత్రమె, యావశ్యకము. ఆభిముఖ్యత సహజసిద్ధమగుట, నూతనముగాదు. కాన తదపేక్ష లేదు. నూతనమగు నాభిముఖ్యత లేనందున చిత్తు, అవేద్యమయ్యెను. కావున చిత్త్వము శుద్ధ మనోమాత్ర వేద్యము. అన్య వస్తువుల నుండి పరావృత్తి కలుగుటయె మనస్సునకు శుద్ధి. ఇది యె, పరతత్వ జ్ఞానమునకు సాధనము. మనస్సునకిట్టి శుద్ధి కలుగ నంతకాలము, జ్ఞానము గలుగబోదు. కలిగినజ్ఞాన మధ్రువము. కర్మ, ఉపాసన, వైరాగ్యాదికము మున్నగు వాని కెల్ల మనస్సున కట్టి శుద్ధి గలిగించుటయందె, వినియోగము. కావున నన్యపరావృత్తి రూపమగు శుద్ధిగల్గిన మనస్సున కాత్మ భాసించును.''

రాజిట్లుబలుక నష్టావక్రుకు తిరిగి యిట్లనియెను. "రాజ! మీరు జెప్పి నటుల, నన్యపరావృత్తి మాత్రమున నె, మనస్సున కా పరాచితి భాసించు నెడల, నట్టి యన్య పరావృత్తి కలిగిన సుషుప్తి యం దాత్మ భాసింపవలయునుగదా! సుషుప్తి మాత్రమున నె, యటుల కృతార్థతగల్గుచుండ, సాధనాంత రాపేక్ష యేల?'' జనకుడంత "భూదేవ! సమాధానము

జెప్పెద సావధానుడవగుచు వినుము. నీవుచెప్పునది సత్యము. సుషుప్తి యందు, మనస్సున కన్యపరావృత్తి పూర్ణముగ నున్నది. కాని, యీ యవస్థయందు మనస్సునకుగల వస్త్వవభాసన సామర్థ్యమె లీనమైనది. అట్టిచో, నాత్మ నెటుల భాసింపజేయును? ప్రతిబింబధూళ్యాది యన్యవస్తువులయొక్క పరావృత్తి కలిగినంతమాత్రమున, కాటుకచే పూయబడిన దర్పణమందు గగనము భాసించునా? అటువలె నన్య పరావృత్తి గలుగుచు, నిద్రచే విలిప్తమైన మనస్సయోగ్యమగుట, చితిని భాసింప జేయజాలదు. అట్లు గానియెడల లోష్టకుడ్యాదుల యందుగూడ, నా చిద్రూపము భాసించి యుండవలయును. కావున యోగ్యమగు శుద్ధ మనస్సునందె, చితి భాసించును. ఆకారణము ననె, సద్యోజాత శిశువుయొక్క మనస్సునందిది భాసించుటలేదు.

ఇంకను జెప్పెద వినుము. మసిచే బూయబడిన దర్పణమందు మనచే లక్షింపబడకున్నను, మసియొక్క ప్రతిబింబము యుండియే యున్నది. సన్ముఖస్థమగు ప్రతిబింబమును గ్రహించు దర్పణ స్వభావము మారజాలదు. కాన మసియొక్క ప్రతిబింబ మూండెననుటకు సందియము లేదు. అటువలె మనస్సు సుషుప్తియందుండినపుడు నిద్రయను దాని తోడ గూడియుండెను. నిద్రయను, నన్యవస్తు వచ్చుట నుండు

టచే, నన్యపరావృత్తి సిద్ధింపకున్నది. కాన చితినిభాసింపజేయ జాలదు. నిద్రచే గూడియున్నదనుటకు, మేల్కాంచిన తదు పరి, తన్నిద్రా స్మృతియు, తద్దశయందు గల మూఢత్వ స్మృతియు గల్గుటయె, కారణము ఇట్లు సుషుప్తియందు మనస్సుయొక్క మనస్త్వము లీనమగుటను, నిద్రాతత్పరత్వ ముండుటచే, నన్య పరావృత్తి సిద్ధింపకుండుట వలనను, ఆత్మావభాసము లేదని యూహింపగుచున్నది

ఇంకను లెస్సగ దెల్పెద మిక్కిలి సావధానుడవగుము. మనస్సునకు ప్రకాశ విమర్శలను నవస్థాద్వయము గలదు బహిర్విషయ సంబంధము ప్రకాశావస్థ యనబడుచున్నది. బహిర్విషయము మనస్సునందు ప్రతిబింబముగ గ్రహింపబడి, తద్విషయార్థమును గూర్చి, 'ఇదియిట్టి'దను శబ్దసంభేదమగు విచారము గల్గుట విమర్శావస్థ యనబడు చున్నది. మొద టిది యగు ప్రకాశావస్థ యనునది 'ఇట్టి', 'ఇట్టి' వస్తువను జ్ఞానమునకు పూర్వావస్థ గాన, నందు వస్తు విభేదము లేదు. కావున నది నిర్వికల్పము. భేదరూపమున నిది ఘట, మిది పటమనను శబ్ద సంభేదాత్మక విచారరూపము రెండవది యగు విమర్శావస్థ. కాన, నది సవికల్పము. 'ఇది, యిట్టి విధము గలద'ను శబ్దభేదము లేనిదగుచు, కేవల వస్తుదర్శన రూప మగు ప్రకాశము నిర్వికల్పము. 'ఇది యిట్టివిధమైన'దను

వస్తు దర్శన మూలకమును, శబ్ద సంభిన్న రూపమును నగు విచారాత్మ భాసనము విమర్శయగుచున్నది. కాన నది సవికల్పము. అది, యభినవమనియు, నన్యమనియు రెండు విధములు. అభినవ మనుభవాత్మకము అన్యమనునది, పూర్వానుభవ సంస్కారముచే గల్గిన స్మృతి రూపానుసంధానాత్మకము. ఇట్లు మనస్సు ప్రకాశ విమర్శాత్మక, నిర్వికల్ప సవికల్పకా భాసశక్తి ద్వయయుత మగుచున్నది.

మనస్సెల్లప్పుడును, ఈ శక్తి ద్వయయుతముగనున్నది. నిద్రా విషయికమగు ప్రకాశరూపమును అనగ. నిర్వికల్ప రూపమును దీర్ఘకాలము ధరించినది సుషుప్తి. ఘటాది నిర్వికల్పము వలె క్షణికమైనది కాదు. అనేక వికల్పము లుదయించుటచే, సవికల్పక జ్ఞానబాహుళ్యము గలిగి బహుళ విమర్శగలది జాగ్రదావస్థ. కాన నదియు మూఢదశ యని చెప్పబడుచున్నది. సుషుప్తియందు విమర్శలేదు గాన, నందు మూఢత్వము చెప బడుచున్నది. సుషుప్తి విమర్శ హీనమగుట, కేవల ప్రకాశాత్మక మగుటచే, మూఢ దశ యగుచన్నది. ఇట్టి ప్రకాశనిబిడత్వము చేతనె, దీపాదులు మూఢములని నిశ్చయింపబడినవి.

తాత్పర్యమేమన, చిదాత్మ ప్రకాశైక రూపమైనను,

బ్రకాశించు నొక రాయివంటిది కాదు. అట్లైన జడమె, యగును. చిదాత్మ స్ఫురత్ప్రకాశ రూపమైనది. ఇట్టిప్రకాశము దీపాదులకు లేదు. ఆ స్ఫురద్రూప చైతన్యమునకే, విమర్శయనియు, చితి శక్తియనియు, క్రియాస్పందనమనియు, పరాఽహంతయనియు, పర్యాయనామము లాగమము లందు జెప్పబడుచున్నవి. చిదాత్మ కిట్టిరూపమున నె, జగత్క్రియా ప్రభ విష్ణుత్వముగలుగుచున్నది. కావున నిట్టివిమర్శ యుదయింపక, సర్వథా ప్రకాశ నిబిడత్వమె, యుండి యున్నను అట్టిది మూఢ దశయని, విద్వాంసులు నిశ్చయించిరి. విమర్శానుదయమె, జాడ్యనిమిత్తమని భావము.

సుషుప్తియందు నిద్రాచ్ఛాదనవలన, విమర్శ యుదయింప కుండెనని చెప్పియుంటిని. ఆనిద్రయన నెట్టిదో వినుము. ఇది తొలుతబుట్టిన యవ్యక్తము, చిదాత్మయొక్క పరిచ్ఛిన్నావ భాసః రూపమగు బాహ్యావభాసనము, జగచ్చిత్రమునకు భిత్తిరూపమున జెప్పబడినది యీయవ్యక్తమె దానికెట్టి యాకృతియు జెప్పుటకు వీలులేదు కాన, నదియవ్యక్తము, ఆ కారణముననె, యీది మహాశూన్యము. అది సుషుప్తి యందు నిద్రి యనబడుచున్నది. అత్యంతాభావ మవ్యక్త లక్షణము. సుషుప్తియం దేమియు లేనిస్థితి, యుద్ధితకాల స్మృతి రూపమున దెలియబడు చున్నది. నిద్రయన దృశ్య

సామాన్యాభావ లక్షణము. కాన సుషుప్తి, అప్రకాశావస్థా రూపమగు నిద్రను బ్రకాశింపజేయుచున్నది. నిద్రయందు, వస్తుదర్శనకాలమందు గూడ నిట్టి విధముననె, దృశ్యసర్వాభావముగలిగి మూఢముగనె యుండును. కాని, యుత్తర క్షణమందు బుట్టిన వికల్ప సమూహమున, నామూఢత్వము గప్పబడుచున్నది. సుషుప్తియందు మనస్సు విలీనమగుచుండ, నిద్రా ప్రకాశరూపమును ధరించినదను పెట్టిదనిన, నవ్యక్త శక్తి ప్రకాశైకత్వమున నుండుట, నప్పుడు మనస్సునందు విమర్శ యుదయింపదు. కాన విలీనమగుచున్నదని చెప్పుచున్నాము. వస్తుదర్శన కాలమందుగూడ మనస్సిటువలె లీనమగుచున్నది.

అష్టావక్ర! స్వానుభవమున నీకు పరమ రహస్యము దెల్పెద వినుము. అతిసూక్ష్మ విమర్శకులగు విద్వాంసులు గూడ నిందు మోహము నందుచున్నారు. నిర్వికల్ప సమాధి, సుషుప్తి, వస్తు దర్శనము, నను నీమూడును ప్రకాశనిబిడత్వముచే, నొకేవిధము గలవి. అనుద్భూత విమర్శాత్మత్వము గలిగి, కేవల ప్రకాశమాత్రాత్మకము లగుట నొకేవిధము గలవి. అట్లైచో, నిది సుషుప్తి, యిది, సమాధి, యిది వస్తు దర్శనమను వ్యవహార భేద మెట్లు గల్గుననిన, వినుము. స్వరూప సామ్యమును గల్గియుండినను, ఉత్తరోత్తర జని

తాను సంధానాది రూపవిమర్శ భేదమున, నివి భేదించు చున్నవి. సమాధ్యనంతరము, ఇంతకాలము నేనుపరతి జెంది యుంటినని, సుషుప్తి యనంతరము 'నాకేమియు దెలి యలేదనియు, వస్తుదర్శనానంతరమిది ఘటమనియు, విమర్శా భేదముచే ననుసంధానము గల్గుచున్నది. విమర్శ యుందలి, యిట్టి భేదమునకు భాస్యపదార్థభేదము కారణము. సమాధి యందు భాస్యమగునది కేవల చితి. సుషుప్తియందు భాసిం చునది యవ్యక్తము. వస్తుదర్శనమందు భాసించునది, ఘటాది భిన్నభాసనము. భాస్యమటుల త్రివిధముగ నున్నది. సమాధ్యాదులందుగల భాస్యభేదములచే, స్వరూప భేదము గూడ నావశ్యకమె యగునన, నటులగాదు. సమాధ్యాది భాస్యము నిర్వికల్పమగుట, భిన్నముగాదు. విమర్శారహిత ధర్మ మొప్పుచుండుట, ప్రకాశ నిబిడత్వ రూప సమాన ధర్మము గలవియనియె చెప్పవలసియున్నది. సమాధి సుషు ప్తులు చిరకాలముండుట, ననంతరము స్పష్టముగ నందర చేతను విమర్శింపబడు చున్నవి. వస్తుదర్శనము క్షణికమగుట, స్పష్టముగ విమర్శింపబడజాల కున్నది. అటువలె క్షణిక సమాధియు, క్షణికసుషుప్తియు విమర్శ కందకబోవుచున్నవి. జాగ్రిద్దశయందు క్షణికములగు సుషుప్తి సమాధులుండియే యున్నవి. సూక్ష్మదృష్టి గలవారలచే, క్షణికసుషుప్తి, పరి చయమువలన లక్షింపబడుచున్నది. అపరిచయ దోషమున

సూక్ష్మసమాధి లక్షింపబడజాలకున్నది. బ్రాహ్మణునకే సర్వప్రాణులకును వ్యవహార దశలయందు గూడ సూక్ష్మ సమాధులుగలవు. పరిచయాభావమున లక్షింపబడకున్నవి జాగ్రతయందు, విమర్శాభావదశ, యెప్పుడెప్పుడుండిన నది యెల్ల సమాధియనియె తెలియుము. కాన సమాధి యన విమర్శాభావమాత్రమె యని తెలియుము. కాన సుషుప్తి వస్తు దర్శనములందుగూడ సమాధిత్వము గలదు.

అయిన సుషుప్త్యాదులచే సమాధిఫలము గలుగు చున్నది కదా యనిన నట్లుగాదు. సుషుప్తి దర్శనములందు ముఖ్య సమాధిత్వములేదు. అవి రెండును భేదరూప విమర్శ యొక్క సంస్కార గర్భితములగుట, వానియందలి సమాధి త్వమునకు ముఖ్యత్వము లేదు. అనగ, అనాత్మభూతదృశ్య వస్తువిషయిక వికల్ప జ్ఞానముయొక్క సూక్ష్మ రూపమును ధరించి యున్నవని యర్థము. సుషుప్త్యనంతరము నేనేమియు నెరుగననియు, వస్తు దర్శనానంతర మిది ఘటమనియు, నిద్రా ఘటరూపమగు, భేదవిషయిక రూప విమర్శ గలుగు చున్నది. వాటియొక్క సంస్కారాత్మరూపమగు సూక్ష్మ రూపము స్వకార్యములగు సుషుప్తియందును వస్తు దర్శన మందును గలదు. సమాధ్యనంతరము, విమర్శ చిదాత్మ మాత్ర విషయికముగనె యుండును. వానియందలి భేద

మిట్లు తెలియదగును.

క్షణికములగు సుషుప్తి సమాధులెట్ల విమర్శన రూపములో, జాగ్రితయందలి క్షణిక సుషుప్తి సమాధులు గూడ నట్లె యగుచున్నవి. అట్లైన సమాధి సుషుప్తివలె జడమగునుగదాయనిన, రెంటికిని సామ్యముండి యున్నను, అందలి సూక్ష్మవిశేషమును దెల్పెద వినుము. సృష్ట్యాదియందు బుట్టినదియు, బహిఃపదార్థముయొక్క అర్ధ భూతమును నగు నవ్యక్తము, దృశ్య సామాన్యాభావ లక్షణము గలది. సుషుప్తియందు. దృశ్యసామాన్యా భావము భాసించు టనుభవసిద్ధము. కావున సుషుప్తియందు దృశ్యా త్యంతాభావమె భాసించుచున్నదని సిద్ధమైనది. కావున పర చిదాత్మయొక్క దృశ్య సామాన్యాత్యంతాభావ రూపావ్యక్తా త్మక జడశక్తియే, సుషుప్తియని తేలినది. సుషుప్తి జ్ఞానమునందు భాసించునది, యేమియు భాసించుట లేదను నదియే. ఏమియు భాసించుటలేదను, దృశ్యాత్యంతాభా వము జడశక్తి. సుషుప్తి దానికి స్థానమగుట, నాకేమియు తెలియదను తాత్కాలికదర్శనము, తదుపరి స్మృతిరూపమున భాసించుచున్నది. కావున సౌషుప్త జ్ఞానమునకు జడశక్త్యా కారము సిద్ధించినది. కావున సుషుప్తి జడరూపమైనది. సమాధికాలమందు సమాధియందు భాసమానమగునది బ్రహ్మా కారిణి యగు చితి. సమాధియన మనస్సు అనాత్మ విషయము

నుండి పరావృత్తి జెంది, ప్రత్యక్చిదాకారమును జెంది యుండుట అందు భాసమానమగుచితి, దేశకాలములచే, నపరిచ్ఛిన్నమును, పరిపూర్ణమును స్వయంప్రకాశమును నగును. అట్టి సమాధి సుషుప్తి యెట్లుగాఁగలదు? కావున సుషుప్తి మాత్రమున కృతార్థత గలుగజాలద”ని, జనకు డష్టావక్రునికి బోధించెను.

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
ప్రకాశిక యను నాంధ్రీకరణంబున, నష్టావక్ర
జనక సంవాదమను షోడశాధ్యాయము.



# సప్త దశాధ్యాయము.

తే॥గీ॥ సోహమను సమాధిగత చిత్స్వాత్మభావ
ప్రత్యభిజ్ఞాన సహితంబె పరమ పదము
సుప్తి దర్శన కల్పనా శూన్యతయగు
నర్థ్యమన నెందు వినుమంబ! మౌనిపలుకు-

పరశురామ! అష్టావక్రుడిట్టుల జనకునిచే జెప్పబడిన తత్వ లక్షణమును విని తిరిగి యెట్టుల ప్రశ్నించినదియు, జనకు డెట్టి ప్రత్యుత్తరముల నిచ్చినదియు. సర్వము నెరింగించెద వినుము. అష్టావక్రుడంత నో రాజ! వ్యవహార దశలయందు గూడ సూక్ష్మ సమాధులుండునని చెప్పియుంటివి అట్టి నిర్వి కల్ప చిదాత్మక సమాధు లేయే దశలయం దెట్లుగా గలు గునో, సెలవీయ గోరెద'' నని యడిగెను. ఆ రాజంత టుల సమాధాన మొసగెను ''బ్రాహ్మణుడ! చెప్పెదని వినుము. తొలుత ప్రియురాలి సమ్యగాలింగనము బొంది నపుడు, క్షణకాలము నరుడు, బాహ్యాంతర వ్యాపారము నెరుంగక, నిద్రాక్రాంతుడును గాక, యుండును. ఇది సమాధియని చెప్పబడును. బాహ్యమగు దిగ్దేశ కాలాదికము

గాని, యంతరమగు సుఖదుఃఖాదికము గాని గుర్తెరుంగక, నిద్రాక్రాంతిచే నగు మూఢత్వమును బొందని, యీ స్థితి వ్యవహార దశయందలి, క్షణికసమాధి. చిరకాలము వాంఛింపబడి, యలభ్యమని నిశ్చయింపబడినవస్తు, వకస్మాత్తుగ బ్రాప్తించిన, తత్ప్రాప్తిస్థితియం దట్టి సమాధి స్థితియే గలుగుచున్నది అతి సంతసమున, మార్గము వెంట నెట్టి విపత్తునైన నూహింపక వెడలునపు డకస్మాత్తుగ వ్యాఘ్రాదుల నెదుర్కొనిన క్షణమందుగూడ నట్టి స్థితియె కలుగును. అతి ప్రియుడును, ప్రయోజకుడును, గృహభార నిర్వాహకుడును, ఆరోగ్యవంతుడునగు పుత్రు, డకస్మాత్తుగ మరణించె నన్నవార్త వినిన క్షణమున గూడ నట్టిదియె కలుగును. ఇట్లు మహా సుఖహర్ష భయశోకాదు లాకస్మికముగ సంభవించు నెడ, తత్తదారంభ క్షణమందు, మనస్సు నిర్విమర్శ రూపమున, స్వరూపస్థితిని గాంచును. అదియె, క్షణికసమాధిదశ యనబడును.

మరియు బ్రికారాంతరమున సమాధి సంభవమగు విధము దెల్పెద వినుము. జాగ్రత్స్వప్న సుషుప్తుల మధ్య సమాధ్యవస్థలు గలవు. బాహ్యేంద్రియ వ్యాపారదశ జాగ్రదవస్థ. కేవల మనస్సునకగు స్థూల వ్యాపారదశ స్వప్నావస్థ. నిద్రచే మనస్సుయొక్క విలీనదశ సుషుప్త్యవస్థ. ఈ

దశలయొక్క అంతరాళములందు, అనగ పూర్వదశ యంత రించి, ఉత్తరదశ నందనుండు క్షణికసమయములందు, మనస్సు నిర్విమర్శాత్మకముగ నుండును. కాన సమాధ్యవస్థలు గలుగుచుండునని తాత్పర్యము.

మరియు వినుము. దూరమున నున్న నొకవస్తువు నేకాగ్రమగుబుద్ధితో జూచునెడ, నుదాహరణముగ, నాకస మందలి సూర్యబింబమును జూచునెడ మనస్సు, తృణమునం దొకదానియందుండే తృణజలూకము నెడముగ నున్న మరి యొక తృణమునందుకొని. యందు బోవసాగి, దీర్ఘమగు నటుల, దీర్ఘముగాగలదు. దేహస్థితమగు మనస్సు, సూర్య మండల పర్యంతము దీర్ఘత్వమును బొందును. దేహమందు దేహాకారమును, సూర్యమండల రూపభావమందు, తద్భావా కారమును నగుచున్నది. దేహ సూర్యమండలముల మధ్య మనస్సు నిరాలంబముగ స్వరూపస్థితి బొందుచున్నది. దేహా కారమును విడచి, సూర్యాకారమును జెందని మధ్యకాల మున మనస్సు గగనాకారమగుచున్నదని చెప్పవలనుబడదు. గగనము నిరాకారమగుట, నేత్రేంద్రియ ద్వారమున మన స్సుచే గ్రహింపవలను బడదు. కావున తత్కాలమందు, మనస్సు దేహాద్యాకారమును విడచి, స్వరూపమాత్ర స్థితిని జెందుచున్నది. అది సమాధ్యవస్థ యగుచున్నది.

ఇంకను సర్వదా, బహుప్రకారముల సూక్ష్మసమాధులు గల్గుచుండును. అవియు దెల్పెద వినుము. వ్యవహారమునం దెవ్వనికి గాని, జ్ఞాన మొకరూపమున భాసింపదు. ఖండజ్ఞాన సముదాయమున వ్యవహారము ప్రసృత మగుచున్నది. వ్యవహారమందు ఘటాద్యాకార జ్ఞానధార సర్వానుభవసిద్ధము. ఆకార భేదము గూడ సర్వానుభవ సిద్ధము. తత్తదాకార పరిచ్ఛిన్న ఖండజ్ఞాన సముదాయమె, ప్రసృతమగు వ్యవహార మంతయు నగుచున్నది. ఏకజ్ఞానమందు వ్యవహారము యుండదు. జ్ఞానమటు లనేకము గాకపోవుటచేతనె, యాచార్యులగు సుగత కాణాద ప్రభృతులు, క్షణభేదముచే భేదితమగు జ్ఞానధారయె, యాత్మయనియు, నట్టి జ్ఞానధారాత్మక ఆత్మధర్మము బుద్ధి యనియు మున్నగువిధముల జెప్పియుండిరి. జ్ఞాన భేద మిటుల నందరచేతను, నంగీకరింపబడినది. క్షణిక జ్ఞానముల యొక్క అంతరాళములందు నిర్వికల్పత్వము సిద్ధించుచున్నది. ఘటజ్ఞానమందు, ఘటజ్ఞానమెకాని పటజ్ఞాన ముండజాలదు; అటుల జ్ఞానము భేదించుచుండును. ఇట్టి జ్ఞాన భేదములందంతరాళ దశలు తప్పనిసరియగుచుండును. అప్పుడు మనస్సు నిర్వికల్పత్వమును దాల్చుచుండును. అష్టావక్ర! యిటుల సమాధిస్వరూప పరిచయము గలవారలకు ప్రతిక్షణము సమాధి గల్గుచునెయున్నది. అట్టి పరిచయము లేనివార

లకు సమాధి శశశృంగము వంటిది.''

జనకుడిటుల జెప్ప విని, యష్టావక్రు డీరీతి ప్రశ్నించెను. "రాజ! యిటుల వ్యవహారమందు నిర్వికల్పసమాధి, యందరకును గల్గుచు డు నెడల, సంసృతి యెట్లు గల్గుచున్నది? సుషుప్తియం దవ్యక్తమును, వస్తు దర్శనమందు జడాదులగు ఘటములును భాసించుటచే, నా రెంటికిని పురుషార్థ సాధకత్వము లేకపోవుచున్నది. నిర్వికల్ప సమాధియందు శుద్ధ సంవిదాత్మ భాసించుచుండ, నట్టి సమాధ్యనుభవము గల్గునెడ తిరిగి సంసృతి గల్గుటెట్లు? నిర్వికల్ప సమాధి యందు ప్రకాశమగు జ్ఞానమె కద యజ్ఞాన సర్వ నాశన కరమును, నిశ్శ్రేయ సకారణమును నగుచున్నది. అట్టిచో, తిరిగి సంసరించు టెట్టిది? నాకీ సంశయము నివారింపుము.''

జనకుడంత "భూదేవ! యీ పరమ రహస్యము చెప్పెద వినుము. అజ్ఞానముచే. సంసార మనాదికాలము నుండియు బ్రవృత్తమైనది. ఇది సుఖ దుఃఖరూపప్రవాహమున స్వప్నమువలె, తెంపులేక నందరచేతను సర్వదా యనుభవింపబడుచున్నది. ప్రవాహ రూపమున ననుభవింపబడుచుండినను, తెంపులేనిదైనను, స్వప్నసాదృశ్యము జెప్ప

టచే నసత్యమైనదని భావము. ఇట్టి యజ్ఞాన కార్యము యొక్క నివృత్తి, జ్ఞానముచేనని, నిశ్చయింపబడినది. అజ్ఞానము నిశ్శేషముగ నాశమొందించు జ్ఞానము సవికల్ప జ్ఞానము - ఈ సవికల్ప జ్ఞానమున, ప్రత్యభిజ్ఞ కలుగుటచే నగు సవికల్ప జ్ఞానమని యర్థము నిర్వికల్ప జ్ఞానముచే నజ్ఞానము నివర్తింపబడదు నిర్వికల్పజ్ఞానము దేనికిని విరుద్ధముగానిది. అచ్చట నన్యవస్తు ప్రతీతియె, లేనప్పుడు, విరుద్ధత్వమునకెట్టి యవకాశమును లేదు. చిత్రవిచిత్రభాసములకు భిత్తివలె, సవికల్పములకు నిర్వికల్ప జ్ఞాన మాశ్రయభూతము. కాన విరుద్ధత్వము లేదు. కావున, అజ్ఞానము నివర్తింపబడదు. కేవల జ్ఞానము నిర్వికల్ప జ్ఞానమని చెప్పబడుచున్నది. అందు సంకల్ప దశయందు తత్తదాకారోల్లేఖనమందు సవికల్పత గలుగుచున్నది. సవికల్ప జ్ఞానమె యజ్ఞానము. మరియొకటి కాదు. అది కార్యకారణ రూపమున ననేక విధముల నున్నది. స్వాత్మయందు పూర్ణత్వాఖ్యాతియె, కారణ రూపమగు నజ్ఞానము. చిదాత్మ పూర్ణము. అవచ్ఛేద రహితము. అవచ్ఛేదమునకు దేశకాలాకారాదులు నిమిత్తమగుట ప్రసిద్ధము. ఈ మూడునుగూడి చిదాత్మకు పరిచ్ఛేదములు గాజాలవు. ప్రతిబింబముల యునికి దర్పణాధీనమగునటుల, దేశకాలాదుల యునికి చిదాత్మాధీనము. తమ తమ స్వరూప సాధకమగు దర్పణమునకు ప్రతిబింబములు,

పరిచ్ఛేదము గలిగింపజాలనటుల, దేశకాలములు చిదాత్మకు పరిచ్ఛేదము గలిగింప జాలవు. అటుల కాలాదులచే నపరిచ్ఛిన్న మగు స్వాత్మయొక్క పూర్ణత్వ ఖ్యాతియందపూర్ణత్వఖ్యాతి చెప్పుటయె మూలమగు నజ్ఞానము. ఇట్టి యజ్ఞాన కారణమునకు దేహాత్మత్వాది భాసన రూపమగు కార్యాత్మకా జ్ఞానము పల్లవప్రాయము. ఈ యజ్ఞానముయొక్క నివృత్తి కలుగువరకును సంసారము నివర్తింప బడదు. పూర్ణాత్మ విజ్ఞానముననె కాని, అజ్ఞానము నివర్తింప బడదు.

ఆ పూర్ణాత్మ విజ్ఞానము పరోక్షమనియు నపరోక్షమనియు రెండువిధములు. గురుశాస్త్రములవలన గలుగునది పరోక్షజ్ఞానము. అది సాక్షాత్సంసార దుఃఖ నివృత్తి రూప పురుషార్థమునకు కారణము గాజాలదు. శాస్త్రములయొక్క శ్రద్ధామాత్ర శ్రవణాదులచే, నీవుగలిగినజ్ఞానమునకు సంసార నివర్తక రూప ఫలము గలుగ నేరదు. అదియు పరోక్షజ్ఞానముననె కాని కలుగదు. ఆ యపరోక్ష విజ్ఞానము సమాధిప్రకర్షచేగాని జనింపదు. అనగ, దేహాద్యహంభావాది రూపవాసనలు చిరసంగతము లగుట, మలినమైన బుద్ధుల, కపరోక్ష జ్ఞానమొకప్పుడు గల్గినను, నది దృఢసంస్కార దాయకము గాజాలదు. కాన సమాధి ప్రకర్షచే సిద్ధమగు జ్ఞానము దృఢ సంస్కారము గల్గిన దగుట,

దేహాద్యహంభావాది దృఢవాసనలు విచ్ఛేదమునంది, తిరిగి యనర్థసంగతి కలుగదని భావము. కావున నట్టి సమాధిప్రకర్ష చేగల్గిన యపరోక్షవిజ్ఞానమె, ప్రపంచ జ్ఞాననాశన సమర్థమును, మోక్షఫలావహము నగుచున్నది.

సమాధి ప్రకర్షచే నట్టి విజ్ఞానము గల్గునెడ, జాగ్రిదాదులం దెల్లరకును, సమాధి పరంపరలు గలుగుచుండ, నట్టి జ్ఞానమేల యుదయింపదనిన, చెప్పెద వినుము జ్ఞానపూర్వక మగు సమాధియె యట్టి విజ్ఞాన జనకమగుచున్నది. అవగ, పరోక్షజ్ఞాన పూర్వకసమాధి యపరోక్ష విజ్ఞానమును గలిగింప గలదు. కావున పరోక్ష జ్ఞానాభావము నందు సమాధి గల్గినను, యజ్ఞానులకు పురుషార్థము సిద్ధింపదు. అట్లైన శాస్త్రజ్ఞులకు పరోక్షజ్ఞాన ముండి యుండెనుగదా! వారలకు పూర్వముజెప్పబడిన నైసర్గిక సమాధులచే పురుషార్థ మేల సిద్ధింపకున్నదనియా శంకింతువేమో, దృష్టాంత ముఖమున దెల్పెద వినుము. మాణిక్యలక్షణ మెరుగని యొకానొకడు దైవగతిగ, కోశగృహ జొచ్చి, యందున్న మాణిక్యమును జూచె ననుకొనుము. పరోక్షముగ నైన వానికి మాణిక్యలక్షణ జ్ఞానము లేదు. కాన వాడు దానిని తెలిసికొన జాలకుండును. మరియొకడు పరోక్షముగ మాణిక్యలక్షణ మెఱిగినవాడు, కోశగృహమందు మణినిజూచి

ననుకొనుము. వాడు తత్పరుడైన నిది మాణిక్యమని గుర్తిం చును. అతత్పరుడైన. జ్ఞాతలక్షణుడయ్యును, నిపుణు డయ్యును, ఇది యేమి యని విచారము నందక అతత్పరత్వ కారణమున, నిది మాణిక్యమని గురింపజాలడు. ఆటువలె మూఢులు పరోక్షజ్ఞానరహితులగుటచే, స్వాభావిక సమా ధులచేత విజ్ఞానము నందజాలరు. శ్రుతజనిత పరోక్షజ్ఞాను లయ్యు శాస్త్రజ్ఞు, లతత్పరత్వ కారణమున, విజ్ఞానము నంద జాలరు. అనగ శాస్త్రము, స్వస్వరూపము దేహాది విలక్ష ణము, పరచిన్మయమని చెప్పుచున్నదికదా యని సర్వధా తత్సాధన సంపాదనచేత, దాని నపరోక్షీకృత మొనరింత మను, అభినివేశనాది సాధనలయందు తత్పరులు గాకుండుట, నపరోక్ష జ్ఞానము నందజాలకుందురు.

మరియొక దృష్టాంతమున, నీసూక్ష్మార్థమును వివరిం చెద వినుము. శుక్రతారా లక్షణ శ్రవణజన్య జ్ఞానహీను డగు మూఢుడాకాశమునం దొకానొకప్పుడు, శుక్రతారను గాంచుచు గూడ, నిది శుక్రతారయని యెరుంగజాలడు. మరి యొకడు శ్రుత జ్ఞానయుతుడయ్యును, తత్పరత్వ వివర్జితు డగుట, 'నాచే శుక్రతార సర్వథా తెలియదగినది' అను అభి నివేశము లేనికారణమున, నద్దానిని చూచినను, ఎరుగజా లడు. దిగాకారాది లక్షణములచే, పశ్చిమదిగ్గతమైనదియు,

సూర్యాస్తానంతరము గనబడునదియు, భాస్వరాకారము గలిగినదియు, శుద్ధ వర్ణయుత మైనదియు, శుక్రతారయను లక్షణవాక్యములు విని, నాచే శుక్రతారా స్వరూపము సర్వథా తెలియబడు గాక యని, తత్పరుడగుచుండు, నూహాపోహాకుశలుడగు నరుడు, తప్పకదానిని గుర్తెరుగుచున్నాడు. వాడు తదితర పరావృత్త మనస్కుడగుచు, చూచుచునె, స్ఫుటముగ గుర్తింపగలుగు చున్నాడు. అటువలె పరోక్ష జ్ఞానాభావముచే మూఢులును, శాస్త్రజనిత పరోక్ష జ్ఞానము గలిగిన వారయ్యును, తత్వరత్వా భావమున పండితులును, క్షణిక సమాధులు గలుగుచున్నను, స్వాత్మ రూపమును తెలిసికొనజాల కున్నారు.

భూసుర! జ్ఞానప్రాప్తిక్రమము జెప్పెద వినుము. తొలుత దేహాది వ్యావృత్తమగు ప్రత్యగాత్మ తత్వమె, జగదాది వ్యావృత్తమగు పరాత్మతత్వమనియు, నద్వయ చిదేకరసమును, నపరిచ్ఛిన్నము నని, పరోక్షముగ తెలిసికొనుము. అనంతరము పరోక్షముగ దెలియబడిన దాని యందలి యుక్తులను సదా చింతన చేయుట యను మననమున, సంశయములను బోనాడుము. అనంతరము దేహాది దృశ్య వ్యావృత్తమును, నపరిచ్ఛిన్నమునగు చిద్రూపము నేనను, చిత్తవృత్తి ప్రవాహకరణాత్మకమగు ధ్యానమున నిధి ధ్యాసనొనరింపుము.

దానిచే దేహాదులందలి, యహం ప్రత్యయరూప విపరీత భావన శిథిలమగును. అనంతరము నిదిధ్యాస పరిపాకమున, నందలి చిత్తవృత్తి, అయత్నముగ తదనువృత్తి రూప మగును. అది సవికల్ప సమాధియగును. అందు ధ్యేయ ధ్యాతాది భేదస్ఫూర్తి కలదు. తత్సమాధ్యభ్యాస పరిపాక మున, నేనిటుల ధ్యానించుచున్నానను, సూక్ష్మాభిమానాం శము నశింప, ధ్యేయమగు శుద్ధ చిన్మాత్రావస్థితి శేషించును. అది నిర్వికల్ప సమాధి కాగలదు. ఇదియె, శుద్ధాత్మతత్త్వము యొక్క అపరోక్ష తత్త్వము. అంత సమాధ్యనంతరము, సమాధియందు స్ఫురించిన శుద్ధాత్మ స్వరూపమును, శాస్త్ర ముచే దెలియబడిన పరాత్మ స్వరూపమును, ప్రతి విమర్శ జేసి, 'సఏవాహ'మను ప్రత్యభిజ్ఞ గలవాడగును. ఈ ప్రత్య భిజ్ఞానమె, సంసార నివర్తక విజ్ఞానము. కావున పరోక్ష జ్ఞానములేక మూఢునకును, తత్పరత్వములేక శాస్త్రజ్ఞునకును, విమర్శోదయముగాని కారణమున, ప్రత్యభిజ్ఞాన ముదయింప జాలదు కాన పురుషార్థసిద్ధి కలుగజాలదని, తాత్పర్యము. సన్నిధియందుగల నిధిని విస్మరించి దురదృష్టవశమున, భిక్షా టన మొనరించు వానివలె, సమాధి నిత్యమగు చుండియు, సంసృతి నపేక్షించుచుందురు. కావున నీ సహజ సమాధు లన్నియు నిరర్థకము లగుచున్నవి. ప్రత్యభిజ్ఞయందుప యుక్తములు గాక, నిరర్థకములని భావము. కావున నె,

సద్యోజాత శిశువు యొక్క నిర్వికల్పస్థితి, యజ్ఞాన నివృత్తి కరము గాజాలదు. కాన సంసార నివృత్తి రూపఫలమును సాధింప జాలకున్నది. ప్రత్యభిజ్ఞానాత్మకమగు సవికల్పక జ్ఞాన మెద్దికలదో, యదియె సంసారమూలమగు నజ్ఞానము ను నాశ మొనరింపగలదు.

అనేక జన్మ సుకృత పరంపరల నాత్మ దేవత సంతుష్టురాలు రాగలదు. అప్పుడే, ముముక్షుత్వము గల్గును గాని, కామ్య నిషిద్ధకర్మల, కల్పకోటి శతములకైన, ముముక్షుత్వము ప్రాప్తము గాజాలదు. జగమందు చైతన్య యుతముగ జన్మయె దుర్లభము. అందును మానుష జన్మ మిక్కిలి దుర్లభము. అందును సూక్ష్మబుద్ధి గలుగు టత్యంత దుర్లభము. భూసుర! జగత్తును బరికింపుము. స్థావర సృష్టియందు శతాంశమైన, జంగమసృష్టి లేదు. జంగమ సృష్టియందు శతాంశమైనను, మానవసృష్టి లేదు. మనుష్యుల యందైనను కోటాను కోట్లు యుక్తా యుక్తములను, పుణ్యాపాపములను, నెరుగక, పశుప్రాయులుగ నున్నారు. ఇంకను కోట్లకొలది మానవులు, కామ్య మార్గానుయాయులుగ నున్నారు. స్వర్గాద్యనిత్యఫలముల గాంక్షించుచు పాండిత్యాభాస గర్వితులై, చరించుచున్నారు. వీరలలో కొందరు కొంచెము వివేకము గలవారు, పాప సంస్కార

మాలిన్యము చిత్తములందు మిగిలియుండ, నద్వైత పద దూరులగుచున్నారు. ఆ యద్వైత పరమపదము భగవన్మాయచే నాచ్ఛాదితమైనది మందభాగ్యులగు మాయాంధులచే, జెందబడజాలదనుట నిశ్చయము. అత్యంత పుణ్య పరిపాకమునగాని, యద్వైతజ్ఞానసిద్ధి గలుగజాలదు. మాయాంధుల కా పదము బుద్ధికెక్కదు. బుద్ధికెక్కిన వారలయ్యును, దౌర్భాగ్యులు కొందరు, వృథాగ్రహము వహించి, కుతర్కములచే, తత్పదము మరగు పరచుకొను చున్నారు. అహో! మాయా మహాదేవియొక్క మహాత్మ్యమే మన వచ్చును! చూచుచుగూడ, హస్తగతమగు చింతామణిని, పరిత్యజించినటుల, కుకల్పనలచే, కుతర్కములచే, నా మహాత్పదమును, బరిత్యజించుచున్నారు. ఎవరి సమ్యగారాధన, పరదేవత సంతుష్టినందునో, వారు మాయావినిర్ముక్తులును, శ్రద్ధా సమన్వితులును, సుతర్క యుతులునై, పరాద్వైత చిద్మాత్రపదమును విశ్వసించి, పరమపదమును జెందుచున్నారు. ఆక్రమమును జెప్పెద సావధానుడవై వినుము.

అనంతజన్మ సుకృతముల, దేవతాభక్తి కలుగగలదు. తద్భక్తిచే, నిష్టదేవతను, చిరకాల మారాధించిన, తత్ప్రసాద ప్రాప్తి గలుగును. దానివలన విచారోదయమును, తదనంతరము విషయములందు దోషదృష్టియు గలిగి, భోగ

సమూహాములందు వైరస్యముదయించును. తదుపరి, విషయ వైరస్యమున, శ్రేయస్సాధనలకు, శ్రద్ధ, గురు దైవాదులయందు తత్పరత్వము గల్గును. అంతట సద్గురువును బొంది, తదుపదేశమున నద్వైత పరమపద/జ్ఞా/మును బడయును. ఇది, యద్వైత పరమపదము గలదను పరోక్ష జ్ఞానము, అంతట స్వానుభూతమగు నద్వైత పదమును తెన్నగ విచారణ చేయవలయును. ఆగమానుగతములగు సుతర్కముల, నుపపత్తుల నంది, విచారించి, నిశ్చయము నందవలయును మననాత్మకమగు నిట్టి విచారణచే సంశయములను నాశమొనరించి, యద్వయమగు చిదాత్మతత్వమున నిశ్చితబుద్ధి నందవలయును. అనంతరము, తన్మాత్రాకారముగ, చిత్తమును ధారణజేసి, యద్వయాత్మ తత్వమును సంతత ధ్యానమొనరింప వలయును. 'ఇటుల ధ్యానింపనాచే దెలియబడగలదను' దృఢవిశ్వాసముతోడ ధ్యానింపవలయును. చిత్తమతిచంచలమగుట, తన్మాత్రాకారమగు ధారణ శక్యముగాకపోవును. అయినను తీవ్రప్రయత్నమొనరించి, హఠవృత్తిగనైన, నట్టి ధారణ నొనరింపవలయునుగాని, తత్ప్రయత్నము నుండి విరమింపగూడదు ఇటుల పరోక్షానుభవ పర్యంతము, యత్నమొనరింప వలయును. అనంతరము నిధిధ్యాసచే, ప్రత్యగాత్మ తత్వమపరోక్షముగ నెరిగి, ధ్యాతమగు పరమాత్మతోడ నభేదముగ స్ఫురించి,

తత్పరమాత్మతత్త్వమును, 'సోఽహ' మను వికల్పమునకు విషయముగ జేయువలయును. అనగ 'సోఽహ' మను ప్రత్యభిజ్ఞానము గలుగగలదు. ఇదియ, సంసారమూలమగు నజ్ఞానమును నాశమొనరించును. ఇందు సంశయములేదు. అనగ, శ్రవణమననాదుల. నిశ్చితమగు ప్రత్యగాత్మ తత్త్వానుధ్యానము పక్వమైన, నట్టి పక్వధ్యానమె, నిర్వికల్ప సమాధియగును. ధ్యానము, పరిపాక తారతమ్యమున, సవికల్పసమాధియు, నిర్వికల్పసమాధియు, నగుచున్నది. చిత్తము శుద్ధాత్మాకారముగనుండుగాక యని, సంకల్పించి తత్సంకల్పము విస్మరింపక, సంస్కారరూపమున నను వర్తించుచు చిత్తము తదాకారము జేయుచు, మధ్యమధ్య సంకల్ప విస్మరణచే, చిత్తము ధ్యేయాకారతను వదలుచుండు నంతవరకు, ధ్యానమనబడును. ఇట్టి ధ్యానము విశేషముగ నభ్యసింప, సంకల్ప సంస్కారము వదలకుండగనే, చిత్తము ధ్యేయాకారతాను వృత్తిని జెందుట సవికల్పసమాధి. ఇట్టి సమాధ్యభ్యాస ప్రకర్ష వలన, సంకల్ప సంస్కారము నపేక్షింపక, నభిమత కాలపర్యంతము చిత్తము, ధ్యేయాకారతాను వృత్తిని జెందుట నిర్వికల్ప సమాధియగును. ఇట్టి నిర్వికల్పసమాధిని బొంది, యనంతరము తచ్ఛుద్ధ చిదాత్మైకాకారతాను వృత్తిని స్మరించి, ఆయద్వైతాత్మనే నేయను, ప్రత్యభిజ్ఞానము గలవాడుగా గలడు. ఈ ప్రత్యభిజ్ఞానము, సంసార

మూలమగు నజ్ఞానమును సాంగముగ, నాశమొనరించును. ధ్యానముయొక్క పరిపాకమన సర్వవికల్ప పరివర్జనము. వికల్పములన, వివిధములగు సంకల్పములు. వివిధమగు ఖ్యాతి వికల్పము. ఏకవిధమగు ఖ్యాతి నిర్వికల్పము. అనగ నేకాకార చిత్తవృత్తి నిర్వికల్పము. అనాత్మోల్లేఖరూప మగు. మనోవ్యాపార వర్జనమాత్రమున, వికల్ప వివర్జితత్వము గల్గును. వికల్పములు వర్జింపబడిన యనంతరము, నిర్వికల్పము చిత్తరువులు తుడిచివేయడిన శుద్ధ భిత్తివలె, స్వతస్సిద్ధము గనె యుండును. శుద్ధ భిత్తిని సంపాదించుటకు, చిత్తరువులను తుడిచి వేయుటయె, యావశ్యకము. అటువలె, వికల్పములను బోనాడిన, మనస్సు తనంతనే నిర్వికల్పముగనుండును; కావున నిర్వికల్పమగు నాత్మ సంపత్తియన, వికల్ప త్యాగమెయగుచున్నది. అంతకంటె నధికముగ బొందదగిన పావనపదము లేదు. మాయామహాత్మ్యమున, నిందు బండితులు గూడ మోహబడుచున్నారు.

నిశితబుద్ధిగల వారలచే, నాపదము క్షణకాలముననె, లక్షింపబడుచున్నది. బ్రాహ్మణుడ! ఉత్తమాధమ మధ్యములని, యందు త్రివిధములగు నధికారులు గలరు. ఉత్తమాధికారు లుపదేశ కాలమునందె, యా పరమపదమును దెలియుచున్నారు. విచార ధ్యానాదికమంతయు, తత్ప్రిధ

మోపదేశ శ్రవణకాలముననే, కలుగుచున్నది. ఉత్తముల కా పదప్రాప్తియందెట్టి క్లేశమును లేదు.

నేనొకానొక వేసవియందొకనాటిరాత్రి, చక్కని వెన్నెల గాయుచుండ, వికచపుష్ప సౌరభ పరీవృత లతామంటపమున మదిరా మదఘూర్ణితుడనై, ప్రియాలింగనానందభరిత స్వాంతమున, హంసతూలికా తల్పమున, బరుండి యుంటిని! అప్పు డాకసమందు జరించు సిద్ధగణములు బల్కు, యద్వైత తత్వపరములగు, నమృత పేశల వచనములు వినియుంటి! తత్కాలముననె, యా పదమెరింగితిని. విచారణచేతను, ధ్యానముచేతను గూడ, తత్కాలముననె, యయ్యది విదితమయ్యెను. ఇట్లర్ధ ముహూర్త మాత్రమున నాపావనపదమెరింగి, ముహూర్త కాలము, తత్సమాహిత మానసుడనైతిని నిశ్చేష్టముగ, నాపూవ ద సముద్రమున మునిగితిని. తదుపరి బాహ్యస్మృతి నంది, యిటుల విచారైక పరుడనైతిని. ఈ పరమానందామృత భరితమగు పదమెంత యద్భుతముగ నున్నది! అపూర్వపదము నందితిని తిరిగి దాని యందు జొత్తునుగాక! ఇంద్రాదిపదవు లందలి సుఖము, దీనియందు లేశమాత్రము నకు చాలదు. హైరణ్యగర్భానందాంత సర్వసుఖమును గూడ, దీని లేశమునకు తుల్యము గాజాలదు. ఇంతవరకు కాల

మెంత స్వప్నముగ గడపితిని! చింతామణిగణ సమన్వితమగు, స్వకీయ నిధానమును గానక, పిడికెడు కిరసని వాంఛించి, భిక్షాటన మొనరించు నటుల జరించితిని. ఆహా! జను లెంత మూఢితములు! స్వాత్మానంద మహాంబుధి నెరుగక, నజ్ఞాన విమోహితులై, మహాశ్రమల, లేశమాత్రమగు బాహ్యా సుఖమందుచున్నారు. బాహ్యాసుఖ లేశము కొరకగు నృనా పరిశ్రమ యిక జాలును. అపరిచ్ఛిన్నానంద సందోహ తత్ప రుడనైే, సర్వదా యుందును గాక. ఈ బాహ్యా వ్యవహా రమున, నాకగున దేమి? ఇదియంతయు పిష్ట పేషణతుల్యము. ఆవియు, భోజ్యము, లవి యమాల్యము, లవియు శయనము, లవియు స్త్రభూషణము, లవియు యోషిత్సంభోగాదికములు. చిరకాల పర్యుషితములగు నవియె, తిరిగి తిరిగి సేవింప బడు చున్నవి. అవిచార పరత్వమున పితృ పితామహాదు లనుస రించిన మార్గమె, యనుసరింపబడుచున్నది. ఇట్లగుచుండు గూడ, పర్యుషిత విషయ భోగములందు జుగుప్స కలుగ కున్నది ఇటుల నిశ్చయించి, తిరిగి నే నంతర్ముఖుడ నగు నంత, మిక్కిలి శుభమగు మరియొక విమర్శ నాకుదయించెను.

అహో! యిదియేమి! నాకెట్టి చిత్త విమోహము గల్గినది! ఆనంద పరిపూర్ణాత్మ, యేది కలదో, యదియు నేనగుచుండ, తిరిగినాకు జేయుట కేమికలదు! నాచేపొంద

దగినదేమి? నా చేబొందపడనిదేది? ఎక్కడెప్పుడెట్లుగా బొందబడగలదు? అప్రాప్తమగునది సంప్రాప్తమైనదనిన, నదిసత్యమెట్లు గాగలదు? అనంత చిదానంద రూపుడనగు నాకు క్రియాసదుద్భవమెట్టిది? దేహేంద్రియాంతఃకరణాదు లన్నియు స్వాప్నసమములు. అవి యన్నియు నఖండైక చిదాత్మనగు నాయందవియ, యగుచుండ, నొకయంతఃకరణాను నిరోధింపనేమి కాగలదు? ఇతరములగు ననిరుద్ధ మనస్సులు నాయవియ యగుచుండ, నొక్క మనస్సు యొక్క నిరోధ మున నేమి సంభవింపగలదు? నిరుద్ధానిరుద్ధ మనస్సు లన్నియు నాయందు, బర్యాప్తముగ భాసించుచున్నవి. సకల మనస్సులయొక్క నిరోధమునందుగూడ, నాకు నిరోధ ముండజాలదు. మహాకాశముకంటె బర్యాప్తమగు నాకు నిరోధమేమి? పూర్ణానంద రూపుడనగు నాకు సమాధి యెట్లుండును? చిదానంద రూపుడనై, గగనము కంటె పూర్ణుడనగు నాకు, శుభాశుభ ప్రాపక క్రియాసంభవమెట్టిది? అనంతములగు శరీరాత్మాభాసలందు, నా మహిమచే క్రియా ద్యాభాస కలుగుచుండ, తత్క్రియాభావమున నాకెట్టి లోటు కలదు? నాకు కర్తవ్యాకర్తవ్యములు లేశమైనను లేవు. కాన, ఆనంద నిర్భరుడనగు నాకు నిరోధముచే, నేమి ప్రయోజనము? సమాధియందుగాని, తద్వ్యుత్థానమునగాని, నిత్యపూర్ణ స్వభావుడను, ఎట్టి క్రియయందీ దేహముండునో

యది యందుండుగాక! అనినేను సర్వధా స్వస్థుడను, మహా నంద నిర్భరుడను, అపరిచ్ఛిన్న చిద్రూపుడను, క్రియా మాలిన్య రహితుడనునై యుంటిని.

ఉత్తమాధికారియగు నా స్థితిని జెప్పియుంటిని. అధమాధికారి కనేకజన్మల, జ్ఞానజన్యమగు ఫలము గలుగును. మధ్యమాధికారులకు, క్రమముగ శ్రవణము, విచారణాను ధ్యానములు గలిగి, యనంతరము జ్ఞానోదయము గాగలదు. విజ్ఞానఫలముతో గూడిన సమాధి కడుంగడు దుర్లభము. విజ్ఞాన ఫలహీనమగు సమాధిశతముచేనైన నెట్టి ప్రయోజనమును లేదు కావున విజ్ఞానహీనములగు సూక్ష్మసమాధుల వలన నెట్టి ఫలమును లేకున్నది. దారి వెంట బోవునపుడు, విషయవిమర్శ లేకయె, ప్రకాశించెడి విషయముల యొక్క సమ్యగ్జ్ఞానము గలుగనంతమాత్రమున, నవి ప్రకాశింపజేసెడి యజ్ఞానము నివరింపబడదు. నిర్వికల్ప విజ్ఞానము కేవల జ్ఞానముయొక్క నిజస్వరూపము. అది సర్వదా భాసమానమైనను, వికల్పముల యాచ్ఛాదనచే, ప్రకాశింపని విధము ననె, యుండును వికల్పములు నశింప, పూర్వము భాసించుచున్నదె యైనను, విజ్ఞానము తిరిగి యపూర్వముగ భాసించు దానివలె నగును. అనగ, నిర్వికల్ప సమాధిరూప జ్ఞానము, దర్పణతుల్యమగుచు, సర్వ వికల్పరూప ప్రతిబింబ

ముల కాశ్రియమగుచున్నది. కాని వికల్పములచే నాచ్ఛాదితమగుట, ప్రతిబింబములచే పూర్ణమగు దర్పణమువలె, ప్రకాశించునదయ్యు, ప్రకాశింపని దానివలె నుండును. వికల్పరూప ప్రతిబింబములు దొలగిన, లోగడ ప్రకాశించునదయ్యు, అప్పుడపూర్వముగ భాసించుదానివలె నుండును. పూర్వము జ్ఞానజ్ఞేయముల భేదముగ నుండుట, దెలియబడక, జ్ఞేయరూపములగు వికల్పములను దొలగింప, జ్ఞాతమైనదిగ జెప్పబడుచున్నది. ఉత్తమమగు నాత్మవిజ్ఞాన క్రియమీా విధముగ నుండును.

భూసుర! యీా వినినదంతయు, దిరిగి విచారణ నొనరించి, తెలిసికొనుము. ఆత్మతత్త్వము నెరిగి, కృతార్థుడవు గాగలవు.” జనకునిచే నిట్లాదేశింపబడి, యష్టావక్రుడు, స్వస్థానమున కేగి, విచారానుధ్యాన పూర్వకముగ, నద్వితీయాత్మ తత్త్వమును గుర్తెరిగి, సర్వారంభములవదలి, శీఘ్రముగ జీవన్ముక్తుడయ్యెను.

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ ప్రకాశిక యను నాంధ్రీకరణంబున, నష్టావక్రీయమను సప్తదశాధ్యాయము.

---

# అష్టాదశాధ్యాయము.

తే॥ గీ॥ బంధమోక్షగతియు సత్యవస్తువిధము
వ్యోమరూపంబు చిత్త విద్యోతనంబు
గురుతుగ లుఁ గంగ దెలుపు నా గూరుని వినుము
పరమ గుహ్యార్థమంబ! విద్యావిభు కరుణ.

భార్గవ! జనకమహారాజుచే నిర్మలాత్మ స్వరూపము వేద్యరహితమని, నిరూపింపబడి, తత్ప్రాప్తిస్థానములు గూడ జెప్పబడినవి. పంచయామాభావమున, మాయామోహితులగు జనులాస్థానములను గుర్తెరుగ జాలకున్నారు; వేద్యరహిత సంవిద్దశ, యంతర్ముఖ మనస్సుచే, దెలియబడును గాని, మరియొకవిధమునగాదు. వేయేల! రామ! నీకు సారాంశమును దెల్పెద వినుము. వేద్యము సర్వమును మనస్సుచే తెలియబడుచున్నదనుట ప్రసిద్ధము. కనుక మనస్సునకు వేద్యత్వము లేదు. అట్టిచో, వేద్యనిర్ముక్తమగు మనస్సుండుట భావ్యమె కదా! వేద్యముల యొక్క వేదనాంతరాళములందు, నిర్వ్యాపారమగు మనస్సట్టిదియే యగుచున్నది. అట్టి వేద్యరహితమగు మనస్సునకె విత్తియని పేరు, అనగ శుద్ధమగు నాత్మతత్వము.

అటుల నాత్మతత్వ మవేద్యమగుచుండ, తద్వేదన మసంభావ్యమగును గాన, పురుషార్థసిద్ధి యెట్లు గల్గునన వినుము. ఆత్మ స్వప్రకాశమాన మగుట, నది యెపుడును నితరాపేక్ష లేక, ప్రకాశించుచునే యున్నది. ఇట్లంగీకరింపక, నదియు మరియొకదానిచే బ్రకాశింపబడుచున్నదని యన మొదలిడిన, నట్టి యితరాపేక్షకంతుండదు గాన, ననవస్థాదోషము గల్గును. అనుభవ రూపమున స్వప్రకాశమగు నాత్మ, సర్వదా ప్రకాశమానమగుచుండ, తద్వేదన మసంభావ్యమనుట సంభావ్యము. చిదాత్మ సర్వదా ప్రకాశమాన మగుట, నీ కనుభవ రూపమున దెల్పెద వినుము. ఇతరములు భాసించుకాలమున, ననగ, ఘటాది దర్శనకాలమందు రామ! నీవు భాసించుట లేదా? నీవు భాసించుట లేదను నెడల, నీవు లేవనియె, చెప్పవలసి వచ్చును. ఉండుట యన భాసించుటయ కదా! అట్లు నీవు లేనిచో, నీవు ప్రశ్నించు టెట్టిది? స్వయముగ మరణింప బ్రవృత్తుడగు వాని నన్యులు రక్షింపజాల నటుల, స్వాత్మ లేదని నిషేధింప బ్రవృత్తుడగు మూఢునియొక్క ఆత్మ సాధనము నన్యునిచే నొనరింపబడ నెట్లుశక్యమగును? ఆత్మ లేదనిన, నట్టియనర్థము వాటిల్లుచున్నది. గగన కుసుమము వలె, నేను లేననువాని కాత్మ గలదని పరుడెట్లు సాధింపగలడు?

ఆత్మను నిషేధించుట లేదుగాని, సామాన్యముగ భాసించెడి స్వాత్మను, విశేషరూపమున తెలిసికొన నిచ్ఛగించుచున్నానందువేని, వినుము. లోకమున సామాన్య విశేషాంశలుగల ఘటాదులందట్లగుట సంభవించునుగాని; నిస్సామాన్య విశేషాత్మకమును, గగనతుల్యమును, అఖండైకరూపమును నగు నాత్మవిషయమున సంభవింపదు. ఆ కారణమున నీచే, సామాన్యముగ, నాత్మరూపమేని తెలియబడుచున్నదో, యదియ వాస్తవముగ, నిస్సామాన్యమును, నిత్యమునగు నీరూపము, తదితరముగ దేహాదిరూపమున భాసించు, ననిత్యభావము నీరూపము గాజాలదు. ఇటుల దృశ్యదర్శిత్వభావాది సర్వ విశేష రహితముగ భాసించు సంవిత్సామాన్యము, నీరూపము. అది గుర్తిడియు, వ్యర్థముగ మిక్కిలి మోహము నందుచున్నావు. భాస్యమగు ఘటపటాది జాలమంతయు, విశేష విషయమగును. అనగ, తత్తద్భాసక జ్ఞానము, తత్తద్భాస్య విశేషాకారాకారితము. అట్లుగాక కేవల జ్ఞానసామాన్యము నీరూపము. అట్టి నీ, వన్యాపేక్షారహితముగ స్వయముగ భాసించుచున్నావు.

శరీరాది రూపమున భాసించుచున్నానని యందువేని వినుము. ఇదినేనని యనుకొనినపుడె, దేహాత్మబుద్ధి కలుగుచున్నది. అనగ దేహాద్యాకారోల్లేఖన సంకల్పమున నె,

దేహాత్మరూపమున భాసించుచుంటివి. కాని స్వతస్సిద్ధముగ గాదు. సూక్ష్మముగ విచారింపుము. దేహాదుల కంటె నితరములగు ఘటాదులను సంకల్పించు కాలమున. భాసించు నీయందు దేహరూపము భాసించుచున్నదా? లేదు దేహత్వము భాసింపకున్నను, వస్తుతః చిదాత్మనగు నా సంబంధము గలిగియుండుట, దేహాదులు నా రూపమునిన భాస్యమానములగు ఘటాదుల తోడగూడ, సంబంధము గలిగి యుండుట, తద్ఘటాదికము గూడ నీ దేహామె కావలసి యుండును. వస్తుతః 'అహం' ప్రత్యయాత్మక చిదాత్మ రూపుడనగు నాకు దేహము పరిచ్ఛేద కోపాధికాన, తద్దేహము గూడ, నారూపమె యనిన వినుము. ఘటాదులను సంకల్పించుకాలమున, తద్ఘటాద్యాకారాకారిత జ్ఞానము గలుగుచున్నది. అనగ, తత్తత్కాలమున, తత్తత్ జ్ఞాన రూపుడవగుచున్నావు. అటులగల్గు నీ యొక్క ఘటాది పరిచ్ఛిన్న ఘటాది జ్ఞానమునకు, ఘటాదికము పరిచ్ఛిన్నోపాధియగుచున్నది. కావున ఘటాదికమంతయు నీ రూపమె కావలసి యుండును. అటుల సర్వమయుడవు గావలసి యుండ, నొక్క దేహముమాత్రమె, నీరూపమెట్లు గాగలదు? సర్వమయుడవు గావలసి యుంటివికదా! ఘటాది భాసనకాలమందు, తదితరములగు పటాదులందు నీకహం ప్రత్యయ సంబంధము గలదా? లేదు. కావున దృశ్యము నీరూపము

గాజాలము. కావున తత్త్వాత్మ భూతమగు దృగ్రూపుడవు. అట్టి దృక్, దృశ్యాత్మక మెప్పుడును గాదు.

ఆత్మ స్వరూపమగు దృక్ స్వప్రకాశము. దృశ్య రహిత శుద్ధ దృఙ్మాత్ర రూపము. ప్రతిబింబములచే చిత్రిత మగు దర్పణమువలె, దేహ దేశకాలాది భేదాత్మక చిత్రములచే, జగత్తను చిత్తరువు గలది. దర్పణమందు ప్రతిబింబ వైచిత్ర్యము, బింబమూలకమగునటుల, నా చిదాత్మ యందలి జగద్వైచిత్ర్యము, సంకల్పమూలకమైనది. కాన సంకల్ప వర్జనానంతరము, స్వతః భాసించునది. అట్టి సంకల్పత్యాగావధి భూతమును, శుద్ధ చిద్రూపమును నగు స్వాత్మను లక్షింపుము. ఇట్లాత్మ ప్రత్యభిజ్ఞాత మగుచుండ, దానియందలి దేహాద్యనాత్మ భూతమును లక్షింపకుండుట, సర్వ సంసార కారణమగు తద్దేహాదికమందహంభావ కారణ రూపమగు నజ్ఞానము నశించును.

అజ్ఞానము నశింప, మోక్షము ప్రాప్తించును. మోక్షమన, స్వర్గ మర్త్య పాతాళముల నెందేనియు దొరకు నొక వస్తువుగాదు. సర్వసంకల్ప వర్జనమాత్రమున, తత్కాలముననె కలుగు శుద్ధ చిన్మాత్ర స్వరూపస్ఫూర్తి. మోక్ష మటుల స్వరూపాత్మకమగుట, నప్రాప్తమగున దెన్నడును

గాదు. కేవల మజ్ఞానమాత్రమును నిరసించిన, నట్టి కృతార్థత గల్గును.

పై జెప్పబడిన జ్ఞానము కంటె, మోక్ష మనునది స్వర్గమువలె మరియొకటి యుండుననిన, నది కృత్రిమమును, నట్లగుట నశించునదియును గాగలదు. కాన మోక్షమనునది వేరొకటి కాదు. స్వస్వరూపమునకు, బాహ్యమనునది సిద్ధింపకుండుట, లెస్సగ నిరూపింపబడి, యున్నది. అట్టిచో, స్వరూపాతిరిక్తముగ మోక్ష మెచ్చట నుండగలదు? స్వరూపము కంటె వేరగు సర్వమును, శశశృంగము వలె మిథ్యయగుట, నదియు శశశృంగసమమె యగును స్వరూపము సర్వత్ర పూర్ణమగుచుండ, నన్యత్ర మోక్ష మెచ్చట నుండగలదు! స్వరూపము నందె జగత్తువలె నున్నదనిన, దర్పణమందు ప్రతిబింబమువలె, స్వరూపానతిరిక్తముగ నున్నదనియె, చెప్పవలయును. వ్యవహారముదైనను, మోక్షమనునది వేరొక వస్తువు గాదు. బంధనాశమె, మోక్షమనబడుచున్నది. అయిన, నాశమన నభావము సత్యమగు మోక్షమభావాత్మక మెట్లు గాగలదు? ఒకేవస్తువు భావాత్మకమును, నభావాత్మకమును గాజాలదు గదా! అట్లు గాజాలియుండిన, భావాభావోభయాత్మకములగు స్వప్నభావములు సత్యము గావలయును. కాని, యా భావములకు బాధగలుగుట,

నవి యసత్యము లగుచున్నవి. కావున బంధాభావరూపము, సత్యమగు మోక్షమెట్లు గాగలదనిన వినుము. ఒక వస్తువు యొక్క స్ఫురణ లేనపు డావస్తువు లేదని చెప్పెడి, యభావ జ్ఞానము బాధయని చెప్పబడును. ఇట్టి బాధ, దేనియందు గల్గునో, యది యసత్యము. తదితరము గాదు. సమస్త దృశ్యమునకు స్ఫురణాభావ కాలమందు, వస్త్వాభావ రూప బాధకలదు. కనుక నదియంతయు నసత్యము. ఆత్మ వస్తువున కట్టి యభావ మెచ్చటను గలుగజాలదు. సర్వత్ర సర్వదా, ఆత్మస్ఫూర్తి కలిగియుండుట, దీనికి కారణము. ఘటాది ప్రత్యయ కాలమందు చిదాత్మ ప్రత్యయము లేదు కదా యనిన, దర్పణ ప్రతిబింబ న్యాయమున, సర్వాత్మ రూపమున భాసించుచుండియున్న దర్పణరూపమగు నాత్మయం దప్రత్యయము జెప్పుటకెన్నగును వీలుపడదు. కావున స్వరూపము కంటె భిన్నముగ మోక్షమెప్పుడును సత్యము గాజాలదు. పూర్ణ స్వరూపాపరిచ్ఛిన్న స్ఫూర్తియె, మోక్షము. సదా పూర్ణస్వభావమగు చిదాత్మకు, మోక్ష దశయందె, పూర్ణత్వము జెప్పనెట్టిదన, స్వభావముచే, పూర్ణమైనను, చైత్య సంపర్కమున పూర్ణముగాని దానివలె భాసించుచున్నదని భావము. చైతన్యవర్జన మాత్రమున చిదాత్మ పూర్ణత్వమును దాల్చుచున్నది. దర్పణ స్వరూపము ప్రతిబింబములచే, సంకుచితమైనదానివలె, నున్నటుల, చైత్య

భాసమున చిదాత్మ సంకుచితమైన దానివలె నగుచున్నది. ప్రతిబింబములు భాసింపనపుడు దర్పణ మపరిచ్ఛిన్నమైన దానివలె నున్నటుల, చైత్యము భాసింపనపుడు, చిదాత్మ పూర్ణమైనదానివలె భాసించుచున్నది.

చిదాత్మకు, తనయందు భాసించు చైత్యములచే పరిచ్ఛేద మాభాసమాత్రముగాని, వస్తుతః కాలాదులచే బరిచ్ఛేద ముండజాలదు. అట్లుగాక, పరిచ్ఛేద మున్నదనిన, అట్టి పరిచ్ఛేదము చిత్ప్రకాశితముల చేతనా? లేక చిదప్రకాశముల చేతనా? యని, యడుగవలయును. చిదప్రకాశితములు శశశృంగ సదృశములు కాన నసిద్ధములు. చిత్ప్రకాశితములచే ననిన, చితియె వానియందు వ్యాపించియుండ, నట్టివానిచే, పరిచ్ఛేద మెట్లుండును? దర్పణ వ్యాప్తములగు ప్రతిబింబములచే దర్పణము నకు. పరిచ్ఛేదము గల్గునా? అటువలె చిద్వ్యాప్తములైన కాలాదుల, చితికెన్నడును పరిచ్ఛేదము గలుగదు. లోకమునందొకడు, కాల పరిచ్ఛిన్నమగు నొకభావమును భావించె ననుకొనుము. ఉదాహరణముగ నీ వృక్షము నూరు సంవత్సరముల ప్రాయముగలదని భావించె ననుకొనుము. అందు వృక్షము పరిచ్ఛేదము, కాలము పరిచ్ఛేదకము. ఈ రెండును చిత్ప్రకాశితములె. అట్టి చిత్ప్రకాశితములె యగు భావకాలములు, పరిచ్ఛేద్య పరిచ్ఛేద

కత్వములఁ దాల్చెను. ఈ రెంటిలో నే యొకటి యైనను, చిద్వ్యాప్తముగానియెడల, పరిచ్ఛేదసిద్ధియె కలుగదు. చితికి బాహ్యముగ చైతన్యమున్నయెడల, నద్దానిచే చితికి పరిచ్ఛేదము గలుగవచ్చును. కాని చిద్వ్యాప్తమగుట వలననే; స్వరూపసిద్ధి గలుగుచున్న చైత్యము, తత్సంబంధవర్జితముగ, తద్బాహ్యమున నుండు టెట్టిది? ఆ సంబంధమైన, నేక దేశ మాత్రము గాదు. అట్లైన తదేక దేశమాత్రేతరము సిద్ధింపదు. కారణ మేమన, చిత్సంబంధాంశ మాత్రభానమున గాక, నన్యమేదియు సిద్ధింపదు. కావున, నే యవ్యక్తభిత్తి యందఖిల దృశ్యచిత్రము, భాసించుచున్నదో; యా బహిః పదార్థ రూపావ్యక్తముగూడ తత్స్వరూప సిద్ధ్యర్థము చితి నిర్మగ్నమె కావలసియున్నది. ఇట్లు దీపాలోక నిర్మగ్నమగు భిత్తియందలి చిత్రములకు, దీపాలోక నిర్మగ్నత్వము వలె, చితి నిర్మగ్నత్వము గూడ, నూహింపవలెను. అనగ, బహిః పదార్థరూపమగు నవ్యక్తము, చితి నిర్మగ్నమగుచుండ, తద వ్యక్త నిర్మగ్నములగు కాలాదులు, చితి నిర్మగ్నములు గాకుండు టెట్లు?

ఆకాశముచే వ్యాప్తములగు ఘటాదు లాకాశమునకు పరిచ్ఛేదకములు గానట్టుల, చిదంతర్భూతములగు కాలాదులు చితికి పరిచ్ఛేదములు గానేరవు. అందునుగూడ, గగనము

కంటె వ్యతిరిక్తముగ, ఘటాదికముండనటుల, చిదాత్మ వ్యతిరిక్తముగ దృశ్యములేదు. ఇట్టిచితి నిర్మగ్నమగు చైత్యము, చక్కని యుక్తిపూర్వకముగ విచారింపుము చితి యందు నిర్మగ్నమగుట. తదంతర్భాస మానమగు చైత్యము ప్రతిబింబమువలె నున్నది. లోకమునందొక భావమునందు, మరియొక భావమును జూడము. అట్లు చూడగల్గుట సంభవించెనేని, భావసాంకర్యము గలుగగలదు. అనగ, ఘటమను భావగర్భమున, పటమను భావముండినయెడల, ఘటము పటము గాగలదు, పటము ఘటము గాగలదు. ప్రతిబింబము లిటులనే, యొకదానియందింకొకటి యుండ జాలవు. కావున దర్పణ ప్రతిబింబతుల్యమగుట. దృశ్యము చిదాత్మకంటె వ్యతిరిక్తము గాజాలదు.

మరియు బహిఃపదార్థమని చెప్పబడిన యవ్యక్తము స్వరూపా జ్ఞానమూలమని చెప్పియుంటిమి. అట్టి యవ్యక్తాత్మక బహిఃపదార్థము నాశ్రయించి యుండిన భావములకు, సత్యత్వమెట్టిది? కావున స్వాత్మయగు చితి స్వరూపము, తన యొక్క మాయా నామక స్వతంత్రశక్తి చేత, మాయావిచే గల్పితమగు నింద్రజాలము వలె, నాయా దృశ్యభావాకారమున సదా భాసించుచున్నది. కావున స్వరూపాతిరిక్తముగ నెద్దియు లేదు.''

ఈవాక్యములు విని భార్గవుడు తిరిగి యిటుల ప్రశ్నించెను. "మహాత్మా! మీరు చెప్పినది దుర్ఘటనముగ నాకు దోచుచున్నది. శుద్ధమును, ఏకమును నగుచితి, యనేక విధముల చిత్రముగ భాసించుట సంభవమగుట, నాకు దుర్ఘటముగ దోచుచున్నది. చితియనియు చైత్యమనియు, రెండు విధములగు వస్తువు లందరకు ననుభవ సిద్ధము లగుచున్నవి. అందు చైత్యము చిత్తుచే భాసింపబడునది కావచ్చును. చితి మీరు చెప్పినటుల స్వప్రకాశము గావచ్చును. కాని లోక మందు, వెలుగుచే భాసింపబడు వస్తువా వెల్గునకు భిన్నమ గుట లేదా! అటువలె, చిత్తుచే భాసింపబడియు చైత్యము, చిత్తుకంటె వేరగునది యేలగారాదు! చైత్యము చిదాత్మక మనుట ననుభవ విరోధముగ నున్నది.

అదియును గాక, మహాత్ముడగు జనకునిచే, యిట్లు జెప్పబడినది సర్వసంకల్పవర్జనమున, మనస్సు నిర్వికల్పముగా గలదు. ఆ నిర్వికల్పము, సంసారమును రూపుమాపు జ్ఞానము, అజ్ఞానమె, ఆత్మరూపము. ఇట్లు చెప్పబడినది, యెటుల సమంజసమగును! జ్ఞానక్రియయందు మనస్సు, ఆత్మ యొక్క కరణమని చెప్పబడినది. అనగ చైతన్యమగు నాత్మ యొక్క చితిక్రియా కరణము మనస్సు. అట్టి మనస్సు లేని యెడల, నాత్మకు జడత్వ ప్రసక్తి కలుగుచున్నది కదా! జడ

ములను తెలిసికొనుటకు సాధనమగు మనస్సు, ఆత్మ పదార్థ మును గూడ, తెలిసికొనుటకు సాధనమగుచున్నది. ఆత్మకు గల్గు బంధమోక్షములు, మనస్సువలననె కలుగుచున్నవనుట స్పష్టము. సవికల్పకమగు మనస్సు బంధము, నిర్వికల్పకమగు మనస్సు మోక్షమని, చెప్పబడినది నిర్వికల్పకమగు మనస్సె, యాత్మయనియు జెప్పబడినది. అది యెట్లగును? ఆత్మకు సాధనమని చెప్పబడిన మనస్సు, ఆత్మయగుటెట్టిది? కర్తృకర ణముల కభేదము వాటిల్లునా? దర్పణ ప్రతిబింబ న్యాయమున చైతన్యము, చిదైక్యతను బొందినను, మనోరూపమగు సాధన ముండినపుడు, ద్వైతము శేషించుచునె యుండ, నద్వైత మెట్లు సిద్ధించును? లోకమునం దొకనికి భ్రాంతిగల్గిన యెడ, తద్భ్రాంతి విషయ మసత్యము గావచ్చును. కాని భ్రాంతి స్వరూపము సత్యమె యగుచుండ, నద్వైత మెట్లుసిద్ధించును? అసత్యమగు పదార్థముచేత, నర్థక్రియ లెచ్చటను సంపా దింపబడవు. జగద్రూపమగు వస్తువు స్థిరమును, నర్థక్రియా కరముగనునున్నది. అట్టిచో, జగమసత్యమనుటెట్టిది? ద్వైత మెట్లు వ్యవహార సమర్థ మగుచుండ, నసత్యమెట్లు గాగలదు? దృశ్యజ్ఞానమంతయు భ్రాంతిరూపమైన, నభ్రాంతిజ్ఞాన ముండ జాలదు కదా! అట్టియెడ భ్రాంతి యనియు, నభ్రాంతి యనియు జ్ఞాన భేద వ్యవహార మెట్లు గలుగుచున్నది? అంద రకు నొకేరూపమగు భ్రాంతి యెట్లు గల్గును? ఈ సందేహా

ములచే బీడింపబడుచున్న, నాయందనుగ్రహముంచి, వీటిని బాపుదురు గాక."

ఈ ప్రశ్నల నాకర్ణించి, సర్వవేత్తయగు దత్తాత్రేయు మహర్షి సంతసించి, యిటుల జెప్పదొడగెను. "రామ! లెస్సగ నడిగితివి. వీనికి జవాబు లిదివరకే వచ్చియుండెను. కాని సంశయ నివారణచే, మనస్సునకు సంతోషము గల్గువరకును, తిరిగి విచారణ జేయుచుండవలయును. కాన నీ వడుగుట, సమంజసము. ప్రశ్నింపని యెడ మనోగతమును, గురువైన నెట్లు చెప్పగలడు. బుద్ధి భేదమున ప్రాణుల యొక్క యూహాపోహాలు వేరుగ గల్గుచుండును. స్వాభిమత మడుగనిది, గురువైన నెటుల సందేహముల దీర్పగలడు. అడుగనివానికి సందేహనివృత్తి గాజాలదు. ప్రశ్నించు వానికి విద్యావ్యాప్తి గలుగును. ప్రశ్నించిన గాని, నిరూపింప వలను పడదు గాన, ప్రశ్న నిరూపణకు బీజమువంటిది. అడుగని వానికి విద్య రాజాలదు గురువును ప్రశ్నించియె, తెలిసికొనవలయును.

ఏకమగు చిదాత్మ, జగద్రూపమున విచిత్రముగ భాసించుట, సంభవమె యగును. ఏకరూపమగు దర్పణము ప్రతిబింబములచే, వివిధముగ భాసించుట లేదా? కేవల

మొక్కటియే యగు మనస్సు, స్వప్నమందును, మనోరా జ్యాదిక మందును, బింబము నపేక్షింపకయె, ద్రష్ట్రు దర్శన, దృశ్య త్రివిధ రూపమున విచిత్రముగ భాసించుట లేదా! అటువలె శుద్ధమగు నా సంవిదాత్మ, విచిత్రాకార ముగ భాసించుచున్నది.

చితియనియు చైత్యమనియు, స్వప్నమందు గూడ, వివిధముగ భాసించుచున్నది. స్వప్నచిచ్చైత్యములు వాస్త వికములా? అటువలె, జాగ్రత్తునందు దండరకును భాసమానమైనను ద్వైతము వాస్తవికము గాదు. ఏది లేకుండ, నేది భాసింపదో, యది తదాత్మకమని వ్యాప్తికలదు. సువర్ణము లేక భాసింపని కంకణము, సువర్ణాత్మకమె యగును. అంధునకు వెలుగు లేకుండగనె, స్పర్శాదులచే ఘటాదులు భాసించుచుండుట ఈవ్యాప్తికి భంగము పుట్టించున కిదివరకు, రూపము భాసింపక పోయినను, తదితరులకు వలె, స్మృతియందున్న రూపము భాసించుచున్నది. కాన రూపమున కాలోకాత్మత్వము లేదు కాని చిద్విషయమున, నది భాసింపక నెచ్చటగాని, యేదియు గాని, కొంచెమైనను భాసింప జాలదు. ఆదర్శము లేక ప్రతిబింబము కొంచెమైనను భాసింపదు కాన నాదర్శాతిరిక్తముగ, ప్రతిబింబ ముండజాలదు. అటువలె చితికంటె నతిరిక్తముగ నేదియు నుండజాలదు.

కావున, చితికంటె నన్యముగ మనస్సైనను లేదు. మనస్సు కూడ దృశ్యతుల్యమగుట, చిదన్యముగ లేదని యర్థము. స్వప్నమందెటుల జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములకు భిన్నముగ మనస్సు లేదో, జాగ్రతయందు గూడ, చిద్రూపములగు నా మూటి కంటెను భిన్నముగ, మనస్సు లేదు. స్వప్నమందు కల్పిత మనస్సు, సర్వకార్య నిర్వాహక మగుచున్నటుల, జాగ్రత యందుగూడ, నట్లె యగుచున్నది స్వప్నమందలి శిరుచ్ఛేదన క్రియ, యసత్యమగుట, తత్కారణమగు కుఠారము గూడ, నెట్లసత్యమగుచున్నదో, యటువలె దృశ్య మసత్యమగుట, తత్ జ్ఞాన మసత్యమును, తత్కారణ మగు మనస్సు గూడ, నసత్యమగుచున్నది. క్రియ, సత్యరూపమైన, కరణము సత్యము గాగలదు. అసత్యమగు నరశృంగము చేత, నేది యెప్పుడు ఛేదింపబడగలదు? కాన రామ! చైత్యకార్యమునకు కారణమగు మనస్సు లేనిదె యగుచున్నది. స్వప్న కార్యమునకు మనస్సెంతటి కారణమో, జాగ్రత యందు గూడ నంతియు. ఇక బంధమోక్షాది వైచిత్ర్య మెట్లుగల్గెనన, చిదాత్మ కేవల మప్రతిహతమగు స్వీయ స్వాతంత్ర్య శక్తిచే, మనస్సు మొదలగున వెంతయు గల్పించి. ద్రష్టృ దృశ్యాది భేదమున వ్యవహరించుచుండును. అప్పుడప్పుడు పూర్వమందు జెప్పబడిన, నంతరాళ దశలయందట్లు వ్యవహరింపక నిర్వికల్ప రూపమున నుండును.

రామ! వినుము. చిదాత్మ పరిపూర్ణమైనను, ఆకాశ తుల్యము గాదు. ఆత్మతత్వము చైతన్యరూపమగుట, స్వప్ర కాశమైనది, ఆకాశమువలె జడముగాదు. ఆకాశాత్మలకు సర్వసామ్యముండినను, చైతన్యమాత్రత్వ మాత్మ కధికముగ గలదు. వ్యాపకత్వము, సూక్ష్మత్వము, ఏక రసత్వము, ఒకప్పుడు లేకుండుట మరియొకప్పుడు నశించుట యనునవి లేకుండుటయు, నవయవ సంస్థాన శూన్యత్వము, సర్వమున కాశ్రయ మయ్యు స్పర్శింపబడ కుండుట, సర్వానుస్యూ తత్వము మున్నగునవి, యాకాశాత్మలకు సమానధర్మములు విశేష మేమన, నాత్మ చైతన్యమయము ఆకాశము చైతన్య శూన్యము. వస్తుతస్తు, చైతన్య పూర్ణమగు నాకాశమే, యాత్మయగును. ఆత్మాకాశములకు కొంచెమైనను భేదము లేదు. ఆకాశమే యాత్మ. ఆత్మయె, యాకాశము. అనగ, పై జెప్పబడిన చైతన్యమాత్ర విశిష్టత్వమె, భేదమని భావము. అజ్ఞులు భ్రాంతిచే నాకాశము నాత్మరూపముగ జూచుచున్నారు. నేత్రదోషమున, గుడ్లగూబ, తమోమాత్రమును సూర్యకాంతిగ జూచునటుల, నవిద్యా దోష మున భ్రాంతినందుచున్నారు. చిత్పరిపూర్ణమగు నాయాకా శమునె, పండితు లాత్మగ జూచుచున్నారు. పరి చిద్రూప ముగు చిదాత్మ, స్వేచ్ఛ స్వాతంత్ర్య మహాత్మ్యమున, పరిచ్ఛి న్నములగు ననేకవిధములు, భాసింపజేయుచున్నది. స్వప్న

మందు, తన్నుదాన నేకవిధముల భాసింపజేయు చుండునటుల, మనుష్యాది భేదమున, నా చిదాత్మ తన్నుదాను భాసింప జేయుచున్నది. పరిచ్ఛిన్నదృష్టి కనేకవిధముల భాసించు చున్నను, ఆ పరాచితి స్వదృష్టిచే, స్వాయముగ, పూర్ణాత్మ రూపముననే యున్నది. ఇంద్రజాలికు డొక్కడైనను, జూచువారలకు, తన్ను దాననేకవిధముల భాసింపజేయుచు, తనదృష్టిచే, దానొక్కడె భాసించుటలేదా! అటువలె, నేక మును, నిర్వికారమునగు నాపరాచితి, యఖండైకరూపమున, భాసించుచున్నను, ననేక విధముల, పరిచ్ఛిన్నత్వము గల దానివలె, గాన్పించుచున్నది.

మాయచే నావరింపబడి, పరిచ్ఛిన్న రూపము లను, భాసింపజేయుచున్న దానివలె నున్నది. ఈ మాయావరణము గూడ, పరిచ్ఛిన్నమగు నన్యదృష్టికి గాని, స్వదృష్టికి లేదు. ఇంద్రజాలికుడు మాయావృతుడైనటుల నన్యదృష్టి కగుపడి స్వదృష్టి కగుపడనటుల పరచితియున్నదని భావము. పరచితి యొక్క ఘటనాఘటన సమర్థమగు నత్యంత సామర్థ్యమునకు మాయయని పేరు. మాయచే, జగద్వ్యాపారము నడచుచు న్నదన, పరచితియొక్క పూర్ణస్వాతంత్ర్యముచే నని, యెరుగ వలయును. లోకమునందుగూడ, యోగులు, మాంత్రికు, లింద్రజాలికులు, వస్తుతః స్వాతంత్ర్య యుతులయ్యు, పర

చిన్మాయచే, తమ స్వాతంత్ర్యము గప్పబడ, యోగాదియు క్తులచే, తదాచ్ఛాదిత స్వాతంత్ర్యమును కొలదిగ బొంది, దుర్ఘటనములను ఘటించుచున్నారు. తన పూర్ణ స్వాతంత్ర్యము చేత, పరచితి యట్లొనరింప చిత్రిమేమియు లేదు.

పూర్ణమగు చిదాత్మకు పరిచ్ఛేదమెట్టిదో, తెల్పెద వినుము చిదాత్మ స్ఫురత్ప్రకాశ రూపమైనది. అట్టి స్ఫూర్త్యాత్మ ప్రకాశము యొక్క అనాత్మ విశ్రాంతియె, 'ఇదం' భావము. అనగ జడములందు గలిగెడి స్ఫూర్తికి 'ఇదంత' యని పేరు. స్వాత్మవిశ్రామము 'అహం' భావము. చిదాత్మ, యఖిలరూప విశ్రామము గలిగిన దగుట, 'పూర్ణాహంభావ' మని, చెప్పబడుచున్నది. ఇవ్విధముగ పూర్ణాఖండ రూపమగు చిదాత్మ, తన స్వాతంత్ర్యమును మాయా వశమున, నేకదేశముగ భాసించును. అందలి యభిమానము, అనగ, నహంభావము పరిచ్ఛేదమని, చెప్పబడు చున్నది. ఈ పరిచ్ఛేదమపూర్ణత్వ ఖ్యాతియనియు, నవిద్య యనియు జెప్పబడుచున్నది. ఇట్లు పరచితి తన స్వచ్ఛస్వాతంత్ర్యమున, తాను బహుధా పరిచ్ఛిన్నముగ నున్నటుల, భావింపబడుచున్నది. ఇందు పండితు లనేకులు భ్రమపడు చున్నారు. బహిర్దృష్టిగలిగి, స్వాత్మ ననుభవ మొనరించు కొను ప్రయత్న మొనరింపకుండుటయె, దానికి కారణము.

గురువు చెప్పినది విని, యంతర్ముఖుడగుచు, జెప్పబడిన రీతి, ఆత్మ సద్రూపమా, యసద్రూపమాయని, యపరోక్షముగ తెలిసికొను పర్యంత, మనుభవము జేసికొననియెడల, ఫలమును బొందజాలరు. శ్రవణాదులచే గల్గిన పరోక్షతా మాత్రమున ఫలము గలుగదు. కావున రామ! నేజెప్పినది, యంతరదృష్టిచే పరిశీలింపుము.

పరిచ్ఛేద కారణమగు మాయాస్వరూపమును, తత్ప్రాగ్వ్యక ముగ, మాయాకాశ స్వరూపమును, సుస్పష్టముగ దెల్పెద వినుము. చిద్రూపమగు పరాదేవి, దృశ్యాకార పరిచ్ఛేద రహితమును, సర్వానుస్యూతమును, నట్లగుట బ్రకాశమయమునై యున్నది. కావున స్వాత్మ విశ్రాంతిగలది. కాన పరాఽహంతాయని, చెప్పబడుచున్నది. జడములు, చిదాత్మయందు భాసించునవికాన, వానికి స్వాత్మ విశ్రాంతి లేదు. జడములు చిదాత్మాశ్రయమున భాసించుటను, స్వయముగ భాసింపజాలకుంటను, స్వాత్మ విశ్రామము లేదు. చితి యితరాపేక్ష లేక స్వాతంత్ర్యమున, సర్వదా తనంతతానె భాసించుట, తనయందె, విశ్రాంతి గలిగిన దగుచున్నది. జడములకు వలె గాక స్వస్వరూప ప్రకాశమం దన్యాపేక్ష లేకుండుటెద్దిగలదో, యదియ స్వాత్మ విశ్రామమని భావము. ఈ స్వాత్మ విశ్రాంతి పూర్ణా-

హంతా లక్షణము. చిదాత్మయందు సర్వమును, ఆదర్శ మందు ప్రతిబింబ నగరమువలె నుండుట, పరిచ్ఛేదరూపము లన్నియు స్వాతిరిక్తముగ లేకుండుటను, తనకు పరిచ్ఛిన్నత లేని కారణమున. భేదస్పర్శ, యీషన్మాత్రము లేకుండుటను, ఈ 'అహంత'కు పూర్ణత్వము సిద్ధించినది కాన పూర్ణాఽ హంత, యనబడు చున్నది. పూర్ణ స్వరూపిణియగు చితికి గల, యపరిచ్ఛిన్న స్వయంస్ఫురణమె, స్వాత్మ విశ్రాంతి యనియు, పూర్ణాఽహంతయనియు జెప్పబడుచున్నది.

చితి పూర్ణాఽహంతయన, వస్తుద్వైవిధ్యమున, బరిచ్ఛేదము గల్గుచున్నదని యూహింపకుము. ఈ రెండును గూడ నఖండైక చిన్మాత్రమని తెలియుము. తత్త్వనిరూపణకిట్లుగా నిర్దేశింపబడినది, చిత్తత్త్వ మఖండైక రసము; పూర్ణాఽ హంతయనినను, స్వాతంత్ర్యమనినను తచ్ఛక్తి. అన, చిచ్ఛక్తి యగుచున్నది. ఆ చిచ్ఛక్తి చిదేకరసమె, యగును. తేజ స్సునకు బ్రకాశోష్ణత్వములు వేరుగానటుల, నా చిత్త త్త్వము స్వాతంత్ర్య విశ్రాంతి సహితైక రసాత్మకమైనది. ఈ పూర్ణాఽహంతయె, మాయాశక్తి. ప్రతిబింబ విచిత్ర ములు గల్గియు నేకరూపమగు నాదర్శమువలె, స్వరూపమున చిదేక రూపిణియయ్యు, జగద్విచిత్ర భాసనముచే, భాసించు చున్నట్లు చిత్రముగ భాసించుకాలముననైన, తన చిదేకరస

స్వరూపమును విడువకుండును. కాన, నతి దుర్ఘటమైనదని చెప్ప నొప్పుచున్నది.

ఇట్లు స్వాతంత్ర్య రూపమగు మాయా శక్తి వలన, స్వాత్మయొక్క పరిచ్ఛేద మేది భాసింపబడుచున్నదో, యది యనాత్మ భాసము. దాని కవిద్యయనియు, జడశక్తియనియు, శూన్యమనియు, ప్రకృతియనియు పేర్లుగలవు. అత్యంతా భావరూపమగు నాకాశమీ యవిద్యయొక్క ప్రథమ సృష్టి. అనాత్మ భాసము మొదలీ ప్రథమసృష్టి వరకును, ఆత్మ యొక్క అదిమ పరిచ్ఛేదమువలె, జెప్పబడుచున్నది. పూర్ణా త్మ విశ్రాంతియొక్క, ఏకదేశత్వ భ్రాంతివలన నాకాశము భాసించుచున్నది. 'అహం' భావవర్జితమగు నాత్మరూపమే, యాకాశము అదియే సంసారకారణము.

ఈ యాకాశ భాసనమున, నంతరములు గల్పింప బడు చుండ, భేదము భాసించుచున్నది. కావున పశుదృష్టికి గోచరమగు భేదమీ యాకాశమె. నీచే లక్షింపబడు నాకాశమందుగల జీవరాసులయొక్క చైతన్యాత్మక మగు నాత్మ, ఆ యాకాశమె. అన్యదేహములందు నీకు సదా భాసించు నాకాశమె, వారలయొక్క చిదానంద ఘనరూప మగు నాత్మ. ఇట్లు నెచ్చటెచ్చట ఏయే యాకాశము

భాసించుచున్నదో, యచ్చటచ్చట నందున్న దేహధారుల యొక్క యాత్మ, యదియేయని భావము. ఆకాశాత్మలకి కైక్యము భాసగుచున్నది.

పూర్వోక్త స్వకల్పితాకాశముచే నావరింపబడిన చిదాత్మయె, మనస్సని చెప్పబడుచున్నది. మనస్సు ఆత్మయె కాని తదితరము గాదు. ఆత్మయె, మనస్సైనన, ప్రమాతృ పరిమాణ భేదమెట్లు గల్గునో, చెప్పెదవినుము. జడశక్తిచే నావృతమగు చిత్తత్వము జీవుడు. అందావరణాత్మకమగు జడశక్తి ప్రాధాన్యమున, ప్రమాణ జ్ఞానసాధనముగ మనస్సగుచున్నది. ఆవరింపబడిన చిత్తత్వ ప్రాధాన్యమున, జీవుడు ప్రమాతయగుచున్నాడు. అనగ చిదావరణ రూపమగు జడశక్తి మనస్సు. జడశక్త్యావృతచిత్తు జీవుడు.

ఇట్లు స్వస్వాతంత్ర్యమున, కల్పితమగు నాకాశాత్మక జడశక్తిచే నావృతమయ్యు, తిరిగి పంచభూతాత్మక దేహముచే గూడ నాచిదాత్మ యెట్లావృతమయ్యెనో, తెల్పెద వినుము. స్పర్శాభావమును, నసంశ్లిష్టావయవత్వమును, ననిబిడత్వమును, మాలిన్య రాహిత్యమును, మున్నగు గుణములు గల యాకాశమందు, స్పర్శ సంశ్లిష్ట, నిబిడ, మాలిన్యత్వాది గుణకల్పన, భూతముల నాభాసింప జేసెను.

అనగ స్పర్శాది రహితమగు నాకాశమునకు, స్పర్శకల్పన, వాయురూపమును; వాయువునకు సంశ్లిష్టావయవత్వ కల్పన, తేజోరూపమును; తేజస్సున కనిబిడత్వ కల్పన, జలరూపమును; జలమునకు మాలిన్య కల్పన, పృథ్వీ రూపమును, ననువిధమున భూతములు భాసింపబడెను. ఇట్టి భూతరాశి మయమగు దేహముచే సమావృతమగుచు, నా జడశక్త్యావృతమగు చిత్తత్వము దేహతాదాత్మ్యమును బొంది, దేహాత్మ యగుచున్నది. ఇట్లు దేహాత్మత్వము నందియు గూడ, చిద్రూపమును బరిత్యజించుట లేదు. ఆ చిదాత్మ శరీరాంతర చిత్ప్రకాశమాత్ర రూపమగుచు, ఘటాంతర్గూఢ ప్రదీపము ఘటాంతర్భాసమానమగు నటుల, దేహాంతర్మాత్ర భానము గల్గియున్నది. దీపకాంతి ఘట ఛిద్రముల నుండి వెలుపలికి బ్రసరించునటుల, నేత్రద్వార ముఖమున నా చితి, బహిర్నిర్గమము గలదగుచున్నది. అనగ, నేత్రాది కరణ ప్రసారసముదితమగు ఘటాదిజ్ఞాన మాత్మ భూతమని భావము. ఆకాశతుల్యమగు చిదాత్మకు నిర్గమ మెట్లసిన, పూర్ణము, క్రియారహితమునగు చిదాత్మకు నిర్యాసమే లేదు. వాస్తవముగ కటుల లేకున్నను, నట్టి నిర్గమన మాభాస మాత్రమె యగును చిదాత్మ, తన స్ఫురణరూప జ్ఞాన శక్తిచే, తనకావరణ భూతమగు నాకాశాత్మకజడశక్తి రూపా జ్ఞానము నెంతగ నివారించునో, యంతగ తనయొక్క నిర్యా

సము భాసించును. ఆత్మస్ఫురణచే, నావరణమును నివారించుట, మనోవ్యాపారమనబడును. కావున నాత్మకంటె మన స్సన్యము గాదు. ఆత్మయె, మనస్సని చెప్పబడుచున్నది. చలనముతో గూడిన చితియె, మనస్సు. నిశ్చల చితియె, యాత్మ. తన స్ఫురణచే నావరణను నివారించుటయె, చితి యొక్క చలనము. అదియు, వికల్పమనబడును. ఈ వికల్పమును, వర్జించిన గల్గు నిర్వికల్ప పూర్ణరూప విజ్ఞానమె, ముక్తిదాయకము. వికల్ప వివర్జనమున గల్గు నిర్వికల్ప విజ్ఞానము, ముక్తిరూపమనుటయందు సందేహము వలదు. నిర్వికల్ప స్థితిమాత్రమున, నావరణ నివృత్తి యెట్లు గాగలదని, యాశంకించిన వినుము. వాస్తవమున. నావరణయే లేదు. రజ్జు సర్పమువలె నావృతి, స్వయముగనె కల్పితము. కావున నది సత్యమైనది కాదు. స్వప్నమునం దొకానొక శత్రువు నిచే బంధింపబడినట్లును. కొట్టబడినట్లును సంకల్పించి బాధ నందును. తస్సంకల్పము విసర్జింప, నా తాడన తర్జనాదికము మాయమగును. అవి యట్లుమాయమైన, నిక బంధ రూపమున మిగిలియున్నదేమి? అటువలె సర్వ సంకల్ప త్యాగానంతర మెట్టి బంధము గాని యుండజాలదు.

రామ! కల్పనాతిరిక్తమగు బంధమెవ్వరికి గాని, యెప్పుడు గాని, యెచ్చటగాని లేదు. అట్టిచో నుపదేశాది

క్రినుమంతయు వ్యర్థము గాగలదుగదా యనిన వినుము. జడాత్మ భ్రాంతిని విడచి. యీబంధ మెట్టిదో, విచారింపుము. బంధమున్న దనుబంధ సత్యత్వనిశ్చయమె మహాబంధము. అనగ, స్వరూపజ్ఞాన ముండియున్నను, బంధసత్యత్వ భ్రాంతి నివృత్తియగువరకు, జ్ఞానఫల ముద యింపదు. కనుక నదియు, ముఖ్యబంధము. నిమిత్తములేక భయపడు బాలునియెదుట, సాక్షాత్కరించు దయ్యమువలె, నీబంధము గూడ నున్నది. ఎంతటి బుద్ధిమంతుడైన, నెట్టి మహాప్రియత్నముల నొనరించిననైన, నీ బంధభ్రాంతి వదలనంతవనుక, సంసృతి నుండి ముక్తుడు గాజాలడు. నిర్మలమగు చిదాత్మకెట్టి బంధ మెట్లు గానుండగలదు స్వాత్మరూపాదర్శ గర్భమున, బ్రతిబింబాత్మకములుగ భావింపబడువానిచే. బంధము గల్గిన, నద్దమందు ప్రతిబింబింపబడిన యగ్ని, దహింపగల్గినదియె, యగును. బంధమందు సత్యత్వబుద్ధియు, మనస్సునునది కలదను నిశ్చయమును, నగు ద్వివిధ భ్రమాతిరిక్తముగ, బంధమెవనికేని, యెచ్చటను లేదు. ఇట్టి భ్రమద్వయాత్మకమలమును, సద్విచార మహాజలమున క్షాళనముజేయు నంతవనుక, సంసృతి నుపశమింపజేయ, నేను గాని, బ్రహ్మవిష్ణు మహేశ్వరులు గాని, విద్యారూపిణియగు త్రిపురా పరమేశ్వరికాని, సమర్థులము గాము. కావున రామ! యీ భ్రమద్వయమును విడచి సుఖింపుము. మనస్సు నిర్వికల్పరూపమును దాల్చిన,

నాత్మమాత్రమె యగుట, ద్వైతభావము మిగిలియున్నదనుట కెట్టి యవకాశమును లేదు.

'ఇది', 'అది', యనెడి భాసనము కంటె, మనస్సు వేరేమియును లేదు. 'ఇది', మొదలగునదెల్లను బరిత్యజింప, నాత్మయె, మిగులుచున్నది. అనగ, దృశ్యాకార సంవలితమగు నాత్మయె, మనస్సని తాత్పర్యము దృశ్యాకారమునెల్ల బరిత్యజింప, నాత్మయె, మిగులుచున్నది.

భ్రాంతి కాలమందైనను ద్వైతము నిలువజాలదు. రజ్జురూపమునందు, సర్పము భాసించుచున్నదను నిశ్చయమె, రజ్జుసర్పభ్రాంతి యనబడుచున్నది. ఈ భ్రాంతియందారోపితమగు సర్పమునకు బాధకలిగినను, అనగ సర్పభ్రాంతి నశించినను, తద్భ్రాంతి జ్ఞానమున కాలంబన రూపమగు, రజ్జుజ్ఞానమబాధితముగ నున్నది. స్వప్నమందలి వస్తువులు, మనస్సునందు కల్పితములైనటుల, నారజ్జువు చితియందు కల్పితమని నిశ్చయము గలిగినపుడు, రజ్జువునకు గూడ బాధగలుగుచున్నది. అప్పుడాజ్ఞానము, ప్రమాతృ వ్యతిరేకముగ, నే యాశ్రయము గల్గి, యెట్టిరూపమున మిగులగలదు! కావున దృశ్యమునకు బాధగలిగినపుడా జ్ఞానము కేవల దృగ్రూపమె యగుచున్నది. అది చిదాత్మానతిరిక్తమగుట, పై భ్రమ

జ్ఞానమున ద్వైతమెట్లుగల్గును?

అర్థక్రియాకారియట్టి, దృశ్యము సత్యమనుచుంటివి. స్వప్నమందలి వస్తువులందుగూడ, నర్థ క్రియాకారిత్వము సుస్థిరముగ నగుపడుచున్నది. స్వప్నమందలి వస్తువు, స్వప్నమందు స్థిరమనియె. యెల్లరచే భావింపబడుచున్నది. ఇక స్వప్నజాగరములందు, భేదమెట్టిదో వినుము. జాగ్రతయందు స్వప్నముయొక్క మిథ్యాత్వ నిశ్చయము గలదు. స్వప్నమందు, జాగ్రితయొక్క మిథ్యాత్వ నిశ్చయము లేదు. ఇదియె భేదము. ఇంతమాత్రముననే, జాగ్రిద్వ్యవహారమునకు సత్యత్వము సిద్ధింపదు. జాగ్రితయందు వస్తువుల స్థిరత్వము, అర్థక్రియాకారిత్వమును ఎటుల జూడబడు చున్నదో, యటువలె స్వాప్నవస్తువులకు స్వప్నమందు జూడబడుటలేదా? స్వప్నమందు, జాగ్రిత్పదార్థములు గాని, జాగ్రతయందు స్వప్నపదార్థములు గాని, యగుపడుటలేదు. అర్థక్రియాకారిత్వము గాని, స్థిరత్వము గాని, రెంటియందును సమముగనే, భాసించుచున్నవి. గడచినదానికిని స్వప్నమునకును భేదమేమి కలదో, సూక్ష్మముగ నాలోచింపుము. ఇంద్రజాలకుడు రచించిన వస్తువులందు స్థిరత్వము నర్థక్రియా కారిత్వము లేకుండెనా? అంతమాత్రముననే, ఇంద్రజాలిక నిర్మాణము సత్యమగునా?

సత్యాసత్య విభాగమును ప్రాకృతు లెరుగజాల కున్నారు. కావున మోహితులగుచు జగము సత్యమను చున్నారు. ఎప్పుడునునాశమనునది లేనిది సత్యమని చెప్ప దగును. అనగ, నభావమునది యెరుగనిదని యర్థము. ప్రకాశరాహిత్య మభావ మనబడును. ఇట్టి యప్రకాశత్వ లక్షణము చితికెన్నడును లేదు. అనేకముగ భాసించుటచే, చిదేతరములగు జడాదుల కప్రకాశత్వము గలదు. అది యెట్టులనిన, నచిద్రూపమగు ఘటాది దృశ్యము లనేకము లగుట, పరస్పర వ్యావృత్తములు. ఒకదానికొకటి భిన్న ముగ భాసించుచు, నొకటి భాసించినపుడు మరియొకదాని భాసనము లోపించుటచే, వానికి ప్రకాశత్వము లేదని చెప్ప బడినవి. ఘటాదులు ప్రతిబింబ రూపమున చిదాత్మ నిర్మ గ్నములుగనె, భాసించుట, చిదాత్మ భాసింపకుండు టెన్న డును లేదు. దృశ్యసామాన్యము భాసింపని దశలందు, చిద్వస్తువుగూడ స్ఫురింప నట్టులున్నందున, దానికిగూడ నభా వము గలదని, యాశంకింపకుము. చితి భాసింపని యెడల, 'యథా, తథా', యను శబ్దవాచ్యమగు, తత్కాలము గూడ భాసింపజాలదు అదియునుగాక, భాసించుట లేదనునది యును, భాసింపజాలదు. 'ఆకాలమున చిత్తు భాసించుట లేదనునపుడు, ఆకాలము, భాసించుట లేదను రెండును గూడ, చిత్ప్రకాశమునసనె భాసించుచున్నవి. కాన, చిత్తు,

యెల్లకాలమును భాసించుచునే యున్నది. కావున చిత్తు సత్యము.

రామ! సత్యాసత్య విభేదమును క్లుప్తముగ జెప్పెదను వినుము. స్వప్రకాశమగునది సత్యము. తదితరమసత్యము. అట్లుగానిచో, రజ్జుసర్ప భ్రాంతియందు 'ఇది సర్పముకా'దని యెడి బాధాజ్ఞానము గలుగక పూర్వముగల, సర్పమనెడి భ్రాంతి జ్ఞానము సత్యము గావలయును మరియు బాధిత మగునది యసత్యము, అబాధితమగునది సత్యమను నీపక్షము సరియగునది కాదు. బాధయనలేదను జ్ఞానము. అబాధ యననున్నదను జ్ఞానము సత్యమగు నాత్మవస్తు వుండినను, లేదను జ్ఞానము గల్గును. అసత్యమగు ఘటాదికము, పర మార్థ సత్యము గాకున్నను, నున్నదను జ్ఞానము గల్గును.

ఇట్టి దోషముండుటవలన, నబాధితము సత్యమని, బాధిత మసత్యమనియు ననెడి వాదము యుక్తముగాదు. మాపక్షమున చిదాత్మ స్వప్రకాశము గాన సత్యము. చిదతి రిక్తమగు జడమంతయు, స్వప్రకాశము గాకపోవుట, నస త్యము. ఇందెట్టి దోషమును గలుగజాలదు. చిదాత్మ భాసింపని యెడ, నెద్దియూ భాసింపదు. 'ఏమియూ లేద'ను మాటకూడ యసంభవము. కావున చిదాత్మ స్వయంప్రకా

శమనుట నిశ్చయమనక దప్పదు. చిదాత్మకూడ స్వయం ప్రకాశము గాదని చెప్పెడి, తార్కిక పండితమ్మన్యుడు, 'నేను లేన'ని పల్కెడివాడె, యగుచున్నాడు. వాని కెవ రేమి చెప్పగలరు! సర్వథా భాసింపక పోవుచున్నదని, యెవని కాత్మయొక్క యునికియందు సందేహము గల్గునో, యట్టి పండితమ్మాని, తన తర్కనైపుణ్యమున, నితరుల మోహమును బోగొట్ట జాలిన, నీచటాయికూడ, నన్యుల మోహమును బోగొట్టును. కావున సత్యాసత్య విభేదము స్వప్రకాశ పరప్రకాశ్యత్వములచే నిర్ణీతమగునుగాని, కేవల వ్యవహార దక్షత్వరూపమగు, నర్థక్రియా సంగతమాత్రమున నిర్ణీతము గాజాలదు.

సర్వజ్ఞానమును భ్రాంతి రూపమగుచుండ, భ్రాంత్యా భ్రాంతి విభేదమెట్లని యడిగితివి. చెప్పెద వినుము. సర్వ జ్ఞానమును, నిస్సంశయముగ భ్రాంతిరూపమె యగును. ఇట్టి జాగ్రిత భ్రాంతిజ్ఞానములంద భ్రాంతిత్వ నిశ్చయము గల్గుట మరియొక భ్రాంతి. జ్ఞానము సర్వమును భ్రాంతి రూపమగుచుండ, నభ్రాంతిరూపమున నెట్లు భాసించుననిన. భ్రాంతి జనకమగు నజ్ఞానమును బాధించు (నివారించు) విజ్ఞానము గలుగక పూర్వము, భ్రాంతియే యుండునటుల, సర్వ జగద్గత విజ్ఞాన, మభ్రాంతి రూపముననున్న మహాభ్రాంతి

వలె నున్నది. శుక్తి యను జ్ఞానముగలుగ, రజత జ్ఞానము భ్రమయగునటుల, చిదాత్మ విజ్ఞానము గలిగిన, సర్వజ్ఞాన మును భ్రమాత్మకము గాగలదు. అందరకును భ్రమ సమానముగ నెట్లుండునని యడిగితివి. ఆకసము నీలముగ నున్నదను భ్రమ సర్వసమానము గాద! దూరత్వ దోష మున నందరకు నట్లగుచున్నది. అందరకు, నవిద్యా దోష ము సామాన్యమగుట, జగద్భ్రమ యెల్లరకును సమాన ముగ నున్నది. సర్వ జ్ఞానానుస్యూతమగు ప్రజ్ఞానమె, అభ్రాంతి. ఆ ప్రజ్ఞానమె, యీభ్రాంతిరూపమగు చిదాత్మ రూపమున నున్నది.

రాము! నీచే నడుగబడిన దంతయు, యుక్తి పురస్సర ముగ జెప్పితిని. అందు సందేహమువదలి, చెప్పినదంతయు లెస్సగ విచారింపుము. జ్ఞానికి వ్యవహార మెట్టిరూపమని వెనుక నీవడిగియుంటివి. అది, తెల్పెద వినుము. లోకము నందు ముక్తులగు జ్ఞాను లుత్తమ, మధ్యమా. ధమ. రూప మున మూడు విధముల నున్నారు. పూర్ణాత్మ స్వరూపజ్ఞ లయ్యు, ప్రారబ్ధవశమున గల్గు భోగముల ననుక్షణము ఖేదింపబడువారు మందజ్ఞాను లనబడుచున్నారు. ప్రారబ్ధ ముచే సంప్రాప్తములగు సుఖదుఃఖాదుల ననుభవించు చున్నను, మధుమత్తములగు మధుక్షీబములవలె, నవి గుర్తి

డక నుండువారు మధ్యమ జ్ఞానులు. విచిత్రములగు కోటాను కోట్ల ప్రారబ్ధము లనుభవించుచున్నను, స్వస్థితినుండి చలింపక, నాపద పరంపరల నుద్వేగమును జెందక, మహా సుఖముల నానందపడక, నాశ్చర్యముల విస్మయమందక, నతః శాంతులును, బాహ్యముగ ప్రాకృతసములు నగువారు జ్ఞానులయం దుత్తములు. అధమజ్ఞానులకు స్వరూప సమాధి, యెల్లపుడును లేదు. ప్రారబ్ధముచేతనో, వాసనాశేషమువనో, సమాధివిచ్ఛేదము మధ్యమధ్య గలుగుచుండ క్లేశము నందుచుందురు. ఇట్టివాడు జీవన్ముక్తుడు గాడు. కేవలము జ్ఞాని. తదితరు లిరువురును జీవన్ముక్తులు. అందు రెండవ వాడు పరిపక్వ నిరోధ సమాధిస్థితుడు. మూడవవాడు పరిపక్వ బాహ్య సమాధిస్థితుడు. ఇట్టి యుత్తమ జ్ఞానులందు బుద్ధిభేదమునను, జ్ఞానపరిపాక భేదమునను, ప్రారబ్ధ శేష మాహాత్మ్యమునను, వ్యవహారములు భిన్న భిన్నముగ నుండును. మద్యపానమత్తులగు వారలకు వ్యవహారము గల్గువిధమున, నిట్టిజ్ఞానులకు గూడ వ్యవహార సంబంధమని యెరుగ వలయును.

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ ప్రకాశిక యను నాంధ్రీకరణంబున, భార్గవ సందేహ నివృత్తిగూప అష్టాదశాధ్యాయము.

# ఏకోనవింశత్యధ్యాయము

తే॥గీ॥ జ్ఞాని భేదంబు స్థితియు విజ్ఞాన సాధ
నంబు పురుషత్రివిధ వాసనాచయమ్ము
దాని జయమందురీతి, నుదాత్త గతిని
బల్కె గురుడిందు వినుమంబ! భారమనక-

దత్తాత్రేయు లట్లుజెప్ప విని, భార్గవుడు ముక్త వ్యవహార క్రమమునుగూర్చి, యిటుల ప్రశ్నించెను. "స్వామీ! బుద్ధి భేదమున జ్ఞానము విచిత్రముగ నుండునంటిరి. స్వాత్మ మాత్ర ప్రకాశాత్మకమగు జ్ఞాన మేకవిధమనియు, నదియె పొందదగినదనియు, నదియె మోక్ష రూపమనియు గూడ చెప్పియుంటిరి. అట్టియెడ మోక్షోపాయ మోక్షము లేక రూపమగుచున్నవి. అట్టిచో, బుద్ధియందు తీవ్ర మందత్వాది భేదములున్నను, ముపాయోపేయము లొకటియేయగునపుడు, జ్ఞానమందు పాకవిచిత్రత యెట్లు సంభవించును? జ్ఞాన సాధనములు వేరుగనున్నవా? లేవా? ఈవిషయము నాకు విస్తరించి నిర్ధారింప ప్రార్థించుచున్నాను."

దయానిధియగు దత్తాత్రేయులంత నా యర్థము ల, విస్తృతముగ జెప్పనెంచి, యిట్లారంభించెను. "రామ! యీ యుత్తమ రహస్యమును జెప్పెద వినుము. జ్ఞానసాధన మందు విభేదము లేదు. జ్ఞానమునకు విచిత్ర సాధనములు లేవు. సాధనాల్పానల్ప తారతమ్యము ననుసరంచి, ఫల ప్రాప్తి భేదించుచుండును. ప్రాగనేక జన్మార్జిత సాధన పూర్తిగ గల్గినట్టి సాధనా పూర్తియందు జ్ఞాన, మాకాశ ఫలపాతమువలె, ననాయాసముగ లభించును. సాధన యొక్క పూర్త్యపూర్తి తారతమ్యము ననుసరించి, జ్ఞాన ప్రాప్తియందలి, యాయాస తారతమ్యముగూడ గల్గుచుం డును. పరమార్థమున జ్ఞానము స్వరూపసిద్ధమగుట సాధ్య మెన్నడును గాజాలదు. కావున నద్దానికి సాధనాపేక్షయె, లేదు. చైతన్యమె విజ్ఞానము. అది సదా స్వయంప్రకాశ మానము. అట్టి నిత్యప్రకాశ స్వరూపమందు సాధనాపేక్ష యెట్టిది? చిత్తమనెడి, యతినిర్మల స్ఫటిక భరిణయందు, పద్మరాగము వలె, చైతన్య మంతర్గతముగ నున్నది, ఆ చిత్త స్ఫటిక కరండ, మనంత వాసనారూపమగు పంకముచే నావరింపబడి యున్నది. కాన పద్మరాగతుల్యమైనను చైత న్యము, స్వరూపము ననుప లక్షింపబడకున్నది నిరోధ మను సలిలమున, నా వాసనా పంకమును లెస్సగ పరిమా ర్జింప వలయును. ఆ చిత్తకరండ మనాదికాలము నుండియు

మూయబడియుండుట, బిగిసియుండును. అనంతరము విచారణ రూపమగు తీక్షయంత్రమున, యుక్తిసహితముగ దానిని తెరువవలెను. అప్పుడందు భాసమానమగు మణిరూప చైతన్యమును బొందనగును. అనగ ననాదిగ, దేహాది తాదాత్మ్యమును జెందిన చైతన్యమె, చిత్తమనబడు చున్నది. ఆ దేహాది తాదాత్మ్యమె, మూతబిగింపు. దేహాదుల నుండి, భిన్నరూప వివేచనయె, యుద్ఘాటనము. ఇట్టి విచారణ వలన చైతన్య స్వరూపస్ఫూర్తి కలుగును. ఇట్టి విచారణకు పూర్వము, నిరోధమున వాసనలత్యజింపవలయును కావున రామ! వాసనలను రూపుమాపుట యందె, సాధన మూపయుక్తము కాని స్వరూపసిద్ధియందు గాదు. జన్మాంతర సమార్జిత పుణ్యావశమున, చిత్తమందు వాసనలు న్యూనముగనున్న, సాధనాపేక్ష యల్పముగ నుండును. అట్లుగాక, నధికముగ నున్న సాధనాపేక్షయు నధికముగ నుండును. ఈ వాసనాల్పాధిక్యతలనుబట్టి, బుద్ధికూడ వివిధముగ నుండును. ఎవని యొక్క బుద్ధి, యెంతగ వాసనా సమూహమున, నాచ్ఛాదిత మగుచుండునో, యంతగ నాతనికి సాధనాపేక్ష యుండగలదు.

వాసనలు బహువిధములు. అందు ముఖ్యమగునవి తెల్పెద వినుము. అపరాధ, కామ, కర్మభేదమున వాసన

త్రివిధము. అనగ నపరాధవాసన, కామవాసన, కర్మవాసన యని మూడువిధములు. ఇందపరాధమనునది, యశ్రద్ధారూపము. ఇది ముఖ్యమును, స్వాత్మవినాశకమును నగుచున్నది. శాస్త్రమునందు జెప్పబడినదియు, గురువుచే బోధింపబడినదియు, సత్యమను దృఢనిశ్చయము శ్రద్ధ. తద్విపరీతమశ్రద్ధ. ఇట్టి యశ్రద్ధారూపమునకాక, అపరాధవాసన విపరీత గ్రహరూపమున గూడ నున్నది. తరచుగ, శాస్త్రనిపుణులగు పండితులు గూడ, నెన్నిపరికరము లున్నను, ఈ యపరాధవశమున, జ్ఞానము నందకున్నారు. విపరీత గ్రహదోషమున, నిర్విశేషమగు పరతత్వ ముండజాలదనియు, లేదనియు, నుండినను, నేరిచే దెలియబడ జాలదనియు, తెలియబడిన, నది పరతత్వము గాజాలదనియు, నీ జ్ఞానమున మోక్షమెట్లు గాగలుగునని యు, దోచుచుండును. ఈవిపరీత గ్రహము, నిట్టి సంశయముగూడ, పురుషాపరాధ వాసనాలక్షణము. ఈ వాసన ప్రబలమైనది. శాస్త్రవిద్యలందు కుశలులగు నసంఖ్యాకులు రామ! యీవాసనచే నాక్రమింపబడి సంసృతిని బొందుచున్నారు. ఇయ్యది పూర్వజన్మార్జిత దుష్కృత సంస్కారవశమున, బుద్ధి నావరించి యుండును.

ఆచార్యులచే లెస్సగ జెప్పబడిన దానినైన, బుద్ధి

కెక్కనీయని యుపదేశగ్రహణ ప్రతిబంధక రూపమగు మహాధ్యమునకు, కర్మవాసన యనిపేరు. ఇది నిరోధమున గూడ జయింప శక్యముగానిది. కామమన, కర్తవ్యశేషము. ఈ పనిని జేసి, దీనినిబొందవలయునని నెడి కోరిక. ఇది బహు విస్తృత మైనది. సముద్రమునందలి తరంగములను గాని, పృథివియందగు నణువులను గాని, యాకసమందలి నక్షత్రములను గాని, లెక్కింపవచ్చును గాని, యొక్క మనుజునికిగల కామములను లెక్కింప వలనుబడదు. ఆశా పిశాచి యని చెప్పబడు; నీ కామవాసన, యాకసముకంటె విస్తీర్ణమును పర్వతము కంటె నచలము నైనది. దీననీ సమస్తలోకము గూడ నున్మత్తమగుచున్నది. దీనదందహ్యామాన మగుచు లోక మాక్రోశించు చుండును. లోకమునందు, ధన్యులు కొందరు మహామంత్రరూపమగు వైరాగ్య మాశ్రయించి యీ వాసనా నిర్ముక్తులగుచు, సర్వాంగ శీతలులై ప్రకాశించుచున్నారు. రామ! యీ మూడు వాసనలచే పరీవృతమగుట, చిత్తత్వము యదార్థముగ భాసింపకున్నది. కావున వాసనానాశమే సర్వసాధనలయొక్క ఫలము. ఇందు మొదటిది యగు నపరాధవాసన, 'ఈ దోషమునకు మూలము, నాకు జ్ఞానము కలుగక పోవుట' యను నిశ్చయమున నివర్తింప బడగలదు. రెండవదియగు కర్మవాసన, యొకే జన్మయందుగాని; లేక ననేకజన్మలయందు గాని, యీశ్వరప్రసా

దముననె నివర్తింపబడగలదు. అట్టి, యీశ్వర ప్రసాద మున గాక, కోటియుక్తుల నైనను, నివర్తింపబడ జాలదు. మూడవదియగు, కామవాసన వైరాగ్యాది సత్సాధనలచేవి నివర్తితమగును. విషయములందు సదా దోషచింతనయె, వైరాగ్యకారణము గాగలదు. మరియొకవిధమున వైరాగ్యము జనింపదు. ఈ చెప్పబడిన వాసనాల్పాధిక భేదమును విషయములందలి దోషదృష్టియు, హెచ్చుతగ్గుగ నుండును.

సర్వ సాధనములకును మూలభూతమగునది, ముముక్షుత్వముగాని మరియొకటి కాదు. ముముక్షలేని శ్రవణమన నాదికమంతియు, ముఖ్యఫలము నొసగజాలదు. అపరోక్ష జ్ఞానము శాస్త్రప్రక్రియా జ్ఞానమాత్రసంపద, శిల్పమువంటిది. దానికి సంసార నివృత్తిరూప మహాఫలము లేదు. వైకుంఠమును పటమున రచించినవాడు, వైకుంఠమును బొంద జాలనటుల, కేవల శాస్త్రజన్యజ్ఞానమున, బరమపదముబొంద పడదు. ముముక్షుత్వము లేక నొనరింపబడిన శ్రవణాదిక మంతయు, శవాలంకారమువలె, వ్యర్థముగాగలదు. రామ! తీవ్రముగాక, మందమగు ముముక్షుత్వము గూడ, ఫలశ్రుతి వలన గలుగు సామాన్య కోరిక ఫలవంతము గాజాలనటుల వ్యర్థమె యగును. గొప్ప ఫలము లభించునని ఫలశ్రుతి వినిన, ప్రాశిోటియుం దెవరికిచ్చజనింప కుండును. కాని

యట్టి ఫలశ్రుత్యనంతరము గలిగిన యిచ్ఛామాత్రమున, గట్టి కృషిచే గాని పొందబడ నిఫలమెటుల, లభ్యమగును! కావున నేదో కల్గిన ముముక్షుత్వమునకు ఫలముండ నేరదు. ముముక్షుత్వము తీవ్రమగునెడ, నద్దానికి శీఘ్రకాలమున ఫలము లభించును. సాధనములందత్యంత ప్రవృత్తిని గలిగించునది ముఖ్యతమమగు ముముక్ష. అదియ, తత్పరత యనబడును. సర్వాంగములు దహింపబడువాడు, చల్లదనముకంటె మరియొకదాని నపేక్షింపనటుల, నెపుడు సంసారదాహసంతప్తుడగువాడు విముక్తికంటె వేరొండపేక్షింపడో, అపుడె తీవ్రముముక్షుత్వము గలిగినదని చెప్పవలయును. అట్టిది సంసారోత్తారణరూపఫలసాధనమందు సమర్థమగుచున్నది. అట్టి తీవ్రముముక్ష, విముక్త్యేతర విషయమందు గల్గు దోషదృష్టివలన జనింపగలదు. ఆవైరాగ్యమెంత తీవ్రముగనడచిన, ముముక్షుత్వమంత తీవ్రరూపముదాల్చును. దోషదృష్టివలన, విషయములందలి యాస్థ నశింపజేయు వైరాగ్యముదయించును. వైరాగ్యమున ముముక్షుత్వము గల్గును, తీవ్రముముక్షుత్వమున, తత్పరత యుదయించును. తత్పరత్వమున, సాధనలయందలి తీవ్రముగుప్రవృత్తి. అట్టి తీవ్రప్రవృత్తివలన నద్భుతఫలమందబడును."

ఇట్లు దత్తాత్రేయులు బలుక, సందిగ్ధమనస్కుడగుచు,

తనకు గల్గిన సంశయమున రాముడిటుల ప్రశ్నించెను. "మహాత్మా! మోక్షమునకు మూలకారణము, సత్సంగము మని చెప్పితిరి. ఈశ్వరానుగ్రహ మనియు చెప్పియుంటిరి. దోషదృష్టియు నంటిరి. ఇందు ముఖ్యమగు నాది కారణ మెద్ది? అట్టి దానికి గూడ కారణమెద్ది? దానికికారణము లేద నిన, కారణరహితముగ నెద్దియు గలుగదని, నా నిశ్చయము. కాన, కారణము లేక యెట్లుండగలదు? అదియంతయు నాకు విస్తరించి సెలవిండు."

అంత దయానిధియగు దత్తాత్రేయు లిటుల బదులు జెప్పెను. "భార్గవ! శ్రేయస్సున కాధికారణమును నీకుజెప్పెద వినుము. ఆపరమేశ్వరియగుచితి, తనయొక్క స్వాతంత్ర్య మాహాత్మ్యమున, దర్పణమందు ప్రతిబింబమువలె, తనయందు జగచ్చిత్రమును వికసింపజేసెను. ఆపరాచితియె, హిరణ్యా గర్భ శరీరమును దాల్చి, యనాద్య జ్ఞానావృతులగు జీవుల నుద్ధరించు నిమిత్తము, సర్వకామప్రపూర్ణమగు నాగమాబ్ధిని, వెలిబరచెను. సృష్టియందు స్వభావమున జీవుల విచిత్ర కామవాసనా యుతులు. అట్టి జీవులకు శుభమెట్లు గల్గునని. యా హిరణ్యాగర్భుడు, చింతా పరాయణుడగుచు, నాగమా బ్ధియందు చిత్రఫలములు గల్గిన కామ్యకర్మలను సృజించెను. జీవుడు స్వభావముగ, సత్కార్యములను దుష్కార్యములను

జేయుచునుండును ఇట్లు కర్మపరిపాకవశమున, ననేక యోని సహస్రముల భ్రమించుచు, నేదో పుణ్యకర్మ వశమున మానుషభావమును గాంచును. అందు కామవాసనా వశంగతుడగుచు కామ్యకర్మలయం దభిముఖుడగును. కామ్యకర్మ ఫలము విశేషముగ బొందగోరి, యీశ్వరు నారాధింప మొదలిడును. అపుడీశ్వరమహిమ నుద్ఘాటించు శాస్త్రముల నవలోకించును. కామ్యకర్మ ఫలశ్రుతిచే, కామ్య కర్మల యందు బ్రవృత్తుడగుచు, తత్ఫలప్రాప్తియందు విఫల మనోరథుడగుచుండును. సూక్ష్మ స్వరూపముగల కర్మల నాచరించుటయం, దనివార్యములగు లోపముల కతన, పూర్ణ ఫలప్రాప్తి కలుగకుండును. అప్పు డొకానొక సత్పురుషు నొద్ద కేగి, కర్మల నెటులాచరించిన, తనకు ఫలప్రాప్తి గలుగ గలదని, కర్తవ్య జిజ్ఞాసనందును. తత్ప్రసంగవశమున, మహేశ్వర మాహాత్మ్యమే కొలదిగనో, వినుట సంభవించును. అంతట ప్రాక్పుణ్యవశమున, నా పరమేశ్వరి ప్రసాదమున, శ్రేయః ప్రవృత్తి కలుగగలదు. కావున భార్గవ! పూర్వ పుణ్యవశమున సత్సంగమును గాంచి, యత్యంత దుర్లభమగు శ్రేయస్సోపాన పంక్తిని, మానవుడందగలడు.

తరచుగ శ్రేయఃప్రాప్తికి, సత్సంగమమె, మూలము. కాని యొకప్పు డత్యుత్కట పుణ్యమున గాని, యత్యుత్కట

తపస్సున గాని, యాకాశఫలపాతమువలె, శ్రేయస్సును మానవు డాకస్మికముగ, ననగ సత్సంగాదికము లేకుండగనే, పొందుచున్నాడు. కారణవైచిత్ర్యమున, శ్రేయఃప్రాప్తికూడ విచిత్రముగనె యుండును. ఇటుల బుద్ధిభేదమునను, వాసనా తారతమ్యమునను, సాధనముల తారతమ్యము వలనను, జ్ఞానులయొక్క స్థితి భేదించుచుండును. పురాకృత పుణ్యకర్మాది సంస్కారమున బుద్ధికి వాసన, యెవని కల్పముగ నుండునో, వాని కల్పసాధనమున, నీప్రతిబద్ధమగు జ్ఞానసిద్ధి కలుగగలదు. అత్యుత్కట పుణ్య సంస్కారమున, వాసనారహితముగ నెవనిమనస్సు, సంసిద్ధముగ నుండునో, యతనికి నిమిత్తమాత్రమున మహత్తరమగు జ్ఞానసిద్ధికలుగును. అతి పాప సంస్కారమున నెవనిమనస్సత్యంత వాసనానిబిడమగునో, యట్టివానికి జ్ఞానము గలిగినను, నది యజ్ఞానమును నశింపజేయ, సమర్థము గాజాలదు. అట్టి యాచ్ఛాదిత జ్ఞానమున, కొన్ని జన్మలు సాధింప, నది పూర్ణత్వమును జెందగలదు. ఇటుల కర్మ సంస్కార భేదములనగు బుద్ధి స్థితి భేదమున, జ్ఞానులస్థితి వివిధముగ నుండును. బుద్ధియొక్క వాసనావృత్తి తారతమ్యమున జ్ఞానము భిన్నముగ గాన్పించును. జ్ఞానుల స్థితిభేదము గూడ, దానిననుసరించియుండును.

రామ! జ్ఞానుల స్థితిభేదము దెల్పెద నాలోకింపుము,

బ్రహ్మ విష్ణుమహేశ్వరులు స్వభావజ్ఞానులు. అనగ, కర్మాది వాసనాభావమున, ననావృత జ్ఞానులు. అయినను స్వభావమున బుట్టిన, సత్వాది గుణమూలమున, వారల స్థితిభేదమును గాంచుము. వారిజ్ఞానమునకు, మాలిన్యము గలదని చెప్పుట యెప్పుడును వలనుపడదు. విశుద్ధ జ్ఞానుల య్యు, స్వభావగుణ మాహాత్మ్యమున, సృష్టి స్థితి లయరూపమున, భిన్నస్థితిని చెందియున్నారు. జ్ఞానియొక్క పచ్చని శరీరము, నలుపుగ మారనటుల, చిత్తస్వభావముగూడ నన్యభావమును జెందదు. అత్రి పుత్రులమగు, దూర్వాసుని, చంద్రుని, నన్నును గాంచుము. మేము ముగ్గురము జ్ఞానులమె మా యందొకడు క్రోధి. మరియొకడు కామి. నేను సన్యాసిని. ఇటుల స్థితిభేదము నందియున్నాము. ఇంకనుగాంచుము. వసిష్ఠుడు కర్మిష్ఠి. సనకాదులు సర్వసంగత్యాగులు. నారదుడు భక్తినిర్మగ్నుడు. కవియగు భార్గవుడు, దైత్యపక్షాశ్రితుడు. గురువు దేవతాశ్రితుడు. వక్తయగు వ్యాసుడు, శాస్త్రనిర్మాణ తత్పరుడు. జనకుడు, రాజ్య పరిపాలకుడు. భరతుడు త్యాగి. ఇటుల స్వభావమున భిన్నస్థితులందున్న చ్యవన యాజ్ఞవల్క్య విశ్వామిత్రాది జ్ఞానులను గాంచుము.

రామ! నీకిందలి రహస్యము జెప్పెద వినుము. వాసన మూడువిధములని చెప్పియుంటిని కదా! అందు రెండవదియగు

మాాధ్యరూప కర్మవాసన, యన్నిటికంటెను మిక్కిలి కష్టమై నది. ఆవాసన లేశమైనను లేనివారు మిక్కిలి మేధావంతులు. అట్టివారల కపరాధవాసనగూడ లేకయుండి, కామ వాసనల భ్యాసపాటవము లేక, నశింపక మిగిలియున్నను, అవిజ్ఞాన ప్రతిబంధకములు గాజాలవు. అనగ కర్మవాసనచే నత్యంత మూఢచిత్తులగు వారల కపరాధ కామవాసనలు లేకున్నను, మాాధ్యమున జ్ఞానోదయము గాజాలదు. స్వల్పకర్మ వాసనచే నీషన్మూఢచిత్తులగు వారల కపరాధ కామవాసనలు, జ్ఞాన ప్రతిబంధకములై యగును. ఎవరికపరాధ కర్మవాసనలు లేశమైన నుండవో, యట్టివారలకు కామవాసనలు జ్ఞాన ప్రతి బంధకములు గాజాలవు. వారలకు వైరాగ్యముతోడ పని లేదు. అటువలె, మననసిద్ధిపూర్వక సమాధికూడ పనిలేదు. వారలు సకృచ్ఛ్రవణ మాత్రముననె, మనన ధ్యానాదికము నంతయు, తత్కాలమునందె కొలదిగ పొంది, పూర్ణాత్మ పదము, సంశయరహితముగ నెరిగి, జీవన్ముక్తులగుచున్నారు. జనకాదు లిట్టివారు. సూక్ష్మము, నిర్మలమునైన బుద్ధిగల వారలు మిక్కిలి దృఢమగు నభ్యాస మొనరించి కూడ, కామాది వాసనల నిశ్శేషముగ నాశమొనరింప జాలని స్థితి యందు, వారల కాత్మసాక్షాత్కారము గలిగినను, పూర్వ స్థితమగు నా కామాది వాసనలు, వెనుకటివలె, నిరంతరము పరివర్తించుచుండును. కాని, యావాసనలయందు, వారి

బుద్ధి యెన్నడును, కొంచెమేనియు సక్తము గాదు. అనగ, నెవరికి వైరాగ్యాద్యభ్యాసముల, తత్ప్రారబ్ధ విశేష జాతములును, జ్ఞానమున కప్రతిబంధకములును నగు. కామాది వాసనలు నష్టముగావో, వారలకు జ్ఞానోదయానంతరము గూడ, కామిత్వ క్రోధిత్వాది లక్షణము లుండునని యర్థము. వారు ముక్తులనియు, బహుమానసులనియు జెప్పబడుచున్నారు.

రామ! కర్మవాసనల నతిమూఢమగు మనస్సునకు సాక్షాచ్ఛివుడె, యుపదేశకర్తయైనను, జ్ఞానముగలుగనేరదు అపరాధ వాసనయైనను, దృఢముగ నున్నవాని కెన్నడును జ్ఞానమటువలె, కలుగనేరదు. అట్లుగాక అపరాధ వాసనయైనను, కర్మవాసనయైనను, స్వల్పముగ నుండి కామవాసన బహుళముగ నున్నవానికి. విశేష శ్రవణ మననాదులను, సమాధ్యభ్యాస ప్రకర్ష వలనను, బహుకాలమున కతికష్టమున విజ్ఞానము లభించును. అట్టివాడెల్లప్పుడును, అభ్యాసమందు నిమగ్నుడు గావలసి యుండుటచే, వానికి వ్యవహారము బహుస్వల్పముగ నుండును. ఇట్టివారలకు యోగనిష్ఠాప్రకర్ష వలన కామాది వాసనలు నశింప, మనస్సు నష్ట ప్రాయమగును. అనగ, సదా నిరోధింపబడియుండును. అట్టివారు మధ్యమ జ్ఞానులనియు, నష్ట మానసులనియు జెప్పబడు చున్నారు. అభ్యాస ప్రకర్ష యంతగ నుండని కారణమున, వాసనలు

పూర్తిగ నశింపక, మనస్సు నష్టముకానివారలు సమనస్కులని చెప్పబడు చున్నారు. వీరు మందజ్ఞాన యుతులు. వీరు కేవల జ్ఞానులుమాత్రమె. పై రెండు తరగతులవారు జీవన్ముక్తులు ఈ కేవలజ్ఞానులు ప్రారబ్ధ పరతంత్రులగుచు, సుఖ దుఃఖముల ననుభవించుచు, దేహాంతమున ముక్తిని జెందుదురు.

మనస్సనియెడి భూమియందు, ప్రారబ్ధమను బీజము సుఖదుఃఖాది భోగ రూపాంకుర పరిణతి గాంచును. నష్ట మానసులని చెప్పబడిన జ్ఞానులకు మనోభూమి యుండదుగాన, తత్ప్రారబ్ధము, పేణకయందున్న బీజమువలె, సంకురిత శక్తిని గోల్పోయి నశించును

మిక్కిలి మేధావి యగువాడు, పదిపనుల నొకే తూరి, యెవ్విధమగు తొట్రుపాటును లేక జేయుచుండును. ఏకకాలమందు నడచుచు, మాట్లాడుచు, పనులను జేయు క్రియానిపుణులను జూచుచున్నాము. ఏకకాలమున నొకే మనస్సుచే, త్రివిధమగు క్రియ, యెటుల జేయబడుచున్నదో చూడుము. అధ్యాపకుడు, మహుమంది శిష్యుల నొకే పర్యాయ మధ్యాపించుచు, నందరు వారి యపశబ్దములను, ననుచ్చారితములను, భేద వర్ణోచ్చారణలను లక్షించుట

లేదా! సహస్రబాహువుల ఖడ్గములు ధరించి, యొకేమారు తొట్రుపాటు లేక, యుద్ధమొనరించు మేధావియగు కార్త వీర్యుని నీవ, చూచితివి కదా! వీనిమనస్సు, తత్తత్కార్య సాధనానుకూల వ్యాపార క్రమయుక్తముగ బహువిధమగుచు, బహువిధములగు కార్యములను సాధించుచుండును. అటు వలె నుత్తమజ్ఞానుల, యాత్మాకారమగు మనస్సు బాహ్యా గతమయ్యును, స్వవిశుద్ధత్వ మెందును గొంచక, చాతుర్య మున వర్తించును. బహుమానసులన నిట్టివారలు. వారి ప్రారబ్ధము, మనోభూమియందు మొలకెత్తిన దెత్తుచుండ గనె, జ్ఞానాగ్నిచే దగ్ధమగుచుండును సుఖదుఃఖప్రాప్తియె, ప్రారబ్ధ బీజాంకురము. బీజాంకుర న్యాయమున వచ్చిన సుఖ మును 'ఇది సుఖ' మని తెలియుట, తత్ప్రారబ్ధ ఫలము. అంకురము, దగ్ధమగుచుండ, తత్ఫలమెట్లు గలుగగలదు? వ్యవహారూపయుక్తమగు ననుసంధానమును, బలాత్కార ముగ స్వీకరించి, యట్టిజ్ఞానులు వ్యవహరింతురు. అట్టి వ్యవ హారమందైన, ననుభవశాలియగు పురుషుడు, పిల్లవానిగూడి యాడుచు, శిలాది నిర్మిత గజతురగాది సేనల యుద్ధక్రీడ యందు, బాలుడు తన గజాదుల నాశమునకు దుఃఖించుచు, నెదుటి గజాదుల నాశమున నెటుల సంతసించుచుండునో, యటువలె, తానుగూడ పైకి సంతసించుచు విచారపడు చున్నను, అంతర్వికారము నందనటుల, నా బహుమానసుడు

ప్రవర్తించును. మఱియు నన్యపురుష వ్యవహార మందలి, లాభాలాభముల వలన తనకు లోపల సంతోష విచారములు లేకున్నను, నెదుటి తృప్తికొఱకు సంతసించుచు, విచార పడుచుండు వడువున, నుత్తమజ్ఞానులు స్వకార్యము లందు గూడ వర్తింతురు. విశుద్ధ వాసనాభ్యాసము చేతను. నిరోధము చేతను, వాసనలు నశించును. మిక్కిలి మేధావులగు జ్ఞానులట్టి యభ్యాస నిరోధము నొనరింపకుండుటచే, నవి నాశమునందని కారణమున, నాయా పూర్వవాసనానువృత్తి, జ్ఞానోదయము పిమ్మటగూడ గల్గుచుండును. ఆ కారణమున, కొందరు కర్మనిష్ఠులుగను, కొందరు కాముకులుగను, కొందరు క్రోధవంతులుగను, వివిధాచార తత్పరులుగ, నుత్తమజ్ఞానులు విలసిల్లుచున్నారు.

సమనస్కులని పూర్వము జెప్పిన మందజ్ఞానుల విషయము జెప్పెదవినుము. వారికిగూడ వేద్యమంతయు, నసత్యమను నిశ్చయబుద్ధికలదు. సమాధి దశయందు, స్వరూపాద్వయ చిదాత్మాను సంధాన కాలమున, వారికిగూడ వేద్యమేమియు భాసింపదు. కాన నుత్తమ జ్ఞానులవలె, నా స్థితియందు వీరికిగూడ హర్ష విషాదాదులు లేవు. సమాధియన స్వరూప విమర్శకాని, మరియొకటి కాదు. సర్వము నకు నాశ్రయమగుచు, నిర్వికల్ప స్వరూపము సదా స్ఫురించుచునె

యున్నది. అది లేనియెడల నుండునది లేదు. ఇట్టి నిర్వికల్పాత్మ రూపము పూర్వమందు జెప్పబడిన, సంవిద్వేద్యాంతరాళాది దశలందు స్ఫురించుచున్నది. అంతమాత్రమున, సర్వజనులకు సమాధి సిద్ధింపదు. సమాధ్యుద్ధిత కాలమందు 'సోహం' అను విమర్శాత్మక ప్రత్యభిజ్ఞానముగల్గిన కావి, యది సంసారోత్తరణ రూప సమాధి కాజాలదు. అదియు విజ్ఞానము.

ఆస్థితి నందినవా రుత్తమజ్ఞానులు. వేద్య సంబంధ రహిత విత్తిదశ సమాధి. ఉత్తమజ్ఞానులకు వ్యవహారమందును, వేద్యసంబంధముగు విత్తియె, విదితమగు చున్నది. అది యెట్లన, నాకాశము నీలముగ నగుపడుచున్నది. ఇట్లగుపడు నైల్యమసత్యమని తెలిసికొనిన తదుపరి, తిరిగి చూచినపుడు పూర్వమువలె విత్తికా నైల్యసంబంధము గలుగదు. అనగ, నీలమను జ్ఞానము గలుగదు. అటుగాక, నసత్యమని, యెరిగినను గూడ, సత్యత్వబుద్ధి కలుగు బాలునికి వలె, నైల్యము గోచరించుచునె యుండుట, విత్తికి నైల్య సంబంధము లేకుండుటెట్టిదనిన వినుము. ఈపక్ష మంగీకరించిన, సత్యాసత్య జ్ఞానమునకు భేదము లేకపోవును. యధార్థ మెరిగిన వారికి నైల్యము, కనుపించుచున్నను లేకున్నది. ఎరుగని వానికి కనుపించుచునె యధార్థముగ నున్నది. ఇందలి భేద

మెట్లనిన, మరుజలతత్త్వ మెరిగినవాడు దానిని గాంచి, యెండ మావి యని తలచి, యూరకుండును. తెలియని వాడు, త జ్జలాహరణార్థై. పరుపు లెత్తును. యథార్థమెఱిగిన వానికి, మరుజల సంబంధ మంతమాత్రమె యగును. అటువలె, జ్ఞానుల కసత్యముగ గ్రహింపబడిన వేద్య సంబంధము, వేదన మున కెచ్చటను లేదు. కావున జ్ఞానులకు వేద్యహీనమగు విత్తియె, భాసించుచున్నది. అనగ వేద్యసంబంధ రహిత మగు విత్తియని భావము.

నష్టమానసుడను మధ్యమజ్ఞానికిగూడ, సుతరాం విత్తి వేద్య సంబంధరహితముగనె, భాసించును. దీనికి కారణ మేమన, నట్టివాడెప్పుడును, నున్మనీదశను జెందియుండును. మనస్సు విషయ వ్యాపృతమైనపుడు, వేద్య సంబంధము గల్గును. అది దానికి చలనావస్థ. నిశ్చలావస్థయందు వేద్య సంబంధ ముండదు. దీని కున్మనీదశయని పేరు. మధ్యమ జ్ఞాని సదా సమాధియం దుండుట, వేద్యసంబంధ రహితమగు నీయున్మనీ దశయందుండును.

అట్లైన సదా సమాధిస్థితుడు గాని యుత్తమ జ్ఞానికి, మనశ్చలన మున్నది గాన, వేద్యసంబంధ మున్నదని చెప్ప దగదు. సత్యరూపమున గ్రహింపబడిన వేద్యసంగతి వలన,

మనస్సునకు చలనము గాని, వేద్య మసత్య రూపమున గ్రహింపబడిన మనస్సునకు చలనావస్థ యుండదు. మనస్సున కత్యంత నిశ్చలత్వము నిరోధసమాధి యనబడును. అసత్యత్వ నిశ్చిత వేద్య సంగతి రూపాభాస చలనత్వము బాహ్యసమాధి లక్షణము ఈ రెండు దశలును, ఉత్తమజ్ఞాని కేక కాలము నందు కలుగుచున్నవి. అతడు సదా సమాధిస్థితుడును, సమాధ్యుత్థితుడును గూడ నగుచున్నాడు. కావున నుత్తమ జ్ఞానికి గూడ వేద్య రహితమగు విత్తియె, భాసించుచుండును. రామ! నే జెప్పినదంతయు నీవు వెనుకనడిగిన ప్రశ్నలకెల్ల సమాధానమగు చున్నది.

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ
పరికాశిక యను నాంధ్రీకరణంబున, జ్ఞానస్థితి విభేద
కథనరూప ఏకోనవింశత్యధ్యాయము.

---

# వింశత్యధ్యాయము

తే॥గీ॥ సంశయములెల్ల చాపి ప్రశాంతిగరపి
భవమహాంభోధి దాటించు నావయనగ
దగిన విద్యాఖ్య గీతమ్ము దత్తుడిందు
బల్కె, నది సుంత వినుమంబ! వల్లెయనుచు-

భార్గవ! జ్ఞానులస్థితినిగూర్చి ప్రశ్నించియుంటివి. అందులకు నీకు పూర్వగాథ నొండు వినిపించెద వినుము పూర్వము నతిపావనమగు సత్యలోకమున, బ్రహ్మసభయం దొకప్పుడు, సూక్ష్మాతి సూక్ష్మముగ విమర్శింపబడి. జ్ఞాన గోష్ఠి జరిగియుండెను. అందు సనకాదులును, వసిష్ఠ పులస్త్య పులహాక్రితు భృగ్వత్రి నారద ప్రచేతాంగీరస చ్యవన వామదేవ విశ్వామిత్రి గౌతమ శుక పరాశర వ్యాస కణ్వాకాశ్యపాదులును, దక్ష సుమంత శంఖలిఖిత దేవలాదులును, తదితర మహర్షి సత్తములును, రాజర్షి ప్రివరులును గూడి. మహాత్తరమగు నాబ్రహ్మసత్రిమందు, మిక్కిలి నిశితముగ నాత్మ విచారణనొనరించిరి.

ఆ సందర్భమున నందరుగూడి, బ్రహ్మానిట్లు ప్రశ్నించిరి. మహాత్మా! మేమందరముగూడ, తత్వవిద్యా పారంగతులము. జ్ఞానులము. ఇట్టి మాస్థితి ప్రకృతిభేద సంస్కార వశమున వివిధముగ భాసించుచున్నది. అది యెట్టులనిన, నిందు కొందరెల్లపుడును సమాధి తత్పరులు. కొందరనారత మాత్మ విచారరతులు. కొందరు భక్తినిమగ్నులు. మరి కొందరు కర్మాశ్రియులు. ఇంకను కొందరు బహిర్ముఖులగు వారలవలె, వ్యవహార పరులునై యున్నారు. ఇందెవరుత్త ములో, మాకు సెలవీయవలయును. ఇందెవరికి వారలు, తమతమమార్గము సర్వశాస్త్ర సమ్మతము, శ్రేయస్కరము, నని తలచుచున్నారు.

ఇట్లడుగు నా మహర్షుల, ననాశ్వాస దోషోపహత చేతస్కులనుగ నెరిగి. బ్రహ్మ తానుజెప్పనదైన విశ్వసింప రను తలంపున, 'మునీంద్రులారా! మీరడిగిన యర్థము నే నెంతయు నెరుంగకున్నాను. సర్వజ్ఞుడగు నా పరమేశ్వరు డెరుంగు గాన, నందేగుదమని, వారలగూడి, యింద్రోపేంద్ర పురస్సరముగ నచ్చటి కేగి, ఋషిప్రవరు లడిగిన రీతి నా పర మేశ్వరు ప్రశ్నించెను. శివుడా ప్రశ్నల నాకర్ణించి, బ్రహ్మ యొక్క యంతరాభిప్రాయమును గ్రహించెను. 'ఈ ఋషు లనాశ్వస్త మనస్కులు. నే నేదేని సమాధాన మిచ్చిన,

నయ్యాదికూడ వ్యర్థము గాగలదు. కారణమేమన, వారు వివిధపక్షముల, నాయదికూడ నొకటగునని, శ్రద్ధ వహింప కుందు''రని తలంచి, యిటుల ప్రత్యుత్తర మిచ్చెను. "మునీశ్వరులారా! యీ ప్రశ్నకు సరియగుసమాధానము నాకుగూడ స్ఫురింపకున్నది. కావున విద్యామయియగు నా పరమేశ్వరిని ధ్యానింతము. తదనుగ్రహమున, నిగూడార్థ మంతయు నెఱుంగగలము." అట్టులన విధి విష్ణు శివాదులగూడి మును లందరును, విద్యారూపిణియు చిచ్ఛరీరిణియు నగు నాత్రిపురా పరమేశ్వరిని ధ్యానించిరి. ఇట్లుధ్యానింప, నపరిచ్ఛిన్న చిదేక రూపిణియగు నాపరమేశ్వరి, శబ్దరూపమున నావిర్భవించెను. అంత గగనాంగణమున, మేఘ గంభీర నిస్స్వనమున, 'ఋషి సంఘములారా! మీరు నన్నెందులకు ధ్యానించి యుంటిరో, మీరు కోరునదెద్దియో, శీఘ్రముగ నుడువుడు. మద్భక్తులగువారల కోరికలు సఫలము గాకుండ నుండజాలవని'' విన వచ్చెను. ఆ శబ్ద మాకర్ణించి, మునిపుంగవులా, పరావాగ్దేవికి బ్రణతు లొనరించి, బ్రహ్మాదుల గూడి వివిధ స్తోత్రముల నిట్లు నుతించిరి. "శ్రీవిద్యారూపిణి! త్రిపురా పరమేశ్వరి! నీకు నమస్కృతులు. సర్వ సృష్టియొక్క, యుత్పత్తి స్థితిలయములు నీయందగుట, సర్వమునకు బరమేశ్వరివగు నీకు నమస్కారములు. నీకుత్పత్తి నాశములు లేవు. ఉత్పత్తి లేనిదానవగుట నాదివియు, విపరిణామము లేనిదానవగుట,

నిత్య నవాత్మికవునై యుంటివి. జగదాశ్రయమ వగుచు సర్వము నీవయగుచున్నావు. ఘటములందు మృత్తు వలె, సర్వదృశ్యమందు సద్రూపమున ననువృత్తమగుచు, సర్వసారము నీవయగుచున్నావు. ఆయనువృత్తికూడ. జ్ఞానాత్మకమగు చిత్ప్రకాశరూపము నగుట, సర్వజ్ఞమూర్తివి. సర్వస్వాతంత్ర్య రూపమున, నపరిచ్ఛిన్నానంద రూపిణివి . దృశ్యమాభాసమాత్రమె కాన, పారమార్థికముగ నందు నీవెద్దియును గావు. సర్వసారమునుగావు. సర్వజ్ఞమూర్తివియు గావు. అశరీరిణివగు నీకెట్లు నమస్కరించువారము. ముందు వెనుకను, సర్వ దిశలందును వ్యాపించియుండు నిన్ను గూర్చి నమస్కరించుచున్నాము.

మా సంశయముల దీర్ప, ననుగ్రహింపుము. నీ పరరూపమెట్టిది? నీ యైశ్వర్య మేరీతిగలది? జ్ఞానస్వరూపమెద్ది? జ్ఞానఫలమేమి? ముఖ్యమగు జ్ఞానసాధన మేమి? సాధకుడన నెట్టివాడు? సిద్ధుడెవడు? ఉత్కృష్టసిద్ధి యెద్ది? సిద్ధులందుత్తముడెవరు? దేవీ! యీ ప్రశ్నలకుత్తరములు క్రమముగ దయసేయ వేడెదము. ఇవియ, నీకసంఖ్యాకనమస్కృతులు.

అంత నామహావిద్యారూపిణి, ఋషి సమూహమందు దయమానమానసురాలగుచు, నసందిగ్ధముగను, శ్రవణానందకరముగను, ఇటుల జెప్ప మొదలిడెను. "ఋషులార !

మీరడిగినదంతయు క్రమముగ జెప్పెదవినుడు. ఆగమ సము ద్రిమునుండి, యమృతమును వలె, సారాంశమును మీ కందజేతును.

దర్పణమందు ప్రతిబింబమువలె, దేనియందీ పరిదృశ్య మానమగు సర్వమును, ఉత్పత్తి స్థితి లయముల గాంచి భాసించుచున్నదో, ( అనగ లోకమునందు ఘటాదులవలె వేరుగ భాసింపక, దర్పణమందు ప్రతి బింబము యొక్క ఉత్పత్తి స్థితి లయావభాసనము వలె, నా పరాప్రతిభ కవ్యా తిరేకముగ, జగదుత్పత్తి స్థితి లయములని తాత్పర్యము ) యెయ్యది, యవిద్యావృత మానసులకు జగదాకారముగ భాసించుచు, యోగులకు దృశ్య ద్వైతాకార వర్జితమగు నిర్వికల్పముగ భాసించుచున్నదో ( దృశ్యాభాస లేశరహిత మగు చిద్రూపము స్వాత్మయందు, కేవల 'మహ' మను దృష్టిమాత్ర రూపమున భాసించు చున్నదని భావము ) యేకాంత భక్తులచే, నిష్కపటముగ, ననురక్త్యతిశయ మున, తదేకాయత్తత, నిత్యము సేవింప బడునట్టియు (ఏకాంతభక్తులన, ద్వైతమాలిన్య రహితులగువారలు. నిర వధిక ప్రేమద్వైతబుద్ధి కసంభవము. ద్వైతబుద్ధిగల వారల ప్రేమ స్వార్థము. అద్వైత తత్వ వేత్తలకు సర్వము చిద్రూపమగుట, నుపాధివశమగు స్వపరభేదము లేకుండును. కాన వారిప్రేమ నిరవధికము, నిష్కపటము నగును. అట్టైన

సేవ్యసేవక విభేదభావ ముదయింపని యద్వైతులకు, పరాత్మ సేవన మెట్లు సంభవించునన, నట్టి జ్ఞానము గల్గినను, పూర్వ సంస్కారమున గలిగిన, స్వభావవాసనా వైచిత్ర్యమున, విభేదభావము నాహరించి, తత్పరులై సేవించు చుందురు ) యింద్రి యాదులయొక్కయు, మనోబుద్ధ్యాదుల యొక్క యు, దేహము యొక్కయు, ప్రతిబింబములకు దర్పణమువలె. నేది స్వభావభూతముగనున్నదో (అనగ, పై జెప్పిన, యింద్రి యాదుల చేష్టలకు కారణభూతమైన, నాంతర ప్రాణసూత్ర మని భావము ) యేది భాసింపకున్న నెయ్యదికూడ లేదో, దేనిని శాస్త్రములు, లక్షణావృత్తి నాశ్రయించుచు, బోధిం చుచున్నవో, యదియు, జగత్క్రీడా పరాయణురాలనగు నా యనవచ్చిన్న ప్రతిభ. అదియ నా పరరూపము.

అనేక బ్రహ్మాండములకు నావల, నూర్ధ్వమందుగల సుధాసముద్రమందలి, మణిద్వీపమందైన, కదంబవనవాటికా మధ్యస్థమగు, చింతామణిమయ దివ్య సౌధాంతరాళ స్థిత, పంచబ్రహ్మమయ ఫలకమందలి, త్రిపురసుందరమగు, ననాది మిథున రూపమైన కామేశ్వరీ రూపము నా యపరరూపము.

అనుగ్రహ, తిరోధాన, సృష్టి, స్థితి, లయాత్మక పంచ కృత్యాధికారులగు సదాశివేశాన బ్రహ్మ విష్ణు రుద్రులును, గణేశ స్కంధ దిక్పాలురును, శక్తులును, గణ దేవతలును,

యాతుధాన సురపన్నగ యక్ష కింపురుషాదులును, నాయపర శరీరములు కాన, నవి యన్నియు బూజనీయములగుచున్నవి. ఇట్లు సర్వత్రి, నాయీరూపమున నున్న నన్ను నా మాయచే. విమోహితులగుచు నెఱుంగకున్నారు. ఈ మూర్తులన్నియు, నాసంబంధమైనవని గుర్తెరుగకున్నారు. ఇందెవరి నారాధించి నను, నేన పూజింపబడిన దాననగుచు, గోరిన ఫలములనేన, యొసంగుచున్నాను. కారణమేమన, నాకంటె మరియొకరు పూజింపబడు వారుగాని, ఫలదాతలు గాని లేరు. ఎవరు నన్నెటుల భావించిన, తదనుగుణ్యాముగ, ఫలమును వారు నావలననె, పొందుచున్నారు.

ఇక నామైశ్వర్యమును దెల్పెద వినుడు. అది యనంతము కొంచెమేని యపేక్షింపక, అద్వయ చిన్మయురాలనగు నేననంత జగదాకారమున భాసింతును. అట్లు భాసించుచు, నాయద్వైత చిద్రూపమునకు గొరతబడక నుందును. ఇది దుర్ఘటార్థమగుట, సామాన్యముగ భావించుటకు శక్యముగానిది. ఋషిపుంగవులారా! యిదియ, నా ముఖ్యమగు నైశ్వర్యము. మీరు సూక్ష్మదృష్టిగలిగి దీనిని విమర్శింపుడు.

దృశ్యములకెల్ల నాశ్రియమగుచు, సర్వమునం దనుస్యూతమగుచుండి కూడ, కేవలాద్వైత చిన్మాత్రాత్మ రూపమున నె, యుండియున్నాను. ఇట్టి నా యైశ్వర్యమును బరిశీ

లింపుడు. నిత్యముక్తురాలనయ్యు, పరమ స్వాతంత్ర్య రూపమగు, స్వసంబంధ మాయాశక్తి నేను స్వాత్మను సజ్ఞానావృత మొనరించి, యనాది కాలము నుండియు జనన మరణ ప్రవాహమున బడి, తత్సంసారమును సాధించుదానివలె, శిష్యరూపము నంది, తిరిగి గురువు వలన నాత్మతత్త్వ మెరిగి, తిరిగి తిరిగి ముక్తురాల నగుచుందును. అటుల, ననంత విచిత్ర రూపమగు జగము, నుపాదానాది సామగ్రి రహితముగ సృజించుచుందును. అట్టి నా యైశ్వర్య పరంపర లనంతములు గలవు. వానిని లెక్కింప సహస్ర వదనునకేని శక్యము గాదు. క్లుప్తముగ జెప్పెద వినుడు. నామహైశ్వర్యాంశామాత్రమున, విచిత్రమగు నీ జగద్యాత్ర యంతయు బ్రవర్తింపబడుచున్నది.

నాయొక్క జ్ఞానము ద్వైతాద్వైత రూపమున బహువిధముగ నున్నది పరాపర విభేదము నందియు బహువిధము. ఇట్టి బహువిధమగు జ్ఞానఫలముకూడ బహు విధముల నున్నది. ద్వితీయ వస్త్వాలంబనమున ద్వైతజ్ఞానము వివిధము. స్వరూపాతిరిక్తమగు, మూర్తిమంత్రాది వివిధ విషయిక ధ్యానము ద్వైతజ్ఞానము. ఇది స్వప్నరాజ్యాది తుల్యము (అనగ, ధ్యానము స్మృత్యనుసంధాన రూపమున నప్రామాణ్య మైనది కాన, స్వప్నరాజ్య భ్రమ తుల్యమని యర్థము.) ద్వైతజ్ఞానము భ్రమతుల్యమగునెడ, నిష్ఫలమ్ము

గాగలదు గదాయన, నట్లుగాదు. అదియుగూడ, భగవ న్నియతిశక్తిచేత నియమితమగుట, ఫలవంతము గాగలదు. ఈ ధ్యానాత్మక మగు నుపాసన యంతయు నపర జ్ఞానమనబడు చున్నది. ఇది వివిధరూపములు గలది. అందు నా యపర రూపమని చెప్పబడినదాని, తదైక విషయికమగు ధ్యానమె ముఖ్యము. కారణమేమన, చిత్తశుద్ధ్యాది జ్ఞాన సాధన సముదాయ రూపమగు, ముఖ్యఫలపరంపర గలది. ఈ ముఖ్యాపరరూప ధ్యానమున, సాక్షాత్ జ్ఞానసాధన సంపత్తి కలుగ గలదు. సదాశివాది ధ్యానముల, నీ ముఖ్య ధ్యాన ప్రాప్తి కలుగగలదు. ధ్యానాత్మకమగు ద్వైత జ్ఞానమున, కజ్ఞాన నాశకత్వ లక్షణము లేదు. కనుక సాక్షాదజ్ఞాన నాశ కమగు, నద్వైత జ్ఞానము శ్రేష్ఠ విజ్ఞానము. కాని, యీ యద్వైత విజ్ఞానము, (శ్రీ) విద్యారూపిణినగు నన్ను బహు కాల మారాధింపక బొందపడు టెట్లు?

నా పరస్వరూపముగ జెప్పబడిన, దృశ్యద్వైత వర్జిత మును, అనవచ్ఛిన్నమును నగు చిద్రూప మేది కలదో, యదియె, యద్వైత విజ్ఞానము. అయిన, నట్టి చితి చిత్ర మునకు భిత్తినలె, నజ్ఞాన సహితమగు జగత్తున కాశ్రయ మగుట, నజ్ఞాన నివర్తక మెట్లు గాగలదనిన వినుడు. వేద్య రూపముగ భాసించు విభేద వర్జితము, ననగ్జ్ఞేయ వర్జిత

సామాన్య జ్ఞానరూప, మా చితియొక్క శుద్ధదశయనబడును. అట్టి శుద్ధదశయొక్క యపరోక్ష జ్ఞాన మద్వైతజ్ఞానము. అట్టి జ్ఞానము గల్గిన ద్వైత, మర్థక్రియోత్పాదనా నసమర్థమగుచు, నిరాకరింపబడును. దర్పణము గుర్తెరిగిన, తద్గత ప్రతిబింబములగు సర్ప వ్యాఘ్రాదుల వలని భయాద్యర్థ క్రియలు బుట్ట జాలవు గదా! ఏ కాలమున చిత్తము దృశ్యాకార కలంక రహితమును, స్వరూపభూతమును, 'అహం' ప్రత్యయాత్మకమును నగుచు అఖిలావస్థానుగత సామాన్యచిద్రూపమగు, స్వాత్మయం దెట్టి పరిచ్ఛేదమునులేక, లెస్సగ నేకీభావమును జెందుచున్నదో, యదియు, శుద్ధ నిర్వికల్ప సమాధ్యనుభవమగును, తదనంతర మా సమాధియం దనుభూతమగు, శుద్ధ చిద్రూపము నేనను, అఖండాకారముగ ప్రత్యభిజ్ఞానముదయించును. అట్టి ప్రత్యభిజ్ఞానము, పరమవిజ్ఞానము.

అపరజ్ఞానస్వరూపము వినుము సాంగ శ్రవణమున గాని, కేవల తర్కమున గాని, దేహాది పరిచ్ఛేద వర్జితమగు చిదాత్మ విభానము, పరోక్షముగ గల్గును. అది దేహాదులందగు. నాత్మత్వ బుద్ధిని నశింపజేయును. ఇట్టి పరోక్షజ్ఞానమపర జ్ఞాన మనబడుచున్నది.

దృశ్య మేకొంచెము భాసమాన మగుచుండినను, అయ్యది యేజ్ఞానమున, నెవ్విధముగను భాసింపకుండునో,

యయ్యాది పరమజ్ఞానము. అనగ దర్పణతత్వ మెరిగిన, తత్ప్రతిబింబమా దర్పణ భిన్నముగ భాసింపనటుల, నే విజ్ఞానము గల్గిన. విజ్ఞాతముగాని దెద్దియు నుండదో, యదియ యద్వైత విజ్ఞానము. ఘటపటాది పరిచ్ఛిన్న విశేషజ్ఞానములకు, బ్రతిబింబములచే బరిచ్ఛిన్నములగు దర్పణాంశములకు మహా దర్పణమువలె, నే విజ్ఞాన మాత్మరూపమగుచున్నదో. యదియగద యద్వైత విజ్ఞానము! ఎట్టి విజ్ఞానము గల్గుచుండ, చిర సంశయములు, పెనుగాలికి మేఘపంక్తుల వలె లయమందుచుండునో, యదియ యద్వైతవిజ్ఞానము. ఎట్టి విజ్ఞానమందు దృశ్యగత కామాద్యఖిల వాసనలు స్వరూపనాశ మందుచుండునో ప్రారబ్ధవశమున, కొన్ని వాసనలు క్షయ మందకుండినను. నయ్యవి కోరలుబెరకిన పాముల వలె, జన్మాంతర రూపానర్థ ప్రదములు గాజాలకుడునో, యదియ పరమ విజ్ఞానము.

సర్వ దుఃఖము లయొక్క విలయము, విజ్ఞాన ఫలము. అత్యంతాభయ సంప్రాప్తిరూప మోక్షమీ ఫలమని చెప్పబడుచున్నది. ద్వితీయ సంకల్పమువలన, భయప్రాప్తి కలుగుచుండును. అద్వైతజ్ఞానము దృఢమగుచుండ, సూర్యోదయమందు తమస్సనకువలె, ద్వైత సంకల్పమునకు, దావెచ్చట? ఋషులారా! భయనిమిత్తమగు ద్వైతసంకల్పము వర్జింపబడు

చుండ, భయమను వార్తగూడ నెట్లుండగలదు? కావున నట్టి మోక్షముకంటె నన్యమగు ఫలమంతయు భయదాయకము గాగలదు. లోక సమీక్షవలన, ద్వితీయ పదార్థమంతయు నంతముగలదని తేలుచున్నది. అంతము గలదాన భయముగాక అభయ మెట్లు గాగలదు? కలియక వియోగమంతము గాగలదని, యెల్లరకును దెలిసిన విషయము. అనగ, సంబంధ మశ్వరమనుట నిశ్చయము. కావున, నన్య ఫలము భయప్రదమని, చెప్పబడినది. ఆత్మస్వరూపా నన్యమగు మోక్షరూపఫలమె, యభయ ఫలమని పండితులచే జెప్పబడినది జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ ఫలముల భేద మవభాసింపక, నేకత్వము గలుగునపుడె, యద్వితీయాత్మ స్వరూపమగు మోక్షమను ఫలము గలుగగలదు. అది సర్వభయ వర్జితము

సంకల్ప వికల్ప రహితముగ శుద్ధ స్వరూప స్ఫురణ గలుగుట జ్ఞానఫలము. అదియె, జ్ఞాతస్వరూపము. అట్టిదియయ్యు, మోహమున నవ్విధమున లక్షింపబడకున్నది. మోహమున, నట్లనుపలక్షిత స్వరూపునకు, మోహ నిరసనోపాయమున, స్వస్వరూపము నుపలక్షింప జేయువాడు గురువు. అటుల జేయునదియు శాస్త్రము. సంకల్ప వివర్జితమగు సంవిదూపము, తెలిసికొనదగిన స్వరూపము. ఎంతకాలము

సంకల్ప త్యాగముగాని నిమిత్తమున, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ గత భేదము భాసించునో, యంత కాలము భాసమానమగు జ్ఞాత్రాదుల స్వరూపము వాస్తవమైనది కాజాలదు. ఎపుడు, సర్వ సంకల్పవర్జనమున, జ్ఞాత్రాదులందలి పరస్పరము భాసమానమగు భేదము, కబళింపబడుచున్నదో, యపుడు జ్ఞాత్రాదుల సత్యస్వరూప సంపత్తి కలుగుచున్నది. అదియు, మోక్షమను ఫలము. కావున జ్ఞాత మొదలు మోక్షఫల పర్యంతము వస్తుతః భేద మేమాత్రమును లేదు. ఉపదేశార్థము శాస్త్రములందు భేదము గల్పింపబడినది. కావున నూతనముగ నందదగిన ఫలమేమియు లేదు. ఆత్మయందు, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ మోక్షాదిరూపముల భేద సంకల్పన, మవిద్యచే గలుగుచుండు పర్యంత, మవిద్యా భాసితమగు జనన మరణాది రూప సంసారము స్థిరమగుచున్నది. అతి దుర్ఘటమును, దేవతానుగ్రహైక మూలమును నగు, సద్గురూప దేశాదుల జ్ఞాత్రాది భేదము విలయమొంద, నప్పుడట్టి భేదవివర్జితమగు భావమువలన, వాయువుచే, భిన్నభిన్నమగు మేఘము వలె సంసారము విలయమందుచున్నది.

ఇవ్విధమగు మహామోక్షమునకు, తత్పరత్వము సాధనము. సంపూర్ణముగ తత్పరత్వము గల్గిన, మరియొక సాధనాపేక్ష లేదు. పూర్ణముగ తత్పరత్వము గలుగకున్న, నితర

సాధనానేకమున, ప్రయోజనమును లేదు. కావున మోక్ష మునకు, తత్పరత్వమె సాధనము. సర్వథా దీనిని తప్పక సాధింతుననెడి స్థిరమగు చిత్తవృత్తి తత్పరత్వమన. ఇట్టి తత్పరుడు ముక్తిప్రాప్తియు డనదగును. దినములగాని, మాస ముల గాని, కొన్ని సంవత్సరములకు గాని, లేక మరియొక జన్మయందుగాని ముక్తుడై తీరును. బుద్ధికిగల మాలిన్య తార తమ్యమున, కాలవిలంబన తారతమ్య ముండునుగాని, ముక్తు డగుటకు సందియము లేదు.

బుద్ధియందు సర్వపురుషార్థముల నాశ మొనరించు, దోషములు పెక్కులు గలవు. ఈదోషములవలన, జనులు ఘోర సంసారమున నీ విధముగ నెల్లెడ దపించు చుందురు. అందు మొదటి దనాశ్వాస దోషము. రెండవది కామవా సనా దోషము. మూడవది జాడ్యతా దోషము. అందనా శ్వాసదోషము సంశయమనియు, విపర్యయమనియు, రెండు విధములు. మోక్షమనునది కలదా? లేదా? యనునది మొదటిదగు సంశయలక్షణము. మోక్షమన లేదనునది, విపర్యయ దోషము. ఈ రెండును తత్పరత్వమునకు ముఖ్య ప్రతిబంధకములు. మోక్షము గలదను, పూర్వ సంశయ మునకు విపరీతమగు నిశ్చయమున, నా రెండు దోషములును, నశించును. అనాశ్వాస దోషమూలము విరుద్ధ తర్కచింత

నము. దానిని వదలి, సత్తర్క చింతన మభ్యసించిన, తన్మూలచ్ఛేదన పూర్వకమగు విపరీత నిశ్చయము గలుగ గలదు. అనంతరము శ్రద్ధయుదయింప, ననాశ్వాసము నశించును. కామాది వాసన శ్రవణమందు బుద్ధికి ప్రతిబంధక మైనది. కామాది వాసనా విష్టమగు బుద్ధి ప్రవర్తింప నేరదు. లోకమున కాముకుడు, కామితార్థమందు ధ్యానైక తత్పరుడగుచు, నెదుటనున్నది కాంచుట గాని, చెవులబడు నది వినుటగాని నేరడు. అట్టి కామాది వాసనాయుతుడు, శ్రవణ మొనరించినను, అది విననిదాని సమమగును. కావున నా వాసనలను, వైరాగ్యాది సాధనచే జయింపనగును. కామ క్రోధాది వాసనలు వేలకొలది కలవు. అందు మూల భూతమగునది కామము. అది నశించిన మిగులునవి లేవు. కావున వైరాగ్యమున కామవాసన జయింపవలయును. 'ఇది నాకుండుగాక' యను నాశయె, కామము. పొందుటకు శక్యములగు స్త్రీ ధనాదులందీయాశ, స్థూలభూతముగనుండును. పొందుట కశక్యమగువాని యందు సూక్ష్మరూపమ ననుండును. దృఢమగు వైరాగ్యయోగమున స్థూల సూక్ష్మ రూపమగు కామము మొత్తమును నాశమొనరింపవలెను. ఈవైరాగ్య మనుక్షణ కామ్యదోష పరామర్శ వలనను, విషయ వైముఖ్యత వలనను గలుగగలదు.

ఋషిసత్తములార! జాడ్యరూపమున వ్యవస్థితమగు బుద్ధిదోష మభ్యాసాదుల వారింప నశక్యము. ఆ దోష మున, తత్పరత్వమున శ్రవణమొనరించినది కూడ బుద్ధికెక్క జాలదు. ఈ మాంద్యము పురుషార్థ వినాశకరమగు మహా దోషమునుడీ! దీనిని హరింప నాత్మదేవతనగు నన్ను, జప పూజాధ్యానాదుల సేవలొనరించిన గాక. మరొండువిధమున సాధ్యము గాజాలదు. ఆ సేవాతారతమ్యత ననుసరించి, యీ జడత్వము నే హరింతును. ఈ దోష మల్పముగ నుండిన, నీ జన్మయందును, గాఢముగనున్న, మరియొక జన్మయందును, ఫలప్రాప్తి గలిగింతును. నన్ను గూర్చి ధ్యానాదిరూప సేవన మొనరించువానికి, సర్వసాధన సంప త్తియు గలుగగలదు. నన్నెవడెల్లప్పుడును, నిష్కామ ముగ, నిష్కపటముగ, ననవచ్ఛిన్నాను రాగమున సేవిం చునో, యట్టియుపాసకుడు, విఘ్నములనన్నియు నుత్తరించి, శీఘ్రముగ కృతార్థుడు గాగలడు. ఎవడు, సర్వబుద్ధులను బ్రసరింపజేయు సర్వేశ్వరినగు నన్ను, మూఢుడగుచు నాదర మున సేవింపడో, యట్టివాడెన్ని సాధనములనంది యున్నను, విఘ్నములచే, ప్రతిపదమునను గొట్టబడుచుండును. ఫల ప్రాప్తి గలుగవచ్చును, కలుగక పోవచ్చును.

కావున ఋషులారా! తత్పరత్వమె ముఖ్యమగు సాధ

నము. అట్టి తత్పరత్వము గలవాడు పరమ సాధకుడు. అందును మద్భక్తి యుక్తుడు, సర్వపూజితుడగు సాధకుడు.

దేహేంద్రియ ప్రాణాదు లాత్మకాదనియు, నేనాత్మ స్వరూపుడననియు నిశ్చయము గల్గుటనునదియు సిద్ధి. శరీరాదులందాత్మత్వ భావన, యెల్లప్పుడును స్థిరముగ నుండియున్నది. శరీరాదులం దాత్మత్వా భావనయె సిద్ధియగును. అయిన, సుషుప్త్యాదుల నట్లుండియున్నదికదా యన, నట్లుగాక మాధ్య్వ వివర్జితముగ నాయభావన యుండవలయును. సర్వజనులకును, దేహాదివ్యవచ్ఛేదముగ నాత్మ నిశ్చయము లేదు కావున, వారలు మహానర్థ పరంపరలనందుచున్నారు. కాన దేహాదుల భాసింపజేయునదియు, కేవల చిన్మాత్రిము నగు దానియందు, స్వరూపవిమర్శ పూర్వకమగు నాత్మ నిశ్చయము స్వాత్మరూపాది విషయికములగు, సర్వ సంశయములను నాశమొనరింపగలదు. కావున స్వాత్మ నిశ్చయ జ్ఞాన సిద్ధికంటె, నితరమేదియు సిద్ధి గాజాలదు.

ఖేచరత్వాది సిద్ధులును, అణిమాది సిద్ధులును గలవు గాని, యవి యన్నియు నాత్మ విజ్ఞానసిద్ధికి లేశమాత్రిమేనియు సరిగాజాలవు. అవియన్నియు దేశకాల పరిచ్ఛిన్నములు. పూర్ణ చిదానందరూప శివాత్మక స్వాత్మజ్ఞానరూప

మగు నీ యాత్మవిద్య యపరిచ్ఛిన్నము. పరిపూర్ణ మగు స్వాత్మ విద్యాసాధనములం దియ్యావి, యనంతగ్ఖ్యాతములు, అట్లయ్యు, నాత్మవిద్యావిషయం దియ్యావి, యంతరాయ ప్రయోజకములు మాత్రము గాగలవు. కావున తీవ్రముముక్షువు లాచాయ జనరు. ఇంద్రజాల రూపసిద్ధికి సామ్యము లనదగు నీసిద్ధులవలన, బ్రహ్మపదము తృణప్రాయముగ జూచు నాత్మజ్ఞానికి గాదగిన దేమి? సాక్షాద్బ్రహ్మప్రాప్తి కలిగిన మహాజ్ఞాని కీ సిద్ధులు కేవల కాలక్షపణ హేతువులు. కావున, నత్యంత శోకనాశ మొనరించి యానంద సాంద్రజనకమగు నాత్మ విజ్ఞానసిద్ధికంటె, మరియొకటి సిద్ధి కాజాలదు. మృత్యువునుండి, తరింపజేయునదియ సిద్ధి. ఇతర మెద్దియును గాదు.

ఈ యాత్మ విజ్ఞానసిద్ధి, యభ్యాసభేదమునను, బుద్ధి నైర్మల్య భేదమునను, కర్మపరిపాక విభేదమునను, వివిధముగ నుండును. సంక్షేపమున, నుత్తమ మధ్యమాధమ త్రైవిధ్యము గల్గియుండును.

ఋషులార! లోకమునందు ద్విజులచే నధ్యయన మొనరింపబడి ధారణయం దుంచబడిన శ్రుతిపారము వంటిది. అతి మేధావి, నిరంతరాభ్యాస వశమున, ధారణ నొనరించిన

శ్రుతిని, పఠన మొనరించు సమయమున, వ్యాపారానేక శత ములు గలిగియున్నను, తత్పాఠమందు, వర్ణస్వరాది విప ర్యయ దోషముల నందడు. అట్లు పఠించుశ్రుతి యుత్తమ మైనది. వ్యాపార కాలమందు చిత్తము, శ్రుతి పాఠమందు సమాహిత మొనర్చియు, తదితర సమయములందు సమా హిత మొనర్పకయు, నస్ఖలితముగ పఠింపబడు శ్రుతిపాఠము మధ్యమము. చిత్తము సమాహితము జేయునపుడె యస్ఖలి తమగు శ్రుతిపాఠ మధమము. ఇటువలె నాత్మజ్ఞానసిద్ధికూడ నని తెలియవలయును. మహా వ్యవహారములందు సమాహి తత్వా భావమున నుత్తమజ్ఞానియు, వ్యాపారా భావమందు సమాహితత్వాభావమున మధ్యమజ్ఞానియు, సర్వదా సమాహి తత్వమున నధమజ్ఞానియు, జ్ఞానసిద్ధి గలిగియుందురు.

స్వప్నావస్థలయందు కూడ, విచారణక్షణ తుల్యముగ, శుద్ధ చిన్మాత్రాహంభావమగు పరమస్థితి గలిగియుండుట, పరమోత్తమ సిద్ధి. సర్వ వ్యవహారములందును, ప్రయత్న మున ప్రాచీన సంస్కార బోధవలన ప్రవృత్తి గలుగు, టుత్తమ సిద్ధియొక్క పరాకాష్ఠయని తెలియనగును. లౌకి కుల కయత్నముగ, బాహ్యప్రవృత్తి గలుగునటుల, దేహా ద్యనవచ్ఛిన్నమగు, సంవేదనాత్మయం దవిచ్ఛిన్న స్థితి గల్గి యుండుట సిద్ధియొక్క పరాకాష్ఠ. వ్యవహార పరుడయ్యు,

భావ్యాభావములను జూచుచు, ద్వైతమును జూడకుంటయె. సిద్ధియొక్క పూర్ణత్వము. జాగరాద్యవస్థల యందు వ్యవహరించుచునైన, నిదురించునపుడువలె, పూర్వోత్తరానుసంధాన విచ్ఛేదము గల్గియుంట, సిద్ధియొక్క పూర్ణత్వ లక్షణము.

ఇట్టి సిద్ధిని బొందినవాడు సిద్ధులలో నుత్తముడు. వ్యవహార పరుడయ్యు, నెపుడుగాని, సమాధిని విడని మేధావి సిద్ధులలో నుత్తముడు. స్వానుభవమున, స్వాంతమందు జ్ఞానుల వివిధస్థితుల గుర్తెరుగువాడు సిద్ధులలో నుత్తముడు. సంశయముగాని కామముగాని లేశమును లేక, నిర్భయముగ వ్యవహరించువాడు సిద్ధులలో నుత్తముడు. సుఖ దుఃఖాత్మకమగు సర్వజగద్వ్యవహారమును, దర్పణగత ప్రతిబింబమునువలె, స్వాత్మయందు గుర్తెరుగువాడు సిద్ధులలో నుత్తముడు. సామాన్య చిద్రూపముగ స్వాత్మను గుర్తెరిగియుంట, సర్వానుస్యూతమగు సర్వాత్మ తానగుట, స్వాత్మ తాదాత్మ్యపన్నముగ, సర్వజీవులను బద్ధముక్తులనుగ జూచు సర్వాత్మ, సిద్ధులలో నుత్తముడు. తాను సర్వాత్మగ, సర్వాధిష్ఠాన మగుట, సర్వజీవబంధమును స్వాత్మయం దెరిగిన వాడయ్యును, దాని యసత్యత్వ నిశ్చయమున, మోక్షమెన్నడు నపేక్షింపని వాడు సిద్ధులలో నుత్తముడు, అట్టి సిద్ధోత్తముడె, నేను, నేన యట్టి సిద్ధోత్తముడు. యీయిరు

వురకును భేదము కొంచెమేనియు లేదు.

ఋషులార! మీరడిగినదంతయు క్రమముగ సుస్పష్టముగ దెల్పియుంటిని. ఈ నేజెప్పినదానిని గ్రహించిన, మోహము నందజాలరు." భార్గవ! యిటుల జెప్పి విద్యాస్వరూపిణియగు నా పరాదేవి విరమించెను. ఋషు లావాక్కులు విని, సర్వ సందేహముల వదలి, శివాదులకు నమస్కరించి, వారివారి నివేశనములకు వెడలిరి. పాపౌఘ నాశినియగు నీ విద్యాగీత నీకు జెప్పితిని. సాక్షాద్విద్యా రూపిణియగు పరమేశ్వరి నిరూపించిన, యీ విద్యాగీత విని విమర్శించిన నాత్మ సామ్రాజ్యము నీయగలదు. ప్రత్యహము పఠించిన వారల కాపరమేశ్వరి స్వయముగ జ్ఞాన ముపదేశింపగలదు. సంసార తిమిరాంభోధియందు మునుంగు వారల కియ్యది నావ కాగలదు"

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ ప్రకాశిక యను నాంధ్రీకరణంబున, విద్యాగీతయన నొప్పు వింశత్యధ్యాయము.

# ఏకవింశత్యధ్యాయము

తే॥గీ॥ బ్రహ్మరాక్షస ప్రశ్నరూపాన తత్వ
సార మెరుగంగ జేసె, ప్రశాంతయుతుడు
దత్త మౌనీంద్రుడిందు, సుదాత్తరీతి
నదియు నోపిక వినుమంబ! యాదరించి-

పరశురాముడు విద్యాగీతా కర్ణనమున, నవిద్యా భ్రాంతినుండి ముక్తప్రాయుడగుచు, భక్తి వినమ్రుడై దత్తాత్రేయ మునీంద్రుని తిరిగి యిటుల బ్రశ్నించెను. "స్వామీ! సారభూతమును, సులభమును, సాక్షాత్ఫల దాయకమును నని, వినిశ్చితమగు జ్ఞానసాధనమును, జ్ఞానుల గుర్తింప దగు లక్షణములను, దేహ సంయోగవియోగము లందు జ్ఞానులు వహించియుండెడి స్థితియు, వ్యవహార పరాయణు లయ్యు జ్ఞానుల నానస్సునకగు నసక్తత్వ లక్షణమును, మున్నగు నదంతయు దెలుపగోరెదను." అంత కరుణాసముద్రుడగు నా మునీంద్రుడు మిక్కిలి సంతసమున, 'భార్గవ! రహస్యమగు జ్ఞానసాధనమును దెల్పెదవిను'మని, యిటుల జెప్పదొడగెను.

జ్ఞానమునకు దేవతానుగ్రహము ముఖ్యమగు సాధ

నము. 'వీడు నాపరమభక్తుడు, వీని వాంఛితము, నవశ్యము దీర్పవలయుననని' గ్రహింపబడుటయె. దేవతానుగ్రహము. మనోవాక్కాయ కర్మల, స్వాంతర్యామియగు నాత్మదేవతా సాన్నిధ్యమును సర్వదా పొందుచుండువాడు, అనగ, త్రివిధ కర్మల స్వాత్మదేవత నెల్లపుడు నారాధించువాడు, తప్పక దేవతానుగ్రహపాత్రుడు గాగలడు. అట్లనుగ్రహింపబడిన వానికి, జ్ఞానప్రాప్తి యత్యంత సులభమనుట నిశ్చయము. రామ! యియ్యది జ్ఞానమునకు సర్వోత్తమమగు సాధనము. జ్ఞానఫలమును సాధించుటయం దిద్దానికొండుపాయ మవసరములేదు. దీనిని విడచిన, నొండెద్దియు తత్ఫలము నీయజాలదు.

రామ! దేవతానుగ్రహము లేక, మరియొకటి తత్ఫలము నీయజాలదనుట సకారణము. ఫలభూతమగు విజ్ఞాన చైతన్యము, సర్వము నవభాసింపజేయు సామాన్య చితిరూపమై, యున్నది. ఆ చితియొక్క స్వస్వాతంత్ర్యమున బరికల్పితమగు నావరణ. యవిద్య యనబడుచున్నది. శ్రవణాది విచారమున నా యావరణ నాశమైన, కేవల చితిస్వరూపము లక్షితము గాగలదు. అట్టి స్వరూపోపలబ్ధి, బహిర్భావము లందు తత్పరులగువారలకు మిక్కిలి దుర్లభము. స్వాత్మ దేవతా పరులగు భక్తుల కస్యాపత్వ ముండక, తత్పరత

గలిగియుండుట, బహిర్ముఖులు గాకుందురు. కావున వార లకు జ్ఞానఫలము, సులభముగను, శీఘ్రముగను, ప్రాప్తము గాగలదు.

అట్టి దేవతాతత్పరుడు, తాత్కాలికములగు వైరా గ్యాది యితర సాధనల బురస్కరించుకుని, పరోక్షముగనైన నాత్మలక్షణమును గుర్తెరుగును. తదుపరి జిజ్ఞాసువుల గూడి విమర్శించి, యట్టి నిత్య విమర్శావశమున, తదాకార చిత్త త్వమందును, అట్టి విచారవశమున, తదాకారత స్థిరమగు చుండ, హర్షోద్వేగ వివర్జితమగు చిదాత్మైక రూపమున నాచిత్తము గాంచును. అప్పుడు దృశ్యమంతయు శివైక రూపముగా గలదు. దృశ్య సంబంధమందు గూడ, నా చిత్తము చిదాత్మాకారతను బరిత్యజింపదు. అతడుత్తమ విజ్ఞాని జీవన్ముక్త పదము నందినవాడు. కావున, భక్తి యోగముతో గూడిన నాత్మతత్వ నిరూపణకంటె, శ్రేష్ఠ మగు సాధనము వేరెద్దియు లేదు. తత్సమమగు సాధనము గూడ లేదు.

రామ! జ్ఞానుల లక్షణము దుర్విజ్ఞేయము. కారణ మేమన, శుద్ధ చిన్మాత్రరూపమున నిల్పందియుండుటనునది, వాఙ్మనో నేత్రములకు గోచరముగాని సూక్ష్మవిషయము. మరివేరెద్దానగాని యట్టిస్థితిని నిరూపింప శక్యము గాజాలదు.

లోకము నందు, దేహ వస్త్రభూషణాదుల, వైదుష్యము తెలిసికొనఁబడజాలదు గదా! రసత్వము, తద్రసము నాస్వాదించినవానికి దెలియునటుల, పాండిత్యము, స్వసంవిత్తి మాత్రవేద్యమైనది. అట్లయ్యు, నిపుణులగు విద్వాంసులు, చీమలు తనుమార్గమును వలె, సూక్ష్మములగు జ్ఞానలక్షణములు గుర్తెరుగు చున్నారు. కావున జ్ఞానిలక్షణములు. జ్ఞానికి దెలియునగును. జ్ఞానికి స్థూలసూక్ష్మలక్షణములు గలవు. సూక్ష్మములు పరులకు దుర్విజ్ఞేయములు. స్థూలములగు శాంత్యాదిలక్షణములు వ్యభిచరించుచుండును. అదియునుగాక నజ్ఞానులగు డాంబికులచే, నాత్మతత్త్వ నిరూపణము, సంభాషణము, వైరాగ్యాది సాధనల యభినయము జ్ఞానుల రీతి ప్రదర్శింపబడుచుండును. ఇట్టి, యనిర్మలాతఃకరణులచే, బ్రదర్శనార్థ మభ్యసింపబడు జ్ఞానసాధన మప్రయత్న సిద్ధముగ నెవరియందు స్థిరముగనుండునో, వారలు జ్ఞానులనబడు చున్నారు. అనగ, మానావమానములు లాభాలాభములు, జయాపజయములు మొదలగు ద్వంద్వములు. ప్రసాదక్షోభలను గలిగింపని వాడు జ్ఞానులలో నుత్తముడని యెరుంగవల యును. ఆత్మానుభవ వార్తలందు. సమాధ్యనుభవ రూప గూఢార్థ మడిగినను, సందేహ కాలవిలంబనములు లేక, నసందిగ్ధముగ, వెనువెట జెప్పువాడుత్తమ జ్ఞాని జ్ఞాన వార్తలందు మిక్కిలి యుత్సాహమును, జ్ఞాన ప్రక్రియా నిరూపణ

యందు సోన్ముఖతయు. జ్ఞాని యొక్క లక్షణములు. స్వభావమున ప్రవృత్తి రహితుడును, కామాది రహితమగు శుద్ధచిత్తము గలవాడును, సంతుష్టుడును, మహాపదలందు గూడ నుద్వేగ రహితుడును నగువా డుత్తమజ్ఞాని.

భార్గవ! యీ చెప్పబడిన యుత్తమజ్ఞాని లక్షణములు స్వాత్మపరీక్షయందు సుస్థిరము లైనవి. అనగ, తనకుగల్గిన జ్ఞాన మెంతగ నున్నదో, తెలిసికొనుటయందు మిక్కిలి యుపయుక్తములగు నవి కాని, పరులజ్ఞానము తెలిసి కొను టకు గాదు. సాధకుడెల్లప్పుడును, స్వాత్మ పరీక్షా తత్పరుడు గావలయును. నిపుణుడన్యునియొక్క పరీక్షయందు ప్రవర్తిం చునటుల, స్వపరీక్షణ మొనరించుకొను వాడు సిద్ధి నెటుల జెందకుండును! అన్య గుణదోషములందు, విచారణా తత్ప రుడు గానివాడు, స్వీయగుణదోష విచారపరుడు గాగలడు. అప్పుడు సమస్త సాధనలును బొందిన వాడగుచు సిద్ధినిబొంద గలడు. ఈ చెప్పబడిన జ్ఞానుల లక్షణములన్నియు, నాత్మ పరీక్షయం దుపయుక్తములైనవి కాని, యితరుల జ్ఞాన పరీక్ష యం దుపయుక్తములు గాజాలవు. కారణ మీ క్రింది విధ మున దెలియనగును. స్వభావమున, నపరాధ కర్మవాసనా రహితులగు శుద్ధ మనస్కులకు, మహాత్మసంప్రాప్త సాధన ముల జ్ఞానసిద్ధి కలుగగలదు. అప్పుడంతకు బూర్వముండిన

కామాది వాసనలు నివృత్తి జెందకుంట, స్వవ్యాపారతత్పరు లగుచు, బాహ్యమందువలె, నజ్ఞాన తుల్య వ్యవహారముగల వారుగ నుందురు. అట్టివారలయందు పై జెప్పబడిన లక్షణములు గానరాకుంట వారెటుల పరీక్షింపబడ గలరు? ప్రాకృతుల కటుల పరీక్షించుట, శక్యము గాజాలదు. కాని జ్ఞానాభ్యాస మాహాత్మ్యమున, రత్నస్వరూప జ్ఞానాభ్యాస పరికర్షవలన, రత్న పరీక్షకులు రత్నమును జూచిన మాత్రముననె, యందలి కృత్రిమాకృత్రిమ లక్షణములను గుర్తెరుగు నటుల, జ్ఞానులు జూచుచునె, జ్ఞానుల పరీక్షింపగలరు.

మందజ్ఞానులకు దేహాభిమానము, తన్నిమిత్త వ్యాపారము, తత్ఫలముగూడ, నజ్ఞానితుల్యముగ నుండును. కారణమేమన, వారలకు సహజ సమాధిప్రాప్తి యుండజాలదు. విమర్శాపరులగుచు, స్వరూపానుసంధాన మొనరించు నపుడు, వారు పూర్ణ చిన్మాత్రస్వరూపులుగనుందురు. అనుసంధాన రహితులుగ నుండినపుడు, దేహాభిమాన యుతులుగ నుండి, సుఖదుఃఖముల ననుభవింపుచు, పశు తుల్యస్థితియందుందురు. పూర్ణ దశానుసంధానమున, మధ్యసుధ్య సంసృతి నుత్తరించిన వారయ్యు, తత్తదనుసంధానాంతరాళముల పశుదశ ననుభవించుచుందురు. కాని, యీ పశుదశ,

కాల్పబడిన త్రాడువలె, వారిని బంధింపజాలదు. వస్త్రపు టంచుల రెంటను లాక్షారసముచే, లెస్సగ రంజింపబడిన, నా లాక్షారసవ్యాప్తి వస్త్ర మధ్యభాగము గూడ లాక్షారుణము గాగలదు. అటువలె ననుసంధానాంతరాళములందు మంద జ్ఞానికి గల పశుదశా వ్యవహారము చిన్మాత్రీభూత మగుచు నాతనిని బంధింపజాలదు.

మధ్యమజ్ఞానులకు దేహ సంయోగ మెప్పుడును లేదు. దేహసంయోగమన, దేహాత్మత్వ గ్రహణము. అనగ దేహమాత్మయనుకొనుట అభ్యాసాతిశయమున, మధ్యమ జ్ఞాని మనస్సు సంకల్పవర్జనమున, సర్వథా నిరుద్ధమై యుండును. అతడెల్లప్పుడును సమాధిస్థిత మనస్కుడగుట, వ్యవహారమె యుండదు. భోజనాది వ్యవహారరూప దేహయాత్రను నిర్వహించుటగూడ సుషుప్తివలెనుండును. సుషుప్తియందుండు వాడు, వాసనామాత్రమున, నేదేని పలికియు, నేదేని చేసియు, తదుపరి కొంచెమేని తెలియని విధమునను; మదిరామత్తుడగువాడు, చేయునదియు బలుకునదియు దెలియని విధమునను; యోగి లోకయాత్రా రహితుడగుచు, తద్బహిర్గతుడుగ నుండును. ఎప్పుడేని, యేకొంచెమేని చేసినను, నయ్యది తిరిగి తెలియజాలకుండును. అనగ, దానిని తిరిగి యనుసంధింపడు. ఇక, దైహిక వ్యవహారమంతయు శిశు

వునకు ప్రారబ్ధమున నుద్దేశింపబడిన సంస్కారముచే, స్వప్నావస్థయందు ప్రవృత్తిగలుగునటుల, వాసనా సంస్కార మాత్రమున జరుగుచుండును.

ఉత్తమ విజ్ఞానిస్థితి వినుము. అతనికిని, దేహాత్మత్వగ్రహణము లేదు. రథసారథివలె నుండి, వ్యవహారముల నడపుచుండును. సారథి రథవ్యాపారము నడపుచుండియు, రథమునందు దేహాత్మబుద్ధి యెంతగ గల్గియుండునో, యటువలె దేహవ్యాపార తత్పరుడయ్యు, నుత్తమజ్ఞాని, తద్దేహియు గాక వ్యాపారియు గాక, శుద్ధ చిన్మయుడుగ నుండును. దృశ్యాకార లేశరహితమగుట, శుద్ధ స్వాత్మరూపమాత్రముగ నుండిన యంతఃకరణ గలిగి, యీ యుత్తమ జ్ఞాని, లోకదృష్ట్యా వ్యవహరించుచుండును. నాట్యమునందు స్త్రీ వేషము ధరించిన పురుషు డంతరమున బురుషుడయ్యు, పైకి స్త్రీవలె నటించునటుల, నుత్తమజ్ఞాని వ్యవహరించును. వివేకము గల మనుజుడు, బాలుర తో నాడుకొనుచు, తద్గత జయాపజయముల లందు, ఖేదమోదములందనటుల, నిర్మలాశయుడగు నుత్తమజ్ఞాని, జగత్క్రీడా తత్పరుడయ్యు, నటుల నుండును. మధ్యమజ్ఞాని, చిత్త నిరోధాభ్యాస ప్రకర్షవలన నచలస్థితి గలవాడుగనుండును. ఉత్తమజ్ఞాని విచార ప్రకర్షవలన, నచలస్థితి గలవాడుగ నుండును, బుద్ధికిగల పరిపాక భేద

మున, మధ్యమోత్తమ జ్ఞానుల భేదము గల్గుచున్నది.

విజ్ఞాన ప్రక్రియా ప్రసంగమున, సర్వసందేహము లను బాపు యిరువురు జ్ఞానుల సంవాదము చెప్పెద వినుము. పూర్వము, విపాశా నదీ తీరమున, నమృత నగరమును బాలించుచు, రత్నాంగదుడను పేరుగల యొకానొక రాజుండెను. అతని కతిబుద్ధిశాలురును, మహాత్ములు నగు రుక్మాంగద హేమాంగదులను నిరువురు ప్రియపుత్రులుగలరు. అందు రుక్మాంగదుడు, సర్వశాస్త్రపారంగతుడు. హేమాంగదుడు విజ్ఞాని, జ్ఞానులలో నుత్తముడు. ఆయిరువు రొకప్పుడు వసంతవేళ, సర్వ సేనాపరివృతులగుచు, మృగయార్థ మొకానొక గహనవనము జొచ్చిరి. అందు వ్యాఘ్ర మహిషాద్యనేక మృగములను సంహరించి, యత్యంత పరిశ్రాంతులగుచు, నొక హ్రదము జేరిరి. ఆహ్రదముయొక్క యావలి యొడ్డునగల వటవృక్షమందు, సమస్తశాస్త్ర సారజ్ఞుడగు నొక బ్రహ్మరాక్షసు డుండెను. అతను విద్వాంసులతో, వాదమునకు దిగుచు, నందోడినవారల భక్షించుచు, బహుకాలమునుండి యందుండెను. రుక్మాంగదుడు, చారులవలన నీవార్త విని, వాదకుతూహలియగుచు, సోదరునిగూడి యందేగి, యాబ్రహ్మరాక్షసునితోడ వాదింప మొదలిడెను. అందోడుట, బ్రహ్మరాక్షసుడాతని బట్టుకొనెను. అంత హేమాం

గదు, డిటుల రక్కసునిచే బట్టుబడిన తనయన్నను జూచి, యారాక్షసునితో నిట్లనియెను. "ఓ బ్రహ్మరాక్షసుడ! యాతనిని భక్షింపజనదు. తదవరజుడనైన, నన్ను జయించి తదుపరిమాయిరువురను భక్షింపుము." హేమాంగదవచనము లువిని, యారక్కసుడు 'నాకాహారములభించి బహుకాలమైనది. క్షుద్బాధచే బీడింపబడుచున్నాను. ప్రస్తుత మిాపారణ యొనరించి, నీతో వాదించెదను. తదుపరి నిన్నోడ్చి, తృప్తిగ భుజింతును. ఇది నా నిశ్చయము. పూర్వమొకప్పుడిందేగిన, వసిష్ఠమహర్షి శిష్యుని భక్షించితిని. అంత నా ఋషిపుంగవుడు 'మనుష్యునిక భక్షించిన, నీ ముఖము దగ్ధమగుగాక,' యని శపించెను. తదుపరి నేబ్రార్థింప, వాదములందు జయింపబడిన మనుజులను భక్షింపుమని వరమొసంగెను. అదిమొదలట్లు చేయుచుంటిని. ఈయుత్కృష్టమగు నాహారము నాకు చిరకాలమునకు లభ్యమైనది. దీనిని భక్షించి. యనంతరము నిన్నోడ్చెద" నని భక్షణోద్యుక్తుడయ్యెను. హేమాంగదుడు తిరిగియిట్లనియెను. 'అయ్యా! నావాక్యము వినుము. నీకేమిచ్చిన నీతని వదలగలవో చెప్పుము. అది నీకొసగి, సహోదరుని విడిపింతుగాక.' అట్లన బ్రహ్మరాక్షసుడు, 'రాజ! ఇతనిని విడిచిపుచ్చ గలిగిన దేదియును లేదు. ఆకలిగొన్న సమయమున సంప్రాప్తమైన ప్రాణప్రియమగు నాహారము నెవరు విడువగలరు? కాని, నా

కొక ప్రతిజ్ఞ గలదు. నాప్రశ్నలకు సరియగు నుత్తరువులీయ గలిగితివేని, నీ సహోదరుని విడువగల"ననియెను. హేమాంగదు డంనుల కియ్యకొన, నాతడు గూఢతరములగు ప్రశ్నల క్రమముగ నిట్లడిగెను.

బ్రా॥ ఆకాశముకంటె విస్తృత మైన దెద్ది? పరమాణువు కంటె సూక్ష్మమగున దెద్ది? అది యెట్టి రూపమున నుండును? ఎచ్చట నుండును?

ఆకాశముకంటె విస్తృత మైనదియు, పరమాణువు కంటె సూక్ష్మమైనదియు, బ్రహ్మరూప సామాన్య చైతన్యము. సర్వాంతర మగుటచేతను, అగోచర మగుట వలనను సూక్ష్మము. అది స్ఫురద్రూపమైనది. స్వరూపమందె, యున్నది.

బ్రా॥ అతి విస్తృతమును, అతి సూక్ష్మమును ఒకటియె యెట్లు గాగలదు? స్ఫురత్వమన నేమి? ఆత్మ యన నెట్టిది?

హేమా॥ కారణ రూపమగుట నతివిస్తృతము, అగ్రాహ్య మగుట నతి సూక్ష్మము. చితియె, స్ఫురత్వము. అదియ యాత్మ.

బ్రా॥ ఆచితియొక్క యుపలబ్ధి స్థాన మెద్ది? ఉపలబ్ధిసాధన మేమి? ఉపలబ్ధి ఫలమేమి?

హేమా॥ ఉపలబ్ధిస్థానము బుద్ధి. ఏకాగ్రత యుపలబ్ధి సాధనము. పుట్టువు లేకుంటయె, యుపలబ్ధి ఫలము.

బ్రా॥ నీవుజెప్పిన బుద్ధియన నేమి? దానియేకాగ్రత యెట్టిది? జన్మయన నేమి?

హేమా॥ జడశక్త్యావృతమగు చితియె, బుద్ధి. దృశ్యానున్ముఖమగు నాత్మ విశ్రాంతియె. తద్దైకాగ్ర్యత. జన్మయన దేహాత్మబుద్ధి.

బ్రా॥ చితి, యేకారణమున, ననుభవనీయము గాదు? దానిజెందు నుపాయ మేమి? జన్మ యెటులసంప్రాప్తమైనది?

హేమా॥ అవివేకమున నుపలబ్ధి గలుగకున్నది. కారణాంతరములు లేక న్నాత్మవలన నె (స్వాయముగ నె) యుపలబ్ధి గలుగగలదు. కర్తృత్వాభిమానమున జన్మ కలుగుచున్నది.

బ్రా॥ ఆ యవివేకమన నేమి? ఆత్మయన నెట్టిది? కర్తృత్వాభిమానమన నెట్టిది?

హేమా॥ దేహాత్మల నైక్యాధ్యాసయె, యవివేకము. ఆత్మయన నేదియో, నీయాత్మనెయడుగుము. (ఆత్మనిరూపించుటకు శక్యముగాని దగుటను, ఆత్మను బొందు సాధన మితఃపూర్వము జెప్పబడి యుంటను, ఆత్మేతరము లన్నియు నిషేధింపబడును గాని. యాత్మ నిషేధింప నశక్యమగుటను, ప్రత్యగ్రూపమగుటను, స్వయ

ముగనె, తెలియ శక్యమని భావము) 'అహంకర్తా'
యనెడి వాసనాసంస్కారమె, కర్తృత్వాభిమానము.
బ్రా॥ అవివేకము దేన నశించును? దానికి కారణమెద్ది?
దానికిని కారణమేమి?
హేమా॥ అవివేకము విచారణచే నశించును. ఆ విచారణకు
కారణము వైరాగ్యము వైరాగ్యమునకు కార
ణము, విషయము లందు దోషదృష్టి.
బ్రా॥ విచారణయన నెట్టిది? వైరాగ్యమన నేమి? దోష
దృష్టియన నేమి?
హేమా॥ దృగ్దృశ్యముల జిజ్ఞాసాపూర్వక స్వరూపవివేచనము
విచారణ. దృశ్యమందు రాగమువర్జించుట వైరా
గ్యము. దృశ్యమందు దుఃఖసాధనత్వబుద్ధి, దోష
దృష్టి.
బ్రా॥ ఇదియంతయు దేనిచే గలుగగలదు? అది దేనిచే
పొందబడును? దానికిని మూలకారణమేమి?
హేమా॥ దేవతానుగ్రహమున నది కలుగగలదు. భక్తి
వలన దేవతానుగ్రహ ప్రాప్తి గలుగగలదు. దానికి
కారణము సత్సంగమము
బ్రా॥ దేవతయన నెవరు? భక్తియన నెట్టిది? సత్పురుషు
లన నెట్టివారు?
హేమా॥ దేవతయన జగన్నియంత్రి. తత్పరత్వము భక్తి.

సత్పురుషులన, శాంతులు, దయావంతులు.

బ్రా॥ లోకమునందు సదా భయపడు వాడెవడు? సదా దుఃఖపరుడెవడు? సదా దైన్యయుతు డెవడు?

హేమా॥ సదా భయపడు వాడు మహాధని. బహు కుటుంబ వంతుడు దుఃఖితుడు. ఆశాగ్రస్తుడు సదాదీనుడు.

బ్రా॥ లోకమున నిర్భయుడెవరు? దుఃఖరహితు డెవరు? అదీను డెవరు?

హేమా॥ సంగరహితుడు నిర్భయుడు. మనస్సును జయించిన వాడు దుఃఖరహితుడు. తెలిసికొనదగిన దానిని తెలిసికొనినవా, డదీనుడు.

బ్రా॥ పరులచే నిట్టివాడని లక్షింపబడనివాడెవరు? దేహము లేనివాడెవరు? నిష్క్రియులకు క్రియ యెట్టిది?

హేమా॥ జీవన్ముక్తుడు దుర్లక్ష్యుడు. జీవన్ముక్తులకు దేహమందభిమానము లేకుండుట, విదేహులు. క్రియ యందభిమానము లేనికతమున నిష్క్రియులు.

బ్రా॥ లోకమునందున్నదేది? లేనిదేది? మిక్కిలి యసంభవమైన దేది? ఇంతదనుక జెప్పి, నీసోదరుని విడిపించు కొనుము.

హేమా॥ ఉన్నది దృక్కు. లేనిది దృశ్యము. కావున దృశ్య విషయికమగు వ్యవహార మత్యంతా సంభవమైనది. చెప్పితిని కాన నా సోదరుని విడిచి పుచ్చుము.

అంత బ్రహ్మరాక్షసుడు, సంతుష్టుడగుచు, రుక్మాంగదునివిడచిపుచ్చి యనంతరము, తపోమూర్తియు తేజస్వియు నగు బ్రాహ్మణుడై నిలచెను. అట్లు బ్రాహ్మణ రూపమున నున్ననాతనిని జూచి, యారాజసుతులు నీవెవరవని యడిగిరి. అంత నా భూసురోత్తముడు స్వవృత్తాంత మిటుల జెప్పెను.

నేను పూర్వమున మాగధ దేశమున సర్వశాస్త్ర విశారదుడన విఖ్యాతిగాంచిన వసుమంతుడను బ్రాహ్మణుడను. విద్యా గర్వితుడనగు నాచే, నసంఖ్యాకులగు విద్వాంసులు సభల నిర్జింపబడిరి. అంత మిక్కిలి గర్వితుడనైతిని. మాగధ దేశమున లోకానొకప్పుడు, పరావరజ్ఞుడును, పరమ శాంతుడును నగు అష్టక మునీంద్రు డరుదెంచెను. వాదార్థినై, యమ్మహానీయునితో వాదమునకు గడంగితిని. శుష్క తర్కమందు నిపుణుడనగు నేను, కేవల తర్కయుక్తుల, బహుశాస్త్ర సమ్మతములగు నాయనఘుని సమాధానముల నెల్ల ఖండించి, తర్కజాలముల నాయనఘు నధిక్షేపించితిని. ఇట్లనేక విధముల రాజసభయందు, నాచే నధిక్షిప్తుడయ్యు, బరమశాంతుడగుచు, తూష్ణీంభావము వహించి యుండెను. కాని, యాయన శిష్యుడు కాశ్యపుడనువాడు క్రోధవశంగతుడగుచు, నిటుల శపించెను. 'ద్విజాధమ! నీవు మా గురువుగారి నకారణముగ నధిక్షేపించితివి కాన, చిరకాలము బ్రహ్మ

రాక్షసుడవు గమ్ము.' ఇట్లు శపింప భీతుడనై యమ్మహానీ యుని శరణు జొచ్చితిని. ఆమహాశాంతుడు, విరోధినగు నాయందు మిక్కిలి దయగలిగి, "నీ శాపాంతము జెప్పెద విను," మని యిటుల నుడివెను. "నీవునన్ను ప్రశ్నల కొన్ని యడిగియుంటివి. వానికి నే సదుత్తరముల నిచ్చియుంటివి. కాని యవి యన్నియు కేవల తర్కమున దూషించియుంటివి తిరిగి, యీ ప్రశ్నల నీవడిగినపు, డెవడేని విద్వాంసుడు సదుత్తరముల నిచ్చిన, నీవప్పుడు శాపవిముక్తుడవుగాగలవు'."

"రాజపుత్ర! నేనిప్పుడా శాపమునుండి, చిరకాలమునకు ముక్తుడనైతిని. నిన్ను జ్ఞాతజ్ఞేయుడవగు మహా పురుషునిగ తెలిసికొంటి" ననియెను. అంత వసుమంతుడు తత్త్వార్థ మడుగ, హేమాంగదు డాతనికి లెస్సగ బోధించి, సహోదర సైనికుల గూడి, యాతనికి నమస్కరించి తన పట్టణమునకు వెడలిపోయెను. పరశురామ! నీయడిగిన యర్థము నంతయు జెప్పితి"నని దత్తాత్రేయ మునీంద్రుడు పలికెను.

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ ప్రకాశిక యను నాంధ్రీకరణంబున, రాక్షసోపాఖ్యానం బను ఏకవింశత్యధ్యాయము.

—

# ద్వావింశత్యధ్యాయము

తే॥గీ॥ తాను బూర్వంబుజెప్పిన దాపినెల్ల
సంగ్రహగతి నుడివి, యుపసంహరించె
నీ మహాజ్ఞానఖండంబు, నింక మౌని
చంద్రు డయ్యది వినుమంట! చాలునింక-

పరశురాము డతివినయమున దిరిగి, యవధూతేంద్రు నిటుల ప్రశ్నించెను. "స్వామి! శాపవిముక్తిగల్గిన బ్రాహ్మణుడేమి ప్రశ్నించెను. హేమాంగదు డెటుల బదులు జెప్పెను. అదియంతయు నాకు దెలుపగోరెదను." అంత దత్తాత్రేయు లద్ధనంతమగు తత్సంభాషణమెల్ల వినుపింతు వినుమని చెప్పదొడగెను.

"వసుమంతుడు శాపవిముక్తి గాంచి, సమీపస్థుడగు హేమాంగదుగాంచి, 'రాజపుత్ర! తొలుత అష్టక యోగీంద్రువలన పరమాత్మతత్వ మెరిగితివి. తిరిగి నీ నుడుల, నా పరమపదము లెస్సగ విదితమైనది. కాని, నాకుగల సందేహమును గూర్చి, కొలదిగ ప్రశ్నించెదను. తెలియజెప్పుము. ఆత్మతత్వమెరిగిన నీకీ మృగయాది వ్యవహారస్థితి యెట్లు గల్గు

చున్నది? జ్ఞాతజ్ఞేయము వ్యవహార పరాయణుడగు టెట్లు? తిమిర తేజస్సులవంటి, యీరెండు నొకచో సంభవించు టెట్టిది? దీని యాథార్థ్యమును బోధింపు''మని యడిగెను.

హేమాంగదుడంత నిటుల జెప్పెను. 'భూసుర! నీకు గల భ్రాంతి యింతవరకును నశింపలేదు. ఆత్మస్వరూపభూత మగు జ్ఞానము వ్యవహారమున నెట్లు బాధింపబడగలదు! వ్యవహారమున, స్వరూపభూత జ్ఞానము బాధింపబడు నెడల, నయ్యది స్వాప్నికజ్ఞానమువలె, నసత్యము గాగలదు. అట్టి యసత్యజ్ఞానముతో గూడిన ముముక్షువునకు స్వరూపనాశము గాగలదు. అట్టియెడ, మోక్షరూప పురుషార్థలాభమెట్లుం డును? ఈ సర్వ వ్యవహారమును, స్వరూపభూత జ్ఞానాశ్రిత మగుట నాజానము, తదాశ్రితమగు వ్యవహారమున నెట్లు బాధితము గాగలదు? ప్రతిబింబములకు దర్పణమువలె, సర్వ వ్యవహారమునకును, జ్ఞానమాశ్రయమును, స్వరూప భూత మును నగుచున్నది. ప్రతిబింబములచే, దర్పణము బాధింప బడజాలనటుల, వ్యవహారమున జ్ఞానము బాధింపబడజాలదని యర్థము. దేనియందీ జగత్తు సర్వమును, భాసించుచు న్నదో, యదియ, జ్ఞానము. సంకల్పమున, సమస్త వ్యవహా రమును జ్ఞానమునందె, ప్రకాశించుచున్నది. అసంకల్పమున నా జ్ఞాన రూపమును బుద్ధిచే లక్షించి, బంధ నిర్ముక్తుడును

కృతార్థుడగుట నిశ్చయము. కావున నీ ప్రశ్న సమ్మతమైనది కాజాలదు"

వసుమంతుడంత దిరిగి, నా రాజకుమారు నిటులప్రశ్నించెను 'రాజకుమార! నాకుగూడ జ్ఞానస్వరూపనిశ్చయ మటువలె గలదు. నిర్వికల్పమగు సంవేదనము, స్వరూప లక్షణము. సవికల్ప దశను జెందినపుడు, భ్రాంతి తిరిగి యెటుల లేకుండును. రజ్జువునందు సర్పరూప వికల్పము భ్రాంతి. అయ్యది యనర్థావహమయ్యు, సవికల్ప దశయందు లేకుండు టెట్లు?" హేమాంగదుడంత, 'బ్రాహ్మణుడ! భ్రమాభ్రమ నిర్ణయము నీవెరుంగ జాలకున్నావు. ఆకాశ లక్షణమును గుర్తెరిగిన వానికి గూడ, నాకసము నీలముగనె, భాసించును. ఆకాశము నీలమని యొకప్పుడు వ్యవహారముగూడ, జరుపుచుండును. అంతమాత్రమునసె, యాజ్ఞానము భ్రాంతి యని పించుకొనదు తత్త్వజ్ఞానము లేనివానికేది భ్రాంతియగుచున్నదో. తత్త్వజ్ఞునియందది ప్రమ యనబడుచున్నది. ఒకే విధమగు జ్ఞానము, పురుషభేదమున, భ్రమయనియు, ప్రమయనియు రెండురూపముల నెట్లుండుననిన, నారెంటికిని గలుగు భేదము దెల్పెద వినుము.

జ్ఞానమునకు జీవభూతమగునది ప్రామాణ్యము. తద్వశ

నమున ర్థక్రియ లుండదుయుంచును. సర్పజ్ఞానము గలిగినప్పుడా జ్ఞానము భయకంపాద్యర్థ క్రియా సంపాదక మగుచున్నది. సర్పముగాదను విశుద్ధజ్ఞానమున, సర్పజ్ఞాన మప్రామాణ్యము గా గలదు. అప్పుడా సర్పజ్ఞానము, హతప్రామాణ్య జీవముగలదియగుచు, మృతసర్పమువలె, భయాద్యర్థక్రియా సంపాదకము గాకబోవుచున్నది. అటువలె, నాకాశము నీల మనెడి జ్ఞాన మర్థక్రియా సంపాదకము. అదె భ్రమాకా శము. అవకాశమాత్ర మాకాశమను తత్త్వజ్ఞానమున, నాకా సము నీలమనెడి జ్ఞానము, హతప్రామాణ్య జీవము గలది యగుచు, నర్థక్రియా సంపాదకము గాకబోవుచున్నద గగన తత్త్వజ్ఞాన విలక్షణత్వము గలుగుటవలన, నీజ్ఞానము భ్రమరూ పము గాదు. గగనతత్త్వమును గుర్తెరిగినవా డాకాశము నీలమని వ్యవహరించునపుడు, దర్పణ ప్రతిబింబరూప గజమును జూచి, యిది గజమని వ్యవహరించువిధమున నుండును. కావున గగనతత్త్వ మెరిగినవానికిని, ఎరుగని వానికిని గల ఆకాశము నీల'మనెడి జ్ఞానమునందు భేదము గలదు. తత్త్వజ్ఞులకు భ్రమ ప్రయుక్తములగు నర్థక్రియలు లేకుంట, నది ప్రమయగును. అతత్త్వజ్ఞునియెడ, నర్థక్రియోత్పాదకమైన భ్రమ యగును. జ్ఞానులకు సర్వ వ్యవహారమును జ్ఞానరూపమె, యగును. వారి వ్యవహారము దర్పణ ప్రతిబింబ వ్యవహార తుల్యము గ నుండును. అట్లు, జ్ఞాని వ్యవహారము, జ్ఞానరూపమాత్ర మైన

దగుట, భ్రాంతియుండజాలదు.

జ్ఞానమున, నజ్ఞానము నివర్తింపబడును. నివర్తింపబడుట సహజమగుచున్నది. రజ్జ్వజ్ఞానమున బుట్టిన సర్పము రజ్జుజ్ఞానమున నివర్తింపబడుచున్నది. అటువలె, నద్వయాత్మాజ్ఞానమున, నవభాసమానమగు దృశ్య మద్వయ జ్ఞానమున నేల నివర్తింపబడదనిన, వినుము. కేవల మజ్ఞానజనితమైనది మాత్రము, జ్ఞానమున నివర్తింపబడును. దోష జనితమగునది జ్ఞానమాత్రమున నివర్తింపబడజాలదు. నేత్రరోగి, వస్తువొకటియని యెఱిగి యుండియు. నేత్రగత దోషమున, రెండుగ జూచుచుండును. ఈ జగదాభాసము, కర్మదోష సముద్భవమైనది జ్ఞానమాత్రమున నిది విలయము నంద జాలదు. ప్రారబ్ధకృత కర్మ, తత్ఫలానుభవమున క్షీణమగువరకును, వ్యవహారము జ్ఞానముగల్గు మాత్రమున నశింపదు. అనుభవమున కర్మ క్షీణింప నద్వైత చిన్మాత్రము శేషించును. జ్ఞానమున, నజ్ఞాన నివృత్తి గలిగినను, ప్రవృత్తమగు కర్మవిలయము నందినగాని, జగము స్వరూపతః భాసింపకుండ నుండజాలదు. కావున జ్ఞానికి కర్మశేషమున, ద్వైతాభాసయుండి, వ్యవహారము సంభవమగుచున్నది. ఆ వ్యవహారము జ్ఞానమాత్రమగుట, భ్రాంతి సంభవముగా''దని నుడివెను.

అంత బ్రాహ్మణుడు తిరిగి యిటులప్రశ్నించెను. "రాజపుత్రి! యిది యేమి! జ్ఞానులకు కర్మయుండునా? కర్మయను తూలరాశి, జ్ఞానాగ్ని సంస్పర్శనెటుల నిలువగలదు?" హేమాంగదుడిట్లు బదులు జెప్పెను. "భూసుర! వినుము. జ్ఞానులందరకును కర్మ త్రివిధముగ నుండును. అపక్వకర్మ, పక్వకర్మ, హాతోదిత కర్మయని త్రివిధము. అందు పక్వకర్మ జ్ఞానమున నశింపదు. కర్మయొక్క ఫల మింతకాలమునకు లభింపగలదను, భగవత్సంకల్పమునకు నియతియని పేరు. ఆ నియతిచే, నియమితమగుచు కాలము నడచు చుండును. ఆకాలకృత్యముగ, కర్మలు పక్వదశ నందింపబడుచుండును. ఇట్లు కాలమున పాచితమగు కర్మ పక్వకర్మ యనబడుచున్నది. జ్ఞానోత్పత్త్యనంతరము చేయబడిన కర్మ హాతోదిత మనబడుచున్నది. పక్వకర్మకారబ్ధమని పేరు. విడిచిపెట్టబడిన బాణమువలె, నారబ్ధము సుఖదుఃఖ రూపఫలము ననుభవింపజేయక, తొలగదు. ఆరబ్ధమూలకమె, జగద్భాసము. జ్ఞానుల జ్ఞానపరిపాక భేదము ననుసరించి, జగద్భాస ముండినను, అది భ్రాంతి తుల్యమైనను, ఫలభేదమున భ్రాంతికాజాలదు. మందజ్ఞానులకా జగదావభాసనము, తాత్కాలిక సుఖాది ఫలము స్ఫుటముగ నిచ్చును. మధ్యమ జ్ఞానులకు తత్ఫల భాసనము, జగద్భాసన కాలమునందు మందజ్ఞానులకు వలె నుండును. కాని తదితరకాలములందు, సుషుప్తియందు

మశకదంశన, మలయమారుత జ సుఖ దుఃఖముల బోలి, యస్ఫుటముగ నుండును. ఉత్తమ జ్ఞానులకు జగద్భాసన కాలమందు, సుఖాది ఫలమన్యదృష్ట్యా స్ఫుటముగ భాసించు చున్నను, స్వాదృష్ట్యా శశశృంగ సమముగా నుండును. కాన నది కర్మఫలమని చెప్పుటకు వీలుండదు. అజ్ఞానుల కర్మ ఫలము, పూర్వానుసంధానమున, బోషింప బడుచున్నది. సుఖము గలుగక పూర్వమిట్టి సుఖము గలుగగలదనియు, ననంతర మిట్టి సుఖము నాచే ననుభవింప బడినదనియు, చిర కాలమను సంధించుట, తత్కర్మఫలము పోషింపబడుచున్నది. అనగ సంస్కార రూపమున, దృఢముగ నంత స్థిరమగు చున్నది. మందజ్ఞానుల కర్మఫల సంధానము, మధ్య మధ్యనగు నాత్మానుసంధానమున భిన్నమగు చున్నది. కాన, నజ్ఞానులకువలె, నారబ్ధఫలము పుష్టిని గాంచకున్నది. మధ్య ముజ్ఞానుల, సమాధిరహిత దశలయందగు సుఖదుఃఖ రూప ప్రారబ్ధఫలము, సుషుప్తియందగు మశకమందమారుతములచే నగు దుఃఖ సుఖములవలె, సూక్ష్మత్వమును బొందుచున్నది. ఉత్తమ జ్ఞానులకర్మఫల, మన్యదృష్ట్యా సుఖదుఃఖరూపముగ వ్యవహరింపబడుచున్నను, సదా యనుసంధితాత్మ జ్ఞానస్థితి మాహాత్మ్యమున, దగ్ధరజ్జువువలె నగుచున్నది. నాటకాదు లందు, నరుడు వేషాంతరమును ధరించి, సంతోష దుఃఖముల నందుచున్నను, నంతర్వికారములబొందనటుల, నుత్తమ జ్ఞాని,

లోకదృష్ట్యా సుఖదుఃఖముల ననుభవించుచు, సంపూర్ణకర్మ ఫల సంగతుడుగ గాన్పించు చున్నను, ఆంతరంగికముగ సర్వమును స్వాత్మమాత్రమను దృఢనిశ్చయము గలుగుట వలన, ఫలరూప ద్వితీయ వస్త్వాభావమున, తత్ఫలములచే, స్పృశింపబడకున్నాడు.

అజ్ఞానులు, శుద్ధాత్మను పలక్షించుట లేదు. ఆత్మ జ్ఞానాభావమున, దేహాత్మభూతులగుచు, దృశ్యము సత్యమను నిశ్చయముగలిగి యున్నారు. మందజ్ఞానులు శుద్ధచిదాత్మ నెరిగి, జగత్తు నసత్యముగ జూచుచుందురు. కాని, యభ్యాస మాంద్యమున, పూర్వవాసనలచే, విచ్ఛిన్నాను సంధానాత్మక జ్ఞానముగలవారగుచు, దేహమం దాత్మత్వబుద్ధియు, జగత్సత్యత్వాభాసమును, మధ్యమధ్య బొందుచుందురు. జ్ఞాన వాసనచే, తిరిగి దేహాత్మకత్వాది విషయికమగు నసత్యదృక్కును వదల్చుకొందురు. ఇట్లు మందబుద్ధులకు, సత్య మిథ్యాజ్ఞానముల వాసన పరస్పరము మిళితముగనుండును. కాన తన్మధ్యయందు కర్మ ఫలము స్ఫుటముగ నుండును. ఈవాసనాద్వయము సమముగనుండినను, రెండును తుల్యములు గాజాలవు. సత్యజ్ఞానోదయమున మిథ్యాజ్ఞాన వాసన బాధింప బడును. మిథ్యావాసనచే, సత్య వాసన బాధింపబడదు. తొలుత మిథ్యావాసనావిష్టుడగుచు, శుద్ధ

చిదాత్మను విస్మృతి జెందును. తదుపరి యా వాసనను, భ్రిమాత్మకముగ నిశ్చయించి, దానిని ద్యజించి, సత్యవాసనను బొందును, తదుపరి సత్యవాసన బాధింపబడజాలదు. మధ్యమజ్ఞానికాత్మతత్వజ్ఞానమందు విస్మృతిలేదు. మిథ్యాజ్ఞానమునులేదు. స్వేచ్ఛగ వ్యవహారార్థము మిథ్యాజ్ఞాన మొకప్పుడు గల్గుచుండును. అయినను, జ్ఞానవాసనా తత్పరుడై యుండును. ఇది సిద్ధనిస్థితి. ఇక సాధకుడాత్మజ్ఞాన తత్పరుడుగ, నెంతెంతగనుండునో, యంతంతగ మిథ్యాజ్ఞానవిస్మృతి దృఢమగుచుండును. పూర్ణముగ తత్పరుడగునపుడు మిథ్యాజ్ఞానస్మృతియె, యుండదు.

ఉత్తమజ్ఞానికి సమాధివ్యవహారములందు లేశమైనను భేదముండదు, కారణమేమన, నతని కెప్పుడును, ఆత్మజ్ఞాన విస్మరణముండదు. మధ్యమజ్ఞానికి సమాధిపరుడగునపుడు గల్గు నవిస్మృతి, మిథ్యాజ్ఞానదశలందు కొలదిగ తరుగుచుండును. ఉత్తముడు స్వేచ్ఛగగాని, ప్రారబ్ధ వశమునగాని, సదా సమాధిపరుడుగ, నుండును. కావున నాతని, యవిస్మరణకు తరుగులేదు.

భూసుర! మధ్యమోత్తమజ్ఞానులకు కర్మ, యేకొంచెమును లేదు. కారణమేమన, వారు పూర్ణత్వమును జెంది

సంవిదాత్మకంటె నతిరిక్తముగ నేకొంచెమేనియు జూడరు. అట్టివారలకు కర్మశేషమెటుల మిగులగలదు? సర్వకర్మయును చిదగ్నిచే, భస్మీకృతమగును. కావున వారలకు కొంచెమే నియు కర్మ శేషింపదు. మరి యుత్తమ జ్ఞానులకు హర్ష విషాదాది ప్రారబ్ధ ఫల కార్యము కనుపించుచున్నది కదా యనిన, స్వశిరచ్ఛేదాది యింద్రజాలకుని కర్మ, తదితరులచే నటుల జూడబడుచున్నను, స్వయముగ నట్లు జూడబడనటుల, నుత్తమజ్ఞానియొక్క సుఖ దుఃఖాద్యనుభవము గూడ నని తెలియనగును. ఇందుగల రహస్యమును జెప్పెద వినుము. జ్ఞానియొక్క దృష్టి శివుని దృష్టికి తుల్యమైనది. శివ జ్ఞాను లకు లేశమేనియు భేదము లేదు. ఇది సత్యము, నిస్సంశ యము. కావున జ్ఞానులకు కొంచెమైనను కర్మానువర్తన లేదని తెలియనగును.''

హేమాంగద నిరూపితమగు నిది యెల్ల విని, వసుమం తుడు సర్వ సందేహముల బాసి, విజ్ఞానవంతుడగుచు స్వస్థా నమున కేగెను. రాజపుత్రులుగూడ తమ నగరమున కేగిరి. పరశురాముడట్లాగాథ నంతయు విని, తిరిగి యిటుల ప్రార్థిం చెను. ''గురూత్తమ! తమవదన నిర్గతమగు నీ విజ్ఞానమం తయు వినియుంటిని. నిస్సందేహుడనైతిని. ఆత్మ పదము తెలియబడెను. సర్వానుస్యూత చిదాత్మయె, సర్వ తో

భాసించుచున్నది. అయినను, ఆదినుండియూ మీచే జెప్ప బడిన సారవత్తరమగు విజ్ఞానమంతయు, సంక్షేపముగ నాకు తిరిగి చెప్పగోరెదను". ఇట్లడుగ, నతిరి నందనుడు, తనచే జెప్పబడిన దానిసారమును, వినుమని చెప్పదొడగెను.

"సర్వాధిష్ఠానమును, పూర్ణాహంతా రూపమునునగు నా పరాచితి, తన స్వాతంత్ర్యమను మాయాశక్తి మాహాత్మ్యమున, నితర సహాయాపేక్ష లేకయె, యా దర్శమందు ప్రతిబింబమువలె, జగత్తు నవభాసింప జేయును. తత్క్రమము జెప్పెద వినుము. అపరిచ్ఛిన్నమగు నా పరాచితి, పూర్ణాహంభావమున, నపరిచ్ఛిన్న స్వరూప స్ఫూర్త్యైక ఘనమగుచు, స్వాత్మ చిత్ స్ఫూర్తి ఘనమును, స్వ స్వాతంత్ర్యా మహిమవలన, రెండువిధములుగ భాసింపజేయును. అందేకాంశమున, నపూర్ణాహంభావమును భాసింపజేయును. ఇతరాంశమున నహంభావానాక్రాంతముగ భాసింపజేయును. అహంభావ రహితాంశ, బాహ్యపదార్థ రూపమగు నవ్యక్తమగుచున్నది. పరిచ్ఛిన్నాహంభావ యుతమగు నంశము సదాశివుడనబడుచున్నది. ఆ సదాశివుడ వ్యక్తాంశమును, తనకంటె భిన్నముగ జూచుచుండియు, 'నేనిది' యని సదా యనుసంధి పరుడుగ నుండును. దేహమందు ప్రత్యంగముల, విభేదము గానుపించుచున్నను, నహంభావముచే తమనకు

స్వామిత్వము వలె, యవ్యక్తమందా శివునకు స్వామిత్వమని భావము. ఆ సదాశివుడే. యహంభావరూప స్వాతంత్ర్యమున, వివిధ జగమును సృష్టింప నిచ్ఛగలవాడగుచు. నవ్యక్తరూపమగు నాత్మ దేహమును జూచి, 'ఇది నేన'ని యనుసంధాన పరుడగును. అప్పుడాతడీశ్వరుడగును అవ్యక్తము నేనను, అభిమానావిష్టుడగు నీశ్వరుడె రుద్ర విష్ణు బ్రహ్మ రూపముల త్రివిధమగును. ఈ మువ్వురు బ్రహ్మాండము యొక్క యుత్పత్తి స్థితి లయావభాసకులుగ నుందురు. సృష్టికర్తలగు బ్రహ్మలును, స్థితికర్తలగు విష్ణువులును, సంహార పరాయణులగు రుద్రులును, అసంఖ్యాకులుగ గలుగుచుందురు. రామ! యీ విధముగ జగత్త్రత్వము, దర్పణమందు ప్రతిబింబమువలె, చిదవ్యతిరిక్తముగ భాసించుచుండును. అంతియకాని, నిజముగ, బుట్టునదెద్దియు లేదు. అనేక పరిచ్ఛిన్నాహంభావ పూర్ణమగు జగద్రూపమున భాసించునది, సంపూర్ణాహంభావ రూపిణియగు నాపరాచితియె. రామ! నీవు నీయొక్క సర్వదేహమందును, నహంభావ భావనా పరీతుడవయ్యు, వేరువేరుగ నేత్రాద్యవయవములం దహంభావ కలితుడవై తత్తత్క్రియా పరుడవగు నటులనే, పూర్ణాహంతా సమాశ్రయమగు నా పరాసంవిత్, సదాశివాది స్తంభపర్యంత మపూర్ణాహంతాశ్రయము గూడ నగుచున్నది. జగద్రూపమున నిట్లు భాసించుచున్నది వాస్తవమున నా పరాచితియె.

దేహాహంభావ రూపుడవగు నీవు, స్వయముగ రూప రసాదికమును గ్రహించుట కసమర్థుడవైనప్పటికి, నింద్రియ తాదాత్మ్యమును జెంది సర్వమును గ్రహించుచున్నటుల, సదాశివు డభేదమయుడయ్యు, బ్రహ్మాది స్తంబపర్యంతము గల జీవరాసులందు తాదాత్మ్యమును బొంది, సకలమును గ్రహించుచు సర్వమును జేయుచున్నాడు.

ప్రతిబింబ స్థానీయమగు నీ దేహేంద్రియాద్యఖిలమునకు నాశ్రియమగు దర్పణస్థానీయమైన, యీ నిర్వికల్ప చిద్రూపము, దేనిని గ్రహించుటగాని, చేయుటగాని లేదు. అటు వలె సర్వలోక సమాశ్రియమగు నా పరాసంవిత్, భేదము, లేశమైన గ్రహించి వర్తింపదు. దర్పణమందు ప్రతిబింబము వలె, నీ సర్వజగద్విషయము, నాపరాచితియొక్క స్వాతంత్ర్యమున బుట్టి, యీ పరాచితియందె, భాసించు చున్నది. ఆదర్శ ప్రకాశమె, ప్రతిబింబ ప్రకాశమువలె, జగద్భాసన మంతయు నా పరాచితి భాసనమె. ఈ జగత్తునందు, 'నీవు' 'నేను', 'ఇతరుడ'నియెడి ద్రష్టలుగూడ, దృశ్యము వలె నా పరాచితిమాత్ర స్వరూపులె. దృశ్యసమ్మేళనము లేనపుడు, దృగ్రూపము శుద్ధ పరాచితియె, కాగలదు. ఘటాది ప్రతిబింబముల, పరిచ్ఛిన్నమగు దర్పణాంశము, ఘటాదులు దగ్గరలేనపుడు శుద్ధ దర్పణమాత్రమగునుకదా. విభేదము,

ప్రతిబింబమువలన గలుగు విధమున భాసించుచున్నది. అటు లనే, సంకల్పము వలన భాసమానమగు దృశ్యమంతయు, నిస్సంకల్పమున తుడిచివేయునపుడు శేషించునది, యద్వితీయమగు నా పరానందస్వరూపమె. అది యఖండానంద రూపము. ఔపాధికమగు దుఃఖమఖండమగు నద్దానియం దుండదు గాన, నది దుఃఖ లేశ వివర్జితము. అందరచే, ననుభవింపబడు నానంద మాత్ర స్వరూపమైనది. కావుననె, యందరచేతను గోర బడుచున్నది. ఆత్మస్వరూపము సుఖముగనుకనె, యందరచే గోరబడుచున్నది. సుఖార్థము దేహ స్త్రీ ధనాదులను గోరు చుండుట లేదా! ఆత్మ రూపమును గోరుటెట్టిదనిన వినుము. దేహాదులను గూడ నాత్మసుఖార్థమె, కోరుచున్నాడు. కనుక నాత్మస్వరూపమెప్పుడైన, నెవరిచేనైన, గోరబడకుండుట లేదు. ఆత్మయె ముఖ్యముగ గోరబడినదగుట, నాత్మ సుఖరూపమని భావము. విషయానంద మాత్మానందము యొక్క లేశ మాత్రమని, యాగమము జెప్పుచున్నది.

ఆత్మానందము, శిరస్సునందున్న భారము దించి నపుడును, సుషుప్తియందును భాసించును. స్వరూప భూతానంద, మాత్మానందము. భారత్యాగానంతరము గల్గు సుఖమందరకును, ననుభవైక వేద్యము. అది తాపాది సంగ నిమిత్తమగునది కాకపోవుట, స్వరూపభూతమైనది, నిద్రించు

పురుషుడు సుషుప్తియందు నిర్నిమిత్తముగ మహాత్సుఖము ననుభవించుచున్నాడు. లేచినపుడు, సుఖముగ నుంటినను స్మృతియె, దానికి ప్రమాణము. అది స్వరూపభూతానందము. సుఖములేనియెడ, పశుపామరాద్యఖిల జీవులకును, నా సుషుప్తియందు ప్రవృత్తియె, కలుగకుండును.

సుఖము, స్వరూపభూతమగునెడ, సర్వధా యనుభవింప బడకుండు టెట్టిదనిన వినుము. ఆధార ధ్వని సర్వదా యుండినను, బాహ్యధ్వనుల, తిరోహిత మగుచున్నది. కావున కర్ణపిధానమున, నది విననగుచున్నది. అటువలె, నాత్మ సుఖము కామము, కర్తృవ్యతా మున్నగు వాసనా సమూహమను దావాగ్నిచే, దందహ్యమానమగు వానికి తద్దుఃఖమున, తిరోహితమగుచున్నది. సుషుప్తియందు వాసనా సమూహమంతయు, స్వకారణమందు లయమందుట, కర్ణపిధాన మొనరించువానికి ధ్వనివలె, నాత్మ సుఖ మభివ్యక్తమగు చున్నది. భారవహన సమయమందు, తద్భారమువలన గలిగిన మహాద్దుఃఖమున, తదితర వాసనా కృత దుఃఖమంతయు మ్రింగబడి, భారవహన దుఃఖ మొక్కటియె, ప్రరూఢముగ నుండును. భారత్యాగమున తద్దుఃఖ నివృత్తి గలుగును. తిరిగి వాసనా దుఃఖ ముద్భవమందు పర్యంత మాత్మసుఖ మభివ్యక్తమగును. స్త్రీ మొదలగు వాని విషయసుఖమంతయు నవ్విధము. కావున

నందరచే గోరబడిన దగుట, చిదాత్మయె, యానందమని చెప్పబడినది. కాని, మూఢులు స్వాత్మభూతమగు మహా సుఖమును గుర్తెరుగ జాలకున్నారు. స్త్రీ మొదలగు భేద వస్తువుల, తత్తత్కాలమందు బుట్టి నష్టమగునదియు, వివిధ మైనదియునగు, తామనుభవించు సుఖమును జూచుచుండుట, స్థిరమగు నాత్మరూపమును గుర్తెరుగకున్నారు.

దర్పణ మందు బింబానుసారముగ ననేక ప్రతిబింబ ములు భాసమాన మగు చున్నవి. ఇది దర్పణము, ప్రతి బింబ గ్రహణసమర్థమనెడి దర్పణ విజ్ఞానము గలుగు వరకును, ప్రతిబింబాత్మకములగు భావములు, భిన్నముగనె భాసించు చుండును. ఇదియంతయు దర్పణమని, భాసింపదు. దర్ప ణజ్ఞానపూర్వకముగ, వాని ప్రతిబింబత్వము దెలియబడినపు, డా ప్రతిబింబములు, పూర్వమువలె భాసించుచున్నను, నవి యెల్ల దర్పణముకంటె భిన్నములుగావని తెలియ బడును. అంతియకాక, శుద్ధ దర్పణమె, యిదియంతయునని తెలియ బడును. అటువలె తత్వమెరిగిన వానికీవిధముగ జగత్తు భాస మాన మగుచున్నను, స్వాత్మమాత్రమె యగునుగాని, మరి యొకటి గాదు. మృత్తునందు ఘటాదికమువలె, స్వర్ణమందు భూషణమువలెను, శిలయందు ప్రతిమవలెను, చిదాత్మయం దీజగము భాసించుచున్నది.

పరశురామ! జగత్తు లేనేలేదను దృష్టి, పూర్ణ దృష్టి కాదని, తలంపుము. లేదను విపరీత నిశ్చయము సప్రమాణముగ సిద్ధింపదు. కలదు, లేదను వాదనములచే, సాధింపబడు చిదాత్మ, జగద్దృష్టియొక్క సర్వ నిషేధానంతరము, స్ఫుటముగ భాసించుచున్నది. ఘటాదులు, ఘటాది వికారరూపమున. లేవని నిషేధించినను, మృద్రూపమును నిషేధింప శక్యము గాదుకదా! దృశ్యము, దృశ్యత్వేన నిషేధింపబడినను, దృగ్రూపమున, నవభాసింపకుండు టెట్లు? సర్వము నిషేధించినపుడు, నిషేధించువాడుగూడ నిషేధింపబడడుగాన, జగత్తు లేనేలేదను నంతమాత్రమున, జగత్తు సర్వాత్మనా, లయముగాజాలదు. సర్వము నిషేధింపబడిన సమాధియందు, స్వప్రకాశరూపమున చిదాత్మ భాసించుచుండును. ఉన్నది, యఖండాద్వయ చిదాత్మయె యగునపుడు, నిషేధింప బడదగినదేది? ద్వైతముగాదు; ద్వైత భ్రమ. అనగ నిషేధింపబడునది జగమ్ముగాదు, జగద్భ్రమ. ఆదర్శనగరమున్నదియా? లేనిదియా? ఆదర్శ స్వభావమున, నాదర్శ నగరమున్నదియే యగును. ఆదర్శముకంటె భిన్నముగ నగర మున్నదని యర్థముగాదు. నగరము లేదనుటకును వీలులేదు. కారణము, తన్నగరము గల్గియుండుటాదర్శస్వభావము. అప్పు డాదర్శైకరూపమగు నాదర్శనగరము సత్యమనియే చెప్పవలయును. అటువలె, జగమ్మా

త్మాభిన్నము; ఆత్మా వ్యతిరిక్తము. కాని, యాత్మావభాసము. కావున, చిదాత్మైకరూపమగు జగత్తు సత్యమనియే చెప్పవలయును.

ఇట్లు సర్వమును సత్యమనెడి జ్ఞానమె, పూర్ణజ్ఞానము. దృశ్యము, దృక్కను నీ రెంటియందు, దృశ్యము లేనిదని చెప్పుట యందుగూడ, దృశ్యాభావ ప్రయుక్తమగు, సంకోచావ భాసనముగలదు. దృశ్యము సర్వమును, దర్పణ ప్రతిబింబము వలె, దృగాత్మతియని చెప్పినపుడు, సంకోచావ భాసనము లేక పూర్ణవిజ్ఞానముగా గలదు. కావున దృశ్యము, దృగతిరిక్తముగాదు. దృక్కు స్వస్వాతంత్ర్యమున దృశ్యరూపమును బొందినది. ఆదర్శము, నగరభావమును బొంది నటులనని, శాస్త్రార్థ సంగ్రహము.

బంధముగాని, మోక్షముగాని, సాధకుడుగాని, సాధనముగాని లేవు. అఖండాద్వైత చిచ్ఛక్తియగు నా త్రిపురా పరమేశ్వరియె, భాసించుచున్నది. విద్యాఽవిద్యలు రెండును నామెయె. బంధము, మోక్షము, సాధనము, నామెయె. రామ ! విజ్ఞానక్రమ మాదినుండియు నీకు సమగ్రముగ, తెల్పితిని. ఇదియు, తెలియదగినది. ఇంతకంటె, మరియొకటి లేదు. దీనిని లెస్సగ గ్రహించిన జనుడు, తిరిగి దుఃఖింపడని

దత్తాత్రేయ మునీంద్రు డుపదేశించెను.

నారద ! యుపపత్త్యుపలబ్ధులతో గూడిన, నీ జ్ఞానఖండము వినిన, నెవని యజ్ఞాన సంబంధమగు మోహము నశింపబడకుండునో, యెవనికిది వినినను, మోహము శాంతి నందదో, వాడు శిలావిగ్రహము. లోకమున నిక దేనిచే గాని, వానికి జ్ఞానము గలుగజాలదు. ఒకతూరి వినిన మాత్రముననె, యియ్యది దృఢముగ విజ్ఞానమును గలిగింప గలదు. రెండు, మూడు తూరులు వినిన, మందునకుగూడ జ్ఞానమెట్లు గలుగకుండును? ఇది వినిన; పాపౌఘములు శమించును. విజ్ఞాన మూదయించును. లిఖించిన దృష్టి దోషము నశించును పూజించిన చిత్తశోధన మొనరించును. సర్వదా పరిశీలించిన మౌఢ్యము నశించును. సర్వాత్మభూతమగు నేరూపమును విచారించి, స్ఫుటముగ నవగత మొనరించుకొనిన ముక్తియు, లేకున్న బంధమున గునో, యారూపమే, త్రిపురాపరమేశ్వరీ. హ్రీం.

హ్రీం

ఇది త్రిపురారహస్యమందలి జ్ఞానఖండమునకు తాత్పర్యార్థ ప్రకాశిక యను నాంధ్రీకరణంబున, సర్వతత్వసారమను ద్వావింశత్యధ్యాయము సమాప్తము.

– తత్సద్బ్రహ్మార్పణమస్తు

—